# సింహాసన ద్వాత్రింశిక

(కొరవి గోపరాజ ప్రణీతము)



పరిష్కర్త

గడియారం రామకృష్ణశర్మ








ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

SIMHASANA DWATRIMSIKA ; *A Telugu Classic by KORAVI GOPA RAJU of 15th Century A.D. Edited by Gadiyaram Ramakrishna Sarma, Alampur, Mahaboobnagar Dist.*


ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాద్ - 500 004.





ప్రచురణ : 338

ప్రథమ ముద్రణ : 1982

ప్రతులు : 2000





వెల : రూ. 10-00

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్ - 500 004.

ముద్రణ : అక్వేరియన్ ప్రింటర్స్, సికింద్రాబాద్ - 500 003.

Paper used for the printing of this book was made available by the Government of India at concessional rate.

# తొలి పలుకు

చాలాకాలం క్రింద ప్రచురితమై, ఇప్పుడు ఆంధ్రసాహిత్యారాధకులకు అలభ్యంగా ఉంటున్న చక్కని రసవత్కావ్యాల కోవలోకి చేరినది కొరవి గోపరాజు "సింహాసన ద్వాత్రింశిక" సాహిత్య అకాడమీ శతాధిక ప్రాచీన కావ్యాలను విద్వత్పీఠికలతో ప్రచురించి పండితులకూ, పరిశోధకులకూ, సహృదయులకూ, ఒక ప్రణాళిక ప్రకారం అందజేస్తున్నది. ఈ కావ్య ప్రచురణ ఆ ప్రణాళికా ఫలితమే.

సింహాసన ద్వాత్రింశిక ఒక కథాకావ్యం: రమ్యాద్భుత కథా తరంగిణి. కథాకథనానికి అనువైన శైలీ సారళ్యానికీ, జాతీయాలకూ, చిత్రాకర్షకములైన వర్ణనలకూ, సమకాలిక జీవితవృత్తానికీ, ఈ కావ్యం చక్కని చిక్కని ఉదాహృతి.

ఈ కావ్యాన్ని పరిష్కరించి, తమ బహుముఖీన ప్రతిభాపాండిత్యాలను ప్రదర్శిస్తూ సహృదయావర్జకమైన పీఠికను సమకూర్చి అకాడమీకి అందించి సహకరించిన విద్వాంసులు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారికి కృతజ్ఞతాభివందనములు సమర్పించుకుంటున్నాను.

హైద్రాబాదు.
1-11-1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# సింహాసన ద్వాత్రింశిక

## వి ష య సూ చి క

# సింహాసన ద్వాత్రింశిక

## పీ ఠి క

"సింహాసన ద్వాత్రింశిక" అను ఈ కథాకావ్యమును కొరవి గోప రాజు రచించెను. ఇందు విక్రమార్కుని దివ్య సింహాసన సోపానముల పై ఉన్న 32 సాలభంజికలు భోజరాజునకు చెప్పిన కథలున్నవి. ఈ కావ్యమును ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారు మొదట ద్వితీయభాగమును 1933 లోను, ప్రథమభాగమును 1936 లోను ప్రకటించినారు. ప్రత్యంతరములు లభింపనందున అపపాఠములు చాల దొరలినవి. ముద్రిత గ్రంథములందు అధస్సూచికలలో కొన్ని పాఠము లీబడినవి. అన్నిటిని పరిశీలించి ఉన్న పాఠములలో సమంజసములని తోచిన పాఠములను గ్రహించి విపుల పీఠికతో ఈ ప్రతి ప్రకటింపబడినది. తెలుగులోని కథాకావ్యములలో నిది గణింపదగినది.

<u>కథా కావ్యములు :-</u> తెలుగులో కేతనకవి చంపూరూపమున 'దశకుమార చరిత్ర'ను రచించి కథాకావ్యములకు శ్రీకారము చుట్టెను. అది దండి మహాకవి సంస్కృతమున రచించిన గద్యకావ్యమున కనువాదము. తరువాత మంచన కేయూరబాహు చరిత్రను వ్రాసెను. అది రాజశేఖరుడు ప్రాకృతభాషలో రచించిన 'విద్ధ సాలభంజిక' అను 'సట్టకము' నందలి కథను గ్రహించి కొన్ని మార్పులు చేసి, మధ్య మధ్య కొన్ని నీతి కథలను చేర్చి వ్రాసినట్టిది. ఆ పిమ్మట జక్కన 'విక్రమార్క చరిత్రము' ఈ కోవలో మూడవది. ఇది కథాసరిత్సాగరము, బేతాళ పంచవింశతి, సంస్కృత విక్రమార్క చరిత్రముల నుండి కథలను తీసికొని వ్రాసినట్టిది. తరువాత అనంతామాత్యుడు 'భోజరాజీయము'ను రచించెను. పిదప

కొరవి గోపరాజు ఈ సింహాసన ద్వాత్రింశికను వ్రాసెను. ఇది సంస్కృత విక్రమార్క చరిత్రకు పూర్తిగ అనువాదమైనను గోపరాజు సందర్భాను సారముగ అందందు అనేక విషయములను మఱికొన్ని కథలను చేర్చినాడు. ఆ తరువాత పుత్తేటి రామభద్ర కవి 'సకలకథా సారసంగ్రహము' ను, వెన్నెలకంటి అన్నయ్య 'షోడశకుమార చరిత్ర'ను, కూచిరాజు ఎర్రన్న 'బేతాళ పంచవింశతి'ని, పాలవేకరి కదిరీపతి 'శుక సప్తతి'ని, అయ్యల రాజు నారాయణామాత్యుడు 'హంసవింశతి'ని, ఎర్రన 'సకల కథా నిధానము'ను రచించిరి. ఇవన్నియు కథాకావ్యములే. ఇవి అనల్పకల్పనా సామర్థ్యముతో ప్రబంధ ఫక్కిలో వ్రాయబడిన మనోహర కావ్యములు.

<u>కవి వంశము</u>- కావ్యావతారికలో గోపరాజు తన వంశక్రమమును ఇట్లు తెలిపెను.

'గోపరాజు నియోగి బ్రాహ్మణుడు, హరితస గోత్రుడు. 'కొరవి' అను గ్రామమునుబట్టి ఆ యింటిపేరు వంశనామమైనది. తెలుగువారి ఇంటిపేర్లు గ్రామములను బట్టి, వారు చేయుచుండిన వృత్తులను బట్టి, వంశప్రముఖులను బట్టి ఏర్పడుచుండును. కొరవి వంశమునకు మూలపురుషుడు వెన్నామాత్యుడు. ఆయన చందవోలు రాజధానిగా తెలుగు దేశమును పాలించిన వెలనాటి పృథ్వీశ్వర రాజునకు ప్రధాన మంత్రిగా ఉండెను. దాక్షారామ శాసనములలో వెన్నామాత్యు డిట్లు ప్రశంసింపబడినాడు: "మంత్రి శిఖామణిః బుధనిధిః శ్రీ వెన్ననామాసుధీః" ఆ చందవోలు నేడు గుంటూరు మండలములో ఉన్నది వేంగీచాళుక్యులకు సామంతులైన వెలనాటిచోడ వంశీయు లీప్రాంతమును పాలించిరి. గోపరాజు తన వంశమూలపురుష నిట్లు వర్ణించెను.

"కలుష మాండలిక భేక ఫణీంద్రు డన, రాయ
గజ గంధవారణ ఖ్యాతి మెఱసి,

వీరఘోట్ట విభాళ డాయూధ బిరుద వి
　　రోధి కళింగనిరోధి యనఁగ,
వెలసి నానాఁటికి వెలనాఁటి పృథ్వీశ్వ
　　రుని రాజ్యభార ధుర్యుండనంగ,
ఆరెలు కన్నడీ లఱవలు తెలుఁగులు
　　దనబిరు దందియఁ దగిలి కొలువ,

నెగడి సనదప్రోలు నెలవుగా భూసుర
వంశసాగరామృతాంశమూర్తి
చక్రవర్తిమాన్య సౌజన్యధన్యుండు
విక్రమార్కనిభుడు వెన్నవిభుడు". (1-42)

ఆ వెన్నయ పౌత్రుడు 'అమరేశ్వరుడు'. కొడుకును చెప్పక మనుమని చెప్పినందున అమరేశ్వరుడు సాక్షాత్ పౌత్రుడు కాడనియు ఆ వంశమున పుట్టిన వాడనియు గ్రహింపవలెను. అమరేశ్వరునకు గంగాంబిక యందు 'అన్నయ-సింగయ' అను పుత్రులు పుట్టిరి. అన్నయను గూర్చి గోపరాజే మియు చెప్పలేదు. కాని 'ముప్పది యిద్దరు మంత్రుల చరిత్ర'లో అన్నయు దానకర్ణుడని చెప్పబడినది.

"ఘనదాన కర్ణుడై గండ పెండెముఁ దాల్చెఁ
　　గౌరవి అన్నామాత్యకుంజరుండు"

ఈ అన్నయ కొడుకు పెద్దిరాజు, పల్లికొండరాజు మల్లదేవరాజుచే ఆందోళికాచ్ఛత్రచామరములు బహూకృతులుగా పొందెను (1-46). ఈ పల్లి కొండరాజ్యమెటనున్నదో తెలియదు. అన్నయతమ్ముడు సింగయకు అబ్బయ, గోపయ, సత్తెనారన అను ముగ్గురు కొడుకులు పుట్టిరి. అబ్బయకు రామ రాజు, కేశిరాజు, బాచిరాజు, సింగరాజు అను నలువురు పుత్రులు. వీరిలో బాచన-సింగనలు రాచకొండ నేలిన అనపోత కుమార సింగయకు మంత్రులై యుండిరి.

"ఘనులగ్రజులకు నీడై
వనములుఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి బొ
చనయును సింగనయును దగి
రనపోతకుమార సింగయకు మంత్రులనన్॥ (1-48)

గోపరాజు చిన్నతాత సత్తెనారన 'ఆంధ్ర కవితా పితామహు' డని భీమన అని పేరు పొంది రామాయణ కావ్యమును వ్రాసెనట (1-49). ఇతడు వ్రాసిన రామాయణము లభింప లేదు. సింగయ కుమారులలో రెండవ వాడైన గోపయకు గంగాంబ యందు కసవరాజు పుట్టెను. అతనికి వేముగల్లు రాజధానిగా నేలిన రాణా మల్లనరేంద్రునకు పరమ గురుండై శైవాచార ప్రథమ సింహాసనాధీశ్వరుడైన బ్రహ్మదేవ వడియల కూతురు కామాంబిక యందు ఈ కృతికర్త గోపరాజు పుట్టెను. తండ్రి కసవరాజు

"తంత్రముచేఁ గార్యము పర
తంత్రము గాకుండఁ బతిహితమె చేయు మహా
మంత్రులలోపలఁ గసవయ
మంత్రి విచారమున దివిజమంత్రియుఁబోలెన్. (1-54)

మంత్రియై యుండిన రాణా మల్లనరేంద్రుని గూర్చి కూడ యేమియు తెలియుటలేదు. ఆయన కొడుకు గోపరాజు.

స్థలము- గోపరాజు తండ్రి కసవరాజు వేముగల్లు పాలకుడగు రాణా మల్ల నరేంద్రునకు మంత్రియై ఉండినట్లును, తాను ఆయూరనే పుట్టినట్లును తెలిపినాడు. అవతారికలోని (1-56) పద్యమునుబట్టి వేముగల్లు రాణామల్ల నరేంద్రునకు రాజధాని అని, కొండల నడుమ ఉన్న వనదుర్గమని, అందు శ్రీ విష్ణు మందిరమున్నదని తెలియుచున్నది. ఇది ఇప్పుడెచటనున్నదో గుర్తించుట కష్టము. మహబూబ్ నగరంజిల్లా కొల్లాపురం తాలూకాలో ఒక వేముగల్లున్నది కాని అది కాదు. కరీంనగరం వరంగల్లు జిల్లాలలో వేముగలు లున్నచో వానిలో నొకటి కావచ్చును.

వంశనామమునకు మూలమైన 'కొరవి' గ్రామము వరంగల్లు జిల్లాలో ఉన్నది. గోపరాజు పెదతాత కొడుకులు రాచకొండ నేలిన అనపోత కుమార సింగయకు మంత్రులుగా ఉండిరి. రాచకొండ నల్లగొండజిల్లాలోనిది. కవిస్తుతిలో వేములవాడ భీమకవికి ప్రత్యేకముగా ఒక పద్యమును వ్రాసెను. వేములవాడ కరీంనగరం జిల్లాలో ఉన్నది.

ఇందలి ఇరువది యొకటవ బొమ్మ కథలో మూలమున లేని భువన గిరిని (నల్లగొండ), ఓరుగంటిని(వరంగల్లు), గోదావరి నదిని, కాళేశ్వరమును (ఆదిలాబాదు), ధర్మపురిని (కరీంనగరం) వర్ణించెను. వీనినిబట్టి గోపరాజు కరీంనగరము వరంగల్లు జిల్లా ప్రాంతమువాడై యుండునని భావింపవచ్చును.

కవికాలము- ఇతని కాలమును గూర్చి పలువురు పండితులు విశేష చర్చలు చేసి విభిన్నాభిప్రాయములను ప్రకటించినారు. శ్రీ వెంపరాల సూర్య నారాయణ శాస్త్రిగారు 1480 సం॥ ప్రాంతమువాడని[1] శ్రీ కందుకూరు వీరేశ లింగం పంతులుగారు 17 శతాబ్దివాడని[2], శ్రీ చాగంటి శేషయ్యగారు 1480-90 మధ్య అని[3], శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు గారు 1350-1410 మధ్య అని[4], శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు శకవర్షముల 14 శతాబ్ది మధ్య గాని, చివరగాని ఉండవచ్చునని[5], డా॥ నేలటూరి వేంకట రమణయ్య గారు 15 శతాబ్దివాడని[6], శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు 15 శతాబ్ది చివరివాడని[7], శ్రీ ఆరుద్రగారు 1500-1530 అని[8], చెప్పినారు.

ఇందరు ఇన్ని విధములుగ చెప్పుటకు ప్రధాన కారణము కొరవి వంశ మూల పురుషుడగు వెన్నామాత్యునకు గోపరాజు ఏడవ పురుషుడుగా చెప్ప

---

1. ప్రథమ ముద్రణ పీఠిక
2. ఆంధ్ర కవుల చరిత్ర
3. ఆంధ్ర కవి తరంగిణి
4. ఆం.సా. పరిషత్ పత్రిక
5. History of the Reddy Kingdoms
6. వాఙ్మయ వ్యాసమంజరి
7. ఆంధ్ర సాహిత్య చరిత్ర
8. సమగ్రాంధ్ర సాహిత్యము

బడుటయే. దాని సామంజస్యమును గమనింతము. కవి వంశావతారికలో వెన్నామాత్యునకు పౌత్రుడు అమరేశ్వరుడని చెప్పినట్లే, ఆశ్వాసాంత్యగద్యలలో "శ్రీ కొరవి వెన్నామాత్యపౌత్ర కసవరాజ తనూజ గోపరాజ విరచితంబైన సింహాసన ద్వాత్రింశిక" అని తనను గూడ పౌత్రునిగా చెప్పెను. దీనిని బట్టి గోపరాజునకు అయిదవ పురుషుడగు అమరేశ్వరుడు వెన్నయకు సాక్షాత్ పౌత్రుడు గాడని ఆ వంశములో కొన్నితరములు గడచిన తరువాత పుట్టినవాడని గట్టిగా చెప్పవచ్చును. ఇందువలన వెన్నామాత్యుని కాలము నుండి తరమున కిన్ని వత్సరములని గుణించు బాధ తప్పినది.

గోపరాజు కాలమును తెలిసికొనుటకు రెండు ఆధారములున్నవి. ఒకటి గోపరాజు పెదతాత కుమారులు బాచన సింగయలు రాచకొండ రాజగు అనపోత కుమార సింగయ కడ మంత్రులుగా ఉండుట. ఈ సింగభూపాలురు ముచ్చురున్నారు. వీరిలో అనపోత నాయకుని కుమారుడు కుమార సింగ భూపాలుడు క్రీ.శ 1430-1475 వరకు పాలించినవాడు. ఇతని కడనే బాచన సింగనలు మంత్రులుగా ఉండినట్లు తలచవచ్చును. ఇతని కోరిక పైననే బమ్మెర పోతన 'భోగినీదండకము'ను రచించెను. గోపరాజు ఈ కాలమునకు ఒక తరము తరువాత ఉండవలెను. రెండవ ఆధారము గోపరాజు పూర్వకవి స్తుతిలో పిల్లలమఱ్ఱి వీరరాజును పేర్కొనుట. ఆ వీరరాజు పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడనియే పలువురు పండితులు అభిప్రాయపడినారు. జైమిని భారతమును రచించి పినవీరభద్రుడు 1485-1490 సంవత్సరములలో విజయనగర సామ్రాజ్యమును పాలించిన సాళువ నరసింహ రాయలకు అంకిత మిచ్చెను. దానినిబట్టి గోపరాజు పిన వీరభద్రునకు తరువాత కొద్ది కాలముననే ఉండునని శ్రీ ఆరుద్రగారి అభిప్రాయము. శ్రీ లక్ష్మీకాంతము గారు పిన వీరభద్ర, గోపరాజులు సమవయస్కులు కాకున్నను సమకాలికులై యుందురని చెప్పిరి.

డా॥ నేలటూరి వెంకటరమణయ్య గారు గోపరాజు పేర్కొన్నవాడు పినవీరభద్రుడు కాడనియు, అతని అన్న పిల్లలమఱ్ఱి పెదవీరరాజు కాదగు

నని యు, అతడు శ్రీనాథునకు గురు వనియు వ్రాసిరి.[1] శ్రీనాథుడు హర విలాస పీఠికలో కృతిభర్త అవచితిప్పయసెట్టి గురువైన "పిల్లలమఱ్ఱి మహా ప్రధాని పెద్దన్న గురూత్తముడని, శైవమార్గ సంపన్ను"డని చెప్పెను. ఆ పెద్దన్నయే పెదవీరరాజని, కవియైయుండెనని, పినవీరభద్రుని అన్నయని చెప్పుటకు ఆదారములేదు. గోపరాజు పిల్లలమఱ్ఱి వీరరాజాదులను 'దలంతు మత్కులచంద్రుల సత్కవీంద్రులఁ' అన్నాడు. బహుశః ఆ పెద్దన్న పినవీరభద్రునకు పితామహుండేమో।

ఈ సందర్భమున మరొక విషయము గమనింపదగియున్నది. ఈ కావ్యమునందలి అయిదవ ఆశ్వాసమున పదవ బొమ్మకథలో ఒక అవధూత విక్రమార్కునకు యోగరహస్యములు తెలుపు ఘట్టమున ఒక ఆటవెలది పద్యమును వ్రాసెను.

"దుఃఖసాధ్యమయ్యుఁ దొడరి యభ్యాసంబుఁ
జేయఁ జేయ యోగసిద్ధి పెంపు
దినఁగఁదినఁగ వేము తియ్యనౌ కైవడిఁ
బిదప పరమ హర్ష పదము సుమ్ము. (5-15)

ఈ పద్యము చదువగనే వేమన పద్యము.

"అనఁగ ననఁగ రాగమతిశయిల్లుచు నుండు"అనునది వెంటనే స్ఫురణకు వచ్చును. గోపరాజు తనకావ్యమున ఆటవెలది పద్యములను విశేషముగా వ్రాసినాడు. దీనినిబట్టి గోపరాజు వేమనకు తరువాత ఉండి అతని ప్రభావమునకు లోనై యుండెనా అని తలచుటకు అవకాశమున్నది.

1500-1580 ప్రాంతము కృష్ణరాయలు అష్ట దిగ్గజముల కాలము. గోపరాజు ఆకాలమున నుండినట్లు అతని కావ్యములో ఎట్టి సూచనయు లేదు.

---

1. వాఙ్మయ వ్యాస మంజరి.

సింహాసన ద్వాత్రింశికలో దక్షిణదేశము నందలి ఎన్నో పుణ్య క్షేత్రముల ప్రస్తావన ఉన్నది. కాని పంపా విరూపాక్షము ప్రస్తావించబడలేదు. ఏమి కారణమో తెలియదు. ఇంతవరకు తెలిసిన దానిని బట్టి గోపరాజు పిల్లల మఱ్ఱి పినవీరభద్రునకు ఈవలి వాడని మాత్రము చెప్పవచ్చును.

గోపరాజు వైదుష్యము : గోపరాజు తన్నుగూర్చి తన కవితానైపుణ్యమును గూర్చి కావ్యావతారికలో నిట్లు వ్రాసికొన్నాడు.

"కం. పూజితులగు కవుల కృపఁ
భ్రాజిష్ణుఁడఁ గొంత అష్టభాషావిదుఁడఁ" (1-58)

వ. అని యిట్లు సకల వరప్రదాన కారణదేవతలను, జతుర హృద్యానవద్య గద్య పద్య విద్యా విద్యోతితులయిన కవీశ్వరులనుం బ్రశంసించి తత్ప్రసాదాసాదిత సహజ సాహిత్య తరంగితాంతరంగుండనై సకల జన సాధారణంబ గునట్లు విన్నవించెద. (1-13)

కం. అప్పరమేశ్వరు కరుణం
గుప్పలుగొను విక్రమార్కు గుణముల కొఱకై
చెప్పెద రసభావంబులు
ముప్పిరి గొనునట్లు కథలు ముప్పది రెండుఁ. (1-61)

ఆ.వె. తన వచోవిశేష మెనయక పూర్వక
థామితోక్తిఁ జెప్పుటేమి కడిది
యొకఁడు గోలవట్టి యొయ్యనఁ గొనిపోవ
నంధుఁడెచటికైన నరుగుటరుదె. (1-34)

ఈ విధముగ గోపరాజు తన రచనా విధానమును చెప్పెను కాని అనుకున్నట్లు ప్రతిభను ప్రదర్శింపలేక పోయినాడు. మూలమును యథాతథముగ చెప్పనని తన వచోవిశేషమును చూపెదనని చెప్పినట్లే చేసినాడు.

'అష్టభాషా విదుడ' నుటలో గొంత సత్యము లేకపోలేదు. సంస్కృతము, షట్ప్రాకృతములు తెలుగు కలిసి అష్టభాషలగును. సంస్కృతాంధ్రములలో చక్కని పాండిత్యము గలవాడనుటలో సందేహము లేదు. నాలుగవ ఆశ్వాసములోని ముక్తపదగ్రస్త నిరోష్ఠ్య దండకము, ఆశ్వాసాంతపద్యాలు అతని సంస్కృత పాండిత్యమును చాటుచున్నవి.

ప్రాకృత భాషాజ్ఞానము గలవాడనుటకు అతడొక పద్యములో ప్రాకృత భాషా పదములను వాడినాడు.

"దండశూకాధిపోద్దండ భుజాదండ
 భూరి విశ్వంభరాభారధుర్య
జంభారి పరికీర్తితాంభోజినీ మిత్ర
 సూణు సమాహియదాణరాయ
అక్కిణ హృదయదండొక్క కేళఃక్కేళి
 పతివఃకణీవళఃపక్క దక్క
అంకక్కరిక్క మహోలద స్పాందన
 లవలవప్పహిత తులఃకధీర
ధీరసంపదుస్తు దేవబంధకహిమ
దఃకసౌక్కమోరి దర్శనిచయ
యనుచు నాల్గుభాషలను రాజు దీవించి
నయన సంజ్ఞ నాసనమున నుండి". (2-4?)

ఇందు నాల్గు భాషలనుట చతుర్విధ ప్రాకృతములనుటకు కావచ్చును. తన ప్రాకృత భాషా పరిచయము నిట్లు తెలిపినాడు. ఈ ప్రాకృత భాషా వాక్యముల కర్థమేమో ఆ భాషావేత్తలు చెప్పవలెను.

గోపరాజునకు సాహిత్య వ్యాకరణములేకాక అనేక శాస్త్రములలో తగిన పరిజ్ఞానమున్నట్లు కావ్యము నందక్కడక్కడ బహు విషయములను

వివరించుటను బట్టి తెలిసికొనవచ్చును. ప్రాసంగికముగ స్త్రీజాతులు, కుశనములు, చేపల జాతులు, అశ్వజాతులు, వృక్షజాతులు, వస్త్ర విశేషములు, ఆభరణవిశేషములు, రాజనీతి, ఆంధ్రఛ్ఛందో విశేషములు, ఛందోభేదములు, యోగశాస్త్రవిషయములు, మల్లయుద్ధ పద్ధతులు, సర్పజాతులు, స్వప్న శాస్త్రము, జ్యోతిష శాస్త్రము, గణకరీతులు, 64 కళలు, ద్యూతక్రీడా విశేషములు, వేట పద్ధతులు మొదలయిన విషయములను తెలిపెను. వీనిలో కొన్ని మూలములో సూత్రప్రాయముగ ఉన్నవి. ఈ అన్నిటిలో గోపరాజునకు మంచి ప్రవేశమున్నట్లు తెలియుచున్నది

ఇతడు చతుర్విధ కవితా విశారదుడు. తనకుగల బంధకవితా చాతుర్యమును రెండు చోట్ల ప్రదర్శించెను. సంస్కృత పదప్రయోగ నైపుణ్యమెంత కలదో అచ్చ తెలుగులలో గూడ అంతే నైపుణ్యమున్నట్లు నిరూపించుకొన్నాడు.

<u>సంస్కృత మూలము</u>-'సింహాసన ద్వాత్రింశిక' స్వతంత్ర కావ్యము కాదు. ఇది సంస్కృత గ్రంథమునకు తెలుగుసేత అని కవియే చెప్పినాడు.

> "ఈ సరసోక్తి కావ్యమొకఁ డిమ్ముల సంస్కృత భాషనచ్చుగాఁ
> జేసిన నట్ల వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
> జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
> నేసిన నందె పాఱ మఱి యేసినవానిద సూటిగావునః." (1-35)

ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి ప్రథమ ముద్రణమును పరిష్కరించి పీఠిక వ్రాసిన శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారు "దీనికి మూలము కథాసరిత్సాగరము. ఆ సాగరము నుండి ఈ రత్నము నెత్తి చక్కగా సానబట్టి ఆంధ్ర సరస్వతికిఁ బూజ యొనర్చిన మహాకవి గోపరాజు అని వ్రాసినారు. అదే సందర్భమున అధస్సూచికలో "అచ్చు పడిన సంస్కృత మూలమొక్కటి విక్రమార్క చరిత్రము (గద్య పద్యాత్మకము) కలదు. కాని

యందుగల కథల వరుస యిందు గానరాదు. విషయములును భేదముగా ఉన్నవి" అని చెప్పిరి.

కాని శ్రీ శాస్త్రిగారు కథా సరిత్సాగరమును గాని, సంస్కృత విక్ర మార్క చరిత్రమును గాని సరిగా పరిశీలింపలేదు. సింహాసన ద్వాత్రింశికతో పోల్చిచూడలేదు. కథా సరిత్సాగరమున విక్రమార్కుని కథలు, బేతాళ పంచవింశతి కథలు ఉన్నవి. కాని గోపరాజు వానిని గ్రహింపలేదు. ఆ కథలకును తెలుగు కావ్యమునందలి కథలకును పోలికలే లేవు. అవి భిన్న ముగా ఉన్నవి.

గద్యపద్యాత్మకమైన ఒక సంస్కృత విక్రమార్క చరిత్రమును వావిళ్ళవారు 1936లో ప్రకటించిరి. అదియే గోపరాజు అనువదించిన మూల గ్రంథము. ఆ సంస్కృత మూలమును పూర్తిగా గ్రహించి గోపరాజు మఱి కొన్ని కథలను సమకాలిక జనజీవన విశేషములను చేర్చి "సింహాసన ద్వాత్రింశిక" అను పేర ఈ కథాకావ్యమును రచించెను.

కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు గోపరాజు అనువదించిన మూలమేదో తెలియదనిరి[1]. డా॥ నేలటూరి వేంకటరమణయ్య గారు 'దీని మాతృక యెద్దియో తెలియదు. ఆ సంస్కృత మూలము కాకతీయ యుగ మున క్రీ.శ. 1200-1323ల మధ్య రచింపబడి యుండును' అని చెప్పిరి[2]. అందుకు ఆధారాలు చూపలేదు, కేవలము వారి ఊహయే ఆధారము.

పాల్కురికి సోమనాథుని శిష్యుడు ఏకామ్రనాథుడు (1330 ప్రాంతము) "సింహాసన ద్వాత్రింశిక" అను వచన గ్రంథమును వ్రాసి నట్లును, అదే పేరుతో ఒక ద్విపద రచన గూడ ఉన్నట్లును శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు వ్రాసినారు[3]. గోపరాజు సంస్కృత మూలమును ఈ

1. History of the Reddy Kingdoms. 2. వాఙ్మయవ్యాసమంజరి.
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 43 సంపుటి, 3 సంచిక.

వచన ద్విపద గ్రంథములను చూచియే ఈ కావ్యమును రచించినాడని తలప వచ్చును. 1520 ప్రాంతమున నుండిన యాదవామాత్యుడు వచనములో విక్రమార్కుని చరిత్రను వ్రాసినట్లును, అందు విక్రమార్కుని సింహాసనము మీది 32 బొమ్మలు చెప్పిన కథలున్నట్లును, ప్రతి కథముందు ఒక పద్యము వ్రాయబడినట్లును శ్రీ ఆరుద్రగారు చెప్పిరి[1]. సంస్కృత విక్రమార్క చరిత్రనే గోపరాజు పూర్తిగా అనువదించి అక్కడక్కడ పెంచెనని శ్రీపింగళి లక్ష్మీకాంతము గారు వ్రాసిరి[2].

గోపరాజు అనుసరించిన సంస్కృత విక్రమార్క చరిత్ర యొక సంకలన గ్రంథము. ఇది గద్య పద్యాత్మికము. గద్యము సరళముగ సుంద రముగ ఉండి సాధారణ జ్ఞానము గలవారికిని సులభముగ అర్థమగునట్లున్నది. శ్లోకములు స్మృతుల నుండి, సుభాషిత గ్రంథములనుండి, నీతి శాస్త్రముల నుండి, కావ్యముల నుండి, పంచతంత్రము నుండి గ్రహింపబడి, సందర్భోచిత ముగ కూర్చబడినవి. ఈ గ్రంథ సంగ్రథనకారుడెవరో తన పేరు తెలుపు కొనలేదు. ఇందు ద్వాత్రింశోపాఖ్యానములు విడివిడిగా ఉన్నవి. ప్రతి ఉపాఖ్యానము కథాసంగ్రహము గల ఒక శ్లోకముతో ప్రారంభమగును, మూలము

"శ్రీ పురాణపురుషం పురాంతకం
పద్మసంభవముమాసుతం మయా
సంప్రణమ్యచ సురాజ్ఞ సరస్వతీం
విక్రమార్కచరితం విరచ్యతే"

అను స్తోత్రముతో ప్రారంభమై

"శ్రీమతో విక్రమార్కస్యచరితం మహిమోత్తరం
ద్వాత్రింశత్పుత్తిమాప్రోక్తం సమాప్తి మగమత్తరాం"

---

1. సమగ్రాంధ్ర సాహిత్యము, 7వ సంపుటము. 2. ఆంధ్ర సాహిత్య చరిత్ర.

అను శ్లోకముతో ముగియును. గోపరాజు ఈ పద్ధతినే అనుసరించెను. గోపరాజు మూలము నెట్లనుసరించెనో ఉభయ గ్రంథముల కథాక్రమమును పరిశీలించిన తెలియగలదు.

## సంస్కృత మూలకథలు :

ప్రథమోపాఖ్యానము- ఉజ్జయిని రాజధానిగా మాళవ దేశమును భర్తృహరి పాలించుచుండెను. అతడు భార్య అనంగసేన దుష్ప్రవర్తన వలన విరక్తుడై, తమ్ముడగు విక్రమార్కునకు పట్టము గట్టి అడవులకు పోవును. విక్రముడు రాజై తన సాహస కృత్యములచే బేతాళుని వశము చేసికొని ప్రజారంజకముగ రాజ్యమేలెను. స్వర్గమునకు బోయి రంభా ఊర్వశుల వివాదము తీర్చి, ఇంద్రునిచే దివ్య సింహాసనమును పొందెను. చిరకాలము రాజ్యమేలి ప్రతిష్ఠాన పురములోని 2 సం॥ 6 నెలల కన్యకకు పుట్టిన శాలివాహనునిచే మరణించెను. దివ్యవాణి ఆదేశముచే మంత్రులు విక్రమార్కుని సింహాసనమును భూస్థాపితము చేసి ఆ భూమినొక బ్రాహ్మణునకు దాన మిచ్చిరి.

ఆ బ్రాహ్మణ వంశీయుడొకడు ఆ భూమిలో జొన్నలు సెనగలు పైరు వేసి సింహాసనమున్న దిబ్బపై మంచవేసికొని చేనుకావలి కాయుచుండెను. భోజరాజు సైన్యములతో అచటికి వచ్చును. విప్రుడు మంచెపై నుండి సైనికుల నాహ్వానించి దిగినతోడనే దూషించును. దీనిని గమనించి భోజరాజు ఆ భూమిని కొని మంచె ఉన్నచోట త్రవ్వించగా సింహాసనము కనబడును. ఎంత ప్రయత్నించినను సింహాసనము పైకిరాలేదు. మంత్రి ఆలోచనతో శాంతులు జరిపిన అనంతరము సులువుగా అది పైకి వచ్చెను. ఇచట నంద భూపాలుడు బహుశ్రుతుడను మంత్రి వలన బ్రహ్మహత్యా పాతకమునుండి తప్పించుకొన్న కథ చెప్పబడినది (ససేమిరా కథ).

ఒక సుముహూర్తమున భోజరాజు సింహాసన మెక్కుటకురాగా మొదటి సోపానము మీద ఉన్న సాలభంజిక ఆపి, విక్రమార్కుని వంటి

ఔదార్యముగలవారే ఈ సింహాసన మెక్కవలెనని పల్కి ఆ మహారాజు దాతృత్వమును వర్ణించును.

ద్వితీయోపాఖ్యానము- మరల భోజరాజు సింహాసన మెక్కబోగా, రెండవ మెట్టుమీది బొమ్మ భోజుని ఆపి ఒక కథ చెప్పును- చిత్రకూట పర్వతము దగ్గర ఒక బ్రాహ్మణుడు కామితార్థమునకై ఎన్నోయేండ్లు హోమము చేయుచున్నను సిద్ధి కలుగనందున, విక్రమార్కుడు వెళ్ళి తన తల ఆహూతి ఈబోగా, దేవత ప్రత్యక్షమై రాజుకోరిక మేరకు బ్రాహ్మణుని కామితము దీర్చును.

తృతీయోపాఖ్యానము- మూడవ సాలభంజిక విక్రమార్కునకు అశ్వమేధ యాగ సందర్భములో సముద్రుడు పంపిన నాలుగు దివ్యరత్నములను ఒక బ్రాహ్మణునకు దానము చేసిన కథ చెప్పును.

చతుర్థోపాఖ్యానము- నాలుగవ బొమ్మ విక్రమార్కునకు ఒక విప్రుడు కొద్దిపాటి సహాయము చేసి బహుమతి పొందియు, అతని కృతజ్ఞతను పరీక్షింపగోరి. రాజపుత్రుని దాచి చంపినట్లు నటించినను రాజతనిని క్షమించిన కథ చెప్పును.

పంచమోపాఖ్యానము-అయిదవ బొమ్మ విక్రమార్కుడు విదేశీయునిచే 10 అమూల్య రత్నములను కొని. వాటిని తెచ్చుటకై ఒక భృత్యుని పంపును. వాడు గడువులోగా తీసికొని వచ్చుచు దారిలో నదిదాటించిన పడవవానికి 5 రత్నము లిచ్చినట్లు చెప్పగా మిగిలిన 5 రత్నములను గూడ భృత్యున కిచ్చిన కథ చెప్పును.

షష్ఠోపాఖ్యానము- ఆరవ బొమ్మ విక్రమార్కు డొకనాడు భార్యలతో క్రీడావనమున విహరించుచుండగా ఒక బ్రాహ్మణుడు వచ్చి జగదంబ నన్ను గృహస్థుడవు కమ్మని నిన్ను ఆశ్రయింపుమని చెప్పగా వచ్చితినినను.

వెంటనే విక్రమార్కుడా విప్రునకు ఉత్తమ వధువులను సంపదలను ఇచ్చిన కథ చెప్పను.

సప్తమోపాఖ్యానము- ఏడవ బొమ్మ సముద్ర మధ్యమునందలి పర్వతమున భువనేశ్వరి ఆలయముతో తలలు తెగి పడియున్న దంపతులకై, తన తల ఈబోగా, దేవి ప్రత్యక్షమై దంపతులను బ్రతికించిన కథ చెప్పను.

అష్టమోపాఖ్యానము- ఎనిమిదవ సాలభంజిక కాశ్మీరదేశమున వర్తకుడు త్రవ్వించిన తటాకమును నింపుటకై విక్రమార్కుడు తన కంఠరక్తము నీబోగా దేవి ప్రసన్నమై తటాకమును జలపూర్ణము చేసిన కథ చెప్పను.

నవమోపాఖ్యానము- తొమ్మిదవ బొమ్మ కాంచీనగరము నందలి వేశ్యనాశ్రయించికొని ఉన్న రాక్షసుడు విటులను చంపుచున్న వార్తవిని, విక్రమార్కుడు వెళ్ళి రాక్షసుని చంపివచ్చిన కథ చెప్పను.

దశమోపాఖ్యానము- పదవసాలభంజిక సిద్ధయోగీంద్రుని ఉపదేశముచే యజ్ఞపురుషుని మెప్పించి, ఆయన ప్రసాదించిన దివ్యఫలమును విక్రమార్కుడు కుష్ఠరోగికి సమర్పించిన కథ చెప్పను.

ఏకాదశోపాఖ్యానము- పదునొకండవ సాలభంజిక రాక్షసుని వంతునకు వచ్చిన బ్రాహ్మణ బాలకుని రక్షించుటకై విక్రమార్కుడు వెళ్ళి, రాక్షసుని మెప్పించి, అప్పటి నుండి మనుష్యభక్షణము మాన్పించిన కథ చెప్పను.

ద్వాదశోపాఖ్యానము- పంద్రెండవ సాలభంజిక విక్రమార్కుడు వేణువనములో ప్రతి రాత్రి ఒక స్త్రీని బాధించుచున్న రాక్షసునిచంపి, ఆమె వలన లభించిన సువర్ణ ఘటములను, సర్వస్వము కోల్పోయిన వైశ్యున కిచ్చిన కథను చెప్పను.

త్రయోదశోపాఖ్యానము- పదమూడవ సాలభంజిక ఒక నదిలో కొట్టుకొని పోవుచున్న వృద్ధ బ్రాహ్మణ దంపతులను విక్రమార్కుడు

రక్షించి ఆ బ్రాహ్మణుడు ధారపోసిన ద్వాదశవర్ష మంత్రజప ఫలమును బ్రహ్మరాక్షసునకు సమర్పించిన కథ చెప్పును.

చతుర్దశోపాఖ్యానము- పదునాల్గవ సాలభంజిక విక్రమార్కుడు తనకు సిద్ధయోగి ప్రసాదించిన సర్వకామద మయిన మహాలింగమును ఒక బ్రాహ్మణునకు ధారపోసిన కథ చెప్పును.

పంచదశోపాఖ్యానము- పదునైదవ సాలభంజిక విక్రమార్కుడు తన పురోహిత పుత్రునితో వెళ్ళి ఒక నగరములో దేవాలయ గోపురమునగల తప్తతైలకటాహమున దూకి మన్మథ సంజీవిని అను అప్సరసచే బ్రతికించబడి ఆ అప్సరసను పురోహితపుత్రునకు సమర్పించిన కథ చెప్పును.

షోడశోపాఖ్యానము- పదునాఱవ సాలభంజిక విక్రమార్కుడు దిగ్విజయ యాత్ర చేసివచ్చి, పురబాహ్యోద్యానమున విశ్రమించి యుండగా, ఒక బ్రాహ్మణ కన్యకు ఆమెబరువు బంగారము నిచ్చి పెండ్లి చేసిన కథ చెప్పును.

సప్తదశోపాఖ్యానము- పదునేడవ సాలభంజిక ఒక రాజు విక్రమార్కునితో సాటి అగుటకు ప్రతినిత్యము తనను హోమము చేసికొనుచున్నట్లు విని, విక్రమార్కుడు వెళ్ళి, అచటి దేవతను మెప్పించి,ఆ రాజునకు నిత్యబలి తప్పించిన కథ చెప్పును.

అష్టాదశోపాఖ్యానము- పదునెనిమిదవ సాలభంజిక ఉదయాద్రి దగ్గర గంగానదిలో ఒక స్తంభము సూర్యోదయముతో పైకి లేచి, మధ్యాహ్నమునకు సూర్యుని సమీపించి, అస్తమయమునకు నదిలో మునిగిపోవుచుండుట విని విక్రమార్కుడు వెళ్ళి ఆ స్తంభముపై కూర్చుండి సూర్యుని కడకు వెళ్ళి మెప్పించును. సూర్యుడిచ్చిన దివ్య కుండలములను ఒక దరిద్ర బ్రాహ్మణునకు సమర్పించిన కథ చెప్పును.

ఏకోనవింశోపాఖ్యానము- పందొమ్మిదవ సాలభంజిక విక్రమార్కుడు వేటలో వరాహమును తరుముచు వెళ్ళి, పాతాళము చేరి, బలి చక్రవర్తిని

దర్శించును. ఆయన ప్రసాదించిన రస రసాయనములను ఒక బ్రాహ్మణ కుటుంబమునకు ధారపోసిన కథ చెప్పును.

వింశోపాఖ్యానము- ఇరువదవ సాలభంజిక, విక్రమార్కుడు ఒక మహా సిద్ధునిచే మహిమగల ఘుటికను, బొంతను, యోగదండమును సంపాదించి దారిలో రాజ్యభ్రష్టుడగు ఒక రాజకుమారునకు సమర్పించిన కథ చెప్పును.

ఏకవింశోపాఖ్యానము-ఇరువది యొకటవ సాలభంజిక విక్రమార్కుడు మంత్రిపుత్రుడైన అనర్ఘుని వలన విని ఒక పుష్కరిణిలో సలసల క్రాగుచున్న నీళ్ళలో నుండి రాత్రిపూట బయటికి వచ్చిన 8 మంది స్త్రీలననుసరించి పాతాళమునకు పోయి, వారిచే 8 దివ్యరత్నములను పొందివచ్చి దరిద్ర బ్రాహ్మణునకు ధారపోసిన కథ చెప్పును.

ద్వావింశోపాఖ్యానము- ఇరువది రెండవ సాలభంజిక, నీలపర్వత బిలములోని కామాక్షీదేవిని మెప్పించి విక్రమార్కుడు అందున్న రసకుంభమును దెచ్చి బ్రాహ్మణునకు ధారపోసిన కథ చెప్పును.

త్రయోవింశోపాఖ్యానము-ఇరువదిమూడవ సాలభంజిక, విక్రమార్కుడు దుస్స్వప్న శాంతికై హవనము చేసి 3 దినములు తన భాండాగారమును తెరచి యుంచి యథేచ్ఛగా దానములు చేసిన కథ చెప్పును.

చతుర్వింశోపాఖ్యానము- ఇరువదినాలుగవ సాలభంజిక, ఒక వర్తకుని పుత్రులకు తండ్రి చేసిన భాగ పరిష్కారము అర్థముకాక అన్ని దేశములు తిరిగి ప్రతిష్ఠానపురములోని శాలివాహను డనుబాలునిచే ఆ వివరము తెలిసికొందురు. విక్రమార్కుడీ వార్తవిని శాలివాహనుని పిలువ బంపగా, వాడు తిరస్కరించును. దానిని సహింపక శాలివాహనునిపై దండెత్తి వానిచే సైన్యములు చావగా వాసుకిని ప్రార్థించి అమృతకలశమును సంపాదించును. దానిని శాలివాహనుడు పంపిన బ్రాహ్మణులకు దానమిచ్చిన కథ చెప్పును.

పంచవింశోపాఖ్యానము- ఇరువది అయిదవ సాలభంజిక, ఒకసారి ద్వాదశ వర్ష క్షామము వచ్చెను. విక్రమార్కుడు తన కంఠము నరకుకొన నెంచగా దేవి ప్రత్యక్షమై క్షామబాధ పోగొట్టిన కథ చెప్పును.

షడ్వింశోపాఖ్యానము- ఇరువది ఆఱవ సాలభంజిక, విక్రమార్కుని గుణములను పరీక్షింప వచ్చిన కామధేనువు అతని సాహసమును మెచ్చి స్వాధీనము కాగా, దానినొక దరిద్రునకు దానమిచ్చిన కథ చెప్పును.

సప్తవింశోపాఖ్యానము- ఇరువది యేడవ సాలభంజిక, విక్రమార్కుడు భైరవుని మెప్పించి ఘటత్రయ ధనమును జూదరికి ధారపోసిన కథ చెప్పును.

అష్టావింశోపాఖ్యానము- ఇరువది యెనిమిదవ సాలభంజిక విక్రమార్కుడు బేతాళపురిలోని శోణితప్రియ అను దేవతను మెప్పించి నరబలి మాన్పించిన కథ చెప్పును.

ఏకోనత్రింశోపాఖ్యానము- ఇరువది తొమ్మిదవ సాలభంజిక, విక్రమార్కుడు ఒక భట్టునకు తన రత్నభాండాగారము నుండి కోరిన ధనరాసులు కొనిపోవననుజ్ఞ ఇచ్చిన కథ చెప్పును.

త్రింశోపాఖ్యానము- ముప్పదవ సాలభంజిక, విక్రమార్కుడు ఒక ఐంద్రజాలికుని విద్యామహిమకు మెచ్చి తనకు పాండ్యరాజు పంపిన కప్పమును కానుకలను ధారపోసిన కథ చెప్పును.

ఏకత్రింశోపాఖ్యానము- ముప్పదియొకటవ సాలభంజిక, విక్రమార్కుడు దిగంబరుని కోరికపై బేతాళుని పట్టి తెచ్చుచుండగా కాలక్షేపమునకై బేతాళుడొక కథ చెప్పి దానిని గూర్చి ప్రశ్నించును. రాజు సమాధానము చెప్పగా మౌనభంగము కలిగి బేతాళుడు పారిపోవును. ఈ విధముగా 26 కథలు చెప్పి తప్పించుకొని చివరకు బేతాళుడు దిగంబరుని చంపించి విక్రమార్కునకు వశుడగును. వానిని బ్రతికించి అష్టసిద్ధులను సమర్పించిన కథ చెప్పును.

ద్వాత్రింశోపాఖ్యానము- ముప్పది రెండవ సాలభంజిక, విక్రమార్కుని విశేషముగ ప్రశంసించి, భోజరాజా! నీవును అంతటివాడవు, నీ వలన మాకు శాపమోచనమైనదని చెప్పి తమకు పార్వతీదేవి శాపము, ఆమె పరిచారకలైన తమ పేర్లు, శాపమోక్ష విధీ తెలిపి నీవలన ముక్తి పొందితిమి అని వరము లొసగి 32 సాలభంజికలు దివ్యాంగనలుగా మారి వెళ్ళిపోవుదురు. భోజుడు ఆ దివ్య సింహాసనముపై దేవుని నిలిపి పూజించును.

ఈ మూలకథల నన్నిటిని గ్రహించి గోపరాజు తన కావ్యమున సందర్భానుసారముగ పెంచి మార్చి రచించినాడు.

## సింహాసన ద్వాత్రింశికలోని కథలు :

కైలాసమునందు గౌరిదేవి శంకరుని కథ చెప్పుమనును; శివుడు భోజ రాజునకు సింహాసన సాలభంజికలు 32 చెప్పిన కథలు చెప్పెదను వినుమని చెప్పదొడగెను.

ఉజ్జయినీ పురమును చంద్రగుప్తుని పుత్రుడు భర్తృహరి పాలించు చుండెను. అతని భార్య అనంగసేన. ఆమె చెడు వర్తనము వలన విరక్తుడై విక్రమార్కునకు రాజ్యము కట్టి వెళ్ళెను. విక్రమార్కుడు మహాకాళుని గూర్చి తపమొనర్చి మెప్పించి ఒక సంవత్సరము మీద ఒక దినము వయసుగల కన్యకు బుట్టిన వానితో మాత్రమే చావు కలుగునట్లు వరము పొందెను. భట్టి చాతుర్యము వలన 2 వేల యేండ్లు బ్రతుకును; బేతాళుని వశము చేసికొనును. స్వర్గమునకు పోయి రంభా ఊర్వశుల నృత్య విశేషములు వివరించి ఇంద్రునిచే దివ్య సింహాసనము సంపాదించెను. చివరకు ప్రతిష్ఠానపురము నందలి శాలి వాహనుడను బాలునిచే మరణించును. అశరీరవాణి చెప్పినట్లు ఆ సింహాస నమును విక్రమార్కుని మంత్రులు భూమిలో పాతిపెట్టి ఆ భూమి నొక బ్రాహ్మ ణునకు దానమిచ్చెదరు.

ఆ భూమిలో ఆ బ్రాహ్మణవంశీయుడు మంచె వేసికొని చేనులో పైరు పెట్టి కావలి యుండును. భోజరాజు సైన్యములతో నచటికిరాగా మంచెపై ఉండి ఆహ్వానించును. మంచె దిగి దూషించును. భోజరాజు ఆ భూమిని కొని, మంచె ఉన్నచోట త్రవ్వింపగా సింహాసనము కనబడును. ఎంతప్రయత్నించి నను అది వెలికిరాదు. మంత్రి సలహా మేరకు శాంతులు చేయగా వెలికి వచ్చును. మంత్రి ఆవశ్యకతను తెలుపు బహుశ్రుతుని (ససేమిరా) కథ, ఏకలునికథ, వులిపులుగు కథ చెప్పబడినవి. భోజరాజు శుభదినమున సింహాసన మెక్కబోగా మొదటిమెట్టుపై ఉండిన బొమ్మ భోజుని ఆపి విక్రమార్కుని వంటి సాహసౌదార్యములు కలవాడే ఈ సింహాసనమెక్కుటకు అర్హుడని చెప్పును. ఇట్లే తక్కిన 31 బొమ్మలును ఒక్కొక్క కథ చెప్పును.

మొదటి బొమ్మ కథ- మూలమునందలి కథతోబాటు అదనముగ సుదర్శనుని కథ. చతురంగ తజ్ఞుని కథ చేర్చబడినవి.

రెండవ బొమ్మ కథ- మూలములోని కథనే చెప్పును.

మూడవ బొమ్మ కథ- మూలమందలి కథతోబాటు గౌళికుని కథ చేర్చబడినది.

నాలుగవ బొమ్మ కథ- మూలకథనే చెప్పును.

అయిదవ బొమ్మ కథ- మూలకథనే చెప్పెను.

ఆఱవ బొమ్మ కథ- మూలకథనే చెప్పెను

ఏడవ బొమ్మ కథ- మూలకథయే.

ఎనిమిదవ బొమ్మ కథ- మూలకథతో బాటు శంఖపాలుని కథ అదనముగా చెప్పబడినది.

తొమ్మిదవ బొమ్మ కథ- మూలకథయే.

పదవ బొమ్మ కథ- మూల కథయే.

పదునొకండవ బొమ్మ కథ- మూలకథతోబాటు జీమూతవాహనుని కథ చెప్పబడినది.

పండ్రెండవ బొమ్మ కథ- మూలమందలి కథయే.

పదమూడవ బొమ్మ కథ- మూలమందలి కథయే.

పదునాల్గవ బొమ్మ కథ- మూలకథతోబాటు రాజశేఖరుని కథ చేర్చబడినది.

పదునైదవ బొమ్మ కథ- మూలకథయే.

పదునాఱవ బొమ్మ కథ- మూలకథతోబాటు కలహకంటక ఏకాంగ వీరుల ద్వంద్వయుద్ధ కథ చెప్పబడినది.

పదునేడవ బొమ్మ కథ- మూలమందలి కథయే.

పదునెనిమిదవ బొమ్మ కథ- మూలకథయే.

పందొమ్మిదవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదియొకటవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదిరెండవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదిమూడవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదినాలుగవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదిఅయిదవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదిఆఱవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదియేడవ బొమ్మకథ- మూలకథతోబాటు మతిమంతుని కథ చేర్చబడినది.

ఇరువదియెనిమిదవ బొమ్మ కథ- మూలకథయే.

ఇరువదితొమ్మిదవ బొమ్మ కథ- మూలకథయే.

ముప్పదియవ బొమ్మ కథ- మూలకథయే.

ముప్పదియొకటవ బొమ్మ కథ- మూలకథలో బేతాళుడు చెప్పిన కథను వదలి క్రొత్తగా వజ్రముకుటుని కథ చెప్పబడినది.

ముప్పదిరెండవ బొమ్మ కథ- మూలకథతో కావ్యసమాప్తి చేయబడినది.

గోపరాజు మూలగ్రంథమందలి 32 కథలతోబాటు అందు లేని 10 కథలను అదనముగా చేర్చెను. మూలకథలన్నియు యథేచ్ఛగా పెంచబడినవి.

## అనువాద విధానము :

గోపరాజు మూలము నెట్లు అనువదించెనో ఉదాహరణకు ఒక చిన్న కథను పరిశీలించిన తెలియగలదు.

పంచవింశోపాఖ్యానము-

"ద్వాదశ వార్షిక మధికావగ్రహం భావినం సమాకర్ణ్య।
ఆశాపూర త్త్యై నిజశిరోబలిం దత్తవానితి బ్రూతే॥

పునరపి రాజా యావత్ సింహాసనే ఉపవేష్టుం ఉపాక్రమత తావ దన్యా సాలభంజికా అబ్రవీత్, శ్రూయతాం, రాజన్- విక్రమాదిత్యే రాజ్యం కుర్వతి ఏకదా కశ్చిత్ జ్యోతిషికః ఆగత్య-

శ్లో॥ సూర్యః శౌర్య మథేందురింద్ర పదవీం సన్మంగళం మంగళః
సద్బుద్ధించ బుధో గురుశ్చగురుతాం శుక్రఃశుభం శంశనిః
రాహుర్బాహుబలం కరోతు సతతం కేతుః కులస్యోన్నతిం
నిత్యం భూతికరా భవంతు భవతః సర్వేనుకూలా గ్రహాః॥

ఇతి ఆశిషం ఉక్త్వా పంచాంగమ్ అకథయత్. రాజా పంచాంగం శ్రుత్వా జ్యౌతిషికం అపృచ్ఛత్, భో! దైవజ్ఞ! కీదృశం ఏతత్ సంవత్సరఫలం? దైవజ్ఞః- అస్మిన్ సంవత్సరే రాజా రవిః, మంత్రీ మంగళః, ధాన్యాధిపతిః శనిః, అన్యచ్చ శనైశ్చరో భౌమశ్చ రోహిణీశకటం భిత్వా యాస్యతః, తస్మాత్ సర్వథా అనావృష్టిః భవిష్యతి ఉక్తంచ వరాహమిహిరేణ-

"అర్కసుతేన హి భగ్నే భౌమః శుక్రశ్చ రోహిణీశకటే
ద్వాదశ చాబ్దాన్ నహి నహి వర్షతి వర్షాణి వారిదో నియతం॥

"రోహిణీశకట మర్క సూనునా భిద్యతే రుధిరవాహినీ సరిత్
కిం బ్రవీమి? నహి వారిసాగరే సర్వలోక ఉపయాత సంశయం॥

మతాంతరే—"యదా భినత్తి మందోయం, రోహిణ్యాః శకటం తదా
వర్షాణి ద్వాదశాత్యంతం, వారివాహో న వర్షతి॥

ఇదం దైవజ్ఞ వచనం శ్రుత్వా రాజా అబ్రవీత్- ఏతత్ అవగ్రహ నివారణే కమపి ఉపాయం నివేదయ. దైవజ్ఞః- నవగ్రహ హోమాద్యనుష్ఠానం కర్తవ్యమ్ తతః వృష్టిః భవిష్యతి.

తతో విక్రమార్కః శ్రోత్రియాన్ బ్రాహ్మణాన్ ఆహూయ తేభ్యః పూర్వవృత్తాంతం ఉక్త్వా తైః హోమం కారయితుం ఉపక్రాంతవాన్. తతః సర్వ హోమసామగ్రీ సంపాదితా. బ్రాహ్మణైః కల్పోక్త ప్రకారేణ నవగ్రహ హవనమపి కృతమ్. హోమ సాద్గుణ్యార్థం పూర్ణాహుతిరపి నిర్వర్తితా, రాజా దివ్య వస్త్రాదినా బ్రాహ్మణాన్ అతోషయత్. తతః భూరిదానేన దీన అంధ బధిర పంగు కుబ్జాదయోపి సంతోషితాః,తథాపి వృష్టిః న అభూత్. తదనంతరమ్ అనావృష్ట్యా సర్వోపి లోకః పరంక్లేశం అగమత్. రాజాపి తేషాం దుఃఖేన స్వయం దుఃఖితః సన్ ఏకదా యజ్ఞశాలాయాం ఉపవిష్టః వ్యచింతయత్. తావత్ అశరీరవాణీ వాక్ ఆసీత్. భో రాజన్! తవ పరోపకారోయది పురః స్థిత దేవాలయ వాసిన్యా ఆశాపూరణ్యా దేవతాయాః పురః ద్వాత్రింశత్ లక్షణయుక్తస్య పురుషస్య కంఠరక్తేన బలిం దేహి, తతః వృష్టిః భవిష్యతి. అవగ్రహః అపి నశ్యతి. ఇతిశ్రుత్వా రాజా దేవాలయం గత్వా దేవతాం నమస్కృత్య కంఠే ఖడ్గం న్యధాత్. తావద్దేవతా- రాజన్! తవ ధైర్యేణ ప్రసన్నాస్మి. వరం వృణీష్వ! రాజా అభణత్- దేవి! అనావృష్టిం నివారయ, దేవతా-తథా కరిష్యామి ఇత్యుక్త్వా సద్యశ్చకార తతః రాజా నిజభవనమ్ అగమత్॥

ఇమాం కథాం కథయిత్వా సాలభంజికా భోజరాజం అబ్రవీత్. భో రాజన్! ఏవం విధం సాహసం త్వయి విద్యతేచేత్ అస్మిన్ సింహాసనే ఉపవిశ, తత్ శ్రుత్వా రాజా తూష్ణీం బభూవ-

ఇతి పంచవింశోపాఖ్యానమ్

## ఇరువది యైదవ బొమ్మకథ :

కం॥ శ్రీ దయితా వదనచ్ఛా
యాదర్శీభూత కౌస్తుభారుణతేజో
మేదుర వక్షఃస్థలు దా
మోదరుఁ గాకోదరేంద్ర యోజిత తల్పున్॥

క నెమ్మనమునఁ దలఁపుచు మో
హమ్మున సింహాసనమున కరుదెంచినఁ జో
ద్యమ్ముగ నిరువది యేనవ
బొమ్మవలికె నడ్డపెట్టి భోజనృపాలున్.

క. ఏమని చెప్పుదు నుజ్జయి
నీమనుజాధిపుని భంగి నియతంబుగ నో
భూమీశ్వర దివ్యంబగు
సామర్థ్యము లేక యెక్కఁజన దెవ్వరికిన్.

మ. అది యెట్లన్న నెఱుంగఁ జెప్పెద నరివ్యాపాద నాసాదనో
న్మదబాహాయుగళుం డనంత ధనదాన ప్రీణితక్ష్మాతల
త్రిదశస్తోమ నిరంతరస్తుతి లసత్కీర్తిప్రియుం డంగనా
మదనాకారుఁ డవంతినాయకుఁడు సామ్రాజ్యంబుతో నొప్పుచున్

శా. ప్రాతః కాలమునందుఁ గొల్వున నయప్రఖ్యాతులౌ రాజులున్
నీతిన్యస్తమనస్కులౌ సచివులున్ విద్వాంసులుం గొల్వఁగా

జ్యోతిర్మధ్యమునన్ వెలింగెడు హిమాంశుంబోలి సొంపొందుచో
జ్యోతిశ్శాస్త్ర విదుండొకండు ధరణీశుంగాంచి దీవించుచున్.

క. సర్వశుభంబులు నీకడ
నిర్వాహము కలిగియుండు నీకేమని యా
శీర్వాదం బొసఁగుదు నా
యుర్వృద్ధి దలంప నవియ యునికికిఁ గోరున్.

సీ. ఐదింటఁ దానొప్పఁదట నెన్మిదింటఁ దొ
మ్మిదియింటఁ బంద్రెంట మేలు శుక్రుఁ
డిందుఁ డాఱింటను నేడింట మూఁటను
బదిటఁ జేకొన్న శుభప్రదుండు
శని రాహు కేతు భూతనయ సూర్యులు మూఁట
నాఱింట మే లర్కుఁ డట్ల పదిట
రెంట నైదింట నేడింటఁ దొమ్మిదిటను
గురుఁ డున్నఁనెల్ల కోర్కులు ఫలించు

బుధుడు బేసిగాని పొందుల నిష్టుఁడౌ
వీనికెల్ల దుష్టవేధ లేమి
ఫలము లొప్పు జనన భవనంబు మొదలుగాఁ
పదునొకంట నున్నఁ బరమ సుఖము.

గీ. అందు రవితనుజాది మహాగ్రహంబు
లిప్పు డాఱింటనునికి నీ యిష్టమొనరు
గురుఁడు బుధుఁడును బైపయికొనుట మేలు
శుక్రచంద్రులు మూఁట నిల్చుట శుభంబు.

వ. అనుచు శుభస్థానంబులు నతని గ్రహంబులునుం జెప్పి.

క. "ధర్మేతిష్ఠతి తే బు
ద్ధిర్మనుజాధీశ" యనుచు దీవించినఁ ద
న్మర్మంబెఱింగి నృపుఁడా
ధర్మము చొప్పెట్టి దనిన దైవజ్ఞుండున్.

క. నీవది యెఱుఁగవె ధర్మము
ప్రోవంజనువాఁడు భక్తితోఁ దన శక్తిన్
దేవబ్రాహ్మణ పూజలు
గావింపఁగవలయు విగతకల్మషుఁ డగుచున్.

క. గురువును దేవరగా స
త్పురుషుని గురువుగ నిజాశ్రితునిఁ బ్రాణముగాఁ
బరవనితఁ గన్నతల్లిగఁ
బరధనము విషంబుగాఁగ భావింపఁదగున్.

గీ. అన్నదానము దుర్భిక్షమైనయప్పు
డంబుదానంబు నిర్జలంబైనచోట
నభయదానంబు శరణార్థియైనవేళఁ
జేయుటుచితంబు ఘన దయాశీల మలర.

క. కృత్యాకృత్యవిచారము
నిత్యోచితదాన మాత్మనియమము బుధసాం
గత్యము పరోపకారము
సత్యము వినయంబు నయము జరుపఁగ వలయున్.

ఉ. ఈ కొలదిం దదంగము లనేకవిధంబుల నుండు నన్నియున్
నీకడ నొప్పుచున్న వవనీవర నావుడు విద్యలందుఁ బ్ర
త్యేకసమర్థుఁడైన నృపుఁడిప్పటి యేఁటి ఫలంబుఁ జెప్పు మా
నాకని యానతిచ్చిన మనంబున నాద్విజుఁ డుత్సహించుచున్.

మ. మహిమాఖండలుఁడంచు భూజనులు సంభావింప నీ వింపుతో
మహిఁ బాలించుచుఁ బుణ్యకృత్యముల ధర్మద్రవ్య మార్జింపఁగా
గ్రహదోషంబులు పుట్టి వట్లయిన నో రాజేంద్ర యీయేఁట దు
స్సహపాపగ్రహసంభవంబగు నతిక్షామంబు వర్తిల్లెడిన్.

ఉ. అక్రమ మాచరించి విను మర్కతనూజుఁడు తొల్లియున్న యా
శుక్రుని రాశిఁ దా విడుచుచున్ శకటాకృతి నున్న రోహిణీ
చక్రము దాటి మంగళుని సద్మముఁ జేరఁగడంగి యేఁటిలో
వక్రగతిం జరింపఁగ నవర్షణమై చనుఁ గొన్ని వర్షముల్.

క. పఱి పఱి నిల పఱియలుగా
నెఱసిన వనపంక్తులెండ నిరుపమ మగు నా
వఱపునఁ బండ్రెం డేడులు
కఱవిక నతిదుస్తరంబు గాఁగల దధిపా.

చ. అనవుడు దీని కడ్డుపడునట్టి యుపాయము గల్గెనేని నా
యనువెఱిఁగింపు మన్న వసుధామర తృప్తియె కారణంబుగా
నొనరిన దేవతార్చనల హోమములన్ గ్రహపూజ మున్నుగా
జనవర! శక్తికిం దగిన శాంతి యొనర్పుము వర్షణంబగున్.

క. ఇనుమున నాశనిరూపం
బొనరించి వినీల వస్త్ర యుక్తంబుగ న
ర్చనము రచియించి ఖదిరేం
ధనమున హోమంబు సేయఁ దత్ప్రీతి యగున్.

చ. అనిన త్రివిక్రముండు మొదలైన పురోహితులన్ గ్రహాది పూ
జనములు సేయఁబంచి మృదుశాలిమయాన్నముఁ బాయసంబులున్
మునుముగఁ బిండివంటలు సమూహముగా నొనగూర్చి యిష్టభో
జనముల భూసురుల్ దనియ శాంతి దలంబుగఁ జేసి శక్తితోన్.

క. దేశాధీశ్వరుఁ దర్థుల
కాశాపరిపూర్తిసేయ నారాధితయౌ
నాశాపూరణి దేవి ని
వేశాంగణ సీమ హోమవిధి గావించెన్.

ఉ. ఈగతిఁ బెక్కుహోమములు నీగులుఁ బూజలుఁ జేసి చేసి వ
ర్షాగమ మేమియుం గనక యక్కట యాగము మీఱు నాశుభో
ద్యోగము వ్యర్థమయ్యె శివయోగినియుం గరుణింప దంచుఁ జిం
తాగతుఁడైన వేళ గగనస్థలి నయ్యశరీరి యిట్లనున్.

ఉ. భూపకులేంద్ర యింతఁ దలపోయఁగ నేటికి యోగమాత యా
శాపురి సంతసిల్ల యతిసత్త్వము నీ కొసఁగెం బ్రభావ సం
దీపిత దివ్యశస్త్రనిహతిన్ దిననాథ తనూజ వక్రమా
ర్గాప ఘనోపరోధ మభయంబునఁ జేయుము వృష్టి గల్గెడున్.

ఉ. పంటలు పెక్కు గల్గునని పల్కిన నానృపుఁ డాత్మలోన ము
క్కంటి రఘూద్వహున్ విజయుఁగైకొని మ్రొక్కుచు దివ్యబాణముల్
వింట నమర్చి పంక్తిరథులీలఁ గడంగి ప్రతాపశక్తి మి
న్నంటి గ్రహంబులెల్ల విరియంగ శనైశ్చరు నడ్డుకట్టినన్.

ఉ. ఆ శని నిల్చి నీ బలమహత్త్వము మెచ్చితిఁ దొల్లి నీవు గౌ
రీశునిచేఁ దపంబున నభీష్టములందితి నేఁడు శక్తి నా
కాశము గట్టి నాదగు ప్రకాశము ద్రుంచితి నేఁటి నుండి నీ
దేశములోపలం గఱవుదీఱఁ బ్రజల్ సుఖియింపఁ జేసెదన్.

శా. హర్షంబయ్యెభవత్ కృతంబున నృపాలాగ్రేసరా కోరినన్
వర్షంబు ల్గురియింతు నెప్పు డయినన్ వర్ధిల్లు పొమ్మన్న ను
త్కర్షంబంటిన శౌర్యమొప్పఁగ సుభిక్షం బుర్విఁ దోపంగ దు
ర్ధర్షుండై చనుదెంచి భక్తిఁ గొలిచెన్ ధాత్రీశుఁ డాశాపురిన్.

క. ఈసామర్థ్యము నీకడ
వీసంబునులేదు మగిడి వెసఁ జనుమనినన్
వేసరిన భంగి భోజుం
డా సింహాసనము డిగి గృహంబున కరిగెన్.

మూలగ్రంథములో 11 గద్యపద్యములలో ఉన్న కథను 28 గద్యపద్యములకు పెంచెను. మూలములో దైవజ్ఞుని అర్థవంతమైన ఆశీర్వాదమును వదలి విక్రమార్కుని జాతక చక్ర గ్రహస్థితి ఫలములను చెప్పెను. పంచాంగశ్రవణము సంవత్సర ఫలములకు బదులుగా సాధారణమైన గ్రహస్థానములు ఫలములు చెప్పబడినవి. ఇవి అనవసరములు. దైవజ్ఞుడు క్షామారిష్టమునకు చెప్పిన శాంతులు చేసినను వర్షము కురియనందున అశరీరవాణి దేవాలయమందలి 'ఆశాపూరణి' అను దేవికి 32 లక్షణములు గలవాని కంఠ రక్తము నొసగిన అరిష్టము తొలగునని మూలము నందు కలదు. గోపరాజు దీనినెందుకో మార్చెను. "దైవజ్ఞుడు చెప్పిన శాంతి హోమములు ఆశాపురి దేవిగుడి ముందు చేసినను వర్షము కురియలేదు. అశరీరవాణి రాజా! ఆశాపురి దేవత నీకు దివ్యశర శక్తి ననుగ్రహించినది. కావున దానిచే శనైశ్చరుని గతిని అడ్డుకొన్న వర్షము కురియునని చెప్పెను. రాజట్లే శరసంధానము చేయగా శని ప్రసన్నుడై క్షామము పోగొట్టును" గోపరాజు ఈ మార్పు నెందుకు చేసెనో తెలియదు. ఇందువలన మూలమందలి సారస్యము చెడినది. ఇట్లే గోపరాజు ప్రతి కథలోను తన ఇష్టమువచ్చినట్లు మార్పులు చేసినాడు. ఆ మార్పులు సరసములుగ ఉండవు. విక్రమార్కుడు ధర్మము ఎట్టిదని అడుగుట దైవజ్ఞుడు ధర్మమనగా ఏమో తెలుపుట. పూర్తిగా అధిక ప్రసంగము. మరొక మార్పును చూడుడు.

మొదటి కథలో విక్రమార్కునకు ఇంద్రుడు సింహాసనము ఇచ్చిన ఘట్టమున్నది. మూలమున ఇంద్రునకు రంభా ఊర్వశుల నర్తనములలో తార

తమ్యము తెలియక విక్రమార్కుని పిలిపించి తెలిసికొని దివ్య సింహాసనము ననుగ్రహించినట్లున్నది. గోపరాజు దానిని మార్చెను. విశ్వామిత్రుని తపో భంగము చేయించుటకై రంభా ఊర్వశులలో నెవరిని పంపవలెనో ఎవరి యోగ్యతలెట్టివో తెలియక ఇంద్రుడు విక్రమార్కుని పిలిపించుచినట్లు వ్రాసెను. విశ్వామిత్రుని కాలమేదో విక్రమార్కుని కాలమేదో సామాన్యునకు తెలియును కాని గోపరాజునకు తెలియలేదు. అతడు చేసిన మార్పులను తెలిసికొనుటకిది చాలును. మూలమునందు రసవత్తరములైన నీతిశ్లోకములుండగా గోపరాజు వానినివదలి వేసెను. అక్కడక్కడ సూచనాప్రాయముగ చెప్పెను. మూలములోని

"నవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే
విషమేకాకినం హంతి బ్రహ్మస్వం పుత్రపౌత్రకం"

అన్నదానికి

క. గతిగానక యిది యొక సం
గతి బ్రదికెదమంచు నుండఁగా ధర్మముఁద
ప్పితి "బ్రహ్మస్వం విషము
చ్యతే" యనుచుఁ బెద్దలెల్లఁ జదువుట వినవే. (1-176)

అని వ్రాసెను. ఈ పద్యము క్రిందనే

క. బలవంతులమని విప్రుల
ఫలభోగంబులకు నాసపడుదురె మును వి
ప్రులకిచ్చిన భూములు దమ
చెలియంద్రని తలఁపవలదె క్షితిపాలురకున్. (1-177)

అను పద్యమును వ్రాసెను. ఇది మూలములో లేదు. వ్యాసోక్తశ్లోకము

"ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం
నభోగ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా"

ఈ రెండు శ్లోకములును వ్యాస గీతాశ్లోకములే. సాధారణముగ ప్రాచీన శాసనములలో చివర ఫలశ్రుతి భాగమున నివి చెక్కబడును.

గోపరాజు మూలమునందలి శ్లోకములనుగాక అక్కడక్కడ తనకు తెలిసిన సంస్కృత గ్రంథములందలి కములను సందర్భానుసారముగ అనువదించి వాడుకొనెను. ఇవి మూలమున లేవు. సుప్రసిద్ధ శ్లోకమగు

"అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా
పురీ, ద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయకాః॥

అనుదానికి

"మధుర, కంచి, కాశి, మాయాపురము, ద్వార
వతి, యయోధ్య, యీ యవంతిపురము
నాఁగ నెగడు ముక్తినగరంబులం దున్న
నరులు పుణ్యభాజనములు గారె" (1-78)

అని అనువదించెను, ఇట్లే మయూరుని సూర్యశతకము నుండి, జయదేవుని ప్రసన్నరాఘవము నుండి. అన్నపూర్ణాష్టకము నుండి అనువదించి ఇందు వేసికొనెను.

## జక్కన - గోపరాజు :

గోపరాజునకు ముందున్న 'జక్కనకవి, 'విక్రమార్క చరిత్రము'ను ప్రబంధ ఫక్కిలో రచించెను. అతడు విజయనగర సామ్రాజ్యమును 1423-1447 సం॥ మధ్య పరిపాలించిన ప్రౌఢ దేవరాయల కాలమువాడు. శ్రీనాథ కవిసార్వభౌమునకు సమకాలికుడు. జక్కన తాను ప్రబంధ శయ్యగా తెలుగున విక్రమార్క చరిత్రమును చెప్పెదననెను. కాని సంస్కృత గ్రంథమున కనువాదము చేసితిననలేదు. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు-

"సంస్కృతమున విక్రమార్కచరిత్ర అను పేరుతో గ్రంథము కలదు. దానిలోగల కొన్ని కథలతో ఇందలి కథలకు వస్తుసామ్యము కలదు. అంతమాత్రమున అది ఈగ్రంథమునకు మాతృకయని చెప్పజాలము. మరి జక్కన ఇది అనువాదము అనిగాని, స్వతంత్ర రచన అనిగాని చెప్పలేదు. అందువలన ఇందు చాల భాగము అతని స్వతంత్ర రచనయే అని ఊహింపవచ్చును" అనివ్రాసిరి. *

జక్కనకవి గోపరాజు అనుసరించిన సంస్కృత విక్రమార్క చరిత్రమును చూచి అందుండి కొన్ని కథలను తీసికొని వాటిక్రమమును మార్చి తన పద్ధతిలో వ్రాసెను, అతడు గ్రహించిన కథలు.

ద్వితీయాశ్వాసము- 1. విక్రమార్కుడు స్వర్గమునకుపోయి రంభా ఊర్వశుల నాట్యముల తారతమ్యమును నిర్ణయించి ఇంద్రునిచే దివ్య సింహాసనము పొందివచ్చిన కథ.

2. విక్రమార్కుడు కనకస్తంభ పీఠముపై నెక్కిపోయి సూర్యుని చేరి ఆయన అనుగ్రహించిన దివ్యకుండలములను ఒక బ్రాహ్మణునకు దానమిచ్చిన కథ.

3. విక్రమార్కుడు వేటకు బోయి వరాహమును తరుముచు రసాతలమును చేరి బలిచక్రవర్తిని ఆయన ప్రసాదించిన రస రసాయనములను కొనివచ్చి దరిద్రబ్రాహ్మణునకు ధారపోసిన కథ.

4. మధురానగరము దగ్గర ప్రతిరాత్రి ఒక స్త్రీని కశాఘాతములచే బాధించుచున్న రాక్షసుని చంపి విక్రమార్కుడు ఆమె ఇచ్చిన మణిని వైశ్య పుత్రుడు పురందరునకు ఇచ్చిన కథ.

---

* ఆంధ్ర సాహిత్య చరిత్ర

తృతీయాశ్వాసము- 5. భర్తృహరి భార్య చెడువర్తనము వలన విరక్తుడై వనములకు పోయినకథ

6. బహుశ్రుతుడను మంత్రి కథ (ససేమిరా)

పంచమాశ్వాసము- 7. చిత్రకూటము దగ్గర ఒక ముని ఎన్నో యేండ్ల నుండి హోమము చేయుచున్నను ఫలము కానకున్నందుకు విక్రమార్కుడు వెళ్ళి కాళికను మెప్పించి అతని కామితము తీర్చిన కథ.

8. విక్రమార్కుడు అశ్వమేధము చేయు సందర్భములో సముద్రుడు పంపిన దివ్యరత్నములను బ్రాహ్మణునకు సమర్పించిన కథ

9. దేవదత్తుడను బ్రాహ్మణుడు విక్రమార్కునకు కొద్ది సహాయము చేసి అతని కృతజ్ఞతా గుణమును పరీక్షించుటకై రాజపుత్రుని దాచి, వానిని చంపినట్లు నటించినను రాజు బ్రాహ్మణుని క్షమించిన కథ.

10. విక్రమార్కుడు కాంచీనగరములో వేశ్యనాశ్రయించిన రాక్షసుని చంపి వేశ్యనుద్ధరించి తన పురోహితపుత్రుడు కమలాకరునకు సమర్పించిన కథ.

11. రాక్షసునకు వంతుగా పోవలసిన బ్రాహ్మణ బాలకునకు బదులుగా విక్రమార్కుడు వెళ్ళి రాక్షసుని మెప్పించి, నరభక్షణము మాన్పించిన కథ.

ఈ 11 కథలును సంస్కృత విక్రమార్క చరిత్రము నుండి తీసికొని పెంచినవి. తరువాతి వాడైన గోపరాజు జక్కన విక్రమార్క చరిత్రమును చదివి యుండెను. మూలమును జక్కన – గోపరాజులు ఎట్లు అనుసరించిరో పరిశీలించిన తెలియగలదు. మూలము నందలి 'ససేమిరా' కథను చూతుకు. సంస్కృతమున ౬౮ గద్యపద్యములలో ఉన్న బహుశ్రుతుని కథను జక్కన 100 గద్యపద్యములకు పెంచగా, గోపరాజు 103 గద్యపద్యములలో చెప్పెను. మూలమున ఈ కథలోని నందరాజు స్త్రీ వ్యామోహము ఇట్లు చెప్పబడినది.

"విశాలాయాం నందోనామ రాజా మహా శౌర్యసంపన్నో అభూత్, తస్యచ భానుమతీ నామ మహిషీ. తస్యచ రాజ్ఞః తస్యాం అతిప్రీతిరాసీత్. సింహాసనేపి సహైవ తయా సముపవిశేత్. నిమేషమపి తయా వినా నతిష్ఠేత్"

(విశాలా నగరమున నందుడనురాజు గొప్పపరాక్రమము గలవాడు. అతని భార్య భానుమతి ఆ రాజునకు భార్యయందు విశేషప్రీతికలదు. సింహాసనమునందు ఆమెతో కలసియే కూర్చుండును. ఒక నిముషమైన ఆమెను విడిచి ఉండడు.) ఈ అయిదు వాక్యములకు జక్కన 10 పద్యములను వ్రాసెను.

క. ఆ నందమహీవల్లభుఁ
డానంద రసార్ద్ర హృదయుఁడై యేప్రొద్దుం
దా నగరు వెడలకుండును
భానుమతీ మోహపాశ బద్ధుండగుటన్.

క. జక్కవ కవ పెక్కువయగు
మక్కువతో రేయిఁబగలు మనుజాధీశుం
డక్కాంత దక్కనొర్మిక
దక్కటి కార్యంబు లెల్లఁ దక్కిచరించున్.

శా. ఆ రామామణితోడఁ గూరిమి నతండత్యాస్థఁ గ్రీడించు సం
సారస్ఫార సుఖైక సార సురతేచ్ఛాపూర నిర్మగ్నుఁడై
యారామాంతర కేళి పర్వత గుహా హర్మ్యాంతరాళంబులం
గీర్వాలాప మదాలిగీత విలసత్క్రీడా నివాసంబులన్.

సీ. ఆత్మావనీమండలాసక్తిఁ బెడఁబాసి
లతనా నితంబ మండలముఁ బొదువు.

*　　*　　*

వ. అంత బహుశ్రుతుండు

చ. అని తన యిచ్చలో వగచి యన్నరపాలునితో వినీతి గో
పనమతి మంత్రి యిట్లనియె ... ... ...

ఉ. నావుడు మంత్రివర్యునకు నందమహీపతి ప్రీతినిట్లను౯

* * *

క. ఒక్క రే యొక్కమహాయుగ ... ...

సీ. కైసేసి చెలువ నాకడ నల్ల నిలిచిన
నంగజశ్రీ ఁజూఅలాడఁ జూతు

ఉ. కన్నులు గండుమీలు ... ...

క. ఏనొక నిముషంబైనను
భానుమతీ దేవిఁబాసి ప్రాణముఁ బట్టం
గా నోప నీ విచారము
మానుమనిన మంత్రి యనియె మనుజేశ్వరుతో౯.

ఇందు నంద భూపాలుని లాలసత్వము పరాకాష్ఠ నందుకొన్నది. రాబోవు ప్రబంధ యుగమునకు ఒరవడిగా జక్కన రచన సాగినది గోపరాజు ఈ ఘట్టమును

క. ఆ నందభూపతికి సతి
యానందము రూపమయ్యె ననఁ గలిగెఁ ద్రిలో
కీనయనచకోరములకు
భానుమతీదేవి యమృతభానుద్యుతియై.

సీ. దీపిత కనక సందేహంబు దేహంబు
పచ్చకర్పూరంబు పలుకు పలుకు
పల్లవ సంపదాస్పదములు పదములు
శోభితావర్తసనాభి నాభి

* * *

అట్టి సతిని తెప్ప వెట్టక చూచుచు
నిద్ర యాఁకలియును నీసువట్టు
నడఁచి యధరరేఖ నమృతంబు గ్రోలుచు
దేవుఁ డనఁగ మనుజదేవుఁ డొప్పె.

క. వనితలకు నురము నోరును
దను వర్ధము నిచ్చి రచ్యుత బ్రహ్మ శివుల్
ఘనుఁడా మువ్వుర మీఱుచు
జనపతి దన సతికి నిచ్చె సర్వాంగములున్.

సీ. అవనీశు డీక్రియ నంతఃపురంబున
విహరించుచును మంత్రివిన్నపమున

*   *   *

ఈ విధముగ పచ్చిశృంగారమునగాక సాధారణధోరణిలో 5 పద్యము లలో సరిపెట్టినాడు. ఈ కథయందే నందరాజు కొడుకు జయపాలుడు భల్లూకముచే శపింప బడి 'ససేమిరా' అని అరచుచుండును. ఎవరైన జరిగిన విషయమును వెల్లడించిన వెంటనే ముక్తి పొందును. మూలమున 'ససేమిరా'కు నాలుగు శ్లోకములు చెప్పబడినవి.

"స" అను అక్షరమునకు

"సద్భావం ప్రతిపన్నానాం వంచనే కా విదగ్ధతా
అంకమారుహ్య సుప్తానాం హననే కిం ను పౌరుషమ్.

దీనికి జక్కన

"సకల లోకోపకార సంచారులైన
సాధు జనుల వంచించుట జాణతనమె?
తొడలపై నమ్మి నిద్రపోయెడు వయస్యుఁ
బగతు పాలనుఁద్రోయఁ బాపంబు గాదె.

గోపరాజు. "సజ్జనభావము గలుగు సు
హృజ్జనముల మోసపుచ్చుటిది నేరుపె నీ
పజ్జ తొడమీఁదఁ గూర్కిన
యజ్జంతువుఁ జంపఁ జూచుటది పౌరుషమే"

జక్కన మూలపూర్వార్ధమును చక్కగా అనువదించెను. ఉత్తరార్ధము లోని 'హననే కింను పౌరుషమ్' (చంపుటలో మగతన మేమున్నది) అను వ్యంగ్యమును వాచ్యము చేసినాడు. గోపరాజు ద్విత్వజకార ప్రాసము గ్రహించి కొంత తికమక పడినను మూలమును సరిగా అనువదించెను.

రెండవ అక్షరము "సే" మూలమునందు
"సేతుం దృష్ట్వా సముద్రస్య,గంగాసాగర సంగమమ్
బ్రహ్మ హత్యాత్ర ప్రముచ్యేత, మిత్రద్రోహీ నత్రముచ్యతే"

జక్కన "సేతువు దర్శింప మహా
పాతకములుఁ బాసిపోవుఁ బ్రాణసఖునకుఁ
ఘాతుకమతి నొనరించిన
పాతక మే తీర్థసేవఁ బాయునె నరునిఁ.

గోపరాజు "సేతువుఁగని, జలనిధి సం
జాతధనుష్కోటిఁ బడిన సద్ద్విజహతికిం
బాతకము వాయు మిత్రవి
ఘాతికిఁ బాతకమె కాని గతి గలుగదనా".

జక్కన పద్యములో మూలమందలి 'బ్రహ్మహత్యాప్రముచ్యేత'కు బదులు 'మహాపాతకములు బాసిపోవు' అని, వ్రాయ బడినది. గంగా సాగర సంగమ దర్శనమునకు బదులు 'ఏతీర్థ సేవచేసైన' అని చేర్చబడినది. గోప రాజు గంగా సాగర సంగమమునకు బదులు, జలనిధి సంజాత ధనుష్కోటి

బతర, అన్నాడు. అతని ఉద్దేశమేమో తెలియదు. మూలమందలి భావమును ఉభయులును చక్కగా అనువదింపలేదు.

మూడవ అక్షరము "మి"కి మూలమునందు

"మిత్రద్రోహీ కృతఘ్నశ్చ
యశ్చ విశ్వాసఘాతుకః
త్రయస్తే నరకం యాంతి
యావచ్చంద్ర దివాకరమ్."

జక్కన "మిత్రద్రోహి, కృతఘ్నుఁడు
ధాత్రీసురహంత, హేమతస్కరుఁడు, సురా
పాత్రీభూతుఁడు, నిందా
పాత్రులు వీరెల్ల నరక భవనావాసుల్".

గోపరాజు "మిత్రద్రోహి, కృతఘ్ను ప
విత్రగురుద్రోహి చౌర్యవిద్యాపరులున్
మిత్ర శశి స్థితి మేరగఁ
బుత్రులు గలిగియును నరకమునఁ బడుదురనా".

జక్కన మూలములోని ముఖ్యమైన విశ్వాసఘాతుకుని దీసివేసి ధాత్రీ సురహంతను, హేమతస్కరుని, సురాపాత్రీ భూతుని గ్రహించి వీరు నిందా పాత్రులని వ్రాసెను. కథయందలి రాజకుమారుడు, మిత్రద్రోహి, కృతఘ్నుడు, విశ్వాసఘాతుకుడు. ఆ విషయమును దెలుపుటకే ఆ ముగ్గురును ఆచంద్రార్కము నరకములో ఉందురని మూలకారుడు వ్రాసెను. జక్కన ఆ సారస్యమును గ్రహింపలేదు. ఇక గోపరాజు వ్రాసకకుర్తికి లోనై 'పవిత్ర గురు ద్రోహి', 'పుత్రులు కలిగియు' అను నిరర్థకములను వాడెను. మూలము నితడును అవగాహన చేసికొనలేదు.

నాలుగవ అక్షరము "రా"కు మూలము

"రాజన్! భోస్తవ పుత్రస్య
యది కల్యాణ మిచ్ఛసి
దానం దేహి ద్విజాతిభ్యో
వర్ణానాం బ్రాహ్మణోగురుః."

ఈ శ్లోకమున కథానాయకుడగు నంద భూపాలుడు తన గురువైన శారదానందుని చంపనెంచిన పాపమునకు ప్రతిక్రియ సూచింపబడినది. దీనికి జక్కన "రాజేంద్ర విజయపాలుని

రాజిత శుభమూర్తిఁ జేయు రతి గలదేనిన్
ఓజఁగొని విప్రకోటిం
బూజింపు మనూనదాన భోజనవిధులన్"

అని మూడు చరణముల భావమును చక్కగా అనువదించి నాల్గవ చరణమును వదలి వేసెను.

గోపరాజు "రాజ భవదీయుఁడైన త
నూజునకున్ శుభము నోజ నూల్కొను విద్వ
ద్రాజికి ధనదానము ని
ర్వ్యాజమునంజేయు మిహపరంబులు గలుగున్"

అని మూడు చరణములనే అనువదించి నాలుగవ చరణమును వదలి మూలమున లేని 'ఇహపరంబులు గలుగున్' అని చేర్చినాడు. దీనిని బట్టి గోపరాజు మూలమునే ప్రధానము అనుసరించెను. కానిగ్యజక్కనను అనుసరింప లేదని చెప్పవచ్చును.

కావ్యమందలి విశేషవిషయములు :

గోపరాజు తన కావ్యమునందు అనేక విషయములను ప్రాసంగికముగ అక్కడక్కడ చెప్పినాడు. మూలమునందు కొన్ని విషయములు సూచింప

బడినవి. అతడు వానిని విస్తరించి తన సమకాలిక విశేషములనే తెలుపుటకు ప్రయత్నించెను.

1. స్త్రీ స్వరూప స్వభావములు :

భర్తృహరి భార్యావంచితుడై స్త్రీల మనశ్చాంచల్యమును అసహ్యించి కొను షష్టమున మూలశ్లోకములను వదలి స్వతంత్రముగ నిట్లు వ్రాసినాడు.

ఆ.వె. కప్పురంపుఁ గుదుటఁ గస్తూరి యెరువుతో
నుల్లినాటి చందనోదకముల
పెంపిరేని దాని కంపుమాయని భంగి
నెంతయైన నిలువ దింతి మనము. (1-98)

క. వనిత యెరుఁజూచి లోనగు
నన నిక్కము పతియుఁ దోడి యతివలుఁ బరుఅం
గని విని యెగ్గొనరించెద
రని మానిన మానుగాక యడ్డము గలదే.

సీ. మదమెక్కు చన్నులు మాంసపు ముద్దలు
హేమకుంభములకు నెక్కుడనుచు
దూషిత మూత్ర పురీష దుర్గంధమౌ
జఘనంబు కరిశిరస్సదృశమనుచు
జిలిబిలిం బుసులకుఁ జీమిడికిని బుట్టి
యైన మొగంబు సుధాంశుఁ డనుచుఁ
గండలుఁ దోలు బొక్కలు గూడఁ బొదవిన
యాకృతి పసిడి సలాక యనుచుఁ

దేగదైన పెదవి త్రేగ డమృతమని
కవులు వొగడఁ జేరు గలిగెఁ గాక
తత్త్వమెఱిఁగి యిట్లు తలపోసి చూచిన
నింతి రోఁత కెల్ల నిల్లు గాదె. (1-100)

2. స్త్రీజాతులు                                    (1-214)

మూలమునందు బహుశ్రుతుడను మంత్రి తనరాజు భార్యారూపమును చిత్రపటముగా వ్రాయించెను చిత్రకారుడు "స తు తస్యా రూపం సాక్షాదాలోక్య పద్మినీ లక్షణయుక్తాం తాం విలిలేఖ" అని ఉన్న వాక్యమును పురస్కరించి కాని గోపరాజు కొక్కోకము నందు చెప్పబడిన స్త్రీల నాలుగుజాతులు 'పద్మినీ చిత్రినీ, శంఖినీ, హస్తినీ' లక్షణములను గూర్చి వివరించెను.

3. శకునములు- మూలములో "అకాలవృష్ట్యాదీని దుర్నిమిత్తాని బభూవుః,

"అకాలవృష్టిః తు అథ భూమికంపో,నిర్ఘాత ఉల్కా పతనం తదైవ"

అని మాత్రమే కలదు. గోపరాజు వీనిని వదలి సామాన్యముగా తెలుగు వారు పాటించు దుశ్శకునములను చెప్పినాడు.

"పిల్లులు పోరాడుట, బల్లిపలుకుట, తంబళివాడు కనబడుట, ఎదుట తుమ్ముట, దూడను పోగొట్టుకొన్న ఆవు అరచుట, కంపమీది కాకి అరచుట, కుష్ఠురోగి తలకు నూనె రాచుకొని వచ్చుట, మైలబట్టలతో చాకలి ఎదుర గుట, కాకి గోరువంక భరద్వాజపక్షి ఎడమ వైపునకు పోవుట, పాలపిట్ట, భరద్వాజపక్షి, పైడికంటి, గుడ్లగూబ కూయుట, పాము ఎదురగుట" ఇవి దుశ్శకునములు.                                    (1-230)

4. డేగవేట- మూలమున లేదు.

5. చేపలవేట- మూలమున లేదు.

ఆకాలమున ఏయే పక్షులను వేటాడుచుండిరో, చేపలలో ముఖ్యజాతు లేవో చెప్పెను.                                    (1-238)

6. వృక్షజాతులు- విక్రమార్కుని ఉద్యానవనము నందున్న మామిడి, అశోక, వకుళ, పున్నాగ, జంబూ, వృక్షములను ఒక్కొక పద్యమున ప్రత్యే

కముగ చెప్పి చింతచెట్లను గూర్చి 8 పద్యములు చమత్కారముగ వ్రాసెను. (3-145)

7. వస్త్రవిశేషములు- విక్రమార్కుని అంతఃపురస్త్రీలు నానావిధములైన వస్త్రములు ధరించుచుండిరని వాని పేరులు తెలిపినాడు. 49 విధములైన పట్టు-నూలు చీరల రకములను చెప్పెను. పాల్కురికి సోమనాధుడు బసవపురాణములో 58 విధములైన పట్టు-నూలు చీరలను పేర్కొన్నాడు. వానిలో కొన్నిటిని గోపరాజు పేర్కొనెను. ఉభయులును చెప్పినందున ఆనాడు కాకతిరాజ్యములో చేనేత పరిశ్రమ ఉచ్చస్థితిలో ఉండెనని తలప వచ్చును. (3-188)

8. ఆభరణ విశేషములు- రాణులు పాదమునుండి శిరస్సువరకు ధరించు 14 విధములైన అంగాభరణములను చెప్పెను. (3-188 వచనం.)

9. రాజకర్తవ్యములు- మూలమునందు రాజకర్తవ్యములు పంచ యజ్ఞములుగా చెప్పబడినవి.

"దుష్టస్యదండః, సుజనస్యపూజా,
న్యాయేన కోశస్యచ సంప్రవృద్ధిః
సుపక్షపాతోర్థిషు, రాజ్యరక్షా
పంచైవయజ్ఞాః కథితాః నృపాణాం,"

దీనిని గోపరాజు విపులీకరించెను.

సీ. దుర్గరక్షణమును, దుష్టశిక్షణమును
శిష్టపాలనమును సేయవలయు
వర్ణధర్మములను వనములు గుళ్ళును
జలజాకరంబులు నిలుపవలయుఁ
గృషియు వాణిజ్యంబు గృహజీవధనములు
నాయుర్ వ్యయంబులు నరయవలయు

అనదల అర్థుల ఆర్తులఁ బాత్రులఁ
బూజ్యుల విప్రులఁ బ్రోవవలయు

బలముఁ దెంపుఁ గలిగి అలుఁ యుఁ గరుణయుఁ
జలము నిలుకడయును జరుపవలయు
నయముఁ బ్రియము వైరిజయముఁ గార్యముఁ గొల్వు
నితర రాజగతుల నెఱుఁగవలయు. (4-83)

9. విటభేదములు- అమూలకము (4-241)

10. వేశ్యమాత చర్యలు- అమూలకము. (4-243,55)

11. మధుపానగోష్ఠి- అమూలకము (4-266)

12. యోగశాస్త్రము- మూలమున లేకున్నను యోగ విశేషములు 8 పద్యములలో చెప్పబడినవి. (5-12,17)

13. మల్లయుద్ధ విశేషములు- మూలమునలేని,తనకాలమున వాడుకలో ఉన్న మల్లయుద్ధమును గూర్చి విపులముగ వ్రాసినాడు. కలహకంటక ఏకాంగవీరులను ఇద్దరు భటులు పంతముతో తలపడుదురు. ఆ సందర్భమున దంద్వయుద్ధపద్ధతులు, దాని నియమములు, మల్లుల వస్త్రధారణ, తొమ్మిది విధములైన పట్లు మొదలైన వానిని చెప్పెను. (7-45,64)

14. స్వప్నశాస్త్రము- మూలమున ఇరువది మూడవ సాలభంజిక కథలో స్వప్నములను గూర్చి ఇట్లున్నది:

"స్వప్నాస్తు ద్వివిధాః, కేచన శుభాః శుభఫల ప్రయచ్ఛంతి, కేచన అశుభాః అశుభఫలం ప్రయచ్ఛంతి తత్రశుభాః :

శ్లో॥ ఆరోహణం గోవృషకుంజరాణాం, ప్రాసాదశైలాగ్రవనస్పతీనాం
విష్ఠానులేపో రుదితం నితాంతం, శుభాన్యగమ్యాగమనం తథైవ॥

అథ అశుభాః :-

"ఖరోష్ట్రి మహిషవ్యాఘ్రాన్ స్వప్నే య స్త్వధిరోహతి
షణ్మాసాభ్యంతరే తస్య మృత్యుర్భవతి నిశ్చయాత్॥

"ఆరోహణం కంటక వృక్షవాహవైర్యుష్ట్రికాణా మథ దర్శనాని
కార్పాస తీవ్రోరగ పోత్రి శాఖామృగాదిమానా మశుభాని లోకే"

ఫలకాలశ్చ-

"స్వప్నస్తు ప్రథమే యామే, వత్సరేణ విపాకభాక్
ద్వితీయే చాష్టభిర్మాసైః, త్రిభిర్మాసైః తృతీయకే.

అరుణోదయ వేళాయాం, సద్యః స్వప్నఫలం భవేత్."

అని చెప్పబడినది. వీనినే గోపరాజు గ్రహించెను.

స్వప్నఫలకాలములను మాత్రము యథాతథముగ అనువదించినాడు. శుభాశుభ స్వప్నఫలములు చెప్పుటలో మూలమున లేని వానిని చాల చెప్పెను. ఇవి నాటి జనవ్యవహారములోనివి కావచ్చును.

శుభ స్వప్నములు- ఏనుగు, గుఱ్ఱము, పచ్చనిమ్రాను, మేడ, పోతుపసరమును ఎక్కినట్లు వచ్చిన కలలు శుభములు. పాములు తేళ్ళు జలగలు కరచినట్లు వచ్చిన చావును చెప్పును. శరీరమునకు మలము పూసుకున్నట్లు, స్త్రీలతో రమించినట్లు వచ్చిన శుభములు. తలను పేనుకొరుకుట, ప్రేవులు చుట్టుకున్నట్లుండుట, నెత్తురు, కండలు, పాలు, పెరుగు, కల్లు, నేయి త్రాగుట శుభములు. నీటిని, రక్తమును చూచిన దీర్ఘాయువు. మంట, గంట, పచ్చని పంట, తెలుపురంగు కనబడిన మంచిది. బూడిద, ఎముక, ధాన్యపుపొట్టు, ప్రత్తి, ఉప్పు కనబడిన చెడ్డది. మొద్దును, గాడిదను, దున్నపోతును, ఒంటెను ఎక్కిన, అన్నమును, పిండిని, నువ్వులను తినిన కీడు కలుగును. ఏనుగు, దేవత, కస్తూరి, గోపురము, నీలమణులు, మేఘములు, భూమి, యమునానది, కుండలు తప్ప కలలో ఇతరములైన నల్లవస్తువులు చెడ్డవి.

నూనె, కలినీళ్ళు, క్రొవ్వు, తేనె త్రాగిన చెడ్డది. కోతి, పొగ, కాకి కనబడిన చెడ్డది. ఈ శుభాశుభములను విడిగాకాక కలిపి కలగావులగము చేసినాడు. ఇది శాస్త్రీయ పద్ధతి కాదు. (9-71)

15. జ్యోతిషము- ఇరువదియైదవ సాలభంజిక కథలో మూలమున దీర్ఘక్షామము ఏర్పడు గ్రహగతులు చెప్పబడగా గోపరాజు వానితోబాటు సామాన్యములైన గ్రహస్థానములు - ఫలములు మాత్రము చెప్పెను. ఆతనికి ఈ శాస్త్రమున విశేష పరిచయముండినచో విశేషముగ వ్రాసి యుండును

16. జూదము, ఆటలు- ఇరువది యేడవ సాలభంజిక కథలో ఒక జూదగాని ప్రస్తావన ఉన్నది. వాడు తన్నుగూర్చి "దురోదర విషయే అహమేవ విచక్షణః, నాన్యః, అన్యచ్చ వారిక్రీడాం వరాట ముష్టించ జానామి" అని మాత్రమే చెప్పెను. ఇందలి వారిక్రీడ, వరాట ముష్టి అను ఆట లెట్టివో తెలియదు. గోపరాజు వానిని వదలి తెలుగువారికి ప్రియమైన ఆటలు చతురంగము-పాచికల ఆట, పులిజూదములను పేర్కొన్నాడు. (10-87)

17. చోరకళ- మూలమునలేని చోరవిద్యను గోపరాజు అదనముగా చెప్పెను. ఇందు చోరులు ఎట్టి వేషముతో ఉందురో, వెంట ఏయే వస్తువులు గొనిపోదురో, ఎట్లు మెలగెదరో, ఏమేమి చేయుదురో విపులముగా తెలిపినాడు. (10-117)

18. గణక పద్ధతులు- మూలమున లేకున్నను గణకుని విధులు, ఆయ వ్యయముల లెక్కలు వ్రాయు పద్ధతులు, వ్రాయకూడని విధానములు విపులముగా చెప్పబడినవి. రాజకోశముల దగ్గర ఉండు గణకులు వ్రాసిన లెక్కలను, వ్రాతలను ప్రభువు స్వయముగా పరిశీలింపవలెనట. ఈగణకులే కరణములట.

క. కరణము తన యేలికకుప
కరణము, నిర్దయ గుణాధికరణము, ప్రజకుఙ

శరణ ... పగవా ... లకును
మరణము నాఁజెల్లు నీతిమంతుండైనన్. (11-95,101)

19 సేవకుని విధులు- మూలమునలేని సేవకవిధులు, ఉత్తమభృత్య లక్షణములు, దుష్టసేవక లక్షణములు వివరింపబడినవి. ఇందు లేఖక లెంక శబ్దములు పర్యాయ పదములుగా వాడబడినవి. లేఖక పదము నుండియే లెంక వచ్చియుండును. (11-1C6)

20. చతుష్షష్టికళలు- మూలమున లేకున్నను చతుర్దశ విద్యలను, చతుష్షష్టి కళలను ఒక దీర్ఘ వచనమున చెప్పెను. (11-1(8)

21. ఛందోవిశేషములు- మూలమున లేని ఛందో విశేషములను గోపరాజు చెప్పెను. దండకారణ్యమును వర్ణించు సందర్భమున 13 ఛందములు మాత్రము చెప్పబడినవి (5-54). అందును అనుష్టుప్, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి ఛందములలో బుట్టినవని కవిజనాశ్రయకారుడు చెప్పిన వృత్తములను వదలి క్రొత్త వృత్తములను గోపరాజు చెప్పెను. హరిణీవృత్తము అష్టిఛందములోనిదిగా మార్చెను. ఆ తరువాత ధృతి, కృతి, ప్రకృతి, సంకృతి, ఉత్కృతి ఛందములలోని వృత్తములను కవిజనాశ్రయము నుండియే గ్రహించెను. అందు 26 ఛందములు పేర్కొనబడినవి.

తొమ్మిదవ బొమ్మ కథలో ఆంధ్రచ్ఛందో విశేషములను, అందును యతిప్రాసలను, ప్రసక్తి కలిగించుకొని చెప్పినాడు. తెలుగు కవితకు యతులు ప్రాసలు ముఖ్యములని తెలిపి, పదమూడు విధములైన వళ్ళు చెప్పినాడు. యతిని వడి అందురు. గోపరాజు కవిజనాశ్రయచ్ఛందస్సును అనుసరించెను. అందు స్వరయతి, వర్గయతి, అఖండయతి, ప్రాదియతి, బిందుయతి, ప్లుతయతి, సంయుక్తాక్షరయతి. ఎక్కటియతి, పోలికయతి, సరసయతి అను 10 విధములు చెప్పబడగా, గోపరాజు వాటికి వ్యంజనయతి, గూఢస్వరవ్యంజన

యతి, వృద్ధియతి అను మూటిని చేర్చి 18 వళ్ళను చెప్పినాడు. అఖండయతి బిందుయతులను నిత్యసమాసయతి, అనుస్వారయతి అని మార్చెను. ప్రథమ పరిష్కర్తలు గోపరాజు అఖండయతిని చెప్పలేదని ఒక పద్యము నందలి ఆప్రయోగమును మార్చిరి.

"... ... దేవేంద్రుపీఠ్యాని తేరిమీద
నిడికొని యుజ్జయినికి దెచ్చి వేడ్కసిం
హాసనంబెక్కె యాయవనివిభుఁడు" (1-137)

అని యున్నదానిని "నిడికొని యుజ్జేని కేతెంచి వేడ్క" అని సవరించిరి. 'ఇడికొనికి' 'నిడికొని' రూపాంతరమున్నట్లు భారత ప్రయోగమును బట్టి సమర్థింపవచ్చును (ఆదిపర్వము). కాని గోపరాజునకు అఖండయతి సమ్మతమే అగునని క్రిందిపద్యము వలన చెప్పవచ్చును.

"డాయఁగ సమసింపఁగ ఁబా
రాయణ నారాయణాంతరంగా నేకా
నాయాసాదులఁ గర్ణర
సాయనముగ రెండువళ్ళు జరుగుచునుండున్" (4-207)

అట్లే బిందుయతిని గూడ వాడినాడు.

"గం, డక శార్దూల వరాహ సింహ కరిగణ్యంబౌ నరణ్యానికిన్" (3-12)

గోపరాజునకు తరువాత 17 శతాబ్దివాడైన కూచిమంచి తిమ్మకవి తన "సర్వ లక్షణ సారసంగ్రహము"లో 22 వళ్ళను చెప్పి ప్రాదియతులకు గోపరాజు పద్యమునే ఉదాహరించెను. అప్పకవి అనవసరముగ విభజించి 41 యతిభేదములను చెప్పినాడు.

కవిజనాశ్రయమున 6 విధములైన ప్రాసలు చెప్పబడినవి. గోపరాజు వానినే గ్రహించి అందలి సుకరప్రాసమును వదలి చతుఃప్రాసమును

చెప్పెను. అన్నిటికిని ఉదాహరణములను చెప్పి తన సామర్థ్యమును చూపుటకై సర్వప్రాస కందమును చెప్పినాడు.

క. కుండలి బాలకులకు నధి
కుండగు భుజగేంద్రనాయకుండటు మెచ్చం
గుండ యమృతంబు నేడీ
కుండఁగఁ దగదనుచుఁ దప్పకుండఁగ నిచ్చెన్." (9-132)

గోపరాజు వలపలగిలక ప్రాసమున గూడ పద్యము చెప్పినాడు.

శా. కాశ్యపిలోఁ బ్రసిద్ధమగు కంచిని నుండుదు విష్ణుశర్ముఁడం
గశ్యపగోత్రజాతుఁడ, వికార విదూరమనస్కుఁడన్ జగ
ద్వశ్యకళావిశారదుఁడ, దైవము చెయ్ది దరిద్రభావనా
కాశ్యమునొంది భార్య గడుఁ గష్టపుఁ బల్కులు వల్కనోర్చితిన్.
(8-206)

ఇట్టిది 'సంయుక్త విశేషప్రాస' కాదగునని శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు చెప్పిరి * గోపరాజు, ప్రమాదమున గావచ్చును ప్రాసభంగమును చేసినాడు.

"నీ కే వాంఛయు లేకయున్న వినుమా నిన్నెవ్వఁడీక్షించినన్
మాకిష్టంబు సరస్వతీవిభవ మా మర్త్యుండు వే పొందు వా
క్ప్రౌఢుండై విలసిల్లఁ జేసెదము భూపాలాగ్రణీ నీయశం
బాకల్పంబుగ నొప్పఁగాత జనలోకానందమై సాంద్రమై." (12-106)

ఇందలి మూడవపాదమును "వాక్ప్రౌఢుండై విలసిల్లఁ జేసెదము ధాత్రీనాయకా" అని సవరింప వచ్చును; కాని స్వతంత్రించుట న్యాయముకాదు.

---

* అప్పకవీయ భావప్రకాశిక.

వ్యాకరణ విశేషములు :

గోపరాజు చక్కని పాండిత్యము గలవాడని అతని ప్రయోగములు చెప్పుచున్నవి. సుప్రసిద్ధవ్యాకర్త పరవస్తు చిన్నయసూరి ఈ కావ్యము నుండి ఉదాహరణములను తన బాలవ్యాకరణమున చెప్పినాడు.

'ససేమిరా' కథలో "సేతువుఁగని జలనిధి సం, జాతధనుష్కోటిఁ బడిన సద్ద్విజహతికిం, బాతకము వాయు" అని వ్రాసెను. సామాన్యముగా దీనిని చదివినప్పుడు అర్థము సరిగా స్ఫురింపదు. మూలము నందలి 'సేతుం దృష్ట్వా'- అనుదానికి 'సేతువుఁగని' అని గోపరాజు అనువదించెను, 'క్త్వా' ర్థమునకు హేత్వర్థమున్నట్లు ప్రౌఢవ్యాకరణ కర్త చెప్పినాడు. కొన్ని ప్రసిద్ధ ప్రయోగములు గూడ కలవు. కాళిదాసుని కుమారసంభవము నందలి రతివిలాపమున "స్మర సంస్మృత్య న శాంతి రస్తి మే" అనుప్రయోగమున్నది. ఇందలి క్త్వార్థమునకు హేత్వర్థమునే చెప్పవలెను. అట్లే స్కాందపురాణము నందలి శ్రీశైలఖండములో "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అనుచోటను హేత్వర్థమునే చెప్పవలెను. అట్లే గోపరాజు ప్రయోగమగు 'సేతువుఁగని' అనుదానికిని 'సేతువును చూచిన' అని హేత్వర్థమునే చెప్ప వలెను.

ఈ కావ్యమందొకచోట గుఱ్ఱముల పేర్లుగల ఒక పద్యమున్నది.

క. ఒనరించిన నీలని నడ
గని బొల్లనిఁగ త్తలానిఁ గైరని సారం
గని జారని జన్నని నిమ
వని మొదలుగఁ దెచ్చినిలిపె వాహకుఁ డెదురన్. (8-141)

ఈ పద్యమును చూచియే చిన్నయసూరి తన బాలవ్యాకరణమున అచ్చిక పరిచ్ఛేదమునందు "మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుఙ్గు నుత్వంబుగాదు" (4) అను సూత్రమును చెప్పినట్లు తోచుచున్నది.

ఉదా:- మగఁడు, మనుమఁడు, కయిరఁడు. కత్తళఁడు. మగ,మనుమ, రాయ, పాప, వే,జే,ఈ, కా ప్రత్యయాంతంబులు - ఇత్యాదులు, మగాదులు. కయిర, కత్తళ, జన్న, సీల, ఇత్యాదులు కయిరాదులు."

కయిరాదులు తిర్యగ్వాచకములగుటచే అమహత్తులు గావున వానికి 'డుజ్' రాదు. అందుకై ఈ సూత్రము చెప్పవలసి వచ్చినది దీనినిబట్టి పై పద్యమునందలి పదములకు 'డు' ప్రత్యయము వచ్చి సీలఁడు, నడగఁడు, బొల్లిఁడు, కత్తలఁడు, కైరఁడు, సారంగఁడు, జారఁడు, జన్నఁడు, నిమవడు అను రూపము లేర్పడును. వాని ద్వితీయావిభక్తి రూపములే పై పద్యమున కానవచ్చునవి. కత్తలఁడు, కత్తలాడు అను రెండు రూపములున్నవి. మహాకవియగు శ్రీనాథుడు తన నైషధములో "కత్తలాణి తేజీహయముఁ" అని, ప్రయోగించెను. గోపరాజు ఆ ప్రయోగమును చూచి 'కత్తలాని' అని వాడి యున్నాడు.

మరొక పద్యమున "తేగడైన పెదపి త్రేగుడమృతమని
కవులు వొగడఁ బేరు గలిగెఁగాక" (1-100)

అని త్రేగుడు ప్రయోగింపబడినది. బాలవ్యాకరణ కృదంత పరిచ్ఛేదమున "గడ చేర్వాదులకగు" అను 15 సూత్రమున త్రేగడ చెప్పబడినది. ఇష్టే ఏస్మిన్నైన జూపవచ్చును.

ఈ కావ్యమున అక్కడక్కడ క్త్వార్థకేకారసంధి వంటి వ్యాకరణ విరుద్ధ ప్రయోగములును కొన్ని కానవచ్చుచున్నవి.

"ఉండిరుదకంబులో మునిగున్నపగిది" (4-102)

"యేకోనవింశతిమద్వారము పొంత బొమ్మపలికెఁ "వంటివి ప్రమాద పతితములు కావచ్చును.

అపూర్వపద ప్రయోగములు :

గోపరాజు తన కావ్యమున ఇతరులు వాడని, నిఘంటువులలో సాధారణముగ కనబడని కొన్ని అపూర్వ పదములను వాడినాడు. అవి అతడున్న

ప్రాంతమున వ్యవహారము నందుండినవి కావచ్చును, శ్రీ వెంపరాల సూర్య నారాయణ శాస్త్రి గారు ప్రథమ ముద్రణ పీఠికలో కొన్నిటిని చూపి అర్థములను వ్రాసినారు. అవి గమనింపదగియున్నవి. 'బానగిలు=బలాత్కృతమగు, కాసించు=కాసెవేయు, వెంచ=మడువు, పాగు=రహస్యము, పరిణయించి=పెండ్లాడి, వెలగ=ధనము, వెట్టము=విరోధి, పరిమాళించుట=మల్లయుద్ధము చేయుట, వయ్యంది=కొలిమి. ఇవికాక మరికొన్ని కలవు: ఉద్దాలు=చెప్పులు, సన్నాలు=పిల్లల మొలనూలు, చక్కదము=మంచిది, పుల్లతి=మల్లయుద్ధ పద్ధతి, ఉబ్బసము=మిక్కిలి సంతోషము.

**లోకోక్తులు-సామెతలు :**

గోపరాజు సందర్భోచితముగ పలు సామెతలను,లోకోక్తులను వాడెను.

| | |
|---|---|
| "బాణోచ్ఛిష్టం జగత్త్రియం" | 1-26 |
| "బ్రహ్మాస్త్రం విషముచ్యతే" | 1-176 |
| "కామాంధోపి న పశ్యతి" | 1-225 |
| "రాజ్ఞాం ప్రజాపాలనం పరమో ధర్మః" | 1-197 |
| "న భూతో న భవిష్యతి" | 2-65 |
| "ధనమూల మిదం జగత్" | 2-178 |
| "భూయాత్తే సంపద్దీర్ఘాయుర్భవతే" | 3-198 |
| "పరోపకారార్థ మిదం శరీరం" | 4-34 |
| "మూలం వైరతరోః స్త్రీ" | 4-48 |
| "కలౌ మైలారు భైరవా" | 4-73 |
| "అనిత్యాని శరీరాణి" | 4-141 |
| "ధర్మస్య త్వరితా గతిః" | 4-143 |
| "ధర్మే తిష్ఠతి తే బుద్ధిః" | 10-11 |
| "బుద్ధిః కర్మానుసారిణీ" | 10-148 |
| "నా విష్ణుః పృథివీపతిః" | 12-91 |

సామెతలు

"కడుపిటు గాలంగ కంట కాటుక యేలా" 1-86

"హనుమంతుని యెదుట కుప్పిగంతు లెగయుట" 2-49

"కప్పకాటు-బాపనపోటు" 4-130

"ముంజేతి కంకణమున కద్దంబేటికి" 7-84

"మూర్ఖు భారతపర్వంబు పఠింపబూనుట" 8-2

"అందన్రిమాని పండులకు అఱ్ఱులు సాచుట" 8-86

"యేనుఁగు చిక్కెనేని మఱి యెంపలి చెట్టునఁ గట్టవచ్చునే" 11-27

"ఈశ్వరనిరాకరణం బది రిత్తవోవునే" 11-60

"ఇల్లు గాలంగ నుయిఁద్రవ్వ నేగుటంద్రు" 11-120

కవితా విశేషములు :

గోపరాజు కవితా కౌశల్యమును కావ్యమున ప్రతి కథ యందును చూడవచ్చును. అవతారికలోనె అతడు తన సామర్థ్యమును చెప్పినాడు.

చ. తెనుఁగునఁ దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మె
త్తన పసచాలదంద్రు విశదంబుగ సంస్కృత శబ్దమూఁదఁ జె
ప్పిన నవి దర్పముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దత్భవముం గలయంగఁ జెప్పెదన్.

(1-32)

ఇందలి 'తెనుంగు' పదమునకు 'తత్సమ' మని గ్రహింపవలెను. సాంస్కృతికములు, అచ్చతెలుగులు సమానముగా ఉపయోగింప గల ప్రజ్ఞ గోపరాజునకున్నది.

సంస్కృతపద భూయిష్ఠ రచన :

క. ఉల్లోల దుగ్ధసాగర
కల్లోల కరాగ్ర మంద కంపిత ఫణభృ

ద్వ్యాలిభమణిమయ దోలా
వేల్లన సుఖలోలుఁడైన వేల్పుం దలఁతున్. (2-104)

మ. చని యచ్చోట విభుండు చేరె సుమనోజాల ప్రవాళావళీ
జనితానేక సకామపంచశర చంచచ్చాపవల్లీ గుణ
ధ్వని శంకావహ ఝుంకృతి ప్రవిలసత్సంగీత భృంగాంగనా
ఘన సంతోష విశేష కల్పలతికా కందంబు మాకందమున్. (2-145)

అచ్చ తెలుగులు :

క. మొలఁ బులితోలును మేనం
బలుచని వెలిపూఁత యఱుతఁ బాములపేరుం
దల మిన్నేఱును జడలను
జలివెలుఁగుం గలుగు మేటి జంగముఁ గొలుతున్. (2-59)

సీ. పొదలిన కూటమి పిదప మెల్పునఁ గల
గనయంబు డాకేలఁ గొని తెమల్చి
పోఁడిమిగల పాఁపఱేఁడను సెజ్జపై
నూఁతగా వలకేల నొయ్యనొత్తి
క్రొమ్ముడిఁ జెరివిన కమ్మని క్రొవ్విరు
లెడలి వెన్నున జాఱి కడలుకొనఁగ
లేచి వేంచేయుచోఁ జూచి వెన్నుఁడు సొంపు
రెట్టింపఁ గ్రమ్మఱఁ బట్టి యెదఁదఁ

దమక మినుమడిగాఁ గౌను దక్కఁదొడిగి
బిగువుఁ గౌఁగిటఁ గదియంగఁ దిగిచి తివుట
మోవి గదియంగఁ గోర్కులు మూరి బుచ్చు
కలిమి యాబిడ చూడ్కులు గాచుఁ గాత. (4-219)

మిశ్రమము :

శా. కాయజొచ్చెంరసాలముల్ విరహులాకంపింపఁగాఁ గోయిలల్
గూయంజొచ్చె మనోజదిగ్విజయ మాఘోషించుచుం దుమ్మెదల్
మ్రోయంజొచ్చె నవీన పుష్పశరముల్ మొత్తంబుగాఁ జిత్తజుం
డేయంజొచ్చె సతుల్మదిం గలఁగగా నెచ్చోటులం దానయై. (7-12)

క. కలకల బలికెడు పక్షుల
కలకలములు సకలదిశలఁ గలయఁగఁ బొలయుం
దళదళికులముగ దళశత
దళదళములు విరియఁ బ్రొద్దు దళతళఁ బొడిచెన్. (1-28)

కృతులలో అష్టాదశవర్ణనలుండవలెనని లాక్షణికులు చెప్పిరి. గోపరాజుకూడ చెప్పెను.

క. కావునఁ బదునెనిమిది యగు
నీ వర్ణన లచట నచట నింపుగ నెరయం
గావించెద నిటఁ బనికిని
రావనకుఁడు లక్షణాభిరామములగుటన్. (1-35)

ఈ కావ్యమునందలి అష్టాదశవర్ణనలను విస్తరభీతిచే ఉదాహరింపక విడుచుచున్నాను. సహృదయులు పరిశీలింప గోరెదను. గోపరాజునకు సంయమము తక్కువ. వర్ణనాలోలుడగుట అతని స్వభావము. పలుచోట్ల ఈ వర్ణనలు కథాగమనమునకు అడ్డు తగులుచుండును. అనేక వర్ణనలలో ప్రాచీన కావ్యచ్ఛాయలు, అనుకరణములు గోచరించును.

"పల్లవ వైభవాస్పదములు పదములు" (భాగవతము)
"పల్లవ సంపదాస్పదములు పదములు" (1-204)

క. సరి దావచ్చిన వచ్చును
సరసంబుగ నారికేళసలిలము భంగిన్ (సుమతిశతకము)

క. మును దనకుం గానున్నది
పని వడియగు నారికేళ ఫలరసము క్రియం
జన నున్నది చనుఁ గరి గ్ర
క్కున మ్రింగిన వెలఁగపండు గుంజును బోలెన్. (5-286)

"ప్రాచీదిశాంగనా ఫాలతలంబున
దీపించు సిందూరతిలక మనఁగ" (భాగవతము)

"ప్రాచీవధూటికా ఫాలభాగంబున
బెట్టిన కెంపుల బొట్టనంగ" (5-85)

తరువాతి వారిలో ఇతని ఛాయలు కన్పించును. మచ్చునకొక పద్యము

"కాకులలోఁ గోకిలములు
కాకులఁ బడలేక కులము గలయఁగఁ బవనుం
డాకుల పాటొనరింపఁగ
నాకుల పాటయ్యె విరహులగు లోకులకున్" (7-9. సిం. ద్వా)

"ఆకులపాటుఁజూచి యిపుడాకులపాటొనరించె నెంతయున్"
(తారాశశాంకము)

గోపరాజునకు బంధకవిత్వము మీద ప్రీతి కలదని క్రింది పద్యముల వలన తెలియుచున్నది.

సీ. రాజేంద్ర యారక్షరముల పేరిటివాఁడ
నాద్యక్షరము మాన నశ్వవేది
రెండక్షరములఁ బరిత్యజించిన నాట్య
కర్త, మూడుడిపిన గతవిదుండ
నాలుగు నుడిగింపఁ జాలనేర్పరి, నైదు
విడిచిన బుధుఁడ నీ విధముగాత
సర్వాక్షరంబులఁ జదివి చూచిన బుద్ధి
బలముఁగాఁగలయట్టి ప్రౌఢుఁడనఁగ

నేతిబీఱకాయ నీతి గాకుండఁగ
నిన్నివిద్యలందు నెన్నఁబడ్డ
సార్థనాముఁడైన యర్థిగా నెఱుఁగుము
విబుధ పంకజార్క; విక్రమార్క. (2-47)

ఈ పద్యము నందలి చమత్కారము ఆశ్చర్యము కలిగించును. ఒక కవి పేరు ఆరక్షరములు గలది. అందులో మొదటి అక్షరము తీసివేసిన ఆశ్వవేది అగునట. రెండక్షరములు తీసిన నాట్యకర్త అగునట. మూడక్షరములు తీసిన గతమెరిగిన వాడట. నాలుగక్షరములు తీసిన చాలనేర్పరి అట. అయిదక్షరములు విడిచిన పండితుడట. అన్ని అక్షరములు కలిపిచూచిన మహాబుద్ధిశాలి యగునట. అతని పేరేది? 'చతురంగతజ్ఞ' అన్నది అతని పేరు. పైన చెప్పినట్లు ఒక్కొక్క అక్షరము తీసిచూడుడు. ఇట్టిదే మరొకటి.

సీ. రాజ్యంబు వదలక రసికత్వమెడలక
జయశీల ముడుగక నయము చెరక
దీనులఁ జంపక దేశంబు నొంపక
నిజ ముజ్జగింపక నేర్పు గలిగి
విప్రులఁ జుట్టాల వెన్నుసొచ్చినయట్టి
వారిని గొల్చినవారిఁ బ్రజల
హర్షంబుతోఁ గాచి యన్యాయ ముడుపుచు
మున్ను జెప్పిన రీతిఁ జెన్నుమీఱి

చేత లొండులేక ప్రాఁతలు విడువక
యశము కలిమి దమకు వశము గాఁగ
వసుధ యేలు రాజవర్గంబులోన న
య్యాది విష్ణుమూర్తి వంద్రు నిన్ను. (7-75)

ఈ సీసములోని ఎనిమిది పాదములు గీతములోని నాలుగు పాదముల మొదటి అక్షరములను కలిపి చదివినచో "రాజ దీని వివాహము చేయవయ్యా" అని అగును. ధారాశుద్ధిగల ఈతని కవిత్వము పఠితలకు చవులూరించును.

కృతి సమర్పణము :

గోపరాజు హరిహరాభేదమును పాటించు అద్వైతి. తన కావ్యమును హరునకు, హరికి సమర్పించెను. ఇతనికి పూర్వము తిక్కనాదులును తమ కృతులను హరిహరనాథునకు సమర్పించిరి. ఇతడు హరిహరులను వేరుగా, ఏకరూపునిగ స్తుతించెను. కావ్యారంభమున శివుని, ఆ తరువాత కేశవుని నుతించెను. అవతారికలో "సింహాసన ద్వాత్రింశతి కథా కథనమూలకారణం బైన అంబికారమణుండును, మత్కవితాసంపత్తి సంధాయకుండగు లక్ష్మీ నాయకుండును గావ్యనాయకులుగా నియమించుటం జేసి.

సీ. పాపపెండెము గాక పసిఁడి యందియయును
　　　నడుగుఁదామరపైన నమరువాఁడు
　పెద్దమెకముతోలు నిద్దంపుఁ బట్టును
　　　మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు
　ఎముకపూసలును ముత్యములు జేరులు గాఁగ
　　　నక్కునఁ దాల్చి పెంపెక్కువాఁడు
　పునుకయుం బెనుఁగుల్లయును గేలు దమ్ముల
　　　నంచల మాడ్కిఁ బాటించువాఁడు
　సగము పొదవునఁదెల్పు నా సగము నల్పు
　నయ్యు మెడ నొక్కవన్నియ యగుచు మేను
　లెనయ ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ
　బొల్చు నా వేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాత.　　　(1-40)

అని హరిహరనాథునకు సమర్పించెను. ప్రాచీన కవులందరును తమ కృతి భర్తలను, కావ్యారంభమునను, షష్ఠ్యంతములలోను, ఆశ్వాస ఆద్యంత

ములోను స్తుతించినారు. గోపరాజు ప్రత్యేక పద్ధతి ననుసరించెను. ఇష్ట దైవము కలలో వచ్చి కృతినిమ్మని కోరు స్వప్నవృత్తాంతమును, షష్ఠ్యంతములను విడిచి పెట్టెను. కావ్యారంభమున శివుని, కేశవుని వేరువేరుగను, అవతారికలో ఏకరూపునిగ, ఆశ్వాసారంభములలోను, ప్రతిబొమ్మకథ మొదటను హరినో హరునో వేరుగను, ఆశ్వాసాంతములలో ఒక పద్యము హరికి, ఒకటి హరునకు, ఒకటి ఏకరూపునకును, కావ్యాంతమున ఫలశ్రుతిలో ఏకరూపునిగను స్తుతించినాడు.

గోపరాజునకు తిక్కనాదుల పైగల గౌరవముతోడనే గాక మూలము ననుసరించి గూడ హరిహరులను స్తుతించినట్లు కనబడుచున్నది. మూలము నందలి ప్రథమోపాఖ్యానమున భర్తృహరికి దివ్యఫలమియ్యవచ్చిన బ్రాహ్మణుడు హరిహర స్తవముతో ఆశీర్వదించును.

“అహీనమాలికాం బిభ్రత్ తథా పీతాంబరం వపుః
హరో హరిశ్చ భూపాల కరోతు తవ మంగళం॥

హరుని పరముగ- అహి ఇనమాలికాం=పాములకు ప్రభువైన ఆదిశేషుని అను దండను, తథాపి=అయినను, ఇతాంబరం=వస్త్రములేని (దిగంబరమైన) వపుః=శరీరమును, బిభ్రత్=వహించునట్టిహరః=శివుడు.

హరి పరముగ- అహీన=వాడని, మాలికాం=దండను (వనమాలను) తథా=అట్లే, పీతాంబరం=పచ్చనివస్త్రముగల, వపుః=శరీరమును, బిభ్రత్=వహించునట్టి, హరిశ్చ=కేశవుడును, నీకు మంగళములు ఇత్తురుగాక.

ఈ శ్లోకమునే గోపరాజు అవతారికలోని సీసపద్యముగా విపులీకరించెను. ఇదే ఉపాఖ్యానములో ఒక దిగంబరుడు విక్రమార్కునిట్లు దీవించును

“లీలయా మండలీకృత్య, భుజంగాన్ ధారయన్ హరః
దంష్ట్రాగ్రే వరాహశ్చ, తుభ్య మభ్యధికాం శ్రియం”

శివపరమైన అర్థము- లీలయా=వేడుకతో, భుజంగాన్=పాములను, మండలీకృత్య=చుట్టచేసుకొని, ధారయన్=ధరించినట్టి, హరః=శివుడు.

కేశవపరమైన అర్థము- లీలయా=విలాసముతో, భుజం=భుజమును, మండలీకృత్య=వంచి, గాం=భూమిని, ధారయన్=ధరించినట్టి. వరాహశ్చ= వరాహమూర్తియు నీకు అధిక సంపత్తులు ఇచ్చుగాక. మూలమునందలి ఈ హరిహర స్తుతి గోపరాజునకు స్ఫూర్తి నిచ్చియుండును.

**పాఠ పరిష్కరణము:**

ఈ కావ్యమునకు కాకినాడలో ఉండిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తక భాండాగారమునందు రెండు ప్రతులుండినవి. ఒకటి తాళపత్రప్రతి, రెండవది మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందున్న ప్రతుల నుండి పాఠములు గ్రహించి వ్రాయించిన కాగితపుప్రతి. ఇవికాక శ్రీ పోతాప్రెగడ బ్రహ్మానంద రావు పంతులుగారి కడ లభించిన వ్రాతప్రతిని, పరవస్తు చిన్నయ సూరిగారు సూచించిన పాఠములు గల ప్రతిని పరిశీలించి పరిషత్తువారు 1933లో ద్వితీయభాగమును, 1936లో ప్రథమ భాగమును ప్రచురించిరి. ఆతరువాత మరల 1960లో ప్రథమభాగము ద్వితీయ ముద్రణకు నోచుకొనెను. ప్రత్యంతరములు లభింపలేదు. ఇప్పుడు మరల పరిష్కృతపాఠములతో ఈ ప్రతి ప్రకటింప బడుచున్నది.

ఈ పరిష్కరణములో నేను కావ్యమందును, అధస్సూచికలోను ఉన్న పాఠములలో సమంజసములని తోచిన వానిని గ్రహించి తక్కిన వానిని అధస్సూచికలో ఉంచితిని రెండు చోట్ల మాత్రము సందర్భమును బట్టి సవరణలు చేసితిని. నాలుగవ ఆశ్వాసమున సతులపేళ్ళు తెలుగులో చెప్పు సందర్భమునందు "చెలువయుఁ గలకంఠి చేడియ నెలతుక" (4-221) అని ఉన్నది. 'కలకంఠి' పదము తత్సమముగాని అచ్చతెలుగు కాదు. అందుకై నేను "చెలువ కలువకంటి చేడియ నెలతుక" అని సవరణ చేసితిని.

అట్లే పదవ ఆశ్వాసములోని

క. దేశాధీశ్వరుఁ డర్థుల
కాశాపరిపూర్తి సేయ నారాధితయౌ
నాశాపురమున దేవి ని
వేశాంగణ సీమ హోమవిధి గావించెన్. (10-23)

అను పద్యమున తృతీయ చరణము నందలి "ఆశాపురమున" అను పాఠమునకు సందర్భము కుదురదు. మూలమునందీచోట "ఆశాపూరణి" దేవత ప్రస్తావన గలదు. దానినిబట్టి ఆపాఠమును "ఆశాపూరణి దేవి" అని సవరించితిని. అక్కడక్కడ ఉండిన ముద్రణ స్ఖాలిత్యములను దిద్దితిని. ఆట వెలదులకు బదులుగ గీతమని ఉన్నచోట్ల సవరించితిని. ఇందేవైన దొసగులు న్నచో విజ్ఞులు తెలిపిన కృతజ్ఞతతో సవరించికొనెదనని సవినయముగ విన్న వించుచున్నాను.

కృతజ్ఞత-

ఈ ప్రాచీన కావ్యము శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారన్నట్లు "సహజమైన శైలితో, లలితములగు జాతీయములతో, మనోహరములగు వర్ణ నలతో ప్రశస్తి గాంచినది" అనుటలో అభిప్రాయ భేదము లేదు. ఇందు సమకాలిక జన జీవన విశేషములను గోపరాజు ప్రత్యేకముగ వివరించి యున్నందున శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారును, శ్రీసురవరం ప్రతాప రెడ్డి గారును బహుధా ప్రశంసించినారు.

నాకీ పరిష్కరణ పీఠికా రచనలలో అనేక గ్రంథములు తోడ్పడినవి. ఆ గ్రంథకర్తలకును, సంస్కృతమూలగ్రంథము నొసగిన మిత్రులు శ్రీ పి. తిరు మలరావు గారికిని ఋణపడియున్నాను. దీనిని పరిష్కరించు నవకాశమును కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యవర్గము వారికిని, కార్యదర్శి శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారికిని కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

అలంపూరు.
దుర్మతి జ్యేష్ఠము

గడియారం రామకృష్ణ శర్మ

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక*

## ప్రథమాశ్వాసము

### — కృత్యాది. దేవతాస్తోత్రాదికము —

శా. శ్రీమత్పర్వతనందనీ[1] తనులతాశ్లిష్టాంగ మై బాహుశా
ఖామధ్యంబున నున్న పన్నగఫణౌఘం బాకు లై యొప్ప ను
ద్దామం బౌ శశికాంతి పుష్పరుచి నొందంగా జటాపల్లవ
స్తోమం బౌ హరపారిజాతము భజింతు[2] న్వాక్ఫలావాప్తికిన్. 1

చ. పులుఁగుల పెద్ద వాహనము, పోటరి బిడ్డఁడు, జాఁగరౌతు,[3] పా
ములగమికాఁడు సెజ్జ, నలుమోములవాఁ డిలుతీర్చుపట్టి, వే
ల్పులు బలుబంటు; లాకలిమి[4] పొల్తుక, తెల్లనితల్లి పెద్దకో
డ లనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లనివేల్పుఁ గొల్చెదన్. 2

ఉ. దక్షిణనేత్రకాంతి నుచితంబుగ నర్ధవికాస మొంది వా
మాక్షిరుచిప్రసారమున నర్ధము విప్పకయున్న పుండరీ
కాక్షుని నాభిపద్మనిలయంబునఁ దమ్మిదభంగి లోలుఁడై
యక్షయవేదనాదమయుఁ డైన విరించిఁ దలంచి మ్రొక్కెదన్. 3

ఉ. కట్టినపుట్టముం దనువు గద్దియుఁ దమ్మియు నక్షమాలయుం
బట్టినచిల్కయు న్నగవుఁ బాపటజల్లియు నొక్కవన్నెగాఁ
బుట్టుచుఁ బుట్టువిద్యలకుఁ బుట్టినయి ల్లనఁజెల్లి బ్రహ్మవా
కట్టొనరించి తన్ముఖవికాసినియౌ సతి మమ్ముఁ గావుతన్. 4

---

*సింహాసన ద్వాత్రింశతి యనియుం గలదు. 1. నందనా. 2. నుతింతున్. 3 రాగెరౌతు, రాఁగరౌతు. 4. లాల్కమలపొల్తుక.

ఉ. నిద్దము లైన భూషణమణిప్రకరద్యుతు లన్నిదిక్కులన్
దొద్దలువుచ్చి తల్లిచనుదోయిసరిం[1] దలకట్టు మించఁగా
ముద్దులు సూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁదనాడు నా
ముద్దుగణేశునిం దలఁచి మ్రొక్కెద నీకృతికార్యసిద్ధికిన్. 5

క. రుణ్మదపరివృదసురగణ
తృణ్మోచను సురశరణ్యు ధృతశక్తి ఫణి
ద్విణ్మయవాహను, హరినిభు[2]
షణ్ముఖు నభిముఖునిగాఁ[3] బ్రశంసింతు మదిన్. 6

క. ప్రవిమలుఁడని గ్రహరాజని
కవితాప్రియుఁడని జగత్ప్రకాశకుఁడనియున్
భువి విక్రమార్కనృపసం
భవకారణుఁ డనియు[4] లోకబాంధవుఁ దలఁతున్. 7

క. పులుఁగునకై యెవ్వనిమది
నొలికిన శోకము లకారయుతమై కవితా
కలనకుఁ దెరు వయ్యెఁ దలం
పుల నాతనిఁ గొల్తుఁ బుట్టఁ బుట్టిన సుకవిన్. 8

ఉ. శ్రీనిలయంబునాఁగ మురజిద్గుణరత్ననివాస మై యుపా
ఖ్యానతరంగిణీభరిత మై కడగానఁగరాని భారతా
ఖ్యానపయోధిలోనఁ గల మై నిజయుక్తి భజింపఁ గర్ణధా
రానుకృతిం గృతార్థత మహాఘనుఁ డౌ మునిఁ బ్రస్తుతించెదన్. 9

క. ఆ భారతపర్వత్రయ
మీ భారతవర్ష మెల్ల నెఱుఁగఁ దెనుఁగునన్

---

1. నడిం. 2. హరిక్రియు, హరిప్రియ, హరిశిఖుఁడు. 3. నతిసుముఖుఁగా.
4. కారణమనియు.

శ్రీభారతిగతిఁ జెప్పిన
నాభావుకమును[1] దలంతు నన్నయభట్టున్. 10

క. లేముల వాడక శుచియై
[2]లేములవాడం జరించు లేమలవాడం
దా మెఱసిన భీముని నుత
భీముని బలభీము విమతభీమునిఁ దలఁతుణ్. 11

చ. అనఘు హుళక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును, ఘను నాగరాజుఁ, గవిసోమునిఁ, దిక్కనసోమయాజిఁ, గే
తనకవి, రంగనాథు, నుచితజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజుసో
మన, నమరేశ్వరుం, దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులణ్. 12

వ. అని యిట్లు సకలవరప్రదాన కారణదేవతలను జతురహృద్యానవద్యగద్య పద్యవిద్యావిద్యోతితు లయిన కవీశ్వరుల నుం బ్రశంసించి తత్ప్రసాదాసాదితసహజసాహిత్యతరంగితాంతరంగుండ నై సకలజనసాధారణం బగు నట్టిట్లని విన్నవించెద.[3] 13

ఉ. ఆదరణంబులేక చెడనాడిన బాణమయూరకాళిదా
సాదులకైనఁ దప్పు గల దన్యుల కే మని చెప్ప వీనితో
నేదియుఁ గాదు పొమ్మనక యిందులచంద మెఱింగి తప్పినం
గా దని తీర్చి యొప్పు గని కైకొని మెత్తురు గాక సత్కవుల్. 14

ఉ. [4]మానుగఁ దప్పులున్న ననుమానము సేయక మోదమానస
న్మాననులైనవారు పలుమాఱు పరీక్ష [5]లొనర్చి తీర్చినణ్

---

1. నా భరతుండని, నాభావకుఁడని 2. వే,లే, యని రెండుప్రతుల రెండురీతులు (వేములవాడ, లేములవాడ). 3. వితర్కించెద, వినిపించెద. 4. మానము దప్పనీక. 5. లొనర్చిరేనియుణ్.

హీనకవిత్వ మైన మెఱుఁ గెక్కఁడె నేర్పరులైనవారిచేఁ
సానలఁబట్టి తీర్చినను సన్నపురత్నము వన్నెకెక్కఁదే. 15

ఉ. భావరసానుకూలమృదుపాకపదార్థసమృద్ధి లోకసం
భావన నొప్పుకావ్యముల మర్మము[2] గానఁగ లేక దుర్మతుల్
కా వనఁ గాని యెట్టికడఁ గట్టడిఁ జెప్పఁగనేర; రెల్లెడం
ద్రోవన కాక కుక్కలకు దొంతులు వేర్వఁగ నేర్పు గల్గునే. 16

చ. చులుకని పద్య మైనఁ గడుఁ జోద్యము చేయుచుఁ జిన్నవానిఁ బె
ద్దలు గొనియాడఁగాను విని తప్పులుపట్టఁదలంతు రక్షముల్
బిలిబిలి మాట లాడఁ దనుఁ బెంచినవానికి ముద్దుగాక యా
పలికెడు చిల్కపిల్లఁగని బావురుఁబిల్లులు[3] సంతసిల్లునే. 17

ఉ. భీమనపద్య మన్నఁ గడుఁ బ్రీతి వహించుచు మేలుమేలు నా
నే మిది చెప్పినార మన నిక్కమె ప్రాసము గూర్చినాఁడ వౌ
నే మిది కాదు దీనివడి కిక్కడి కర్థ మిదెట్టి దీగణం
బే మని పెట్టినాఁడ వని యెగ్గులుపట్టుఁ గుబుద్ధి పెద్దలన్. 18

క. వివకికి వివరించిన కృతి
చవిపాలం బంచదార సరి గూర్చుట[4] యా
యవివేకికి వినిపించిన
కవిత వఱుతఁ జింతపండు గలుపుట చుమ్మీ. 19

ఉ. పూనినరీతి వానితలఁపు ల్వడిఁ బ్రాసములుం జలంబునం
బానగిలంగ నీడ్చి యొకపద్యముఁ గూర్చఁగవచ్చుఁగాక యా
ఖ్యానకథానుకూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె సన్నమై
కానఁగ జల్లి నేయునది కట్టెడుపుట్టము నేయనేర్చునే. 20

1. నేర్పరులైనవోజులై. 2. పద్ధతి. 3. బాగురుఁబిల్లులు. 4. గూర్చునునా.

క. ఉర్విఁ గల శబ్దజాలము
నిర్వచనస్థితుల నెఱిఁగి నేర్పున విద్యా
నిర్వాహకుఁ డనఁజెల్లెడు
సర్వజ్ఞుఁడు గానివాఁడు సత్కవి యగునే. 21

క. ఎప్పటి కేయది ప్రస్తుత
మప్పటి కావిద్య మర్మ[1] మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము
చొప్పడునే కావ్య మంత సులభమె ధాత్రిన్. 22

క. దుర్వాదము గాకుండ న
పూర్వపుఁగృతిఁ జెప్పుసుకవిపుంగవునకుఁ దా
సర్వజ్ఞుఁడ నని మాటల
గర్వింపఁగనేల తొడవు గానంబడఁగన్. 23

క. చనుఁ "గవివైభవవిద్యా"
యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లి
ల్లును గుడియుఁ జెఱువు నిధియును
వనము సుతుఁడు సంతతులుభవస్థితిగతికిన్. 24

క. ఎవ్వరు కృతు లొనరింపుదు
రెవ్వరు కృతిలోన వినుతి కెక్కుదు రొరుచే
నవ్విమల[2]కీర్తి సంతతు
లివ్వసుమతిఁ జెడక నిలుచు సినకల్పముగన్. 25

క. సుగుణులు "బాణోచ్ఛిష్టం
జగత్రయ" మ్మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే

1. మహిమమచ్చు...జెప్పెదు. 2. నవ్విభుల.

తగఁ దోడఁటిన[1] పాలిం
పగఁ బెరుఁ గయియున్న నది యభోజ్యంబగునే. 26

క. సంబంధము లగురసభా
వంబులు మునుకంటె నభినవంబులు గలవే
యంబుధినె కాక బహు ర
త్నంబులు వర్తకుల కేమి తాఁ బండినవే. 27

క. తల్లి యగు వాణికరుణం
దొల్లిటికవు లధిక లనఁగఁ దోఁచిరి పిదపన్
జల్లిదు లిప్పటి సుకవులు
తల్లికిఁ గడగొట్టు[2] కొడుకు దాఁ బ్రియమగుటన్. 28

క. ఏజనుఁడకైన సద్గుణ
యోజితులై భావ మెఱిఁగి యుచితార్థకళా
రాజితు లగు కవిరాజుల
రాజులు చేపట్టిరేని రాజ్యము గాదే. 29

క. సరసులు చేపట్టినచో
విరసం బగుకావ్య మైన వినిపించిన నా
దరణీయం బయి వెలయదె
ధరఁ బువ్వులఁ దాల్చి తుంగ[3]తలకెక్కుగతిన్. 30

క. అప్పరమేశ్వరు కరుణం
గుప్పలు గొను విక్రమార్కు గుణముల కొఱకై
చెప్పెద రసభావంబులు
ముప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెండున్. 31

1. తోడంటునఁబా. 2. గడపుట్టు. 3. వంకఁ దుంగ

చ. తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మె
త్తన పస చాల దంద్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్భముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగువేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్. 32

క. పదిలముగ మృదులవచనా
స్పదపదసంపదల రసము పదనిడక మహా
పదముల నైనను జల్లులఁ
బొదుపెట్టిన దుడుకుఁగవిత[1] పొదలునె సభలన్. 33

ఆ.వె. తనవచోనిశేష మెనయక పూర్వక
థామితోక్తిఁ జెప్పు టేమికడిఁది
యొకఁడు గోలవట్టి యొయ్యనఁ గొనిపోవ
నంధుఁ డెచటికైన నరుగుట కుదె.
34

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్మల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసినవానిద సూటిగావునన్. 35

చ. తెలుఁగున కెల్లఁ దల్లి యగుఁ దెల్లము సంస్కృతభాష యందులోఁ
బలుకు లెఱుంగుచోఁ బదవిభాగము నన్వయ మర్థమంచు నీ
మలకలకంటె నంచుల సమర్మము దేటతెనుంగ యొప్పు నా
కొలఁది ప్రియంబు గాదె చెఱకు ల్దినుకంటె రసంబు గ్రోలినన్. 36

క. పురమధుజలలీలాంబుధి
పరిణయునయవిప్రలంభ పతిగుణసుత భా

1. దుండుకవిత

స్ఫారచంద్రోదయ రణగతి
గిరి వన దూతర్తురతులఁ గృతి చెప్పఁదగున్. 37

క. కావునఁ బదునెనిమిది యగు
నీవర్ణన లచటనచట నించుక బెరయం
గావించెద నిటఁ బని కివి
రావనకుఁడు లక్షణాభిరామము లగుటన్[1]. 38

వ. అని విన్నవించి కృతకృత్యుండ నై సింహాసన ద్వాత్రింశతి కథాకథనమూల కారణం బైన యంబికారమణుండు ను [2]మత్కవితాసంపత్తి సంధాయకుం డగు లక్ష్మీనాయకుండును గావ్యనాయకులుగా నియమించుటంజేసి. 39

సీ. పాఁపపెండెముగాక పసిఁడియందియయును
నడుగుఁదామరలపై నమరువాఁడు
పెద్దమెకముతోలు నిద్దంపుఁబట్టును
మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు
ఎముకపూసలును ముత్యములుఁజేరులు గాఁగ
నక్కనఁదాల్చి పెంపెక్కువాఁడు
పునుకయుం బెనుగుల్లయును గేలుదమ్ముల
నంచలమాడ్కిఁ బాటించువాఁడు
గీ. సగముపొడవునఁ దెల్పు నాసగము నల్పు
నయ్యు మెడ నొక్కవన్నియ యగుచు మేను
లెనయ ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ
బొల్పు నావేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాత. 40

---

1. మొరయన్, మెరయన్. 2. ముక్తవితాన సంపద్విధాయకుండు.

-: కవివంశావతారవర్ణనము :-

క. తత్పదపద్మారాధన
తత్పరులను రాజమంత్రిధర్మజ్ఞుల మా
సత్పురుషుల వినిపించెద
మత్పారంపర్య మొకక్రమంబునఁ దెలియన్. 41

సీ. కలుషమండలికభేకఫణీంద్రుఁ డన
రాయగజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డారూఢబిరుదవి
రోధి కళింగనిరోధి యనఁగ
వెలసి నానాఁటికి వెలనాటి పృథివీశ్వ
రుని రాజ్యభారధుర్యుం డనంగ
నారెలు గన్నడి లఱవలుఁ దెలుఁగులుఁ
దనబిరుదందియఁ దగిలికొలువ

ఆ.వె. నెగడి సనదప్రోలు[1] నెలవుగా భూసుర
వంశ సాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్య సౌజనధన్యుండు
విక్రమార్కనిభుఁడు వెన్నవిభుఁడు. 42

ఉ. సాంద్రజవంబున,[2] న్మతి, నిజస్థితి, నేర్పునఁ, బేర్మి, సత్యవృ
త్తిం, ద్రుతబాణ[3] పాతనిరతిం, గళల, న్సరివత్తు రెట్లు ప
క్షీంద్రుఁడుఁ బన్నగేంద్రుఁడు నగేంద్రుఁడు పేంద్రుఁడు నింద్రుఁడున్ హరి
శ్చంద్రుఁడు రామచంద్రుఁడును జంద్రుడు వెన్నయ మంత్రిచంద్రుతోన్[4]

క. అమరఁగ వెన్నయమంత్రికి
నమితకళాకీర్తిపాత్రుఁ డగుపౌత్రుం డై

1. సందప్రోలు. 2. సాంద్రబలంబున. 3. ధృఢబాణ. 4. చంద్రుకున్

యమరేశ్వరమంత్రినిభుం
డమరేశ్వరమంత్రి వెలసె నార్యులు వొగడన్. 44

క. [1]సంగతినమరేశ్వరునకు
గంగాంబకుఁ బుట్టి రట్టి ఘను లన్నయయున్.
సింగయమంత్రియుఁ దమలో
నంగీకృత రామలక్ష్మణాకారములన్. 45

ఉ. అన్నయనామధేయసచివాగ్రణి పుత్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధి [2]పల్లికొండజనపాటఁడు మల్లనదేవరాజుచే
నెన్నఁగఁగుంచె లందలము నెల్లియుఁ గైకొని మంత్రియై ప్రతా
పోన్నతి కెక్కె ధర్మముల నొప్పెడు బ్రహ్మవనప్రతిష్ఠలన్. 46

చ. అనఘులు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి సత్తెనా
కన యనఁ గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసాంద్రుఁడు సింగనయుం గ్రమంబునన్. 47

క. ఘను లగ్రజులకు నీడై,
వనములుఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి బా
చనయును సింగనయును దగి
రనపోతకుమారసింగయకు మంత్రులనన్. 48

క. రామాయణకృతి కృతియై[3]
తామెఱయుచు నంధ్రకవిపితామహుఁ డనఁగా

---

1. గంగాంబకుఁ బుట్టిరి భువి, నంగజసన్నిభులు ఘనులు అన్నయయు సింగయ మంత్రియు, 2. పల్లకొండ గుణసంగుఁడు సింగనయుం బ్రియంబునన్. 3. రామాయణ కృతిపతియై.

భూమిని మించిన భీమన
నామంబునఁ బరంగె సత్యనారన ఘనుఁడై.[1] 49

ఉ. నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగమసింగమంత్రికిం
గూర్మిపట్టి నాఁ బరఁగు గోపయమంత్రి నిజానువృత్తిఁ బెం
పారెడు నెల్లమాంబిక కులాంగనగా నుతికెక్కెఁ దారతా
రారుచికీర్తి యాకసవరాజుతనూజుఁడు దాఁ బ్రసిద్ధుఁడై. 50

వ. ఇట్లు గోపరాజతనూజుండైన కసవరాజు దానగుణ రాధేయుం డగు రాణా
మల్లనరేంద్రునకుఁ బరమగురుండై శైవాచారప్రథమసింహాసనాధీశ్వరులైన
[2]బ్రహ్మదేవవడియల కూఁతు కామాంబిక యను కామినీరత్నంబుఁ బరి
గ్రహించి సుగుణగణగణ్యుం డై నెగడె. 51

ఉ. స్థేయుఁడు మంత్రిలక్షణవిధేయుఁడు లాలితదానకేళి రా
ధేయుఁడు సర్వసజ్జనవిధేయుఁడు సంతతసత్యవాక్యకౌం
తేయుఁడు నిత్యకీర్తి సుదతీపరిణేయుఁడు భావశుద్ధి గాం
గేయుఁడు గాయకప్రకరగేయుఁ డమేయుఁ డజేయుఁడున్నతిన్. 52

సీ. ప్రకటిత సరసవాక్కృతి యనఁగాఁ జెల్లి
చతురాస్యుఁడై పద్మజన్ముఁ డనఁగ
నార్యానుకూలమౌ కార్యంబు దీర్చుచు
సర్వజ్ఞుఁడై మహేశ్వరుఁ డనంగ
గామాంబఁ దనపత్నిగా గారవించుచు
బురుషోత్తముండయి హరియనంగ
గోపకుమారుండు కొడుకుగా నక్రూర
దృఢమిత్రుఁడై వాసుదేవుఁ డనఁగ

1. కవియై, 2. బ్రహ్మదేవయొడయల.

ఆ.వె. వేముగల్లు జన్మభూమిగాఁ బెరిఁగియు
[1]దీపులెల్ల మాటఁ దేటపఱిచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి
రాజనంగఁ గసవరాజు మించె. 53

క. తంత్రముచేఁ గార్యము పర
తంత్రము గాకుండఁ బతిహితమె చేయు మహా
మంత్రులలోపలఁ గసవయ
మంత్రి విచారమున దివిజమంత్రియుఁ బోలెన్. 54

వ. ఇట్టి మంత్రిశిరోమణికి నునికిపట్టగునట్టి పట్టనం బెట్టిదనిన. 55

శా. రాజామల్లన కీర్తిచంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి య[2]
క్షీణశ్రీపురుషోత్తమాశ్రయమునై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగ ల్లీమహిన్. 56

వ. ఇట్టి పురంబునందు. 57

క. పూజితు లగుకవులకృపన్
భ్రాజిష్ణుఁడఁ గొంత[3] అన్ధ్రభాషావిదుఁడన్
రాజనుతుఁ డైన కసవయ
రాజతనూభవుఁడ గోపరా జనువాఁడన్. 58

శా. చిత్రఖ్యాతి[4] వితీర్ణవిక్రమనిధి శ్రీవిక్రమాదిత్య చా
రిత్రఖ్యాపనశాసనంబులకు భూరి స్తంభసంభారమై
ధాత్రీపాలురఁ గావ్యవేదులును మోదం బంద సింహాసన
ద్వాత్రింశత్కథల స్గుణంబులుగఁ గావ్యం బొప్పుగాఁ జెప్పెదన్. 59

వ. అది యెట్టిదనిన. 60

---

1. మేదినినృపులమాట గేటుపఱచి. 2. యాక్షోణిన్ శ్రీపుర...శోభిల్లి
3. ఆంధ్రభాషా విదుఁడన్. 4. వికీర్ణవిక్రమ.

-: కథాప్రారంభము :-

ఉ. సారబలప్రసార పరిశంసితవింశతిబాహు బాహుకే
యూర చిరత్నరత్ననికషోపలమౌ రజతాద్రిపై మనో
హారవిహారము ల్సలిపి యచ్చట నచ్చట విశ్రమించుచుం
జారువిచారుఁ గింకరవశంకరు శంకరు గౌరి యిట్లనున్. 61

క. చిత్తజహర మీవలనం
గ్రొత్తకథ ల్గలిగెనేని గోరి వినంగాఁ
జిత్తం బుత్తలపడియెడి
నిత్తఱినిం బ్రొద్దువుత్త మెఱిఁగింపఁగదే. 62

క నావుడు దేవుం డిట్లను
దేవీ కల వెల్ల నీకుఁ దెలిపితి మొదలన్
దేవాసుర మానుషముల
నీవెఱుఁగనియట్టి కథలు నేఁ డిఁక నేవీ! 63

క. ఇప్పటికి భోజునకుఁ గడు
నొప్పిద మగు మణిమయాసనోపాంతములన్
ముప్పదియు రెండు బొమ్మలు
చెప్పిన యాకథలు గలవు చెప్పెద వినుమా. 64

క. అనవుడు నామణిసింహా
సన మెవ్వరిసొమ్ము భోజజనపతి కేలా
గునఁ జేరె నేమికారణ
మున నతనికి నిన్నికథలు బొమ్మలు సెప్పెన్. 65

క. నాకుం జెప్పుఁడు నావుడు
నా కైలాసంబుపై సుఖాసీనుండై

యేకతమునఁ గథ లన్నియు
శ్రీకంఠుఁడు గౌరి కిట్లు చెప్పందొడఁగెన్. 66

సీ. కాంచనకుంభసంగతశృంగములు గల
  మేడలు గడకట్టు మేరు వనఁగ
రామణీయకగుణారామంబులైన మం
  దిరములు తిరములౌ పురము లనఁగఁ
గట్టాయితం బైన కట్టడ గలకోట
  పుట్ట యాచెలియలికట్ట యనఁగఁ
గడ గానరాక భీకరమకరాలయం
  బైన యగడ్త మహాబ్ధియనఁగఁ

గీ. మించి భూమండలంబు నిర్మించువేళఁ
దెలివిపడ బ్రహ్మ పడియచ్చుదెచ్చుకొన్న
ద్వీప మనఁజెల్లు బహురత్నదీప్యమాన
గోపురంబుల నుజ్జయినీపురంబు. 67

క. ఏకడఁ జూచిన రత్న
వ్యాకీర్ణములై వెలుంగు నవ్వీటి గృహ
ప్రాకారంబుల మహిమను
జీఁకటియును జోరకులముఁ జేరఁగనోడున్. 68

క. కోట నొకచోట మరకత
కూటముఁ దృణమనుచు నిలిచి కోమటియిండ్లం
గోటికి నెత్తినపడగల
యాటునకై యశికి పాఱు నర్కుని హయముల్. 69

ఉ. పంబినగాలిచేరుల నభఃస్థలి తక్కెడదండె సేసి నా
కంబు మహీతలంబుఁ గుడుక త్రచియించి విరించి తొల్లి తు

ల్యంబుగ నెత్తుచోఁ జులుకనై యమరావతి మీఁది కేగె స
త్త్వంబున నెక్కుడై యట నవంతిపురం బదివ్రాలెఁ గ్రిందికిన్. 70

క. క్రిందయ్యును నమరావతిఁ
గ్రిందుపఱుచు ననుచుఁ గవులు కీర్తింప మహీ
బృందారకవరులకు నా
నందంబుగ నయ్యవంతినగరం బొప్పున్. 71

ఉ. జాగులు లేక యిచ్చునెఱచాగులు, నంచితకీర్తి సంచయో
ద్యోగులుఁ, బాపవర్తనవియోగులుఁ, గల్పితయాగులుఁ, స్గుణా
రాగులు, వీతరాగులు, నిరస్తవిరోధి కృతానురాగులున్
భోగులు, నిర్విభాగులును, బుణ్యనియోగులుఁ దత్పురీజనుల్. 72

ఆ.వె. మధుర కంచి కాశి మాయాపురము ద్వార
పతి యయోధ్య యీ యవంతిపురము
నాఁగ నెగడు ముక్తినగరంబులం దున్న
నరులు పుణ్యభాజనములు గారె. 73

శా. ఏణిలోచనలుం గవీశ్వరులుఁ బ్రత్యేకాధ్యులున్ జాణలు
న్వీణావేణుకళాప్రవీణమతులు న్విద్వాంసులు న్వీరులున్
క్షోణీదేవతలు న్మహోత్సవముల న్శోభిల్లఁగా నిత్యక
ల్యాణం బై చెలువొందు నాపురము దివ్యం బైన సంపత్తితోన్. 74

సీ. దానప్రశస్తహస్తప్రభావము గల్గు
భూవల్లభులును దంతావళములు
వివిధపదక్రమ విహితవర్తన గల్గు
కుంభినీసురులును ఘోటకములు
బహుళసంఖ్యాతనిర్వహణచాతురిగల్గు
నుత్తమగణకులు యోధవరులు

నక్షపాటవసంభృతార్థభావముగల్గు
నాదెజూదరులును నరదములును

ఆ.వె. బరడు పసిండిగాఁగ భాండసంపద గల్గు
గ్రొత్తవర్తకులును గుమ్మరులును
జొప్పుదప్పకునికినెప్పుడు నొప్పుల
కుప్పయనఁగఁబరఁగు నప్పురంబు. 75

ఆ.వె.అందుఁ జంద్రగుప్తు నాత్మజుండగు భర్తృ
హరియ రాజు విక్రమార్కుఁ డతని
సవతితల్లికొడుకు యువరాజు తన్మంత్రి
భట్టి నాఁగ నీతిపరుఁడు గలఁడు. 76

చ. అలక లలివ్రజంబు, వదనాబ్జము చంద్రుఁడు, సుస్వరంబు కో
కిలములు, మంజువాక్యములు కీరగణంబుల సొంపు, చల్లనూ
ర్పులు మలయానిలం, బయిన రూపము దాల్చి యనంగసేననాఁ
జెలఁగె ననంగసేన యను చేడియ భర్తృహరీష్టభార్య యై. 77

క. తరుణులలో మిక్కిలి నీ
తరుణికడం జిక్కి పీతధరజీవరుఁడై
యొరపునఁ దదీయచేతో
హరుఁడై హరివోలె భర్తృహరి విహరించెన్. 78

ఉ. అత్యనురక్తి భర్తృహరి యంతిపురంబునఁ గేలిలోలుఁడై
నిత్యరతిప్రసంగముల నిల్వఁగ నాతనిదర్శనంబు సాం
గత్యము లేకయుం బ్రజలు కార్యముపట్లను భట్టి విక్రమా
దిత్యులనేర్పునం దగవు దీఱఁగ నుండిరి నైజవృత్తులన్. 79

క. ఆదినముల నప్పురిలో
వేదవిదుం డైన యొక్కవిప్రుఁడు మిగులం

వేదఱిమి నొగిలి ధనసం
పాదనమతి భద్రకాళిపాలికిఁ జనియెన్. 80

క. చని యాగుడిముందట ను
గ్రనియతిఁ దప మాచరింపఁగా నాదిమయో
గిని మెచ్చి దివ్యరూపం
బున నిలిచె స్విప్రుతలఁపుపొం దొనగూర్పన్. 81

ఉ. అత్తఱిఁ జాగి మ్రొక్కుచు ధనాఢ్యత వేఁడుట దప్పి యాత్మలోఁ
దత్తఱ మంది బ్రాహ్మణుఁడు తా నమరత్వము వేఁడినం గృపా
యత్తమనస్కయైన జగదంబిక యేకజనోపభోగ్యమౌ
క్రొత్తఫలంబు దెచ్చి యిది గొమ్మని యిచ్చిన వచ్చె నాతఁడున్. 82

క. వచ్చుట విని తన కెదురుగ
వచ్చినసతిఁ జూచి పిన్నవారలసేమం
బచ్చుపడ నడిగి యాపం
డిచ్చి యమర్త్యత్వ మిచ్చు నిది యని చెప్పెన్. 83

క. అనవుడు విని యతనికుటుం
బినియును దారిద్ర్య దుఃఖపీడిత యగుటం
దనపతిఁ గడు దూఱుచు ని
ట్లనియె మనస్తాపమున సిరాకరణముగాన్. 84

ఉ. అచ్చట మెచ్చుగాంచి యిట కర్థము దెచ్చెద వంచు నమ్మి ము
చ్చిచ్చున వెచ్చి పొట్ట కొక చేరెఁడు గంజియు లేక యాఁకటం
జచ్చియుఁ జావ మించుక విషంబయినం గొనిరాక దేవిచేఁ
దెచ్చితి విట్టిపండు విధి ద్రిప్పఁగ ఛాందసబుద్ధి దప్పునే. 85

క. కడుపునకుఁ గూడు గాసక
పడి మిడిమిడి మిడుకునట్టి బడుగున కియ్యా

అది యమరత్వంబేటికిఁ
గడు పిటఁ గాలంగఁ గంటఁ గాటుక యేలా.

క. గతి దప్పిన పనికేమని
పతి దూఱఁగవచ్చు నిట్టి ఫలమున నొక సం
గతి ధనము పడయవచ్చును,
మతిలో స్త్రీబుద్ధియనక మన్నింపఁదగున్.

మ. ధరణీకాంతునకైన నొప్పు నమరత్వం బింక నీవేగి యా
నరనాథుం గని దీని నిచ్చి బహురత్న స్వర్ణనిష్కోజ్జ్వలాం
బరభూషాది సువస్తువు ల్వడసి రమ్మా యంచుఁ బొమ్మన్న భూ
సురుఁ డేగెన్ ఫలహస్తుఁ డయ్యును *విహస్తుం డై నృపాస్థానికిన్.

శా. ఆవేళన్ రమణీమణుల్గొలువఁగా నాస్థానభూమి న్మఖ
శ్రీవెంపారఁగ నున్న భర్తృహరిధాత్రీనాయకుం గాంచి భూ
దేవుం డుత్సవ మంది యాదరముతో దీవించి యాపండు స
ద్భావంబొప్పఁగ నిచ్చి చెప్పె వరుసం దత్ప్రాప్తిసత్వంబులన్. 89

చ. బహుజనరక్షకుండ వగుపార్థివ నీక తగు న్ఫలం బను
గ్రహమునఁ బుచ్చుకొ మ్మనినఁ గైకొని భూపతి వేడ్కతో యశో
మహిమకుఁ బేరుగాఁ బసిఁడిమాడలుఁ బేర్చినపట్టుచీరలు
న్మహితములైన రత్నములు మన్నన నాతని కిచ్చి పుచ్చి తాన్. 90

క. నే నుండఁగ నిది నచ్చిన
నే నుండుట గడిఁది యిట్టినెలఁతుక గలుగ
న్నే నున్న నొప్పు నని తన
చేనున్న ఫలం బనంగసేనకు నిచ్చెన్. 91

---

*విహస్తుఁడు=చేయిలేనివాఁడు, వ్యాకులుఁడు.

సీ. ఆపొలంతియు దాఁచి యాపండుఁ దనతోడ
నూని కూడెడు మందఁడీనికిచ్చె
వాఁడును దనుఁ గోరి వచ్చి యాసాలలోఁ
గస పూడ్చునట్టి బానిసకు నిచ్చె
నదియును దనకోర్కి పదిలంబుగా మున్ను
తనకూర్చు పసులగోపునకు నిచ్చె
వాఁడును దనకుఁ దావలచి కొట్టములోని
పెండ యెత్తెడునట్టి ముండకిచ్చె
ఆ.వె. నదియు దానిరాక మొద లెఱుంగమిఁజేసి
పెండబుట్టిలోనఁ బండువెట్టి
కొంచు నింటి కేగుదెంచుచోఁ దెరువున
నరుగుచుండి భూమివరుఁడు గనియె. 92

క. కని దానిఁ బిలిచి యిదియే
యనువున నినుఁ జేరెఁ జెప్పు మనవుఁడు నాత
మ్మని మఱఁది పసులఁ గావం
జని యెడ విందెచ్చె ననఁగ జనవిభుఁ డలుకన్. 93

గీ. తొంటివిప్రుని బిలిపించి ధూర్త నీవు
తెచ్చియిచ్చిన ఫలమని తెల్పి ధనము
గొంచు నేగితి విది యెట్లు క్రొత్తయోరి
దీని కల్పినదనుడు నాద్విజవరుండు. 94

క. నే నిచ్చినదియె యిది మఱి
కానేరదు నన్నుఁ గల్లగాఁ జేయకుమీ,
యేనెపమున నిటుచేరెనొ
దీనిని శోధింపు వసుమతీవర యనినన్. 95

క. ఉల్లమునఁ గనలి ధరణీ
వల్లభుఁడుం దానిఁ బిల్చి వనితా యిది నీ
యిల్లేవెరవునఁ జేరెను
గల్లాడక చెప్పు*తప్పుఁ గాచితి ననియెన్. 96

మ. అనినం జెప్పకతీర దంచు నది నెయ్యం బొప్ప నాగోపుఁ జె
ప్పినఁ దన్మూలమునం గ్రమక్రమమునం బృథ్వీశ్వరుం డంతయు
న్విని దండింపక యాత్మ రోసి పలికె న్వేయింపుల న్సొంపులం
దనియంజేసిన నిల్చునే వనితచిత్తం బంచు నిందించుచున్. 97

ఆ.వె. కప్పురంపుఁగుదుటఁ గస్తూరి యెరువుతో
నుల్లి నాటి చందనోదకములఁ
బెంపిరేని దాని కంపుమాయని భంగి
నెంతయైన నిలువ దింతిమనము. 98

క. వనిత యొరుఁజూచి లోనగు
నన నిక్కము పతియు దోడియతివలుఁ బరులుం
గని విని యెగ్గొనరించెద
రని మానిన మానుఁగాక యడ్డము గలదే. 99

సీ. పదరి మెక్కుచన్నులు మాంసపుముద్దలు
హేమకుంభములకు నెక్కుడనుచు
దూషితమూత్రపురీషదుర్గంధ మౌ
జఘనంబు కరిశిరస్సదృశ మనుచు
జిలిబికిం బుసులకుఁ జీమిడికిని బుట్ట
యైన మొగంబు సుధాంశుఁ డనుచుఁ

*నిన్ను గాచితి

గండలుఁదోలు* బొక్కలుగూడఁ బొదివిన
యాకృతిపసిఁడిసళాకయనుచుఁ
•దెగడైన పెదవి త్రేప దమృతమని
కవులు వొగడఁ జేసు గలిగెఁ గాక
తత్త్వ మెఱిఁగి యిట్లు తలపోసి చూచిన
నింతి రోఁత కెల్ల నిల్లుగాదె. 100

చ. అనుచు బహుప్రకారముల నంగనల న్మది రోసి యాత్మకా
మినులఁ బరిత్యజించి యిఁక మీమతి కింపగువారిఁ జేసికొం
డని సెలవిచ్చి రాజ్యసుఖమంతయు మాని విరక్తచిత్తుఁడై
యనుజుని విక్రమార్కునిఁ బ్రియంబుగఁ బిల్వఁగఁ బంచి యిట్లను౯ 101

క. మనతండ్రి సౌరమంత్రం
బునఁ దపమొనరింపమెచ్చి మున్నర్కుఁడు దాఁ
దనయుఁడ నై పుట్టెదఁబొ
మ్మని నీవై పుట్టె విక్రమార్కుం డనఁగ౯. 102

ఆ.వె. సర్వలక్షణముల సంపూర్ణుఁడవు నీవు
భట్టి మంత్రి గాఁగఁ బ్రజలనెల్ల
నేలు మంచు ముద్ర యిచ్చి దేశాంతరం
బరిగెఁ బరమయోగిచరితమునను. 103

క. అన్నరనాథుఁడు విడిచిన
యన్నులు మున్నూఱు నతని యనుమతి గలుగ౯
మున్నూఱుఁ జేసికొని ధర
మున్నూఱుకులం బనంగ మొనసిరి సిరుల౯. 104

---

*•డొక్కలు •ఉమియు పెదవిత్రేగుదమృతంబటంచును— నెగడైన పెదవి— 1. మిగుల౯.

-: విక్రమార్కుని చరిత్రము :-

శా. రాజ్యం బేలుచు విక్రమార్కుఁడిట సంరంభోచితోజ్జృంభణ
ప్రాజ్యప్రాభవభసంభృతద్విపహయప్రారంభసైన్యంబుతో
సజ్యం బైనధనుర్బలంబు కలిమిన్ సామంతులన్ గెల్చి త
త్త్యాజ్యుండై ధనధాన్యలక్ష్మిఁ బరఁగెం బుణ్యం బగణ్యంబుగన్. 105

క. అతఁడు మహాకాళున కా
తత మగుతప మాచరించి తన కమరత్వ
స్థితివేఁడిన నరులకు *నిది
గతిపడ దొండడుగు మనినఁ గడిఁదిగ మఱియున్. 106

క. ఒకదివసం బెక్కుడుగా
నొకయేఁ డగు పిన్నపాప కుదయించిన బా
లకుచేతఁ గాని తాఁ జా
వకయుండను వేఁడికొనిన వర మతఁ డిచ్చెన్. 107

వ ఇట్లిచ్చి. 108

క. వెయ్యేఁడులు రాజ్యసుఖం
బయ్యెడుఁ బొమ్మనిన దేవునానతి నారా
జియ్యకొని వచ్చి భట్టికి
నయ్యానతి క్రమముఁ జెప్ప నతఁడును మఱియున్. 109

క. నే మఱియును నొకవేయేం
డ్లీమహి యేలంగ నీకు నిచ్చెద నని భ
ఞ్ఞామార్గి వగుచు రాజ్య
•వ్యామోహం బర్ధవర్ష మడఁచుము చాలున్. 110

---

*నీగతిపడదు, •వ్యామోహం బడియనర్ధవర్షము చాలున్

ఆ.వె. ఆఱునెలలు నగరియందు నిల్వుము మీఁది
యాఱునెలలు యోగివై చరింపు
పురి సహస్రవర్షములు చెల్లుఁ బౌన్నాళ్ల
నున్న వేయుఁ జెల్లుమండు ననియె. 111

క. తద్వచనము నిజహితముగ
హృద్వనజములోఁ దలంచి యిల యెల్లనుపా
యద్వయమున నరయుచు భూ
భృద్వల్లభుఁడేలెఁ బ్రజలు ప్రియమందంగన్. 112

వ. అంతనొక్కనాఁడు 113

సీ. ఒకజోగి యతనిఁ గాటికిఁ దోడుకొని చని
బేతాళురప్పించి ప్రీతినునిచి
వేలిమిచేసి తా విపరీతగతిఁ బొందె
బేతాళుఁ డారాజు పెంపు మెచ్చి
యెడరైనఁ దలఁపుమీ యే వచ్చి పనులెల్లఁ
జేసెద మఱి యష్టసిద్ధులొందు
ననిపోయె బ్రహ్మోదులును మీఁద విద్యాధ
రాధిపత్యం బగు ననుచుఁ జనిరి

ఆ.వె. భూవిభుండు మగుడఁ బురమున కేతెంచి
సప్తసంతతులను సత్రములను
సంతతాధ్వరములఁ గౌంతేయుగతి శక
కర్తయై ధరిత్రిఁ గీర్తినెఱపె.* 114

ఉ. సఙతదానధర్మగుణచారువిచారుడు వైరివారదృ
క్కజ్జిలమార్జనప్రథమకారణచారుకృపాణపాణి వి

---

*గీర్తి నిలిపె

ద్వజ్జనబృందవందిజనతాజలజార్కుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున నయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్ 115

వ. తొల్లింటి కాలంబున. 116

క. విశ్వామిత్రుఁడు తప మతి
శాశ్వతముగఁ జేయు టెఱిఁగి శంకించి యమ
ర్త్యేశ్వరుఁడు కొలువులోఁదన
విశ్వాసము*గలుగునట్టి వెలఁదులకనియెన్. 117

క. ఓయూర్వశి యోరంభా
మీయిద్దఱిలోన నొక్క మెలఁతుక నటనో
పాయంబునఁ జిక్కఁడి ముని
సేయుతపంబునకుఁ గీడు సేయఁగవలయున్. 118

చ. అన విని పాత్ర నీయెదుర వాడిన నిద్దఱిలోన దీనిచేఁ
బని యగు నంచు నీ వెఱిఁగి పంపుము నావుడు నట్లకాకలెం
డనవుడు నాఁడు రంభ తగ నాడినఁ జూచి ప్రహృష్టచిత్తుఁడై
యొనర ననుక్రమంబునను నూర్వశి యాడిన నట్ల మెచ్చుచున్. 119

క. వారల యెక్కువతక్కువ
లేరీతుల నెఱుఁగ లేక యింద్రుం డిఁక నె
వ్వారెఱుఁగుదురో యని బృం
దారక మునివరుల నడుగఁ దత్సభలోనన్. 120

క. సారదయామృతమతి యగు
శారదకృప వడసి యతివిశారదుఁ డగునా,
నారదుఁ డుపమితశారద
నీరదుఁ డావిక్రమార్కనృపతిం జెప్పెన్. 121

---

*విశ్వసనము ,దయ్యెన్

ఉ. అర్కునిమూర్తి సర్వకళలందుఁ బ్రవీణుఁడు సంగరస్థలిం
గర్కశరాజలోకలయకాలుఁడు దానవినోది పాపసం
పర్కవిదూరుఁ డార్తపతిపాలనశీలనశాలి విక్రమో
దర్కుఁడు విక్రమార్కుఁడిట కాతనిఁ బిల్వఁగఁ బంపు నావుడున్. 122

మ. మునివాక్యంబున నింద్రుఁ డిట్టిగుణధాము న్విక్రమాదిత్యుఁ దో
డ్కొని రమ్మా యని పంపె మాతలి నతండుం దేరునం వేగప*
చ్చనిగుఱ్ఱంబులఁ బూన్చి కొంచు నధికోత్సాహంబుతో మింటిపైఁ
జని యుజ్జైనికి డిగ్గి యచ్చట నృపాస్థానంబు వీక్షించుచున్. 123

మహాస్రగ్ధర—
సభలోనం గాంచె వర్ణాశ్రమజనపరిరక్షాసమారంభలీలా
శుభనిత్యాచారు లోకశ్రుతవిశదనిజస్ఫూర్తిసత్కీర్తిలక్ష్మీ
విభవాకృష్టార్థిజాతాభినుతవితరణాన్వితహస్తప్రభావ
ప్రభవశ్రీరమ్యు ఖడ్గప్రకటితజయసంపర్కు నవ్విక్రమార్కున్. 124

మ. కని యింద్రుండు డిదె నిన్నుఁ బిల్వఁబనిచెన్ క్ష్మాపాల విచ్చేయుమా
యనిన న్గొబ్బున లేచి మాతలికి నాహ్లాదంబుగా నాదరం
బొనరం జేసి మహోత్సుకత్వమున నాయుర్వీశుఁడుం గామ్రుఁడో
యన వచ్చెన్ హరితాశ్వరత్నయుతదివ్యస్యందనారూఢుఁ డై. 125

వ. వచ్చి కామధేను కల్పతరు చింతామణీ సంతతనివాసం బై యమరు నమ
రావతీపురంబు సొచ్చి తేరు డిగ్గి మాతలియునుం దోడరా నమరకిన్నర వి
ద్యాధరయక్షరక్షోనికరపరివారుండును దిక్పాలముకుట తటఘటిత మణిగ
ణకిరణారుణిత చరణకమలుండును నప్సరోహ స్తచామీకరదండచారు చా
మరవ్యజనవీజ్యమానుండును నై సుధర్మాసభామధ్యంబునం దారకితతారా
పథమధ్యభాగంబునఁ దారాగణపరివృతుండై వెలుంగు చంద్రునిచందంబు

*వేయుపచ్చని.

న నందం బగు బృందారకేంద్రునిం గని ప్రణమిల్లిన నతనిం గౌఁగిలించు
కొని గారవించి దీవించి యాసన్నమణిమయసింహాసనంబుపై సుఖాసీనుం
జేసి కుశలం బడిగి సురపతి నరపతి కిట్లనియె. 126

ఆ.వె.ఊర్వశియును రంభయును నాడఁగా మాకుఁ
దారతమ్యమెఱుఁగఁ దరముగాదు
సర్వకళలయందు జాణవు నీ వండ్రు
దీని నిర్ణయింపు మానవేంద్ర. 127

ఆ.వె.అనుచుఁ బలికిమఱియు సాంగసంగీత వా
ద్యాదికృత్యములకు ననువు మెఱయఁ
గడఁగి నిలువుఁ డనుచు గంధర్వులకుఁ జెప్పి
మున్ను రంభనాడుమన్ననంత. 128

శా. గంధర్వ ల్పదునాల్గు దోషములు దక్కం దాళమానంబులన్
గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిం*గావింపఁగా వాద్యముల్
ధింధింధిక్క ధిమిక్కతక్క ధికతోంధిక్క త్తకోఝుంకిణిం
ధింఘాంఝుంకకుఝుకుక్కధిగ్గిగుడధాధీయంచు మ్రోసెన్వెసన్. 129

క. జంభారియెదుర నాట్యా
రంభమ్మున నూర్వశీపరాజయకృతసం
రంభయు నూరుద్వయజిత
రంభయునై రంభ నిలిచె రంగస్థలిపై. 130

క. సురపతిపంపునఁ గూడిన
మురజధ్వను లభ్రశబ్దములుగా శృంగా
రరసము గురియఁగ నాడెను
దిరుపుల మురిపముల మెఱపుఁదీగయుఁబోలెన్. 131

---

* ధ్రువాదిబంధసరణిం.

వ. ఇట్లు రంభ యాడినం జూచి యానాకలోక భూలోకనాయకులు మఱునా(
డూర్వశి కవసరం బిచ్చిన నదియును సంగీత శాస్త్రానుసారంబుగా*నిలిచి
విలక్షించుచు— 132

క. తనువున గీతాలంబన
ము ను జేతుల నర్థవ్యుషితమును నేత్రయుగం
బున భావము( బదముల( దా
శనిర్ణయమ్మును మెఱయ(గలాస్యము నెఱపెన్. 133

క. సురకామిని తన నయనము
లరుదుగ( దలచుట్టివచ్చు ననుట నిజముగా(
దిరుగుచు( బరిమండలితాం
బరపల్లవయైనటించె మరుగొండుగు క్రియన్. 134

క. ఈక్రియ నూర్వశి యాడిన
విక్రమఘను( డిదియె మఱియు వెరవరియనినన్
శక్రుడు మర్మముదెలుపుమ
యేక్రమమున దీని నిర్ణయించితి వనినన్. 135

ఉ. నావుడు నాత( డిద్దఱును నాట్యమున న్సరివత్తు రిందు శా
స్త్రావగతప్రసంగముల సాంగముగా నిది యాడె గాన ని
ష్ఠే వివరించి యూర్వశియు యెక్కుడుగా( గయికొంటి నన్న న
ద్దేవు(డు మెచ్చి యాతనికి దివ్యవిభూషణ మిచ్చి వెండియున్. 136

సీ. ప్రభల నుప్పొంగు ముప్పది రెండు బొ
మ్మలు నన్ని వాకిళ్ళ( బెంపడరుచున్న
నవరత్నఖచిత మై వివిధ సోపానమై
భాసురం బైనసింహాసనంబు

* సంగీతప్రసంగానుసారంబుగా.

మెచ్చుగా నిచ్చిన మెయికొని ప్రణమిల్లి
దేవేంద్రు వీడ్కొని తేరిమీఁద
నిడికొని యుజ్జని కేతెంచి వేడ్క సిం
హాసనంబెక్కి యా యవనివిభుఁడు*

ఆ.వె. సిద్ధులెనిమిదియును జేకూరఁ బగతుర
పేరడంచి యాజ్ఞ పెంపుమీఱ
నేకవీరుఁడై యనేకవర్షంబులు
ధరణి యేలెఁ బుణ్యచరితుఁ డగుచు 137

శా. సత్పాత్రప్రతిపాదితార్థుఁ డయి రాజ్యం బుర్విలో సర్వసం
పత్పూర్ణంబుగఁ జేయుచుం బ్రజల భూపాలుండు పాలింపఁగాఁ
దత్పూర్వార్జితపుణ్యభోగముల కుత్సార్యత్వసంపాదులై
యుత్పాతంబులు పుట్టె నుజ్జయినిలో నుల్కాదిలక్ష్యంబులై. 138

క. అట్టివి గని జనపాలుఁడు
భట్టిం బిలిపించి నీవు భావజ్ఞుఁడ వీ
పట్టున నేతెఱఁ గగునో
యట్టితెఱంగెఱుంగు మనిన నతఁ డిట్లనియెన్. 139

ఆ.వె.పడగ నేలఁ గూలెఁ బట్టపేనుఁగు వ్రాలె
మేడఁ గాకికదుపు గూడి యఱచె
నిన్న వారువముల కన్నుల నీరొల్కె
దీన నీకుఁ గీడు తెల్ల మింక. 140

క. ఇది నిజ మనవుడు నతఁ డే
కదినాధికవర్షయైన కన్యకు సుతుఁ డై

---

* నిడికొని యుజ్జయినికిఁ దెచ్చి యొకవేళ నమ్మహా సనమెక్కి యవని విభుఁడు.

ట్లుదయించు నాకుఁ గీడె
ట్లొదవున్మదిలోన బెగడకుండుము*భట్టీ. 141

క. జమునికినెరగోసెద‡ నా
క్రమమెఱుఁగవె యనుడు నతఁడు కమలజఘటనా
సమయం బైన నసంభా
వ్యము లైనను సంభవించు నది యెట్లనినన్. 142

క. ఇది మానిసి యిది సింగం
బిది దేవత యను వివేక మెడలఁగ బలసం
పద నుక్కుఁగంబమున హరి
యుదయింపఁడె దైత్యవరుని నుక్కడఁగింపన్. 143

క. ఏకద్విత్రిచతుఃపం
చాకృతికృతసంఖ్యముఖుల కవిజేయుండై
కైకొనిన తారకాసురుఁ
బోకార్పఁగ షణ్ముఖుండు పుట్టుట వినవే. 144

మ. వరపుత్రుం డమరేంద్రవైరి పరిఖల్వారాశి యాలంక దా
గిరిదుర్గం బసురు ల్బలంబులు దశగ్రీవుండు రా జిట్లు బం
ధురమౌ రాజ్యము జాలు దేలగిల మిత్రు ల్పుత్రులం గూడఁగా
నరులు న్వానరులుం గొనం దలఁచి చన్నం జేటు వాటిల్లదే. 145

ఉ. కావున నిట్టి బాలకుఁడు గల్గుట తథ్యము నీకు నిష్టలౌ
వేవులవారిచేతఁ బృథివీస్థలిలో నరయింపుమన్నఁ దా
నావచనంబు లియ్యకొని యాత్మహితుం దలపోసి విక్రమా
ర్కావనివల్లభుండు నెడ రంచుఁ దలంచెఁ బిశాచముఖ్యునిన్. 146

---

* బెదరకుండుము. ‡ నొరగోసెద.

క. ఆతలఁపున వచ్చిన నతఁ
డాతెఱఁగెఱిఁగించి యరయ ననిపిన పిదపన్
బేతాళుఁడు పాతాళము
భూతలమును నరసి వచ్చి భూపతితోడన్. 147

సీ. జననాథ! నీవు పంచిన నెల్లచోటులుఁ
దిరిగి ప్రతిష్ఠానపురములోనఁ
గుమ్మరి యింట లేఁగొమ్మముందట మంటి
బలములతో నాడెడుబాలుఁజూచి
యెవ్వరివాఁ డనునెడ నొక్కవిప్రుండు
తనకూఁతుకొడుకు తజ్జనని యిద్ది
యేఁటిపైనొకదినంబేగుచో [1]నాగేంద్రుఁ
డీపాపఁగూడిన[2] నితఁడుపుట్టె

ఆ.వె. దీనికారణంబు దేవరగాక యెం
దెవ్వఁ డెఱుఁగ ననుచు నిట్లు పలికె
నింక రాజ్యభోగ మింకకుండఁగ నీవు
సాహసంబు సేయు సాహసాంక. 148

మ. అని చెప్పన్ విని యావలం దెలిసి సువ్యక్తంబుగా నాత్మనా
శనమూలం బని నిశ్చయించుకొని యాశ్చర్యంబుగాఁ దొల్లి చే
సిన కార్యంబులఁ దోడు వేఁడక మదిం జేటొప్పటులం దోడువేఁ
డినఁ గష్టం బగునంచు దాఁగనియె ధట్టిన్నిల్పి తానొక్కఁడున్. 149

ఉ. ఆ నరనాథుఁ డిట్లు చని యాయుధ మొక్కటి తోడుగాఁ బ్రతి
ష్ఠానపురంబు దగ్గఱునెడం జతురంగబలంబు లన్నియున్

1. జేగిరి. 2. గోరిన

వాని పిఱుంద నేగి నలువంకల నిల్వఁగ నందుఁ గొందఱా
లోనికిఁ జొచ్చి యావిజయలోలుని బాలునిఁ బోరఁ బిల్చినన్. 150

క. నాగేంద్రుఁడు జీవనవి
ద్యాగుణ మగు మంత్రశక్తిఁ దత్కృతములనొ
నాగాశ్వరథ భటాదుల
కాగతిఁ బ్రాణంబు లిచ్చి యాత్మజుఁ బంపెన్. 151

గీ. ఆకుమారుఁడు శాలివాహనుఁ డనంగ
నెగడి నగరంబు వెలువడి నిలుచునంత
శేషు పంపున వచ్చి యాశీవిషములు
విక్రమార్కుని మూఁకల నాక్రమించె. 152

ఉ. సర్పము లీక్రియన్ భటులఁ జంపిన నాఁతఁడు వారిప్రాణముల్
గూర్పఁదలంచి వాసుకికి ఘోరతపం బొనరించి యయ్యెడన్
నేర్పొకయింతలేక యది నిష్ఫలమైనఁ గలంగియున్ భుజా
దర్పము తోడుగాఁగ నిది దైవవశంబని వచ్చెఁ బోరికిన్. 153

క. అతఁ డిటు వచ్చినఁ దక్కిన
హితులును సైన్యములు గూడ నేతెంచినఁ ద
చ్చతురంగ బలము పైఁబడఁ
గుతలము పదహతుల నతల కుతలంబయ్యెన్. 154

వ. ఇట్లు తేజోవిక్రమార్కుం డగు విక్రమార్కుని సేనలు శేషప్రసాదవిశేష
శాలివాహనుం*డగు శాలివాహను బలంబులుం దలపడి పోరు నవస
రంబున. 155

సీ. కాలుబలంబులు గ్రాహసంగతిఁ గ్రాలఁ
దురగముల్ తరఁగల కరణిఁ జెలఁగఁ

* శాలిభానుండగు.

దేరులు కలముల తెఱఁగున దిరుగఁగఁ
గరులు మైనాకాది గిరులఁ బోల
నరిగ బిళ్ళలు కమఠాకృతి మెఱయంగ
నడిదంబులును మీల ననుకరింపఁ
జామరంబులె సితచ్ఛత్రంబులును శంఖ
ఫేన సాదృశ్యంబు పేర్మి మెఱయఁ
గీ. బడగ లుత్పతత్ ఫణికుల భాతి వెలయ
రుధిరధారలు విద్రుమ రుచిఁ దనర్పఁ
బటహరవములు జలఘోష భంగిఁ బొంగ
ముద్రమీఱిన రౌద్రసముద్ర మొప్పె. 156

ఉ. అత్తఱి వీరు లేర్పుక్రియ నార్చుచు వత్తురు వచ్చి మూఁకలోఁ
జొత్తురు చొచ్చి శత్రువులచొప్పు లడంతురు వారి బీరముల్
మెత్తురు మెచ్చిమార్కొనుచు మెల్పున గెల్పున భిన్నభిన్నమై
చత్తురు చచ్చి యచ్చరల సన్నిధినిల్తురు గెల్తుకుద్ధతిన్[1]. 157

క. అయ్యెడఁ దెగియెడి వీరుల
నెయ్యమున వరించు వేల్పు నెలఁతలు దమలోఁ
గయ్యం బడువఁగ శూరుల
కయ్యము దివిఁజూడ నాఁడుఁ గయ్యంబయ్యెన్. 158

సీ. మ్రొగ్గెడు గజ ఘటంబుల నుబ్బి తేఱెడు
రక్తంబు మద్యపూరంబు గాఁగ
వారక తెగినట్టి వీరుల పునుకలు
కొమరారు పానపాత్రములు గాఁగ

1. కల్తురందఱన్.

నందందు వాచవికందువ లగు గుండె
　　కాయలన్నియు నూరుఁగాయలు గను
గండలు తక్కిన కజ్జాలుగాఁ గూర్చి
　　డాకినీగుణము లనేక రుచులఁ

గీ. బొట్ట కొలఁదిగఁ ద్రావుచు భూతములకుఁ
జవులు సూపుచు నేఁటి యుత్సవముఁబోల
నొండు లేదని పొగడుచు నుల్లసిల్లి
సోలి యాడంగఁ జొచ్చె నచ్చోటఁ గలయ. 159

క. ఆ వేళఁ జిత్రముల వీ
రావేశము పొదలఁ బోటులా, డఁగఁ దమకున్
దైవసహాయము లేమిని
భూవల్లభుసేన లెల్లఁ బొలియఁగఁ జొచ్చెన్. 160

ఆ వె. రథము లంత వితథ రథికసారథులయ్యె
గుఱ్ఱములును బాటి గొట్టెలయ్యెఁ
గాలుబలము లపుడు కాలుబలములయ్యె
గజము లెల్లఁ బోర నజములయ్యె. 161

క. కాలము చేరిన వానికి
నేలయుఁ బగ యనఁగ మింట నిలిపిన బలముల్
బాలునిఁ గూడుక యా భూ
పాలుని సైన్యముల నేలపాలుగఁ జేసెన్. 162

శా. శుండాలాది బలంబు లిట్లరిగినన్ క్షోణీశ్వరుం డొక్కఁడుం
జండీశుండును గాలకర్మము నిజేచ్ఛం ద్రోవలేఁ డంచు ను
ద్దండాస్త్రౌఘముచేత శాలివాహనుని చేతన్ దండకాష్ఠాహతిన్
ఖండీభూతశిరస్కుఁడై యెగసి మగ్గంజెల్లె నుజ్జేనిలోన్. 163

క. ఆతని దేహము వెలువడి
యాతత మగుదీప్తి నంబరాంతంబున ను
ద్యోతించుచు నెగసి మహా
జ్యోతిరూపంబు వోయి సూర్యునిఁ గలసెన్. 164

ఆ.వె. ఇట్లు విక్రమార్కుఁ డీల్గిన విజయుఁడై
శాలివాహనుండు లీలతోడఁ
బౌరు లెల్లఁ బొగడఁ బ్రతిష్ఠానమున మహా
రాజనంగఁ జేసె రాజ్యమచట. 165

సీ. అట నుజ్జయినిలోన నందఱు పౌరులు
నడలఁగా భూపాలు నగ్రమహిషి
యేడువకున్న కన్నెఱఁగి మంత్రులు వచ్చి
నీవు గర్భిణి వౌటఁ జావఁ దగదు
వలదన్న నా ప్రభావతి మంత్రివరుల సం
బోధించి యీ రాజ్యమును భుజించు
నీ తగవును జెల్లె నిత్తఱిఁ గడుపులో
పాపని బుచ్చి మీపాలనిడుదుఁ

గీ. గొనుఁ డనుచు వీరపత్ని గావునఁ గడంకఁ
బొట్ట వ్రచ్చియు శిశువును బుచ్చియిచ్చి
యగ్ని నివసించి దివికేగి యమర సతులు
గొలువ నలరెడు నిజనాథుఁ గూడుకొనియె. 166

క. ఆ పట్టనమున మంత్రులు
నా పాపను బెంచుకొనుచు నాతని రాజ్య
శ్రీపతిఁగా నొనరించిరి
భూపాలన మాత్మబుద్ధిఁ బురికొనుచుండన్. 167

క. ఇలలోఁ దండ్రి బలంబును
జలమును మెఱయించుకొని ప్రశాంతుఁ డనంగా
వెలయుచు నతఁడొక కొలఁదిని
జెలువందెను మడుఁగు పట్టు చెలమయుఁ బోలెన్. 168

చ. అనువుగ మంత్రులాతని మహాసన సంస్థితుఁ జేయఁ బూనినం
గని యశరీరి యీపడుచుఁ గార్యము లేటికి వీఁడు దీనినె
క్కిన నగుఁబాటు గాదె తలఁగించి మహిస్థలిఁ బాఁతి పుచ్చుఁ డా
యనిన నమాత్యులెల్ల వెఱఁగందుచు నమ్మణిభద్ర పీఠమున్. 169

ఆ.వె. పుణ్యభూమిఁ బాఁతి పుట్టగాఁ గట్టించి
కొంతకాల మున్న యంతలోన
దైవవశము కొలఁదిఁ దద్దేశమెల్లను
హానిఁ బొందుచఖిల మయ్యె[1] మిగుల. 170

సీ. అచ్చోట నొకవిప్రుఁ డగిసెలు లంకలు
గోధుమల్ జొన్నలుఁ గోరి విత్తి[2]
పిట్టలఁద్రోల[3] నా పుట్ట పట్టున మంచె
గావించి యది యెక్కి త్రోవవారి
నాచేనుఁ జొచ్చి తిన్నన్ని జొన్నలు గోదు
మలు పిసికిచ్చుగ నలఁచి తినుఁడు
అని పిల్వ నమ్మివచ్చిన వారి కవి వెట్టఁ
దా దిగి వచ్చి యందఱ నదల్చి
గీ. పరుల సొమ్ముల కిట్లాస పడఁగఁ దగునె
యనుచు వారల వెడలంగ నడిచి తిరుగ

1. హానిఁబొందుచు లయమయ్యె. (మయిలమయ్యె-చిన్నయసూరిపాఠము)
2. పెట్టి. 3. నార్చ.

మంచె యెక్కి రాజసమున మరలఁ బిలుచు
వచ్చిరేనియు దిగివచ్చి వారిఁ ద్రోలు. 171

క. ఇవ్విధమునఁ జని మగుడుచు
నవ్విప్రుని వెఱ్ఱి యనుచు నందఱుఁ దమలో
నవ్వుచుఁ గనుకనిఁ బోవఁగ
నవ్వార్త యెఱింగి భోజుఁడట కరుదెంచెన్. 172

క. వచ్చిన నృపు భటులంగని
యచ్చటఁ దనమంచె నున్నయాతఁడు చేలో
మెచ్చయినవి భక్షింపుఁడు
విచ్చలవిడి విడియుఁ డనిన విడిసిరి వారల్. 173

ఉ. తొల్లిఁటి యట్లతండు డిగి దూఱుచు భోజునిఁ జేరి యక్కటా
యిల్లొక సర్వమై తినిన నిష్టుఁడు వైరికి సత్తు విచ్చినం
దల్లి విషంబు వెట్టినను దండ్రి తనూజుల నమ్మినన్ మహీ
వల్లభుఁ డొల్చుకొన్న మఱి వారల కెవ్వరు దిక్కు భూవరా! 174

క. బలహీనులకును నృపతియ
బలమనఁగాఁ బేదఁ జెఱుపఁ బాడియె యిది నీ
బలములచేఁ బొలియించితి
వెలుఁగే తనచేను మేయు విధ మిటనయ్యెన్. 175

క. గతి గానక యిది యొక సం
గతి బ్రదికెద మంచు నుండఁగా ధర్మముఁ ద
ప్పితి "బ్రహ్మస్వం విషము
చ్యతే" యనుచుఁ బెద్దలెల్లఁ జదువుట వినవే. 176

క. బలవంతుల మని విప్రుల[1]
ఫలభోగంబులకు నాసపడుదురె మును వి
ప్రులకిచ్చిన భూములు దమ
చెలియండ్రని తలఁపవలదె క్షితిపాలురకున్. 177

ఆ.వె. అనుచు విభుఁడు చోద్యమంది తానమ్మంచె
యెక్కి తుష్టిపుష్టిఁ జొక్కి తలఁచె
దాన ధర్మగతులు దప్పక రాజునై
దీనజనుల సిరులఁ దేల్పఁ దగదె 178

క. వెడఁగు లగుజనుల వృద్ధుల
బడుగులనుం బ్రోవలేని బ్రదుకొక బ్రదుకే
యడిగెడు వారలు గలిగినఁ
బుడమంతయు నిచ్చి వారిఁ బుచ్చెద వేడ్కన్. 179

చ. అనుచు ముదంబునం బలికి యంతటఁ దానె యెఱింగి పల్లటి
ల్లిన హృదయంబు నిల్పికొని లెస్సనిధానము గల్గఁబోలు వి
ప్రుని గుణ మిట్లు గా దిచట భూమిగుణంబని నిశ్చయించి యొ
య్యన దిగివచ్చి యెంత కొలు చయ్యెడు బ్రాహ్మఁడ! చెప్పు మావుడున్.

శా. నాకుం జూడఁగ నూఱు పుట్లగు నరేంద్రా! విష్ణురూపంబవౌ
నీకుంజూడఁగ నెన్ని పుట్టులగునో నీవే కటాక్షింప న
స్తోకంబౌ సిరి గల్గదేయనిన సంతోషించి వేయిచ్చి మం
చాకీర్ణంబగు పుట్టఁగూల్చి యొక నిల్వాక్రిందఁ ద్రవ్వించినన్. 181

-: భోజరాజు సింహాసనమును త్రవ్వితీయించుట :-

క. భోజదృగంభోజగ్రహ
రాజాకృతి నురగరాజ రాజితచూడా

1. పైబడి

రాజిత రత్నప్రభలను
తేజఃపుంజంబు దోఁచి దిక్కులు వెలుఁగన్. 182

ఆ.వె. రత్నగర్భపేరు ప్రకటించునది యొక్క
రత్నసానుమూల రత్నచయము
గంటిలేని మానికంబుల గని యొక్క
నాఁగ నవ్వేలుంగు వీఁగఁ బాఱె. 183

సీ. అందు నానారత్న సుందరప్రాంతమౌ
చంద్రకాంతాంచిత స్థలము కలిమి
బెరయు ముప్పదిరెండు పిల్లగద్దియల కా
భరణంబులౌ హేమపాత్రములను
రత్నదీపమ్ములు రమణఁ జేతులనున్న
పసిఁడి బొమ్మలును ముప్పదియురెండు
నింపైన నృపు నివాళింపు సొంపొందంగఁ
దత్సంఖ్య మణి మయద్వారములను

ఆ.వె. గలిగి నలుదిక్కు లన్ని చేతుల వెడల్పు.[1]
చాపమాత్ర సమున్నతి నేపుమిగుల
విక్రమాదిత్యు లక్ష్మీనివేశ కాంతి
నంతఁ గనుపట్టె దివ్యసింహాసనంబు. 184

క. తద్రూపముఁ గని నృపుఁడు ద
రిద్రుఁడు ధనరాశిఁగన్న రీతిం బ్రముదో
న్నిద్రితుఁడై తిలకింపఁగ
భద్రాసన మద్రిభంగి బరువై తోఁచెన్. 185

వ. తత్కారణం బెఱింగి మంత్రి యిట్లనియె. 186

1. కలిగి నల్గడ నాల్గుచేతుల వెడల్పు.

క. అరుగరె యయాతి పృథు గయ
భరత సుహోత్రాంబరీష భార్గవ శిబి సా
గర రంత్యనంగ రాఘవ
మరుద్దిలీప శశిబిందు మాంధాత లిలన్. 187

ఆ.వె. వారిలోన నెట్టివారి సౌమ్మో యిది
పెద్దగాలమయ్యెఁ బృథివినణఁగి
దీని వెడలఁ దివియఁ బూనిన యప్పుడు
భూతతృప్తి వలయు భూతలేంద్ర! 188

క. అనవుడు విభుఁడది చేయుద
మని గొఱియల జెర[1]పువెట్టి యనువగు బలిభో
జనముల నసురులు సురలును
దనియంగా భూతతృప్తి తగనొనరించెన్. 189

ఆ.వె. దీనఁబొంగి భటులు దివ్యసింహాసనం
బెగయ నీడ్వఁ దాన యెగసి వచ్చె
మంత్రిఁ జూచి రాజు మంత్రీంద్ర! నీ బుద్ధి
లావుకలిమి నిట్టిలాభమయ్యె. 190

ఉ. మంత్రము లేని సంధ్యయును మౌనము లేని తపంబు వేదవి
త్తంత్రము లేని యాగముఁ బదజ్ఞత[2] లేని కవిత్వము న్నదా
తంత్రులు లేని వీణయును దానకరాగము లేని గీతమున్
మంత్రులు లేని రాజ్యము సమానములిన్నియు వ్యర్థకార్యముల్. 191

వ. అని కొనియాడిన నిది మంత్రిప్రశంసావసరంబని యమ్మంత్రివరుండు స్వార్థంబును యథార్థంబునుగా నిట్లనియె. 192

---

1. చెరువు 2. బుధజ్ఞత.

సీ. జూదరి సత్యంబుఁ జోరుని ధర్మంబు
సరసుని కోపంబు సవతిపొత్తు
బాషండు మతమును బ్రాహ్మణు కలహంబుఁ
దులువ సంగడమును ఖలుని తపముఁ[1]
గులటల భక్తియుఁ గోమటి నిజమును
బణ్యాంగనలప్రేమ పంచ బిరుదు
బగతుర సైరణ యెగచు వైరాగ్యంబుఁ
బేద పెద్దఱికము వాది ధనము

ఆ.వె. నధమ సంశ్రయంబు నైంద్రజాలికమును
బొమ్మ సొమ్ము[2] మునుఁగ కొమ్మపట్టు
మంత్రిలేని రాజ్యమహిమయు నావేళ
సుస్థిరములు పిదప నస్థిరములు. 193

ఆ.వె. మంత్రశక్తి నాత్మ మఱి పెట్టిగా నుగ్ర
చండవిష మడంచి దండి గలిగి
యర్థమొదవ భూపుఁ డను పాముఁ బట్టి యా
డించు మంత్రి గారడీని కరణి. 194

కం. కనియుం గానక యిచ్చలఁ
జనఁ జూచినఁ బోవనీక జనపతిఁ గరి చా
డ్పునఁ బట్టి యంకుశముగా
ననువగు పనిఁ ద్రిప్పు మంత్రి యాధోరణుఁడై. 195

ఆ.వె. కావఁ ద్రోవఁ గర్త గావునఁ దనమాట
త్రోవ నలవికాదు త్రోవ యెఱిఁగి

---

1. తగవు. 2. గొడ్డుసొంపు.

యాడు మంత్రిమాట లాదరించెడివాఁడె
మేదినీశుఁడంద్రు వేదవిదులు. 196

మ. నరనాథుండు సమస్తమైన జనులన్ "రాజ్ఞాం ప్రజాపాలనం
పరమో ధర్మ" యనంగ నీపలుకుల న్యాయజ్ఞుఁడై యేలఁగా
నరులందెవ్వరు నాజ్ఞ మీఱఁ జన దన్యాయప్రవృత్తిక్రియా
పరుఁడై ధర్మముఁ దప్పఁజేయుపనిఁ ద్రిప్పంజెల్లుఁ దన్మంత్రికిన్. 197

కం. జననాథుఁ డనపరాధం
దునుమఁగ సెలవిచ్చి హితుల దొరల మనవులన్[1]
వినకుండినఁ దన్మంత్రికిఁ
దననేర్పున నతనికీడుఁ దప్పింపఁ దగున్. 198

కం. ఈచందంబున మంత్రి మ
హాచతురుం డొకఁడు విభునియానతి మొదలం
ద్రోచియుఁ ద్రోవక విప్రునిఁ
గాచె ననఁగ దొల్లి యొక్క కథగల దధిపా. 199

కం. అనవుఁడు నాకథ నాకు
న్వినవలయును మంత్రివరుఁడు విప్రుని నేలా
గునఁగాచెఁ బతిహితంబగు
పనిఁజేసెం జెప్పు మనినఁ బతికిట్లనియెన్. 200

-: బహుశ్రుతుని కథ :-

క. శాలిమయాన్న సదంబర
శాలి సత్యసంగ శాలీన వధూ
శాలావిశాల శీల వి
శాలాపుర మేలు నందజనపతి కడఁకన్. 201

1. తగవులన్

క అతనికి నతిహితుఁడు బహు
శ్రుతుఁ డనఁగా గలఁడు మంత్రి సముం
డతఁడు ఘననీతిఁ బరఁగెను
బతికార్యధురంధరుండు ప్రజలకు హితుఁడై. 202

క. ఆ నందభూపతికి సతి
యానందము రూపమయ్యె ననఁ గలిగెఁ దిలో
కీనయన చకోరములకు
భానుమతీదేవి యమృతభానుద్యుతియై. 203

సీ. దీపితకనక సందేహంబు దేహంబు
పచ్చకర్పూరంబు పలుకు పలుకు
పల్లవసంపదాస్పదములు పదములు
శోభితావర్తసనాభి నాభి
కుంఠిత కలకంఠ కంఠంబు కంఠంబు
ముకుర విడంబాభిముఖము ముఖము
సరసిజ వైభవాకరములు కరములు
విజితనీలోరగ వేణి వేణి

ఆ.వె.నడుము లేమికి నెప్పుడు నట్టనడుము
లోచనములు కర్ణాంత రాలోచనములు
ఇంతి పాలిండ్లు కంతు పాలిండ్లు సూడ
నట్టి రూపంబు రూపింప నరుదుగాదె. 204

ఆ.వె. అట్టి సతిని జెప్ప వెట్టక చూచుచు
నిద్ర యాఁకలియును నీరువట్టు
నడఁచి యధర రేఖ నమృతంబు గ్రోలుచు
దేవుఁ డనఁగ మనుజదేవుఁ డొప్పె. 205

క. వనితలకు నురము నోరును
దను వర్థము నిచ్చి రచ్యుత బ్రహ్మ శివుల్
ఘనుఁడా ముప్వుర మీఱుచు
జనపతి దన సతికి నిచ్చె సర్వాంగములన్. 206

సీ. అవనీశుఁడీక్రియ నంతఃపురంబున
విహరించుచును మంత్రివిన్నపమున
బలిమిమై నొకనాఁడు కొలువున కేతెంచి
యా సతి తొడమీద నభిముఖముగ
నిడుకొని తన్ముఖం బీక్షించుచుండఁగా
దొరలును భటులును బరులు హితులు
లజ్జాభయములఁ దలల్వాంచికొని యుండఁ
గొంత తడవున కయ్యింతి చెయ్యి

ఆ.వె. పూని పట్టుకొనుచు లోనికిఁ బోయిన
మంత్రి కలఁగి యిట్టి మమత నేఁడు
మానిపింపకున్న హాని యౌనంచు మో
మోట మాని తోడ నొయ్యనేగి. 207

ఆ.వె. దేవ! యిచటి కెట్టి తెఱఁగైన నొప్పు నీ
యతివ నటకుఁ దెచ్చు టనుచితంబు
అనుడు నృపుఁడు నవ్వి యచ్చటి కే వచ్చి
యున్న నేమి రాకయున్న నేమి? 208

క. విశ్రుత నీతి వివేక బ
హుశ్రుత నీయట్టి మంత్రి[1] యుండఁగఁ బ్రమదో

1. సచివుడుండఁగ

న్మిత్రముగ విశ్రమించెద
నాశ్రితసంరక్ష నీనయంబున జరుగన్. 209

క. ఏణేక్షణ యీసతి నా
ప్రాణేశ్వరి నిమిషమైనఁ బాసిన విగత
ప్రాణమయి మేను నిల్వదు
ప్రాణము వెడఁబాయునట్టి రాజ్యంబేలా? 210

చ. అనిన బహుశ్రుతుండు హృదయంబున నవ్వుచు నింతప్రేమ గ
ల్గినఁ బటమధ్యమంబున లిఖించిన యీ సతిరూపు నీమహా
సనము సమీపభాగమునఁ జక్కటి నిల్పిన నందు నీదు దృ
ష్టి నిలుపుకొంచుఁ గొల్వున వసింపుము నావుడు నియ్యకోలునన్. 211

క. జనవరుఁ డొక చిత్రకుచే
వనితారత్నంబు రూపు వ్రాయించి పటం
బనువందఁ జూపఁ బంపెను
తన కులగురుఁడైన శారదానందునకున్. 2 2

ఆ.వె. అతఁడు చూచి మెచ్చి యచ్చిత్రకారుని
జేరఁబిలిచి తొల్లి చెప్పినట్లు
సతులలోన నాల్గు జాతులు గల విందు
జాతి కొలఁది వ్రాఁత సహజమయ్యె. 213

చ. తొడలును జన్నులోష్ఠములు దొడ్డలు కన్నులుఁ గాళ్ళుఁ జేతులున్
వెడఁదలు మోముఁ గంఠమును వెంద్రుకలుం గుఱుచ ల్లలాటముం
బొడవు నొడ ల్వెడల్పు కడుపుంగుడుపున్నదపున్ ఘనం బగుం
జిడిముడిపాటులుం దొగరుఁ జీరలు హస్తిని కొప్పు నెప్పుడున్ 214

చ. నడుము కృశంబు పిన్న జఘనంబు కుచంబులు గట్టి వెంద్రుకల్
నిడుపులు గన్నులా మెఱుఁగునిగ్గులు కాంతకు వింతభోజనం

బడరఁ బ్రియంబుఁ గోపము నయంబు సమంబులు దానఁగొండె మే
ర్పడ విను రక్తపుష్పపటరాగిణి శంఖినిఁగా నెఱుంగుమీ. 215

ఉ. అన్నువ యైన కౌనుఁ గుటిలాలక పంక్తియుఁ జెన్నుమీఱఁగా
వన్నెలు గట్టుఁ బచ్చమరువంబులునుం దుఱుమంగ నేర్చు మా
ఱున్నెడఁ గన్నులార్చు సురతోద్ధతి నేర్పరి యల్పభుక్తితోఁ
దిన్నని మాటలాడుఁ గడుఁద్రిమ్మరి చిత్తిని చిత్రవిక్రియన్. 216

ఉ. తెల్లనిచీరలు న్విరులుఁ దియ్యఁదనంబును మెచ్చు వెంద్రుకల్
నల్లన మోవి యెఱ్ఱన కనత్కనకద్యుతి మేను గన్నులు
త్ఫుల్లసరోజరోచులు మృదుధ్వని కంఠము పాణిపాదముల్
పల్లవకాంతు లాననము పద్మము పద్మిని జాతి కిమ్మహిన్. 217

క. కలి యుగమునఁ బద్మిని స
త్కులమున లేదిది తదీయగుణములు గల కో
మలిగాన నెడమ లోఁదొడఁ
దిల ప్రమాణంబు మచ్చ దిరమై యుండున్. 218

ఆ.వె. అనుఁడు వెఱఁగు పడుచు నచ్చిత్రకుఁడు భీతి
తోడ నేగి పువ్వుఁదోఁటలోనఁ
జెలఁగు నప్పున కిట్లె చెప్పిన నతఁడు గో
ప్యస్థలంబు గనుట కాత్మఁ గలఁగి. 219

ఉ. నందన రమ్యమౌ గృహవనమ్మున మన్మథ కేళివేళ నా
నందుఁడు భామవామ జఘనంబున సన్నపు మచ్చఁగాంచి యా
నందము డింది కందు మది నాటుకొనం దలయూఁచి శారదా
నందుని సద్గుణం బవగుణంబుగఁ గైకొని వచ్చి మంత్రితోన్. 220

ఆ.వె. ధర్మమూర్తి యనుచు నిర్మలాత్మకుఁడని
నమ్మినార మిట్టి నాటకములఁ

జాల ద్రోహి యైన శారదానందునిఁ
జంపు మనిన మంత్రి సంచలించి. 221

క. దేవా! యిది మదిఁ దప్పగ
భావింపకు భువి మహానుభావులు మదిలో
దైవిక మానుషములయం
దేవియుఁ బొలివోవకుండ నెఱుఁగుట వినవే. 222

క. జాడచెడి రాచలోగిలి
నోడుగఁ గన్నంబు వెట్టి బలుమ్రుచ్చులతోఁ
గూడిన నొరుఁజంపిన అం
కాడిన మఱి విప్రుఁ జంప నర్హంబగునే. 223

వ. ఇంతియ కాదు. 224

క. భూపాల గురునిఁ జంపెడు
పాపము వల దనుచు మ్రొక్కి పలికినఁ "గామాం
ధోపి నపశ్యతి" యనియెడు
నా పలుకు నిజంబు చేసి యతఁడుగ్రుండై. 225

ఆ.వె. చెడుగుబుద్ధు లింకఁ జెప్పక నామాట
ద్రోవవైతివేని ద్రోహిఁ జంపు
మనుడు మాఱుమాట లాడక శారదా
నందుఁ దెచ్చి బంధనం బొనర్చె. 226

మ. ఇటు విప్రోత్తముఁ గట్టికొంచుఁ జని మంత్రీంద్రుండు చింతించి య
క్కటా చంపించిన బ్రహ్మహత్య నను మ్రగ్గంజేయు నారాజు ని
చ్చటఁ బాపంబున బ్రుంగుఁ గావునఁ దదాజ్ఞాలంఘనం బైన నా
క్కటఁ గావించి జగత్త్రియంబు హితముం గావింతు నంచు న్వెసన్. 227

ఉ. ఆతనికట్టు లూడిచి గృహంబున కంపి యమాత్యుఁ డేగి నే
నాతెఱఁ గట్ల చేసితిఁ బ్రియం బగునే యని చెప్పి వచ్చి త
ద్భీతియు నీతియుం గలుగ ధీరునిఁ బాలుని నేలమాలెలోఁ
బ్రీతి వహించి దాఁచి తనపెంపునఁ బ్రోవఁగఁ గొన్ని యేండ్లకున్. 228

క. పాలసుఁడు కితవ కేలీ
లాలసుఁ డస్థిరుఁడు దురభిలాషుఁడు మృగయా
లోలుఁడయి నందధరణీ
పాలతనూభవుఁడు విజయపాలుఁడు గదలెన్. 229

వ. తదనంతరంబ. 230

సీ. పిల్లులు పోరాడె బల్లి యూరక త్రుళ్లె
దమ్మళి పొడసూపెఁ దుమ్మి రెదురఁ
దొఱఁగువోయినలేఁగ కొఱలుచు నొక కుక్క
పఱతెంచెఁ గ్రంపపై నఱచెఁ గాకి
యులుమఁ డొక్కఁడు నూనె తలతోడ నేతెంచె
మైలచీరలచాకి మ్రోలనెదిరెఁ
[1]గాకియును గొరవంకయును జెక్కలపోతు
నేటిరింతయు దాఁటె నెడమదిశకు

ఆ.వె. [2]పైట వెరవుదప్పఁ బాలగుమ్మయుఁ జాఱె
నొంటిపాటఁ బైఁడికంటి పీచె
నెలుఁగుచేసెఁ బెద్దపులుఁగు పాముటు దోఁచె
దబ్బి బొబ్బలిడియె నుబ్బులడర. 231

---

1. కాకియునొకగొరంకయును- అని చిన్నయసూరిగారు. కాకియు నొక పెరకయు నెరుకల పోతు- 2. పైటవెరవుదప్పబారె చెమరుపోతు.

ఆ.వె. వానిఁ గనుఁగొని పరివారమ్ము గలఁగుచు
శకునబలము లేదు చనకు మనిన
విజయపాలుఁడివియు నిజములో కల్లలో
తెలిసికొంద మనుచుఁ దిరుగఁడయ్యె. 232

క. దుర్మతికి ధర్మబుద్ధియు
నిర్మలునకు దుర్గతియు గణికలకు దృఢ మౌ
కూర్మియుఁ గలిమికి నిలుపును
గర్మములకుఁ దప్పుటయును గలుగవు జగతిన్. 233

శా. ఈరీతిం జను లెల్ల నుల్లముల నూహింపంగ శంపారుచి
స్ఫార[1]జ్యాలలితోరుచాప ధరుఁడై సన్నద్ధసైన్యంబుతో
భేరీభైరవభాంకృతు ల్దిశల నిర్భేదింపఁగా నేగె ని
[2]ష్కారుణ్యుండు సమస్తదుర్గుణగణాగణ్యుం డరణ్యానికిన్. 234

ఆ.వె. అచటఁ జెమటకోక యమరించి కుడిచేతఁ
గడిఁదిడేగఁ బట్టి యెడమచేత
నెఱక లొయ్యఁ జక్కఁ జెరివి మోమీక్షించి
కౌఁజుకెక్కురలను గదియవైచె. 235

వ. ఇట్లొండొంటఁ బులుఁగుల నీల్గించి[3] యొక్కపెట్టు సాళువంబు నెగయించిన

క. తత్పక్షపాతరవము వి
యత్పథమున జలదనినద మన విహగము ల
త్యుత్పాతవృష్టిసమయప
తత్పాషాణములు వోలె ధరపైఁ గూలెన్. 237

---

1. జ్యాయుతచాపరోపధరుఁడై. 2. ష్కారుణ్యుండతఁడుగ్రపాపజన భాగధ్యు. 3. ఇట్లు దొడ్డపులుఁగుల నీక్షించి.

సీ. కేరిజంబులఁ గోసి కేరుట దీరించి
పూ వేండ్లఁ బుడకల బూడ్దెఁ గలిపి
పాలగుమ్మల నేలపాలుగా నొనరించి
వెలిచెల మెలకువ వెలితిచేసి
బెగ్గురుకదుపుల బెగ్గిల ప్రమ్మగించి
కొంగలపొగరెల్లఁ గ్రుంగఁ[1] ద్రొక్కి
కక్కెరనెత్తురు గ్రక్కించి కొక్కెర
పిండు గుండియలెల్ల బెండుపఱిచి

ఆ.వె. కారుకోళ్ల నెండఁ గారించి గొరవంక
బింక మింక వానిపొంక మణఁచి
చెమరుఁబోతుగములఁ జమరి కౌఁజులఁ జించి
సాళువంబు విజయపాలుఁజేరె 238

ఉ. అట్టి ఖగంబువేఁటకు నరాధిపనందనుఁ డిచ్చ మెచ్చుచుం
బిట్టల నెల్ల లోఁబఱిచి భృత్యుల కిచ్చుచుఁ బెక్కువేడుకల్
పుట్టఁగ నొక్కచో మడుఁగు పొంతకుఁ బోయి జలంబు ద్రాని యా
[2]పట్టున మీలఁ గాంచి యొకబారువలం దివియించి యేపుగన్. 239

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువులెంకల కిచ్చె
వాలుగలను సంగడీలకిచ్చెఁ
[3]బాఁపమీనుల బిన్నపడవాళ్ళకును నిచ్చె
మారువులఁ జనవువారి కిచ్చె
బేడసంబుల నిచ్చె వేడుకకాండ్రకు
గెండెల బలుదుండగీల కిచ్చె

---

1. గ్రుంగ. 2. చట్టునమీలఁగాంచి యొకజాలిక్రియందివిపెంచి. 3. పాపె రలను బస్తుపడుచులకునునిచ్చె. పాఁపరలను.

వెలిమొట్టలను దండువుల దలారుల కిచ్చెఁ
గొడిసెలఁ బరిహాసకులకు నిచ్చెఁ

ఆ.వె. బక్కెమొట్ట రొయ్య పరిగ యింగిలికము
చీరబింపుజెల్ల నారజెల్ల
కుంటముక్కు మొదలుకొని కలవన్నియు
బంటువారికెల్ల నొంటియిచ్చె. 240

వ. ఇచ్చి యచ్చోటు వాసి బాణాసనబాణపాణియై వాగురికవాగురా కరాళంబగు
వనాంతరాళంబు సొచ్చి. 241

క. బాలుఁడు మెలఁగెను మృగకుల
కాలాకృతిఁ బవనజవన ఘనశునకాళీ
కోలాహలాకాలాహిత
కోలాహల కాహళానుకూల క్రీడన్. 242

క. తొలిఁదొలిఁ జింకల మనుఁబో
తులఁ గడఁజుల లేళ్ల నిర్ల దుప్పుల మఱి యే
కలముల నెలుఁగులఁ బులులను
బలువిడిగాఁ దునిమెఁ జలముబలమున్మెఱయన్. 243

క. అయ్యెడఁ గోఱలు దీటుచు
దయ్యముక్రియ నొక్కపంది తాఁకుచుఁ దనువుల్
వ్రయ్యలుగఁ బొడిచెఁ దొలఁగం
జయ్యన నలుదెసలఁ బఱచె సైన్యములెల్లన్. 244

వ. అప్పుడు కుమారుండు కృతవాహనారోహణుండై యావరాహంబునుం దోలి
వెనునంట నొంటిం జని చనికాఅడవి నీరంబులలో జాడదప్పి దప్పిఁగొనియొ
క్కమడుఁగుచేరి యచ్చోటఁ దురంగంబు డిగ్గి చెట్టునం గట్టి సరసిలో
జలంబులు గ్రోలి యభయుండై యచట విశ్రాంతికై నిలుచునంత. 245

శా. శ్రీ ఘూపాతనితాంతతాంత[1] తురగస్వేదంబుఁ దీర్పంగ హృ
ష్టా ఘ్రాణంబున మోరయెత్తి తనమీస ల్నిక్కఁ దత్సౌరభం
బా ఘ్రాణించి చరించి పొంచి కృతముఖ్యాయామభీమాకృతిన్
వ్యాఘ్రం బొక్కటి వచ్చి యచ్చట నృపవ్యాఘ్రాత్మజుం జూచుడున్. 246

ఆ.వె. హయము దాని రాకకదరి కట్టినవాఁగెఁ[2]
ద్రెంచుకొనుచుఁ బాఱె దిక్కులద్రువఁ
బొరిగొనం దలంచు పులిఁజూచి బెగ్గిలి
విజయపాలుఁ డొక్కవృక్ష మెక్కె. 247

ఉ. అమ్మెయి నెక్కఁ గోపమున నాపులియుం బఱతెంచి తత్ప్రదే
శమ్మున నిల్చిన న్బెగడి శాఖలమీఁదికి డాఁగ నేగియుం
గొమ్మను నొక్క బొల్లియెలుఁగుం గని తల్లడమంది దుర్నిమి
త్తమ్ముగ నాఫలంబు లిటఁ దప్పక వచ్చెనె దైవమా యనున్. 248

క. క్రిందఁ బులి మీఁద నెలుఁగును
నందప్రియనందనుండు నడుమం గలుగ
న్మందట నొకనుయ్యి యు వెను
కందగ నొక గొయ్యిభంగిఁ గానఁగనయ్యెన్. 249

వ. అప్పుడు. 250

గీ. రెండునిలువు లేగయుఁ బుండరీకం బిది
నీకు నచట నుండ నేర్పుగాదు
నమ్మి[3] వేగమిటకురమ్ము బాలక యని
యెలుఁగు పిలిచెఁ గాఋపెలుఁగు సెలఁగ. 251

---

1. నితాంతవేగ. 2. యప్పుడవాఁగె— (యెంతయువాఁగె) చిన్నయసూరి
3. నెమ్మి.

ఉ. అక్కుమరుండు దాఁప? హృదయంబు యథావిధి నిల్పి రెంటిలో
నిక్కడఁ గొంత యాస గల దిప్పటి కేగెద నంచు మీఁదికిఁ
ద్రుక్కుచుఁ బోయెఁ గ్రిందఁ బులి చూచి చలంబున మీర లిద్దఱుం
జిక్కితి రంచు నాఁగి నిలిచెం దనకన్నుల నిప్పు లొల్కఁగన్.

ఆ.వె. పుండరీక మిట్లు లొండొండఁ జూపుల
మండఁ గోపవహ్ని మెండుకొనఁగ
నుండు టెఱిఁగి మాఱుమండుట మానె నా
నెండవేఁడు గ్రుంకుఁగొండ నడఁగె. 253

క. పులి యాఁగిన జిక్కిన తమ
యెలుఁగునువెదకంగ వచ్చి యెల్లెడఁ గలయం
బొలయు నెలుఁగులో యన గుం
తల మిట్టలఁ జీఁకువాలు దళమై పర్వెన్. 254

క. గగనమణి సాపవమ్ముక్రియ
నెగసినఁ దలసూపకుండి యింతట నతఁడ
స్తగిరిచరిఁ ద్రావలిన పె
ల్లగు ఖగముల కరణిఁ జుక్క లయ్యెడ నిక్కెన్.[1] 255

శా. ఆవేళన్ భువిఁ బీఁట వెట్టిన మహావ్యాఘ్రంబు నీక్షించుచున్
దైవంబు న్మది దూఱుచుం దలఁకుచుం దద్రాత్రియర్ధంబుఁ జిం
తావేశంబునఁ బుచ్చి కూర్కుఁ దలపోయంగా నెలుం గంతయుం
దా వీక్షించి నిజాంకసీమఁ జెలువౌ తల్పంబుగాఁ జూపుచున్. 256

క. నిద్ర చనుదెంచెనేనియు
నిద్రింపుము వెఱవ నేల నీకిట ననినన్

1. స్తగిరిన్ద్రావలినపెల్లగు, ఖగములక్రియఁ జుక్కలంతఁగానఁగ నయ్యెన్

నిద్ర సుఖ మెఱుఁగ దనఁగా
నిద్రించెఁ దదంకశయ్య నృపసుతుఁ డంతన్. 257

సీ. శార్దూల మటు చూచి నిర్దయత్వముతోడ
భల్లూక! పగపట్టి బ్రదుకఁగలవె
వాఁడు నీకేలెస్సవాఁడయ్యెఁ బరజాతి
నృపతిపుత్త్రుండు నిష్కృపుఁడు వీఁడు
మనకులం బాదిగా వనగోచరంబుల
వేఁటచాటున నొక్కనూటిఁ జంపె
నిల నొక్కగూఁటిపిల్లల మిద్దఱము దుష్ట
బాలునకై పోరనేల మనము

ఆ.వె. వీనిఁ గ్రింద వైవు విడిచిపెట్టెద నిన్ను
సగము నీకు నిత్తు నగవు గాదు
నరుని నమ్మవలదు నమ్మి మున్నొకపాము
చిచ్చులోనఁ గాలి చచ్చెఁ గాదె. 258

క. ఆ కథ విను వింధ్యాటవి
నేకలుఁ డనుబోయ తోఁటయీరమున మహా
శాకోటముఁ[1] దెగనఱకఁగ
నాకోటరసీమ నొక్కయహిపతి వెడలెన్. 259

ఆ.వె. వెడలి యేను నిలిచి విహరించు తా విది
వలదు దీన నేమి గలదు నీకు
నన్నుఁ గలసి బ్రతుకు[2] మెన్నఁడుఁ జేటులే
దనిన వెరఁగుపడుచు నట్ల తలఁగె. 260

---

1. తొంటియిర వెఱిఁగి మహానోకహముం. 2. ఇదిగొగొమ్ము మణియు నెన్నఁడు.

క. తలఁగిన వానికి నది తన
తలరత్నం బిచ్చి పుచ్చి తా నేగిన ని
మ్ముల వాఁడు నేగి పురిలో
పల నొక వర్తకున కమ్మె పదిగద్దెలకున్. 261

చ. అట మఱునాఁడు వచ్చిన మహాభుజగేంద్రుఁడు గారవించి ని
న్నఁటిమణి యెంత కమ్మితి వనా యన మూల్యమెఱుంగఁ దెల్పన
క్కట పదివేల కమ్మక వికల్పము చేసితి వింతనుండి మి
క్కుటముగ నమ్ము కొమ్మనుచుఁ గ్రొత్తఫణామణి యిచ్చె వానికిన్. 262

క. తనయిల్లుఁ గాచినాఁడని
మనమునఁ బ్రియమంది యిచ్చు మణు లనుదినముం
గొనిపోయి యమ్ము కొనుచును
ధనికుండై వాఁడు చెల్మి దప్పినబుద్ధిన్. 263

ఆ.వె. దీని కెచటఁ గలుగు దివ్యరత్నంబులు
దీని మొదలితావుఁ దెలియవలయు
ననుచుఁ గోరిపోయి యాపాముచనుజాడ
వట్టి యేగి యొక్కపుట్టఁ గనియె. 264

క. కని తిరిగి పోయి మఱునాఁ
డనలంబును గసవుమోపు హస్తంబులఁ గై
కొనివచ్చి తొట్టఁబోపల
జొనిపె భుజంగంబు మిడుకుచు న్మడియంగన్. 265

క. జాల్మం డిటు గాలిచి
వల్మీకముఁ ద్రవ్వఁ జనిన వడి విషములచే

---

1. వనాయని మూల్యము నెట్టెఱింగి యక్కటఁ

గుల్మాదులు దరికొనఁగా
నుల్మకములభంగి కొన్ని[1] యురగము లెగసెన్. 266

ఆ.వె. ఉరగకులము బోయఁ బొరిగొని శమియించె
నట్లు గాన వీని కడలనేల
పాము క్రూరమంత్రుడు ప్రాణులలోనెల్లఁ
బాముకంటె నరుఁడు పాతకుండు. 267

క. నామాట నమ్మి డిగ్గన
నీ మనుజునిఁ ద్రోవు మింక నేగెద ననినన్
మోమోటలేక నవ్వుచు
నేమీ సభ్యుఁడవె యనుచు నెలుఁ గిట్లనియెన్.. 268

క. ఇలఁ గలపశువుల నెల్లను
బొలియించుచుఁ బాపములకుఁ బొడవయ్యెడు బె
బ్బులితోడి పొత్తు గలదే
పులి నమ్మియకాదె తొల్లిపులుఁ గొక టిలిగెన్. 269

మ. వినుమా చెప్పెదఁదొల్లి యొక్కపులి కావేరీతటిం ప్రాణులం
దనయిచ్చ న్వధియించుచుం దినుచు నుత్సాహంబుతో నుండి కా
రెనుబోతుం దినునాఁడు మాంసకబళాన్వీతంబుగా నొక్కబొ[2]
క్కనిజాస్యంబున నొక్కదౌడయెడ వీఁకం జొచ్చిన న్నొచ్చుచున్. 270

క. వదనము విదురుచుకొను చది
తుదినాలుకయెత్తుచేత దూపొడుచు క్రియం
గదలించుఁ దాలువొరఁగ
న్మెదలించుం దగ్గు మ్రొగ్గు మేదినిఁబొరలున్. 271

మ. ఇటు దుర్వేదనఁ జిక్కి మాన్పుకొనఁగా నెం దేగినం బ్రాణసం
కటమై ప్రాణులు మారి వచ్చె నని డాఁగంబాఱగా నొప్పి యె

1. మఱియునురగ. 2. బొక్క=ఎముక.

చ్చటనుం బాపెడు దిక్కులేక చనుచుఁ శైలస్థలిం జేరి ముం
దట సూచీముఖపక్షిఁ గాంచి తనఖేదం బంతయుం జెప్పినన్. 272

క. సూచీముఖంబు డగ్గఱి
నీ చెడుగుండనము మాని నిలువవు నీనో
రోచెల్ల చొరఁగవలె హిం
సాచారివి కాలుఁడైన నలుగఁడె నీకున్. 273

చ. అనవుడు నోరుసొచ్చి వ్యథ[1] యార్పఁగదే మును చచ్చినట్లు ప
ల్లును మెదలింపకుండెద నలోలత నంచు మొగంబు వంచి వ్రా
లిన నది నోరు సొచ్చి కదలించి క్రమంబున దౌడబొక్క[2] ము
క్కునఁ గొనివచ్చె నాపులికిఁ గుత్తుకనాటినకొయ్య నొయ్యనన్. 274

ఆ వె. అట్లు పుచ్చిన ముద మంది సూచీముఖుఁ
బొగడి యేగి క్రూరమృగము మఱియుఁ
బసులఁ జంపితినఁగఁ బలలంబుతో దౌడ
నాఁటిజాడ నెముక నా టినంత.[3] 275

ఉ. క్రమ్మఱ వచ్చి పుచ్చు మని కైకొని వేఁడినఁ బుచ్చివైచి స
ఖ్యమ్మొనరించి నిచ్చలు సుఖస్థితి నుండఁగ నొక్కనాఁడు మాం
సమ్మొకయింత గానకయుఁ జయ్యన నాపులి వచ్చి వక్త్రము
న్నమ్మిక దోఁపఁగాఁ దెఱచిన న్విహగంబును జొచ్చె నాక్రియన్. 276

క. చొచ్చినయంతన కాటునఁ
జచ్చె న్విహగంబు పులులసంగడ మిదిగో

---

1. నమ్మిచొచ్చివెతయార్పు. 2. దౌడబొమ్మిక్కుముక్కున గొనివచ్చె నాపులికిఁ గుత్తుకనాటిన కొయ్య. 3. పుచ్చినను ముదమందుచుఁ బులుఁగుఁజాలఁ, బొగడియునునేగి యాక్రూరమృగముమఱియుఁ, బసులజంపి తినంగజాపలము తోడ, నాఁటిదౌడనె యెముకయు నాటె షగుడ.

నిచ్చకములాడె దీతని
నిచ్చుటకై యంత యేమి యే నజ్ఞుఁడనే. 277

క. జాతివిభేదం బేటికిఁ
బాతకునకునైన నెడరుఁ బాపి[1] మహావి
ఖ్యాతిఁ గొననొప్పుఁ దిర్య
గ్జాతికపోతంబు చెంచుఁ గాచుట వినవే. 278

క. గోదానము ధనదానము
భూదానము నన్నదానమును బథికహితాం
భోదానము నుత్తమవి
ద్యాదానము గూడ నభయదానము సరియే. 279

ఆ.వె. వెన్నుసొచ్చువానిఁదన్ను నమ్మినవానిఁ
జంపిరేని శిశువు జంపుటంద్రు
పంతమెఱుఁగు జాంబవంతునివారము
బాస తప్పు మిట్టియాస విడువు. 280

చ. అనుచు నిరుత్తరంబుగ దయామతిఁ బల్కెడు నంత రాజనం
దనుఁడును లేచినన్ క్షణము దానిఁకఁ గూర్కెద నిద్రవోకుమీ
యని తొడమీఁద నూఁదికొని యాయెలుఁగించుక కన్నుమూయఁగాఁ
గని పులి వల్కె వాని మెయిఁ గంపము పుట్టఁగ బీతు వెట్టుచున్. 281

ఆ.వె. కోఱలు గలవాని గోళ్లు గలవానిఁ
గొమ్ములు గలవాని నమ్మవలదు
బమ్మరించెనేని బ్రతుకంగవచ్చునే
యెలుఁగు తోడి చెలిమియేల నీకు. 282

---

1. ఘాతుకునకునైన నెడరుగల్గినఁ దనలో నాతుకనవచ్చు. 2. పొందులేల.

క. మొన్న నొకని(దోలితి వా(
డిన్నగ మిట్లెక్కె వాని నిది కరుణాసం
పన్ననిక్రియ లోనిడుకొని
నిన్న విఱిచి పెట్టి నేఁడు నిజమరివోలెన్. 283

క. కూరిమి గల దని నమ్మకు
క్రూరమృగంబులకుఁ గరుణ గూడునె ఋది నీ
చేరువ నుండుట నేఁటికి
నీరీతుల బుజ్జగించె నెల్లిటి కొఱకై. 284

ఆ.వె. దానిఁ జెప్పనేల యేనిదె యొకయేఁడు
పట్టు నాఱు నెలలు పట్టుఁ గాక
మిమ్ముఁ జంపితిందు నమ్ముమీ యెడనాకు
దీనిఁ ద్రోచి బ్రదుకుతెరువు గనుము. 285

చ. అనవుడు వాఁడు నిక్కముగ నాత్మఁ దలంచి యెలుంగుఁ గూలఁద్రో
చిన నది జాఱుచుం దెలిసి చేతికి లోనగు కొమ్మవట్టి యొ
య్యనఁ బఱతెంచి బెగ్గిలునృపాత్మజుఁ గన్గొని యల్పబుద్ధి వే
మన నను నమ్ముమంటి భయమందకుమీ యని పల్కుచుండఁగన్. 286

క. కలకలఁ బలికెడు పక్షుల
కలకలములు సకలదిశలఁ గలయఁగఁ బొలయం
దళదళికులముగ దళశత
దళదళములు విరియఁ బ్రొద్దు తళతళఁబొడిచెన్. 287

ఆ.వె. తమముతోడఁ గూడఁ దరలి శార్దూలంబు
శైలగుహలకేగెఁ జాలడస్సి
తరణికిరణపంక్తి సరసఁ జెట్టుననుండి
యెలుఁగుఁగూడి బాలుఁడిలకు డిగ్గె. 288

క. ఆయెలుఁ గతనిఁబిలిచి య
న్యాయివి పరలోకపీడనం[1] బగుదురితం
బీయెడన పాయఁ జేసెద
రాయిటవినుమిఁక "ససేమిరా" యను మెపుడున్. 289

క. ఈ నాలు గక్షరంబుల
నీనేరమి నొరుఁడు చెప్పెనేని వికారం
బూనక తొల్లిటిక్రియ స
న్మానము గైకొనుము మంచి మాటలతోడన్. 290

క. అని వీడ్కొలిపినతఱి న
ట్లనెయాతఁడును 'స్ససేమిరా' యనుచు వనం
బున భూతావిష్టుని చా
డ్పునఁ దిరుగఁగ వానిహయము పురిఁ జేరుటయున్. 291

సీ. అశ్వరత్నం బొంటి నరుదెంచె నిన్నఁటి
 శకునము ల్పాపనిఁ జెప్పె నొక్కొ
యని తలంకుచు నందజనపాలుఁడాజాడఁ
 బఱతెంచి యడవిలో బాలుఁ జూచి
యన్న యిదేమి రా వన్న "ససేమిరా"
 యనుడుఁ గలఁగి యొత్తి యడుగుటయును
నాలుగక్షరముల నోలిఁబల్కెడువానిఁ
 దోడ్కొనిపోయి మందుల నొనర్చి

ఆ.వె. వీనిభూతశంక విడిపించువారికి
నర్ధరాజ్య మిత్తు ననుచుఁ జాటి
వేలుపులకుఁ బెట్టి వేఁడికొన్నను నాలు
గక్షరములు విడువఁ డయ్యెవాఁడు. 292

1. యన్యాయపరత జేయు పీడనం.

ఉ. నందనృపాలుఁడిట్లను మనంబునఁ గ్రుక్కుచు నెల్ల వేల్పులున్
మందులు మ్రాఁకులు న్మఖలు మంత్రములున్ వృథయయ్యె శారదా
నందుఁడ యిప్పుడున్నఁ బ్రియనందనుఁ దెల్పఁగ నోపు నట్టి పె
ద్దం దునిమించినాఁడ వలదా హితు లెవ్వరు నడ్డపెట్టఁగన్. 293

ఉ. నాపుడు మంత్రి చిత్తమున నవ్వుచు నావిధ మయ్యె నాఁడు. నేఁ
డీవిధ మయ్యెఁ, బేరుకొననేటికి నిందఱపాల దృష్టమౌ
దైవము గల్గనేని భువిఁ దత్సముఁ డొక్కఁడు గల్గనేరఁడే
కావున బమ్మరింపఁ బని గా దని యూఱడఁ బల్కె భూపతిన్. 294

ఉ. ఆవిభు నూఱడించి నిలయంబున కేగి బిలంబువిప్రుతో
నీవిధ మెల్లఁ జెప్పిన మహీసురుఁడు న్సచివాగ్రణీ భవ
ద్భావరుఁ జేరి నాఁటిగురుపుత్రిక యేడవయేఁటి పాప నీ
జీవముచిక్కుదీర్చు నని[1] చెప్పుము నీ వని పంచె నాతనిన్. 295

వ. అటకుం జని. 296

ఉ. ఆతఁడు విన్నవించినఁ బ్రియాన్వితుఁడై సుతుఁ దోడుకొంచు ధా
త్రీతలనాథుఁ డింటి కరుదెంచుడు నాధరణీసురుండు క
న్యాతిలకంబు నాజవనికాంతరికాకృతి నిల్పి పద్యవి
ద్యోతితరీతి దోఁప వినుచుండెఁ గుమారు 'ససేమిరా' ధ్వనిన్. 297

వ. ఇట్టి నాలుగక్షరంబుల నాలించి విని యందఱు నూరకుండుం డని కుమారు
నుద్దేశించి పద్య మి ట్లని చదివె. 298

క. "స"జ్జనభావము గలుగు సు
హృజ్జనముల మోసపుచ్చు టిది నేరుపె నీ
యజ్ఞతొడమీఁదఁగూర్కిన
యజ్జంతువుఁ జంపఁజూచుటదిపౌరుషమే. 299

1. జీవము వేదదీర్చునని.

వ. [1]అని చదివిన బాలుఁడు దా విని ప్రథమాక్షరము విడిచి పెటి "సేమిరా" "సేమిరా" యనుచున్నంతనందఱు నా నందనరేంద్రుతో నానందంబు నొంది మేలు మే లనుచు నుండఁ దత్కాలకలంబు మాన్పి జవనికలో గురుండు.

క. "సే"తువుఁ గని జలనిధిసం
జాతధనుష్కోటిఁ బడిన సద్ద్విజహతికిం
బాతకము వాయు మిత్రవి
ఘాతికిఁ బాతకమె కాని గతి గలుగ దనా. 301

వ. అని రెండవపద్యంబుఁ జదువఁగుమారుండు రెండవయక్షరంబు విడిచి "మిరా మిరా" యనుచుండ నిట నయ్యాచార్యుండును. 302

క. "మి"త్రద్రోహికృతఘ్న ప
విత్రగురుద్రోహిచౌర్యవిద్యాపరులౌ
మిత్రశశిస్థితి మేరగఁ
బుత్రులు గలిగియును నరకమునఁ బడుదు రనా. 303

వ. అని తృతీయపద్యంబు పఠించినఁ దృతీయాక్షరంబు విడిచి "రా, రా" యను నందనుం జూచి యమందానందుం డగు నందు నుద్దేశించి శారదానందుండు.

క. "రా"జః భవదీయుఁడైన త
నూజునకు న్శుభము నోజ నూల్కొను విద్వ
ద్రాజికి ధనదానము ని
ర్వ్యాజమునం జేయు మిహపరంబులు గలుగున్. 305

వ. అని యిట్లు చతుర్థపద్యంబుఁ జదివినఁ జతుర్థం బగు రకారంబుతో నవ్వికారంబునుం బాసి బాలుండు తండ్రికి మ్రొక్కి మిత్రద్రోహలక్షితంబగు ఋక్షవ్యాఘ్రవృత్తాంతం బంతయుం జెప్పిన నచ్చెరువు మెచ్చునుం బిచ్చలింప నవనీపతి జవనికవంకఁ జూచి.

---

1. ఈవచనము మొదలు కందపద్యమువలె నడచున్నది. ఇది వృత్తగంధి.

ఆ.వె. పిన్నదాన విచట నున్నదానవు తల్లి
యింటి వాకిలియును నెఱుఁగ వీవు
కానలోనఁ బులియు మానిసియు నెలుంగుఁ
దొడరు చేఁత లెట్లు తోఁచె నీకు. 307

వ. అనుడు నతం డింకఁ దాఁపం బని లే దని తలంచి. 308

క. భూనాయక! భూసురకృప
నానాలుక నొప్పు వాణి నానాదృతవి
జ్ఞానమునఁ దెలియు నన్నియు[1]
భానుమతీదేవిమచ్ఛభంగి న్మదిలోన్. 309

మ. అనినన్ దిగ్గన లేచి చూచి తెరలో నాచార్యుఁగా నిశ్చయిం
చి నరేంద్రుం డతిహృష్టుఁ డౌచు సచివుం జేపట్టి నీయట్టి బం
ధునిధానం బిఁక నొండు గల్గునె గురుద్రోహంబుఁ దప్పించి యె
దును బాపంబును బొందకుండ నను ధన్యుంజేసి తీనేర్పునన్. 310

క. ప్రణయము దప్పక యా బ్రా
హ్మణహత్య దొలంగ రాజ్య మలరఁగ సుతుదు
ర్గుణములు విడిపించితి నీ
గుణములచే నన్ను జట్టిగొంటివి చుమ్మీ. 311

వ. అని గ్రుచ్చి కౌఁగిలించుకొని తనపట్టిచెట్ట పట్టుకొని పుణ్యసులభానుమతి
యగు భానుమతియుం దానును గురు దగ్గఱి. 312

క. ఎల్లవిధంబులఁ జూచినఁ
దల్లియుఁ దండ్రియును నీవె దయసేయుము మా
కల్లలు లోఁగొని మము నీ
నల్లిలుగఁజూడు మనుచు నరపతి మ్రొక్కెన్. 313

---

1. జ్ఞానముఖంబున వెలయున్.

శా. ఈచందంబున ప్రొక్కి యందలముఁ దా నెక్కించి భూమీవరుం
డాచార్యుం గొని వచ్చి గద్దియపయిన్ హర్షంబుతో నుంచి శి
ష్టాచారంబునఁ బూజచేసి తనరాజ్యశ్రీ సమర్పించి త
ద్వాచా దత్తముగాఁగఁ గైకొని ప్రసాదం బంచు నేలె న్భువిన్. 314

మ. అని మంత్రీంద్రుఁడు చెప్పిన న్విని కథాహ్లాదప్రసన్నాత్ముఁ డై
జననాథుండును మంత్రిలేనిపని మోసం బంచుఁజేపట్టి యొ
య్యన సత్త్వాఢ్యులచేతఁ బుష్పకనిభం బౌ దివ్యసింహాసనం
బనువొందం గొనిపోయి నిల్పె నిజహర్మ్యంబైన ధారాపురిన్. 315

ఉ. శంభుముఖాంబుజార్కు దృఢసారవరాహశరీర వశ్యవి
శ్వంభరు శాంభవీవరదు సంభృతరక్షణు సర్వలోకకు
క్షింభరు సిద్ధసాధ్య సుర కిన్నర పన్నగ గీతకీర్తివి
శ్వంభరు జంభవైరిసహసంభవు దృష్టవపుర్విజృంభణున్. 316

ఉ. శంకితకింకరవ్రజవశంకరుఁ బంకజనేత్రమిత్రు న
భ్రంకషకాంతిసంకులకపర్దవిభూషితభవ్యదివ్యకూ
లంకష నిష్కళంకితవిలాసకలాపధురీణు శౌర్యస
ర్వంకషవైభవాంకితవశంకరు శంకరు లోకశంకరున్. 317

మాలిని. పరమకరుణలీలా భక్తలోకానుకూలా
పరిచితసురరక్షా భగ్నదైతేయవక్షా
సరసిజహితనేత్రా సచ్చిదానందగాత్రా
హరిహరమయ రూపా యాగయోగస్వరూపా. 318

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీర ఘోట్ట
విభాళాది బిరుదప్రకట చారిత్ర కళింగదేశ నిర్ధూమధామ త్యాగ
నాగార్జున కర్ణాట ద్రవిళాంధ్రమహారాష్ట్ర భూపాలరూప నూపురసుందర
చరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్య

సముద్ధరణ శ్రీకొలనివిన్నయామాత్యపౌత్ర హరితసగోత్రపవిత్ర సకల సుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందుఁ బార్వతీపరమేశ్వరాన్యోన్యప్రశ్నోత్తరంబులును భర్తృహరి వైరాగ్యంబును విక్రమార్కుని రాజ్యసాయుజ్యంబులును, శాలివాహన విజయంబును భోజునికి సింహాసన ప్రాప్తియు మంత్రి గుణప్రశంసయు నందోపాఖ్యానంబును నన్నది కథావతారిక ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## ద్వితీయాశ్వాసము



క. శ్రీరామాకుచశైలవి
హారుని మునిహృదయగహ్వరాశ్రయుని మహా
దారుణనఖదారితరిపు
వారణనరసింహు నిగమవనసంచారిన్. 1

క. మనమునఁ దలఁచుచు విద్వ
జ్జనదైవజ్ఞాది సర్వజనసమ్మత మౌ
దినమున భోజుఁడు సింహా
సన మెక్కఁగడఁగె రాజ్యసంపద మెఱయన్. 2

సీ. ధారాపురంబులోఁ దారాపథమువోలు
రత్నమండపములో యత్న మమర
నిమ్మైనపసిఁడికంబమ్ములమేడలో
దివ్యసింహాసనస్థితి యొనర్చి
యవరోచనాజ్యదూర్వాగ్రమపల్లవపుష్ప
సిద్ధార్థదధిఫలక్షీరములును
నాదిగాఁ బెక్కు పుణ్యద్రవ్యములు గూర్చి
వ్రణ్యాహమున భూమిపాలుపుదీర్చి[1]

1. పులితోలు పైభూతి చెలువుదీర్చి

ఆ.వె. దేవతరువుమాడ్కిఁ దెల్లనిగొడుగుతోఁ
గూడఁ బసిఁడికామకుంచె లచట
నిలిపి పొంతఁ గైదువులు సేర్చి యర్చన
లిచ్చె నుత్సవంబు పిచ్చలింప. 3

వ. తదనంతరంబ నానాపురాణేతిహాసశ్రవణంబులను బంచమహావాద్య ప్రపంచంబులను సంగీతసాహిత్యసంగతనాట్య ప్రసంగంబులను బ్రతియా మదీయమానధూపదీపాదినైవేద్యమహోపచారంబులను దత్పరివార దేవ తలకు నుపబృంహణంబుగా సేమం బగునేమంబున నారాముండునుం బోలె నాయామినిం గడపి మఱునాఁడు కృతమంగళస్నానుం డై ప్రత్యూ షనిత్యకృత్యంబులు నిర్వర్తించి యప్పుడు మకరతోరణంబులునుం దెలిముత్తియంబుల తోరణంబులునుం గలువడంబులు, బవికూటంబులు మేలుకట్లునుం జీరగుండ్లును మృగనాభిలేపనంబును, ముక్తాఫలరంగ వల్లికలును వెల్లివిరియ నుల్లంబుల నుల్లసిల్లుపౌరులును నానాదిగంతాగత విద్వజ్జన జ్యోతిషిక శాకునిక స్వైరవేదులును వందిమాగధబృందంబులును బసిండి పళ్లెరంబుల మాణిక్యదీపంబులతో నివాళింపుచున్న పుణ్యాంగన లును హిత రాజలోకబంధువర్గంబునుం దలకొన జయ జీవ వర్ధస్వ సుఖీభవాది శుభసూచకశబ్దంబులును బహువిధవాద్యరవంబులును, నొక్కటై దిక్కులుపిక్కటిల్ల మిక్కుటంబుగా సుముహూర్తంబున సర్వ తోముఖంబగు మహాసింహాసనంబు డగ్గఱి ప్రదక్షిణంబుగాఁ దిరిగి చూచి తత్త్వద్వారంబుల కడల నున్న బొమ్మలతలకడల నున్నపిన్నగద్దియలలో నెందేని నడుగిడి పెద్ద గద్దియ యెక్కుట భావ్యం బని వారశూలరహితం బుగా నొక్కదిక్కున నిలిచి సకలజనకలకలంబు నుడిపి మౌహూర్తిక సావధానశబ్దంబు లొలయ నిష్టదేవతలం దలంచి ప్రశస్తఖడ్గహస్తుం డై పూర్ణఘటికోచితనాదావసరంబు నెదురు చూచుచుండ.

-: మొదటిబొమ్మ కథ :-

క. మును గడియారంబునఁ గ
ట్టిన పెనుజేగంటరవము తేయనునెడ గ్ర
క్కున భోజుం డడుగెత్తినఁ
గని నిలునిలు మనుచు బొమ్మ కలకలఁ బలికెన్. 5

చ. పలికిన భోజుఁ డద్భుత మపారముగా మది నిండి పాఱఁగా
నిలిచి గతజ్ఞ తద్జ్ఞ ధరణీసుర మాగధవందిగాయకా
కలకల మెల్ల మాన్చి శుభకాలములో నిది యెక్కఁ బూనఁగా
వల దన నేల యిందుల నివారణకారణ మేమి నావుడున్. 6

మ తనవాక్యంబులు తత్సభాజనుల కుత్సాహంబు నాశ్చర్యముల్
పెనఁగొల్పంగఁ బసిండిబొమ్మ నగి గంభీరంబుగాఁ బల్కె నో
జననాథా విను చంద్రగుప్తనృపసంజాతుండు కంజాతమి
త్రనిభుం డుజ్జయినీపురిం బరఁగె నేతత్కర్త సత్కీర్తితోన్. 7

వ. ఆయనఘనత యెట్టి దంటేని. 8

క. సిద్ధులకు నసాధ్యము లగు
సిద్ధులు నెనిమిదియుఁ దనకు సిద్ధంబులుగా
నిద్ధరణిఁ బౌరుషమునఁ బ్ర
సిద్ధుం డగు సాహసాంకుఁ జెప్పం దరమే. 9

శా. సంభూతాన్యవిడంబడంబరమిథఃసంరంభగర్వోర్వశీ
రంభానాట్యవిజృంభమాణమతివిస్రంభాదిశుంభన్మనో
జంభారిప్రియసంభృతానకమహాసంభావనాసంభవా
స్తంభోదర్కుఁడుఁ విక్రమార్కుఁ డతఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్. 10

క. అతిశయవితరణగుణమున
నతనికి సరిరాక యెక్క నలవియె నీకుం

గ్రతువులు నూఱును జేయక
నితరుల కమరేంద్రపీఠ మెక్కం దరమే.[1] 11

క. అనవుడు భోజుఁడు విస్మయ
మును సిగ్గు నహంకృతియును ముప్పిరిగొన ని
ట్లనియె నొక యర్థి వేఁడినఁ
దనియఁగ సహపాదలక్షధన మే నిత్తుఁ. 12

క. నావితరణ మిది యల్పమె
నావుడు నది నవ్వి తనగుణం బన్యులకుం
దా వినిపించుట కొఱఁత గ
దా వివరము తప్పి తీవు ధరణీనాథా! 13

క. ఇది మొదలు కొఱఁత యయ్యెం
దుదిఁ బుణ్యము హానిఁబొందె దొడ్డతనంబుం
జెడ రెం దనుఁదాఁ జేర్కొను
టిది కష్టము తొంటినీతి యెఱుఁగవు చుమ్మీ. 14

ఉ. ఆయువు మంత్ర మౌషధము నర్థము దానము మానభంగ మ
న్యాయము నర్థనాశము గృహవ్యసనంబును దాఁపురంబుగాఁ
జేయుట నీతియుక్త మటుసేయక తా నయి దానధర్మముల్
చేయుదునంచుఁ జెప్పినను సీయని నవ్వరె ధర్మ మెంచరే. 15

:- సుదర్శనుని కథ :-

క. ఈ సమయమునకుఁ దగ నితి
హాసము గలదొకటి వినుము హరిదశ్వకులో

1, మెక్కుటగలదే.

ల్లాసకరుఁ డయోధ్యాపుర
వాసి సుదర్శనుఁ డనంగ వసుమతి నేలెన్. 16

చ. అతఁడు సపాదలక్షవసుధామరపంక్తికి భోజనంబు సు
వ్రతముగఁ బెట్టుచుం దివిజవర్గము మిక్కిలిఁ దుష్టిఁ బొందఁగాఁ
గ్రతువులు పెక్కుసేయుచు జగన్నుతుఁడై సరయూతటంబునం
గతిపయవాసరంబు లధికం బగుసత్ర మొనర్చుచుండఁగన్. 17

క. శారద వీణావాద్యవి
శారద తగురూప మైనచందము మెఱయన్
శారదనీరదనిభుఁ డగు
నారదముని చేరవచ్చె[1] నరపతిఁ జూడన్. 18

క. వచ్చినమునిఁ గనుఁగొని యిటు
విచ్చేయుం డనుచు మ్రొక్కి విభుఁడు చితార్ఘ్యం
బిచ్చి కృతాంజలియై నే
సచ్చరితుఁడ నైతి మీ ప్రసాదము కలిమిన్. 19

ఆ.వె. ఎచటినుండి యిటకు నేతెంచితిరి నన్ను
ధన్యుఁ జేయ నన్నఁ దపసి వలికెఁ
బరమధర్మశీల బ్రహ్మలోకమున నీ
దానధర్మవార్తఁ దడవ వింటి. 20

చ. విని నినుఁ జూడ వచ్చితి భువిం గడుఁ బుణ్యుఁడ వంచు నన్న నో
మునివర శిష్యుఁగాఁ దలఁచి ముద్దునఁ బల్కెద వెంతవాఁడ నే
ననుచు వినీతుఁడై నఁ గొనియాడి గుణాఢ్యుఁడ వీవు నీయశం
బనఘచరిత్ర బ్రహ్మభువనాంతము ముట్టిన దింత చాలదే. 21

---

1. వచ్చె నపుడు నరపతిఁజూడన్.

క. విశదమగు కీర్తివసనము
కృశరక్షక! సప్తతంతుకృత మయ్యెఁ జతు
ర్దశభువనంబులఁ గప్పెను
వశమే నినుఁ బొగడ శేషవాణీశులకున్. 22

వ. కావున నీ కసాధ్యంబు లే దెట్లన్న. 23

క. ధాత్రీశ పుణ్యనిర్మల
గాత్రులకును జగములో నగమ్యము గలదే
క్షత్రియపుత్రుఁడు విశ్వా
మిత్రుఁడు బ్రహ్మత్వపదవి మేరల మీఱెన్. 24

క. స్వకులోచితధర్మముఁ ద
ప్పక మనువారలకు వలయుపని దుర్ఘటమే?
ప్రకటంబుగ ఋషిపత్నులు
సికతాకలశముల జలము చేరుపుగొనరే. 25

వ. దీనికి దృష్టాంతంబుగ నీవును దీనం గుండఁ జేసి నీరు నించిన నిలుచు
నని యిసుక చేతి కిచ్చిన నృపాలుం డందుకొని. 26

క. అటు చేసినఁ జిత్రము మి
క్కుటముగ నా దానధర్మగుణసిద్ధునిచే
ఘటితరస మైనసికతా
ఘటి యొప్పెను రసము ఘుటికగట్టినభంగిన్.[1] 27

---

1. ఉ. ఆగతి గుండ నిల్చిన ధరాధిపుఁ గన్గొని నారదుండు నీ
వీగతిఁ బుణ్యకీర్తి వెలయించుచు నిచ్చలుఁ దీర్పు సత్రము
ద్వేగములేక చేయు మని తెల్పి వియద్గతి నేగె నంతలోఁ
ద్యాగము భోగముం దగుసుదర్శనుఁ దచ్చటఁ దాను మెచ్చుచున్.

గీ. క్రొత్తకడవ దెచ్చుకొని వండి మఱి దాని
మీఁద వండిపెట్ట మెచ్చు గాదు
మంటఁ జేసి మొదల మంటనే కఱిగొన్న
దానఁ దొలుతవండఁ దగుట యెట్లు.

(ఒక తాళపత్ర ప్రతిలో ఈ పద్యములున్నవి.)

క. కృతిఁ గుండలు నిలిచిన స
త్కృతిఁ గనుఁగొని నారదుండు దినమును నీ వీ
గతిఁ బుణ్యకీర్తి వెలయిం
పు తపోనిష్ఠలను వెలసి పుణ్యవిచారా. 28

వ. అని యుపదేశించి చనిన. 29

ఆ.వె. ఇట సుదర్శనుండు నీమట్టికుండల
నిచ్చ వండిపెట్ట మెచ్చుగాదు
మంటఁ జేసి మొదలి వంటనే కఱిగొన్న
దానఁ దొలుత వండఁ దగుట యెట్లు.

మ అని మృద్భాండము లెల్లమాని సికతాయత్తంబు లౌ కుండలన్
ఘనుఁడాపాయసశాకసూపముల పాకం బెప్పుడుం జేయుచుం
దనియన్ బ్రాహ్మణభోజనంబు లిడుచుం దానొక్కనాఁ డప్పదా
ర్థనికాయంబులు వండఁచోటఁ జని తత్సామగ్రి వీక్షింపఁగాన్. 30

క. వెస లుడుకం గని నృపుఁ డు
బ్బసమున నే నిట్టిఘనత వడసితి ననఁగా
నిసుమునఁ జేసినకుండలు
విసవిసలై విరిసెఁ బుణ్యవిపరీతగతిన్. 32

క. ఉలికి యతం డప్పుడు మదిఁ
గలఁగుచు నిటఁ గల్మషంబు గలసెనొ తగు వి
ప్రులయెన్నిక గూడదొ హో
తలు మంత్రముఁ దప్పిరొక్కొ ధర గదలెనొకో.

మ. అని యుత్సాహవిహీనుఁ డౌచు నతిచింతాక్రాంతుఁడై యుండఁగా
దనయుచ్చన్మని తొంటిచాడ్పున వియద్భాగంబు శోభిల్ల వ

చ్చినఁ బూజించి మునీంద్ర నామహిమకుం జేటయ్యెఁబో నీవు చె
ప్పినమర్యాదయు నెట్లు దప్పె నని నం బృథ్వీశు బోధించుచున్. 34

క. మర్యాదఁ దప్పెఁజిత్తవి
పర్యాసాహంకృతులను బార్థివ "గర్వా
త్కార్యం వినశ్యతి" యనుచు
నార్యులు మునుచెప్పునీతి యదితప్పగునే. 35

క. పర్వతపథమున రథమును
బర్వస్త్రీసంగమమున బ్రాహ్మ్యవ్రతమున్
గర్వమున ధర్మకార్యము
నుర్వీభాగమున నావయు న్నడవ దనా. 36

క. ఇంతమహిమ వడసితి నని
సంతసమున నీవు రాజసము గైకొన్నన్
సంతతముఁ జేయు సుకృతం
బింతయు ని ట్లింకె నింక నే మనవచ్చున్. 37

ఉ. నావుడు భూవరుండు మునినాయక నే నపరాధి నైతి నేఁ
డావిధ మేక్రియం గలుగు నానతి యి మ్మని మ్రొక్కినంత నా
దేవమునీంద్రుఁ డి ట్లనియె ధీరుఁడ వై మది నుబ్బు లేక భూ
దేవసపాదలక్షఁ బరితృప్తి యొనర్పుము భుక్తిముక్తులన్. 38

క. బహుదినములు జరపఁగఁ ద
న్మహిమయుఁ జేకూరు నింక మనమున గర్వా
గ్రహము వల దనుచు శుభ మెం
దుహితంబుగఁ జెప్పి నారదుఁడు సనినంతన్. 39

క. తాఁకిన మఱి వంగినక్రియ
నాఁకొని వడివండుకొన్న యనువున నృపుఁడుం

దేఁకువసెడి తొల్లిట్టివత
మాకొలఁదినె నిత్యసత్ర[1] మచ్చట జరిపెన్. 40

ఉ. కావున నేన దాత నని గర్వము గైకొని పల్కు నీ వస
ద్భావుఁడ వైతి దానమును బౌరుషముం బరు లెన్నకుండఁగాఁ
దా వినిపించెనేనియు నతండుఁ దృణంబును నొక్కయె త్తగున్
క్ష్మావర గంజిలో మెతుకు గల్గినఁ గ్రొవ్వట నీమహత్త్వముల్. 41

ఆ.వె. అనుడు ఘనుఁడు భోజుఁడును మనంబున గ్రుక్కి
బమ్మరిల్లి పసిఁడిబొమ్మ! నాదు
దానమల్ప మన్నదానవు మీరాజు
దానమెంత చెప్పు దాన నిలుతు[2]. 42

వ. అనిన సాలభంజిక యి ట్లనియె నతం డిట్టి మహావదాన్యుండు. 43

క. పొడగన్నంతనె వేయును
నొడివినఁ బదివేలు నగిన నూత్వేలు మనం
బొడఁబడి మెచ్చినఁ గోటియు
నడిగెడువారలకు నిచ్చు హాటకమయముల్. 44

-: చతురంగ తజ్ఞుని కథ :-

మ. అది యెట్లన్న నతండు కీర్తి దిశలన్ వ్యాపింప భూమండలం
బుదధు ల్మేరగ నేలుచుండి యొకనాఁ డుర్వీశులు న్మంత్రులున్
సుదతీరత్నములున్ రసజ్ఞులుఁ గవిస్తోమంబులుం గొల్వ న
త్యుదయశ్రీఁ గొలువిచ్చి యుండఁగఁ గవీంద్రుం డొక్కఁ డేతెంచుచున్.

సీ. దందశూకాధిపోద్దండభుజాదండ
　　భూరివిశ్వంభరాభారధుర్య

---

1. మాకొలఁదినె నిత్యసత్ర మచ్చట—చిన్నయసూరిగారి పాఠము. మాకలసత్రంబుభంగినచ్చట—ఇతరప్రతులలో. 2. దాన మెంత నీవు దానిఁ దెలుపు. చి. సూరిగారు. దానమెంతనేర్పు—

జంభారిపరికీర్తితాంభోజినీమిత్ర[1]
సూణుసమాహియదాణరాయ[2]
అక్కిణహృదయ దండొక్కకేళశక్కేశి
పతివఃకణీవళశపక్కడక్క
అంకక్కరిక్క మహాలదసాందన
లవలవప్పహిత తులఃకధీర

ఆ.వె. ధీరసంపదస్తు దేవబంధకహిమ[3]
దఃకసొక్కు మోరిదర్శనిచయ
యనుచు నాల్గుభాషలను రాజు దీవించి
నయనసంజ్ఞ నాసనమున నుండి. 46

సీ. రాజేంద్రయాఅక్షరముల పేరిటివాఁడ
నాద్యక్షరము మాన నశ్వవేది
రెండక్షరములఁ బరిత్యజించిన నాట్య
కర్త మూఁడుడిపిన గతవిదుండ
నాలుగు నుడిగింపఁ జాలనేర్పరి నైదు
విడిచిన బుధుఁడ నీవిధము గాక
సర్వాక్షగంబులుఁ జదివిచూచిన బుద్ధి
బలముగాఁగల యట్టిప్రౌఢుఁ డనఁగ

ఆ.వె. నేతిబీఅకాయనీతి గాకుండంగ
నిన్నివిద్యలందు నెన్నఁబడ్డ
సార్థనాముఁ డైనయర్థిగా నెఱుఁగుము
విబుధపంకజార్క విక్రమార్క.

---

1. యంభోఝణీమిత్ర. 2. ఈ పద్యములోని ప్రాకృత శబ్దములు తెలియుటలేదు. ఇందు చతుర్విధ ప్రాకృత భేదములున్నట్లు చెప్పఁబడినది. 3. దేవబంధకహోదు.

తే. అనిన(గ్రమ్మఱ( జదివించి యల్లనవ్వి
ధరణిలోనీవు "చతురంగతద్జ్ఞ" సంజ్ఞ(
బర(గినా(డవ యను(డు భూపాలు(బొగడి
యెలమి( జతురంగతద్జ్ఞ కవీశ్వరుండు. 48

క. ఇది తగు(దగ దనక కళా
విదులకు నీసమ్ముఖమున విద్యలయెఱుకం
బొదపెట్టుట హనుమంతుని
యెదుర వెసం గుప్పిగంతు లెగయుటచుమ్మీ[1] 49

ఉ. అంబుజమిత్రతేజ భవదగ్రకరప్రసృతంబు లైన దా
నాంబువులందు( బుట్టె భువనాంతము నిండుచు( గీర్తిపుండరీ
కంబు ప్రతాపసూర్యు(డు వికాస మొనర్ప(గ నాకసంబు భృం
గంబుగ లోన( బూని యధికం బగువాసన నొప్పు నెప్పుడున్. 50

క. అని చెప్పినపద్యములో(
దనకీర్తివ్యాప్తియుం[2] బ్రతాపస్ఫురణం
బును గని భాండాగారికు(
గనుసన్నం బిలిచి మెచ్చుగా నాతనికిన్. 51

క. ధనమిప్పించె విలోకన
మునకుం బలుకునకు హసితమునకు( గవికి వే
యును బదివేలును లక్షం
బును గోటియు( బసి(డిటంకములు చొప్పలుగాన్. 52

క. ఘను(డు కవి వీడుకొని యొ
య్యనభాండాగారి( బిలిచి యర్థి నను౦ జూ

1. గుప్పిగంతులేయుటచుమ్మీ. 2. దనకీర్తియువ్యాప్తియు.

ఓనఁ బలికించిన నవ్విం
చిన మెచ్చినను నిట్ల చెప్పక యిమ్మా.[1] 53

చ. అని సెలవిచ్చినన్ ధనగృహస్థితుఁ డౌ తనలెంక యిట్టిచొ
ప్పున నొసఁగంగ యాచకులు భూజనకల్పమహీజ మంచు నిం
పునఁ బొగడంగ దానగుణభూషణుఁ డంచు నవంతినాయకుం
డనుదినమున్ యశంబు దిశలం దలర న్మహి యేలె నెంతయున్. 54

క. అదికారణముగ నతనికి
సదృశం బగుగుణము నీకుఁ జాలదుఁ భువిలో
బొదలని పెద్దటికంబులు
పొద పెట్టక[2] మగిడి బొమ్మ భోజనృపాలా. 55

వ. అనుడు ననంతరంబ. 56

శా. లగ్నం బీక్రియ విఘ్న మొందిన నిరాలాపంబుగా విస్మయో
ద్విగ్న స్వాంతనృపాలపౌరహితవంది వ్రాత మీక్షింపఁగా
భగ్నోత్సాహమనోరథుం డగుచు భూపాలుండు లజ్జాభరా
భుగ్నాస్యాంబుజుఁ డౌచు నింటి కరిగెం బుణ్యం బగణ్యంబుగన్. 57

వ. అంతఁ గొంతకాలంబున. 58

-: రెండవబొమ్మ కథ :-

క. మొలఁ బులితోలును మేనం
బలుచని వెలిపూఁత యఱుతఁ బాములపేరుం
దల మిన్నేఱును జడలను
జలివెలుఁగుం గలుగు మేటిజంగముఁ గొలుతున్. 59

---

1. చినఁ బలికించిన మెచ్చించిన నిట్లని నీవు నాకుఁ జెప్పకయిమ్మా.
2. పొదవెట్టక-శర.

సీ. అనుచుఁ గడంకతో నాభోజతిలకుండు
దివ్యాసనంబెక్కఁ దివిరి మఱియు
ఫలకుసుమాదిశుభద్రవ్యములు గూర్చి
సర్వపూజలుఁ దొంటిజాడఁ జేసి
కవిరాజభూసుర గాయకపాఠక
నర్తకులును దనకీర్తి పొగడఁ
బసిఁడిగిన్నియలు చేపట్టి పుణ్యస్త్రీలు
శిరమున మౌక్తికశేష లిడఁగ

ఆ.వె. ఖడ్గహస్తుఁ డగుచుఁ గదలి నృపాసన
ప్రాంతభూమి చేరె గ్రహబలంబు
గలుగువేళఁ బూర్ణఘటికాంతనాదంబు
చెవుల సోఁకినంత శీఘ్రగతిని. 60

క. శింజాయితమంజీర
వ్యంజితనీలాంశుభృంగ మగు పదకంజం
బంజక యిడఁగా వేళా
భంజిక[1] యై యచట సాలభంజిక పలికెన్. 61

క. ఓహో భూవర వలవని
హాహూలివి[2] యేల విక్రమార్కునిసరిగా
సాహసమును గంభీరో
త్సాహంబును లేక యెక్కఁ దరమే నీకున్. 62

ఆ.వె. అనుడు నిలిచి భోజుఁ డాత్మగుణంబులు
చెప్పఁ జూచి మొదలితప్పు దలఁచి

---

1. భంజని 2. వలదుసుమాహూలివి. యాహూలివి-చిన్నయసూరి.

మాని నాఁటిబొమ్మ పూనిక నీవును
దప్పకుండఁ జెప్పు తద్గుణములు. 63

క. అనవుడు నది యిట్లను నీ
గొనములు గలనృపులఁ బేరుకొని చెప్పం జూ
చిన జగమున నుజ్జయినీ
మనుజేంద్రుఁడుగాక యితరమనుజుఁడు గలఁడే.

క. శుభలక్షణుఁడు వదాన్యుం
డభయుం డీఁకఁ గలుగనేర్చునయ్యా "నభూతో
నభవిష్యతి" యనుపలు కా
ప్రభువునకు సరిచెప్పుచోటఁ బలుకఁగవచ్చున్. 64

శా. ధారానాథ యనాథసస్యములకున్ ధారాజధారాధరా
కారుం డై కరుణామృతంబు గురియంగాఁ బ్రాజ్యసామ్రాజ్యల
క్ష్మీరూఢిం జగ మెల్ల నుల్లసిలఁగా శ్రీవిక్రమార్కాఖ్యుఁ డు
ర్వీరామారమణుండు కీర్తిఁ బరఁగెన్ వీరుం డుదారుం డనన్. 66

మత్తకోకిల. అమ్మహీశుఁడు నాఁడునాఁటికి నాత్మభూముల నన్యదే
శమ్ములందుల వార్తలం బరిచారకు ల్వినిపింపఁగా
నిమ్ముతోడ నవంతిపట్టణ మేలుచుండఁగ దూరదే
శమ్మువార్త లెఱుంగఁబోయినచారు లిద్దఱు వచ్చినన్. 67

ఉ. అచ్చటివార్త లెల్లఁ దెలియ న్విని వారల నాదరించి మీ
రిచ్చటి కేగుదెంచునెడ నీనడుమన్ గిరులందుఁ గానలం
దచ్చెరు వేమి గంటి రని యానతి యిచ్చిన నందులోన న
య్యచ్చ యెఱింగి యొక్కఁడు నరేంద్రున కిట్లనియె న్వినీతుఁడై. 68

సీ చిత్రకూటాద్రిపైఁ జిత్రంబు గనుఁగొంటి
నచటి బిల్వద్రుమప్రచుర మైన

పుణ్యతపోవనంబున రత్నకాంచన
మయమైన దేవతాలయము గలదు
లోకైకవంద్య మందాకినీజలధార
తోరమై ముందటఁ దొరఁగుచుండు
నానీరు శుద్ధున కమృతమై పొలుపారుఁ
బాపికిఁ గాటుకభంగిఁ దోఁచు[1]

ఆ వె. దానిపొంత నొకఁడు మౌనియై జపముతోఁ
బాయకుండ వేల్మి సేయుచుండు
నతని కెన్నియేఁడు లరిగెనో యొలికిన
హోమధూళి హిమనగోన్నతంబు. 69

మ. అని చోద్యంబుగఁ జెప్పిన న్విని తదీయాలోకనోత్సాహియై
మనుజేంద్రుండును దిగ్గనం గదలి రమ్యా చూత మామౌని పా[2]
వనతీర్థం బని వానిఁ దోడుకొని భాస్వత్ఖడ్గసాహాయ్యుఁ డై
చనియెం గ్రూరమృగప్రచారతరువిస్తారంబులం దూఱుచున్. 70

వ. ఇట్టి దుర్గమమార్గంబునం జనుదెంచుచు నొక్కయెడ. 71

ఉ. భూరమణుండు గాంచె నతిభూరిపయోధరఝూట మాత్మవి
స్తారపునఃప్రరూఢపటుశాఖమహావటజూట మంచితో
ర్వీరుహసంభృతైకమునివీరకృతోటజవాటము న్సునా
సీరమణిప్రభాపటలచిత్రితకూటముఁ[3] జిత్రకూటమున్. 72

సీ. అందులతీఁగె లింద్రాంగనాగములతోఁ
జెలిమి సేయుచు మిన్నుగలయఁ బ్రాఁకు

1. ఆనీరు పుణ్యుల కమృతంబువలెనుండు — చిన్నయసూరి. 2. చూత మాదివ్యపావన. 3. చిత్రవనాటము.

నందుల మ్రాఁకులు నందనవనకల్ప
తరువులతోఁ గూడి పెరుఁగుచుండు
నందుల క్రొవ్విరు లన్నదమ్ములమాడ్కిఁ
జుక్కలవాసన కిక్కసేయు
నందుల సెలయేఱు లాకాశగంగతో
నటనలు సలుపుచు నాడుచుండు

ఆ.వె. నందుల మెలఁగు కరులై రావతముఁదాముఁ
గదుపుగట్టిమేసి మదము గురియు
నందుఁ గలుగు మౌను లాస ప్తమునులతో
నిత్యసత్యగోష్ఠి నిలుతు రచట. 73

ఉ. అందుల నొక్కచో జలకమాడుచునుండఁగఁ దొల్లి మేదినీ
నందనవక్త్రవేణినయన స్తనకాంతులు జాతిరూపులై
యిం దుదయించె నాఁగ నుతి కెక్కుచుఁ బెక్కుదినంబు లంబుజేం[1]
దిందిరమీనచక్రములు దేలుచునుండు సరోవరంబులన్. 74

క. వివిధద్వాదశరాసులు
దవిలి తిరిగి పాళ్లసంపదలు చేకుఱమి
న్నవరత్నరాసులకునై
నవగ్రహంబులుం దదంగణంబులఁ బొలయున్. 75

క. వింతలుగా నగ్గిరిపొడ
వింతం తనిచెప్ప నలవి యే వెన్నెలఁ ద
త్ప్రాంతంబునఁ గరఁగిన శశి
కాంతంబులు చంద్రుకందు గడుగుచునుండున్. 76

---

1. నుతికెక్కుదినంబులయందు నంబుజేం

సీ. శిరమున విమలపుష్కరవతి యగుమాల్య
వతి రత్నమాలికావతి యనంగ
మృగపాదపట్టన మృదులమౌజేగుఱు
ధూళి శేఖరితసిందూర మనఁగఁ
ప్రబలసమీరణోత్పతితంబు లైన పు
ష్పంబులు కరశీకరంబు లనఁగ
సర్వతోముఖసముచ్చాలనవారి[1] ని
ర్ఝరములు మదజలస్రావ మనఁగఁ
తే. గీ. దన్నుఁ జేరినమేఘముల్ మన్ననంగ[2]
సాలతరువులు బర్హ ధ్వజము లనంగ
నేచిస్వారాజ్యపట్టగజేంద్రులీల[3]
నిలిచిపొలుచు నయ్యచలంబు నృపతి యెక్కె.[4]

శా. లంకేశారిపదాంకితంబులు ఝరాలంకారకూలంకషల్
పంకేజాకరసంకులాంతరములం బ్రవ్యక్త దివ్యాంగనా
సంకేతంబులు మీనకేతనధనుష్టంకారశంకావహా
ఝుంకారాళికులంబులుం గల మహాశైలస్థలుల్ చూచుచుః. 78

క. ధారాధరమార్గాగత
ధారాళం బగుచు ధరణిధరమధ్యకృతా
ధారం బై ధరఁ బరఁగిన
ధారాతీర్థంబు గనియె ధారాధీశా. 79

వ. కనిన నితని మనఃప్రసాదంబు దట్టం బై నిలిచె. 80

---

1. చ్చాలనలోలి 2.. పన్ననంగ 3. ఉజ్జయినిరాజుపట్టగజేంద్రలీల-ఈ పాఠము యతిచెడినది. 4. యిక్కడ వ. "అచటఁ దెరువుఁజూపుచు మావంతు క్రియాహరుండు చూపమున్నుగా నతండు చని" అని యొకదానిలోఁగలదు.

క. దుర్మార్గునకైన మహా
ధర్మస్థలి నాత్మశుద్ధి దలకొను ననఁగా
ధర్మంబుల కాకరమౌ
నిర్మలునకుఁ జిత్తశుద్ధి నిలుచుట యరుదే. 81

భుజంగప్రయాతము. అతం డంత సుస్నాతుఁ డై రత్నహేమాం
చితం బై సువర్ణాద్రి చెల్వొంది దేవా
న్వితం బైన హర్మ్యంబు వే సొచ్చి యాదే
వతం గాంచి పూజించి వచ్చె న్నతుండై. 82

ఆ.వె. అచటిహోమశాల కరిగి మౌనంబునఁ
ఘనతపోవిభూతి కలిమిమెఱసి[1]
మధురయుతములైన మారేడుఁబండుల
వేల్మి సేయుచున్న విప్రుఁ జూచి. 83

ఆ.వె. అన్నపుష్పఫలజలాక్షతాదులు చేత
నున్నవాఁడును[2] జపహోమములను
జేయువాఁడు బ్రణతి సేయఁదగరుగాన[3]
మనుజవిభుఁడు మ్రొక్కుమానిపలికె. 84

క. ఓవిప్రోత్తమ హవనం
[4]బీవెరవున జరుగ వెన్ని యేఁడులు చనియె
న్నావుడు నుబ్బస పుచ్చుచు
నావిధిచేఁతలకు నేమి యనఁగల దధిపా. 85

---

1. దపము కలిమి దోఁప జపముతోడ. 2. నున్నతనికిని. 3. జేయునతనికి నతి చేయఁదగదుగాన. 4. సహనంబీవెరవున......నావుడునుబుస్సగొట్టుచు- చిన్నయసూరి.

ఉ. ఇచ్చట నేండ్లు నూఱు సనియెన్ జగదంబికి నాయవస్థకు
న్మెచ్చదు కూడు మాని రవి మీఁదఁ దపింపగఁ వేల్మి సేసి ము
చ్చిచ్చున వెచ్చుచుండి తెగఁ జిక్కి-తి నన్నుఁ,గృపానువృత్తిఁ దా
నచ్చటివాని లేపి విహితాసనుఁడై నృపుఁ డాత్మనిష్ఠతోన్. 86

క. వ్యాలోలకరాళకజి
హ్వాలం బగు సప్తజిహ్వవదనంబున భూ
పాలుఁడు మధుమిశ్రిత మగు
మాలూరఫలంబు వేల్చె మంత్రము కొలఁదిన్. 87

వ. అట్లు హోమంబు గావించిన నయ్యుమ నెమ్మనంబున నమ్మిక పొడమి పొడ
సూపకున్నం గడచూపునం గెంపుగదుర మదిం బదరి దొరకొన్నకర్జం బుజ్జ
గించుట యిజ్జగంబున నొజ్జల లజ్జలుడుపురజ్జులను నుజ్జయినిఱేఁడు మారే
డుఁబండు మాని తన మెడం జూచి. 88

తే.గీ. పలుకుఁదేనియ గలతలపండువేల్వఁ
దలఁచి తలచికు్కి చెక్కి మీఁదటికిఁ[1] జెరివి
యెడమ కేలఁదెమల్చుచునడిదమెత్తి
మెఱుఁగుమిడుఁగుఱులెగయగా మెడకుఁబూనె. 89

వ. ఇట్లు పూని యుంకించిన. 90

క. ఓహూ నృప నీధర్మో
త్సాహములకు మెచ్చితిని నిజం బిది యిఁక నీ
సాహసము విడువు మని త
ద్బాహోఖడ్గంబు వట్టెఁ బరమేశ్వరియున్. 91

క. పట్టి నిలుచుండి నృప నీ
కెట్టిహితం బైన వేఁడు మిచ్చెద నని చే

1. చక్కి- మీఁదటికి.

పట్టిన ప్రొక్కి మహీవరుఁ
డిట్టనియెం దల్లి మెచ్చి తెట్టులు నన్నున్. 92

మ. ఇతఁడు స్నానము సంధ్యయున్ జపము ని ట్లేకాలముం జేయఁగా
శతవర్షంబులు పోయె నీద్విజుని మెచ్చం జెల్లదో మెచ్చుసం
గతి గాదో గుణ మానతి మ్మనిన నోక్ష్మాపాల యీదు స్తర
వ్రతము ల్గల్గియుఁ జంచలంబు మతి భావం బల్పు మెప్పట్టునన్. 93

ఆ.వె. మేరుశైలధీర మేరులంఘితమున
నాఁగు నీవ్రతంబు నగణితంబు[1]
చంచలాత్మకృతము సంకల్పరహితంబు
నైన జపము లెల్ల హానిఁ బొందు. 94

క. దేవర భువిఁ గాష్ఠంబున
గ్రావంబునఁ గాంచనమునఁ గలుగఁడు శుచియౌ
భావమునఁ గలుగనేర్చును
భావజ్ఞా! భావశుద్ధి పరమార్థ మనన్.[2] 95

క. డెందంబున సందేహము
నొందక ప్రహ్లాదుతండ్రి నొడఁబఱిచెడుచో
నిందుఁ గలఁ డనినఁ గంబము
నం దుదయింపండె విష్ణుఁ డసురులు బెదరన్. 96

క. దేవద్విజమంత్రౌషధ
దైవజ్ఞాచార్యతీర్థధర్మముల యెడన్
భావన యేవిధమున నౌ
నా వెరవున నచటి సిద్ధి యగునిద్ధగతిన్.[3] 97

---

1. మేరుసమానమౌ ఘనతపంబులౌనగణితమైన. 2. పరతత్త్వ మనన్.
3. నీదుక్రియన్.

ఆ.వె. భావ మస్థిరంబు గావున వీనివ్ర
తంబులెల్ల నిష్ఫలంబు లయ్యె
నీవు నిష్ఠ నిట్లు గావించితివి గాన
గడియలోన మెచ్చు గలిగె నీకు. 98

క. ధన్యుఁడ వనవుడు విని స
త్కన్యాదానమును దేవతావరమును రా
జన్యవరాజ్ఞయుఁ దిరుగుట
యన్యాయము గానఁ దిరుగ కంబిక వినుమా. 99

ఉ. ఇష్టములెల్ల నాకుఁ దగ నిచ్చెద నంటివి సర్వముఁ బ్రవత
భ్రష్టుఁడు నాక వీనికిఁ గృపామతి నిమ్మని మ్రొక్కినంత సం
తుష్టి వహించి దేవత చతుశ్శతవత్సరభోగ్యమైన యు
త్కృష్టమహీపతిత్వమును దివ్యపదంబును నిచ్చె వానికిన్. 100

క. వానికి ని ట్లిచ్చి ధరి
త్రీనాయకుఁ బరిణమించి దేవియు నంత
ర్ధానమ్మునొందె విప్రుఁడు
నానృపు వెఱఁగంది పొగడి యరిగె నిజేచ్ఛన్. 101

శా. తత్సేవాఫలదర్శనంబున మహాప్రస్థాన విశ్రాంతిగా[1]
నుత్సాహంబును సాహసంబును బ్రతాపోదారభావంబు న[2]
త్యుత్సేకంబును భూషణాకృతులతో నొప్పారఁగా భూపతీ
వాత్సల్యంబున వచ్చె విక్రమయశోవర్ధిష్ణుఁ డుజ్జైనికిన్. 102

వ. కావున నీ కిట్టి గుణంబులు సమకూరకునికి నెక్కించనదు పొమ్మనిన విని భోజుండును మనంబున నతనిం గొనియాడుచు నుద్విగ్నితాలగ్నుండై[3]

---

1. దదధ్వశ్రాంతిగాఁ జిత్తమందుత్సా. 2, గర్వోత్సేకంబున. 3. విఘ్నితాలంఘితకాలజ్ఞుండై.

సిగ్గుపడుచుఁ బూర్వద్వారగమనంబు మాని యపరద్వారగమనోత్సుకుం డగుచు నాఁటి కద్దివ్యాసనం బెక్కరాకుండుట తెల్లంబుగా మొగంబు తెల్లంబడఁ దిరిగి చని మఱి యొక్కనాఁడు. 103

-: మూఁడవబొమ్మ కథ :-

క. ఉల్లోలదుగ్ధసాగర
కల్లోలకరాగ్రమందకంపితఫణభృ
ద్వల్లభమణిమయడోలా
వేల్లనసుఖలోలుఁ డైన వేల్పుం దలఁతున్. 104

క. అని నియమంబున హితశా
కునికస్వరశాస్త్రవేదకోవిదయుతుఁ డై
యను వగుదినమున సింహా
హాసన మెక్కఁదలఁచి భోజజనపతి చేరెన్. 105

క. చేరిన నచ్చటిపుత్రిక
యారాజుం బలికె వాసవాసన మెక్కం
గోరుట జగ మెఱుఁగ మహా
దారిద్ర్యుఁడు క్రతువుసేయఁ దలఁచుటచుమ్మీ. 106

ఉ. ఆర్యులఁ గూర్చి నేఁడు శుభమైన ముహూర్తము చూచి వట్టిగాం
భీర్యము దోఁపఁగాఁ దగని పెద్దఱికం బిదియేల సన్నపుం
గార్యమె విక్రమార్కనృపుగద్దియయెక్కుట వానిఁబోల నౌ
దార్యము నీకుఁ గల్గినఁ బదం బిడు మోజగ భోజభూవరా. 107

వ. అనుడు విస్మయమానమానసుండై మానవేంద్రుం డాసింహాసన యానంబు మాని యనుమానించి మీనరపతివితరణంబు లేతెఱం గెఱింగింపు మనిన నది యిట్లనియె. 108

సీ. బలమున నిజమునఁ బ్రాణరక్షణమున
భీము భీమాగ్రజు భీమగురునిఁ
జెలువున సంకల్పసిద్ధిఁ దేజంబునఁ
బద్మారిఁ బద్మజుఁ బద్మమిత్రు
శివభక్తిఁ గీర్తి విశిష్టదానంబున
బాణు బాణారాతి బాణజనకు
నైశ్వర్యమున రతి నఖిలోత్సవస్ఫూర్తిఁ[1]
గామసంహరుఁగాముఁగామసఖుని
ఆ.వె. నష్టభోగముల రణాటోపమున బుద్ధి
నింద్రు నింద్రతనయు నింద్రమంత్రిఁ
గ్రేణిసేయు ననుచు జాణలువొగడంగ
నవని యేలె విక్రమార్కవిభుఁడు.

క. సాహసము జయము బలము
త్సాహంబుఁ బరాక్రమంబు ధైర్యముఁ గలని
ర్మోహకుని దొరయునెడ సం
దేహించుచునుండు నాదిదేవుండైనన్. 110

క. నరుఁడు మగతనము నేర్పునఁ
బరఁగించెడుచోటఁ దోడుపడుదురు సురలున్
ధరగౌళికునకుఁ దోడ్పడ
గరుడఁడు జక్రంబు హరియుఁ గలిగినభంగిన్. 111

-: గౌళికుని కథ :-

క. అనవుడు భోజుఁడు గౌళికుఁ
డనువానికి నెచట విష్ణుఁ డాయుధమును వా

---

1. నఖిలలోకస్ఫూర్తి.

హనమును దోడ్పడియెను నే
వినవలతుంజెప్పు మనిన వెస నిట్లనియెన్. 112

ఆ.వె. తుంగసౌధశృంగసంగతాంబర మొచుఁ
బూర్వభూమి నొక్కపురవరంబు
భజనకెక్కిమున్ను నిజమైనపేరిట
వెలసెఁ భువిఁ బ్రతాపవిషయ మనఁగ. 113

వ. అట్టిపురంబున. 114

క. సేనానికి నెన యనఁ బర
సేనాభంజకుఁడు గలిగె క్షితిపతి విష్వ
క్సేనారాధకుఁడు బృహ
త్సేనాఖ్యుండు బల్మి భీమసేనుఁడు వోలెన్. 115

వ. ఆనరేంద్రునకు నానందిని యనుసుందరియందు నయనానందంబుగా నొక్కనందన యుదయించె.

క. ఆరాజతనూభవ క
న్యారత్నము మరుని మోహనాస్త్రముక్రియ నా
కారంబున నొప్పుచు ధర
లో రూఢికినెక్కె నది సులోచన యనఁగన్. 117

క. భూవలయంబున నుపమా
జీవన మగు వస్తు వేర్చి చెప్పెద మనఁగా
నావెలఁది యవయవములకు
నేవియు సరిగాక యునికి నేమనవచ్చున్. 118

సీ. మృదుపల్లవంబులు ముదురక యుండినఁ
బదసరోజములసంపదలఁ బోలుఁ

గరికరంబులమేనఁ గర్కశభావంబు
లేకయుండిన నూరులీలఁ బోలుఁ
జక్రవాకంబులు సడిసన్న రేయెల్లఁ
బాయకుండినఁ జనుదోయిఁ బోలుఁ
జుక్కలఱేఁడు దా గ్రుక్కక పొంగక
కందకుండిన ముఖకళలఁ బోలుఁ

ఆ.వె. జంచరీకచయము సంచలింపక కూడి
నిలిచెనేని కురుల చెలువుదాల్చుఁ
బువ్వుఁదీఁగె మొదలిమవ్వంబు దప్పక
ననిచెనేని మేనియనువుఁబడయు. 119

మ. తనలావణ్య మగణ్యదర్పమయమై తారుణ్యపూర్ణంబుగా
ననవద్యద్యుతితోఁడ నానృపతికన్యారత్న మేరాజనం
దనుల న్మెచ్చక మీఁది మేడకడ గంధర్వాంగనావిభ్రమం
బున నుండెఁ మృదువస్త్రగంధ సుమనోభూషాదిభోగంబులన్. 120

సీ. తరుణి యీక్రియ మేడఁ దరలకుండుటయును
దెలిసి గౌళికుఁ డనుధీరవిటుఁడు
చాయలయుక్కునఁ జక్రంబు గావించి
కాష్ఠయంత్రంబున గరుడిఁ జేసి
తావిష్ణుఁడై మన్మథప్రథనమునకు
మెఱపుగాఁ గస్తూరి మిగుల నలఁది
పసపువన్నియ పట్టువసనంబు గావించి
తిరునామ మొప్పఁగాఁ దీర్చి కడఁక

తే.గీ. నెక్కి కీలున వాహన మెగయఁజేసి
పవనపథమునఁ జనుదెంచి బాలమ్రోల

నిలిచి నేనిదె కృష్ణుఁడ నిన్నుఁ గూర్చి
వచ్చితిని నన్ను వరియింపు లచ్చికరణి. 121

చ. అనవుడు బాల విస్మయము హర్షము లజ్జయు నగ్గలింప నా
తని నట నుంచి యేగి తనతండ్రికి నట్టితెఱం గెఱుంగఁ జె
ప్పిన నతఁడు ప్రియంబున నభీష్టము నేఁ డొనఁగూడఁబోలు నే
కని చనుదెంచి యచ్చట గవాక్షముఖంబునఁ జూచి యుబ్బుచున్. 122

క. చల్లనికొండకు గిరిజా
వల్లభుఁ డల్లుఁ డగునట్టివడువునఁ దల్లీ
నల్లనిదేవర నీచే
నల్లుఁ డనఁగఁ గలిగె నేఁ గృతార్థుఁడనైతిన్. 123

క. అమ్మాతడయక కైకొను
పొమ్మా యని యనుప నేగి పొలఁతుక యచటన్
నెమ్మి దఱకొత్తఁగాఁ దన
నెమ్మన మలరంగ నాతని న్వరియించెన్. 124

ఉ. గౌళికుఁ డయ్యెడ న్మది వికాసము హాసముఁ గూడియాడఁగా
బాలిక నంతనంత మృదుభాషణభూషణ తోషణంబులం
గేలికిఁ జేర్చి లజ్జ కడకీ లెడలించుచు బుజ్జగించి పాం
చాలుని పోలిక న్సురతసౌఖ్యము తీపులు చూపె నేర్పునన్. 125

ఉ. అజ్జలజాక్షియున్ హృదయమందునఁబుట్టినవానిపోరుచే
బుజ్జవ మియ్యకోలు గొనుపొందునఁ గూడిన నింపుగైకొనున్
సజ్జకుఁ దాన చేరు రతిచేష్ట లెఱుంగఁగడంగు చెయ్వులన్
లజ్జయొకింత చేడ్పడఁ జెలంగుఁ బెనంగు ననంగకేలిమై. 126

క. ఇటు నానాఁటికి నొయ్యనఁ
గుటిలాలక యులుకు దీర్చుకొనుచుం దనకాఁ

గిట నాదటఁ జెలగఁగ న
వ్విటుఁడు న్సమరతుల గారవించుచుఁ దివుటన్. 127

సీ. అంగుష్ఠ మడుగు గుల్ఫాంతంబుఁ జిఱుదొడ
జఘనంబు నాభి వక్షంబుఁ గుచము
భుజమూలములు గళంబునుజెక్కు మోవియు
నయనముల్నొదురుముందలయుననఁగఁ
గలుగుచోటులఁ జంద్రకళలఁబెంపునఁ జెక్కు
నారోహణావరోహణము లెఱిఁగి
బీజమంత్రాక్షతవ్యాజదృగ్బాణముల్[1]
హృదయాదిమర్మంబులెక్కఁజేయు

తే.గీ. సుఖముఖాంకనఖరచుంబనభూషణ
గ్రహణతాడనములఁ గదలఁబొడిచి
చిత్తశయనుదెలిపి యుత్తానశాయిత
ముఖ్యసురతతంత్రములఁ గలంచె. 128

క. మనసిజమర్మజ్ఞునితో
మనమలరఁగఁ బెనఁగి కరఁగె మానిని రతిసం
జనితసుఖంబున నెలపొడు
పునఁ గరఁగెడు చంద్రకాంతపుత్రికఁ బోలెన్. 129

శా. ఆజాడం గుచచక్రవాకరుచి పెంపారం దదీయాననాం
భోజాతప్రభ లుల్లసిల్లంగ సముత్ఫుల్లాక్షి[2] మీనద్యుతుల్
రాజిల్లంగ సులోచనాసరసిలో రాయంచభంగిం గళా
భ్రాజిష్ణుం డగు గోళికుండు హరిరూపం బొంది క్రీడించుచున్. 130

---

1. హృద్భషల హృదయాదిమర్మవాహికులఁజొనిపి. 2. పెంపారంగ శుంభన్ముఖాం భోజంబు ల్వికసింపుచుంజెలఁగ నుత్ఫుల్లాక్షి.

ఉ. ఇమ్ములఁ గొన్నియేండ్లు సుఖియింపగఁ దక్కినరాజులెల్లఁ జో
ద్యమ్ముగ నిట్టివార్త విని యచ్యుతుఁ డీతని యుల్లుఁ డయ్యె[1] గ
ర్వమ్ములు మాని వీనిఁ గొలువం దగునంచు భయమ్ముతోఁ దురం
గమ్ములఁ గుంజరమ్ములను గన్యలఁ గప్పము లిచ్చి పంపఁగాన్. 131

క. చేకొనుచు బృహత్సేనుఁడు
చేకొలఁదుల లోఁగు పెఱిఁగి క్షితిపాలకులం
జీకాకుపఱిచి భూములు
చేకొనఁగా నలఁగి తలఁగి సిగ్గున నొకచోన్[2]. 132

వ అందఱుం గూడుకొని విచారించుచుం దమలోన. 133

క. సమముగ దేశము లేలుచు
నమరిన మగకూడు గుడిచి యధమాధమభా
వముతోఁ బెక్కం డ్రొక్కని
సమరమునకుఁ బోకయునికి[3] చచ్చుట గాదే. 134

క. గణుతింప మానభంగ
వ్రణ మాజన్మంబు నెడ్డ వ్రయ్యలు సేయున్
రణమరణము శూరులకును
క్షణదుఃఖము మీఁద నధికసౌఖ్య మొనర్చున్. 135

ఆ.వె. మానహాని యైన మనుటకంటెను[4]
ప్రాణహీన మైన పదము లేదు
వీనిచేత బాధ వెచ్చుటకంటెను
జక్రధరునిచేతఁ జచ్చుఁ టొప్పు. 136

---

1. డీతని కల్లుఁడంచుగర్వ- 2. కై కొనుచు...క్షితిపాలురఁజీ, కాకుపడ నడిచి భూములు, చేకొనఁదలఁచుడు-నడచి. 3. జొరకయునికి 4. అవనిమాన హానియగుట్రోవ-

క రావణకంసాదికర
క్షోవీరులఁ జంపి తన్నుఁ గూడఁగనిచ్చెం
గావున సమములు నల్లని
దేవర కోపములు నట్టిదేవర వరముల్. 137

సీ. మున్నీటిపాపయు మున్నీటితేపయు
నిల్లాలు నిల్లునై యెసఁగువానిఁ
బాములపగవాఁడుఁ బాములవగవాఁడుఁ
దేరును బాన్పునై తేరువానిఁ
గలువలచుట్టంబుఁ గలువలవెట్టంబుఁ
దనరెండుకన్నులై తనరువానిఁ
బూవింటివాఁడును బూవింటివాఁడును
గారాపు బట్టులై[1] గలుగువాని

ఆ. వె. జోడులేనికంటిజోగికి జోడుగా
నున్నవానిఁ బెక్కు మన్నవాని
దల్లి దండ్రియైన నల్లనివేల్పును
గంట చెడనిముక్తిపంట గాదె. 138

క. చొత్తము చత్త మనుచు ను
ద్వృత్తు లగుచుఁ దెగి ప్రతాపవిషయముపై దం
డెత్తి చనుదెంచినం గని
యత్తఱిఁదా వెడలె నాబృహత్సేనుండున్. 139

చ. వెడలి నిజాప్తసైన్యపరివేష్టితుఁడై చని గర్వపాటవం
బడరఁగఁ బోరిపోరి బల మంతయుఁ జచ్చినఁ జిచ్చులోపలం

1. గారాపు సుతులుగా గట్టియై పట్టియై కలుగువాఁడు-చిన్నయసూరి

బడి వడిఁ దూలివచ్చు శలభంబుతెఱంగున నోహటించి లో
పడక పురంబు సొచ్చి సుతపాలికి నాపద చెప్పి పుచ్చినన్. 140

మ. అది యాత్మప్రియుఁ జేరి, దేవ ! మును ప్రహ్లాదుం గృపం గాచి యు
న్మదుఁ డౌ దైత్యునిఁ ద్రుంచి తీవు మొసలి న్మర్దించి యాయేన్గు నె
మ్మది రక్షించితి నేఁడు ని న్గొలువఁగా మాతండ్రి కిట్టీ మహా
పద వచ్చెన్ రిపుసంఘముం దునిమి నీభక్తు న్భువి న్నిల్పవే. 141

క. వేఁడుకొనిన వాఁడును
మనమున నిటు దలఁచెఁ దొల్లిమగతనమునఁ బూ
నినపూనిక విడిచిన నీఁక
వినువారలుఁ జూచువారు వికవిక నగరే. 142

తే.గీ. నాఁటిసాహసమున నిట్టిబోటిగలిగె
నేఁటితెంపున కొకవేల్పు నిల్వఁబడఁడె
యనుచుఁ జక్రంబుగై కొనియంత్రగరుడి
నెక్కిసూత్రంబుగదలించియెగసివచ్చె. 143

వ అట్టి వేళ నయ్యాదివిష్ణుండు. 144

ఉ. గౌళికుఁ డీగ్గెనేనియు జగంబు జనార్దనుఁ డీగ్గె నంచు న
న్నాలము సేయుచుండుఁ దన యల్లుఁడ నే నని నమ్మియున్న భూ
పాలుఁడు ఓక్క భక్తిఁ దమప్రాణము లొప్పనసేయ నున్న మ
న్నీలతలంపులుం బొలియు నే నటు పోవకయుండఁ బాడియే. 145

క. అని చక్రము చేవెలుఁగఁగ
వినతాసుతునెక్కి వచ్చి విభుఁ డొప్పె సువ
ర్ణనగంబుమీద సౌదా
మినితోఁ జెలువొందు నీలమేఘము పోలెన్. 146

మ. తనదివ్యప్రభ లీక్రియ[1] న్వెలుఁగఁగాఁ దార్క్ష్యుండు పక్షాగ్రచా
లనవాతాహతితోన మేఘములు డొల్లన్మిన్ను ముట్టంగ నే
పున దీపించుట లీలఁ గోపమును రూపుం జూపి చక్రాహతి
న్వనజాక్షుండు నృపాలపంక్తి ననిపెన్ వైకుంఠసంప్రాప్తికిన్. 147

వ. ఇట్లు చేసి తదనంతరంబ తజ్జయంబువిదితంబు సేయం బూని. 148

ఉ. ధన్యజనానుకూలుఁ డగు దానవసంహరుఁ డొత్తె నబ్జమూ
ర్ధన్యము భక్తసద్గతివదాన్యము నిర్జితగర్జితోగ్రప
ర్జన్యము ఛిన్నభిన్నపరసైన్యము దిక్కరికర్ణకీర్ణకా
ఠిన్యము గౌళికావనదృఢీకృతజన్యముఁ బాంచజన్యమున్. 149

క. ఇటు వాని పేరుగా ను
త్కటమగు జయ మిచ్చి చక్రధరుఁ డేగిన ను
ద్భటవృత్తి గౌళికుఁడు న
చ్చట చని రణమండలమునఁ జచ్చిననృపులన్. 150

చ. కనుఁగొని మామఁ బిల్చి ననుఁ గంటివె వచ్చిన యీనృపాలురం
దునిమితి వీరిసంపదలు దొడ్డుగాఁ గొనిరమ్ము నీపురం
బున కని చెప్పి తొంటిగతిఁ బోయి సులోచనఁ గూడి దాని కిం
పొనర విహారము ల్సలుపుచుండె ననేకదినమ్ము లిమ్ములన్. 151

క. కావునఁ దెం పెఱిఁగి యస
ద్భావున కచ్యుతుఁడు తోడుపడియె ననంగా
నావిక్రమార్కునకు నతి
పావనునకు సురలు తోడుపడు టచ్చెరువే. 152

ఉ. ఉల్లసితక్షమాభరణుఁ డుజ్జయినీపతిఁ బోలవచ్చునే[2]
యెల్లముఖంబుల న్విష మనేకవిధంబుల నొల్కుచుండఁగా

---

1. దనుజారాతియునీక్రియన్. 2. నెన్నఁబోలునే.

నల్లము ద్రయ్యం బు స్సనుచు నూరక ద్రోగెడి పాముతోడి పొ.
త్తొల్లక తద్భుజాగ్రమున నుర్వి సుఖస్థితి నుండు నెప్పుడున్. 153

వ. అట్టి యాతనితలంపు సంపదలందు నయవినయాదిగుణంబులం బొదలు.

క. ఓలం బగుసంపద నయ
శీలంబునఁగాక దుష్టచేష్టలఁ గలదే
యాలరిమొదవులకును దల
కోల యిడక చేరి పిదుకుకొనఁ[1] దర మగునే. 155

క. ఎక్కడనుండియొ కూడును
నిక్కము లై తోఁచు నొక్కనిముసంబునఁ దా
మెక్కడికొ విరిసిపోవును
దక్కవు సంపదలు మేఘడంబరము క్రియన్. 156

క. కలిమికిని దగినకొలఁదిని
నెలగల వెలి విడువకున్న[2] నిలుపెక్కడి దొ
కలయఁగ నిండిన చెఱువున
కలుఁగించుక విడువకున్న నాఁగనిభంగిన్. 157

సీ. అని యిట్టితలఁపున నశ్వమేధము సేయఁ
బూని భూసురబంధుభూమిపతుల
రప్పించి శుభముహూర్తమున దీక్షావిధి
గైకొని చేయుచో నాకవిభుఁడు
గరుడగంధర్వయక్షవ్రాతములతోడ
నరుదెంచి తోడ్పడి యాదరింప

---

1. నిలిచిపిండుకొన. 2. వలసినకొలఁదిని నెలగల వెలి వెడలకున్న. నెలగ = ధనము (నెలగలు).

సురల నందఱఁ జూచి ధరణీశుఁ డందులో
రత్నాకరుం డటు రామి యెఱిఁగి

ఆ. వె. యతనిఁదోడితేరహితుఁబురోనాతునంపెఁ
బ్రియముగూర్చిమైత్రినయముమెఱయ
విప్రవర్యుఁ డంత క్షిప్రయానంబునఁ
దెరువునడిచి కొన్నిదివసములకు. 158

మహాస్రగ్ధర. కనియెన్ దుర్వారదర్వీకరమకరఝషగ్రాహరక్షావినిద్రున్
ఘనవీచీసద్భుజాభ్రంకషగుణసమతిక్రాంతకాలాంతరుద్రున్
జనకాధీశాత్మజాధీశ్వరధనురతివిస్తారితావర్తభద్రున్
స్వనదంభోదాతిరౌద్రు న్వరతటవిహితోచ్చ్వాసముద్రున్ సముద్రున్.159

సీ. అనిమిషరక్షణాయత్తజీవనముల
గుహబృహస్పతుల సన్మహిమఁ దాల్చి
యధికనాగేంద్రసమారూఢమహిమల
హరిశచీనాథుల ననుకరించి
రాశీభవన్మకరప్రాభవంబుల
సౌరికుబేరుల సాటి నొప్పి
కమలావృతాయతాకారవైభవముల
బ్రహ్మవిష్ణులతోడిపాటి మించి

ఆ.వె. సంతతప్రవాళకాంతి వసంతక
బాలసూర్యులసరి లీలఁ గ్రాలి
భూమి సర్వదేవతామయుం డనఁ జెల్లి,
యెలమి నేఱులెల్లనేలువాని. 160

సీ. మిన్నంటఁ బొంగియు మేర దప్పక పెక్కు-
భంగము ల్గలిగియుఁ బాఱులేక

సుళ్లెన్ని గలిగిన సుజ్జునత్సుకత్వక
యనుకయ్యుఁ బరులకు ననువుగాక
సరివారిలోపల నురువులు గ్రమ్మఁగా
నేఁపైఁ బొరలియు బేలుగాక
తనలోన బడబాగ్ని దరికొని మండియు
వడగాలి మీలపై సుడియనీక
ఆ.వె.బయలుపడియును దనలోఁతుబయలుపడక
దిగులుపఱచియు నొండెడదిగులుపడక
యిసుముకంటెను గుణమణులెసకమెసఁగ
నసమరసమయమైన వెక్కసమువాని. 161

వ. మఱియు గంగాతరంగిణీసంగతం బై హరజటాజూటంబునుం బోలె శంఖాలంకృతం బై విష్ణుభుజంబునుం బోలె వజ్రసముజ్జ్వలం బై పురందరుకరంబునుం బోలె ముక్తామయం బై ముక్తిపథంబునుంబోలె నీలసమగ్రం బై సుగ్రీవసైన్యంబునుంబోలె విజృంభితపద్మరాగంబై శరత్సమయంబునుం బోలెఁ బుష్పితపుష్యరాగంబై శిశిరంబునుంబోలెఁ బ్రసరత్తుషారంబై హేమంతంబునుంబోలెఁ బటువిద్రుమచ్ఛాయంబై వసంతంబునుం బోలె నుద్దండరాజీవంబై గ్రీష్మంబునుం బోలె నాభీలకూలంకషంబై వర్షాగమంబునుంబోలె మీనమిథునకర్కట మకరాదిసంచారంబై గ్రహమండలంబునుం బోలెఁ బరభీతసపక్షభూభృత్కులాశ్రితంబై మహాదుర్గంబునుం బోలె నొప్పు నప్పారంబుగలవాని. 162

క. ఆనీరధి నెల వింతనఁ
గానేరము తేలగిలు మకరములమీఁదఁ
మైనాకాదులు ఱెక్కల
తో నిలుచుం గరులమీఁది దోమలకరణిన్. 163

అ.వె. ఆట్టిజలధిఁ జేరి యవనీసురుఁడు పలు
మాఱుఁ బిలిచి పిలిచి మదిఁ గలంగి
యుత్తరంబులేని యుదకంబు నచటికిఁ
బిలువ వచ్చి నేను బేలనైతి. 164

క. సరసత్వము సన్మానముఁ
బొరయనిచోఁ బ్రియము నెఱపఁ బూనుట ధరలోఁ
దెరువాటుకాండ్రకడ ము
ష్కరుఁడై [1] తనకలిమి చూపఁగడఁగుట సుమ్మీ. 165

మ. అని చింతించి పురోహితుండు నిజరాజాజ్ఞావిధి న్వారిధీ
నిను నేఁ బిల్చితి రమ్ము నిల్వనిడికో నీబుద్ధి యంచున్ ఘన
ధ్వనిగాఁ జెప్పి చనంగ నర్ణవుఁడు దివ్యంబైన రూపంబునం
దనరత్నంబులు నాల్గుగొంచుఁ జని పొంత న్నిల్చి యవ్విప్రుతోన్. 166

వ. నీ కింత వేగిరపడనేల నే నిదె వచ్చుచున్నవాఁడ మీరాజునకు మాకును బరమసఖ్యం బగు నే మెఱుంగుదుము గావున మమ్ముఁ బిలువం బంపె మే మచ్చటికి వచ్చినవారమ యని ప్రియోక్తి నిట్లనుము. 167

క. కడపట నుండియు నే మ
క్కడనుండుదు మనుచుఁ జెలిమిగతిఁ దప్పకుమీ
యెడ దవ్వన వలవదు సం
గడ మనఁగాఁ దలఁపులోనఁ గలుగుట సుమ్మీ. 168

క. నెమిలి గిరి నంబుదము గగ
నముపై రవి లక్షయోజనంబులఁ గొంనం
గమలము లక్షద్వయమున
హిమకరుఁడిలఁదొగలునుండు నెక్కువె చెలుముల్. 169

---

1. నొక్కరుఁడై.

వ. అని విన్నవించి యాశోభనమునకుం గట్నంబుగా నిద్దివ్యరత్నమ్ములిమ్ము,
కోరిన నివి సైన్యసంపాదకంబును, బహుధనప్రదంబును, మృదుచిత్ర
వర్ణవస్త్రాభరణదాయకంబును, బక్వాన్నప్రతిపాదకంబును నౌ నని చెప్పి
వీడుకొలిపిన నతం డతనివచ్చినపని సఫలం బగుటకు హర్షించి. 170

క. సుముఖుం డై చనుదెంచుచుఁ
దమమాళవభూమి సొచ్చి ధరణీశ్వరు యా
గము సంపూర్తియుఁ దాన
క్రమమును విని యచటఁ దనదురాకకు వగచెన్.            171

చ. పొసఁగిన పప్పు మండెఁగలఁ బుక్కిటిబంటిగ మెక్కి మంచి వె
క్కసపుఁ బదార్థము ల్నమలి గబ్బునఁ ద్రేఁపఁగఁ గల్గు భూరి దా
నసమయ మైన మాఁడ ధరణం బటు వచ్చు, విశిష్టపూజతోఁ
బసనగు పచ్చడంబు నొకపట్టియరంబును గల్గుఁ దప్పితిన్.[1]    172

క. చేరెడు నూకలుఁ బిడికెఁడు
కూరయుఁగొని యొక్క పూఁటకూటికి దొరయై
యూరికిఁ బంచినఁ బోఁబడు
పౌరోహిత్యంబు బుద్ధి బంటతికముగా.            173

క. అప్పటి కమికెఁడుకూటికి
నొప్పెడిదియుఁ[2] బోషణంబు, హోమము దొరకై
యొప్పించి వేల్వఁ గాగతి[3]
దప్పెడు తత్త్వము పురోహితత్వము జగతిన్.            174

ఆ.వె. అనుచు బహువిధములఁ దనపని నిందించి
కొనుచు నాత్మనగరమునకు వచ్చి

---

1. పశ్లెరముం గలదప్పు దప్పితిన్ - చిన్నయసూరి. 2. నుప్పిణియును
3. యొప్పించు కొచునులువగతి?

మనుజవిభునిఁ గాంచి వనరాశి చెప్పిన
వినయభాషణంబు లెనయఁజెప్పి, 175

క. నాలుగురత్నాకరముల
మూలద్రవ్యములబీజములొ[1] యనఁదగు నా
నాలుగురత్నంబులు నా
నాలుగుమహిమలును జెప్పి నరపతి కిచ్చెన్. 176

వ. ఇచ్చిన నమూల్యంబు లగువానిం జూచి యిందొకటినీ వేఱుకొమ్మనిన నతండు నాయింట నాలిం గొడుకుం గోడలిని విచారించి వచ్చి పుచ్చుకొనియెద నని సంభ్రమంబునం జని మువ్వురం బిలిచి యారత్నంబు లిట్టిట్టి సంపద లిచ్చు వీనిలో నేది పుచ్చుకొంద మని తలపోయుచున్న పుడు. 177

సీ. సైన్యంబు గలిగిన జగమెల్లఁ జేపడుఁ
గాను డిది యా నని కొడుకు పలికె
ధర "ధనమూల మిదం జగ" త్తనుమాట
తగు నిది గొన నని తండ్రి పలికె
నిష్టాన్నములు మదిఁ దుష్టిగాఁ గుడుతుము
మే లిది గొను మని యాలు చెప్పె
భూషణాంబరముల భోగంబు లిది గొంట
వెర వని కోడలు విన్నవించె

ఆ.వె. నిట్లు వేఱువేఱు నిచ్చలఁ దమలోన
జగడ మైన నతఁడు మగిడి వచ్చి
యింటివారికలహ మెఱిఁగించి వీనిలో
నీవ యొకటి యిమ్ము దేవ యనుడు. 178

1. మూలధనములయినవి నిజముల.

క. ఈనలువుర[1] కిం దొక్కటి
యీనేల తలంపుకొలఁది నిట మీఱగడం
బే నుడిపెద నని యొడయం
డానాలుగుమానికములు నాతని కిచ్చెన్. 179

క. ఈజాడ యోగి నీకడ
నీజన్మమునందుఁ గలుగ దిఁకఁ గలుగ దిఁకఁ బొమ్మనినన్
భోజుండు నమ్రవదనాం
భోజుం డై తాను నంతిపురమున కరిగెన్. 180

శా. ప్రహ్లాదస్థిరభక్తిభాగ్యవిభవప్రత్యక్షరూపు, న్నభోం
తహ్లాదిన్యుదయాదిమూలచరణున్, దైత్యాంతకు, న్విప్రవే
షాహ్లాదాకృతికృత్యవంచితబలిం, జక్షుఃశ్రవస్తల్పు, న
ల్పహ్లాముద్రమనోనురాగవిహరల్లక్ష్మీకవక్షఃస్థలున్. 181

శా. ఇంద్రాదిస్తుతయోగ్యవైభవుని బర్హీభూత[3]భూతావళీ
సాంద్రానందకరప్రసంగనిజలాస్యప్రస్ఫుటీకారు, ని
స్తంద్రానేకమునీంద్ర వంద్యచరణద్వంద్వున్ ముకుందప్రియుం
జంద్రాలంకరణాంకు నద్రితనయాసంసక్తచిత్తాంబుజున్. 182

మాలిని. ఉరగశయనశాయీ యోగ్యవిద్యానపాయీ
గరుడవిహితయానా ష్మాధరోర్వీశయనా
ధరణిభరణదక్షా దండితోద్దండరక్షా
మురహరహరరూపా ముఖ్యసౌఖ్యస్వరూపా. 183

1. ఈనలకువ. 2. క. ఏనే తలంపుకొలఁదిని, మీనలువుర (లోని) జగడ మెడపెదననియుం, దానాలుగుమానికములుఁ, బూనికతో నతనికిచ్చి పుచ్చెం బెలుచన్. "ఈనలకువ" యనియే చిన్నయసూరియును. 3. బహ్వీభూత.

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవిందసనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపౌత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు సుదర్శనోపాఖ్యానంబును, విక్రమార్కుని మహౌదార్యంబును, దదీయసత్త్వసాహసమహత్త్వంబులును, గౌళికోపాఖ్యానంబును, సాహసాంకదాతృత్వంబును నన్నది ద్వితీయాశ్వాసము.



# సింహాసన ద్వాత్రింశిక

## తృతీయాశ్వాసము



### -: నాలుగవబొమ్మ కథ :-

క. శ్రీరమణీరమణపదాం
భోరుహజాతాపగాంబు[1]పూరసితడిం
డీరశకలానుకారా
కారామృతకిరణధారిఁ గందర్పారిన్. 1

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మఱియున్ ధారావిభుం డిష్టశా
కునికజ్యోతిషికాగమజ్ఞుల హితక్షోణీశులం గూర్చి శో
భనలగ్నంబున నెక్కఁబూనికొని తత్ప్రాంతంబు చేరంగ నా
సనపాంచాలిక నిల్వు నిల్వు మని యాశ్చర్యంబుగా నిట్లనున్. 2

క. పఱతెంచెద విచ్చోటికి[2]
నెఱయంగా విక్రమార్కనృపతికి సరిగా
నెఱఁ జేసిన యుపకారం
బెఱిఁగెడు సద్గుణము లేక యెక్కం దరమే. 3

క. అనవుడు భోజుఁడు విస్మయ
మును లజ్జయుఁ బెనఁగొనంగ ముద మెడలఁగ మీ
జనపతియుపకారజ్ఞత
యనువొందఁగఁ జెప్పు మనుడు నది ఇట్లనియెన్. 4

---

1. జాతామలాంబు. 2. విచటికివిను.

ఉ. ఆతఁడు కీర్తిపూరభరితాఖిలదిగ్విజయుండు సర్వధా
త్రీతలనాథసేవ్యుఁడు సుధీజనపాలనకేలిశీలసం
జాతమనోనురాగుఁ[1] డిల సాహసభూషణుఁ డేలుచుండఁగా
నాతనివీట నొక్కవసుధామరుఁ డుండు విలోచనుం డనన్. 5

వ. ఆవిప్రుం డొకనాఁడు తనపత్ని విలోచన పుత్రలాభము లేమికి వగచి దీనికిం గారణంబేమి నీవుసర్వజ్ఞుండ వనియడిగిన నూహించి ధనధాన్యంబు లుద్యోగంబునం బడయవచ్చు విద్యాలాభంబు గురుశుశ్రూషల నచ్చుపడు వంశాభివృద్ధియుం గీర్తియు నీశ్వరకృపం గాక పడయవచ్చునే. 6



క. ఏగురుపురుషులఁ గోరిన
యాగొంతియు ద్రౌపదియు మహాపుణ్యవతుల్
వేగురు బంధులఁ జంపిన
గురుపాండవులు ధన్యు లీశ్వరకరుణ యేన్. 7



క. కావున మన మిఁక నెట్టి య
పావనజీవనుల మైనఁ బరమేశ్వరు సం
భావనఁ బుత్రుని బడయం
గావచ్చు సిజోద్యమంబు గలిగినఁ బడఁతీ. 8

క. అన విని యాసతి వినయం
బెనయం దనయుండు గలుగు నీశ్వరు నారా
ధన మొనరింపుద మనవుడుఁ
దనలో స్త్రీబుద్ధి యనక తా నుత్సుకుఁ డై. 9

తే.గీ. పెద్దయొసఁగెడుమాటయు ప్రియముకంటెఁ
బడుచుచే నీతివాక్యంబువడయఁజొప్పు

---

1. మనోహరాంగుఁడు.

శాస్త్రవేదిచేనున్న విషంబుకంటె
గొల్లవానిచే నమృతంబు గొనుటమేలు. 10

మ. అని తద్వాక్యము లాదరించి పరమేశారాధనం బావిలో
చనయుం దానును జేయుచుండఁగ సుఖస్వప్నంబులో నాత్రిలో
చనుఁ డేతెంచి భవత్ప్రియాసము విశిష్టం బయ్యె నీసువ్రతం
బనుకూలించె శనిత్రయోదశులఁ జేయం బుత్రలాభం బగున్. 11

క. అని శంకరుఁ డానతియి
చ్చిన నతఁడు శనిత్రయోదశీవ్రత మత్యం
తనియతి జరపుచుఁ బుణ్యుఁ
మ్మనఁ గొన్నిదినములకొక్కపుత్రుని బడసెన్. 12

క. ఆపాపనికిం బుణ్యు
వ్యాపారుఁడు దేవదత్తుఁ డనుపే రిడి గౌ
రీపతిపదభక్తుని వి
ద్యాపరిచితుఁ జేయుచును ముదంబునఁ బెంచెన్. 13

చ. క్రమమున బ్రాహ్మ్యకర్మములు గైకొనఁజేసి యెదుంగుచో[1] వివా
హముఁ దగఁజేసి కాశికిఁ బ్రయాణము చేకొని పుత్రుఁ బిల్చి కా
లము శుభవృత్తులన్ బ్రదుకు లాగు విచారము సద్గృహస్థధ
ర్మములను మంత్రతంత్రముల మర్మము లెల్లను జెప్పె వెండియున్. 14

క. పరపీడయుఁ బరనిందయుఁ
బరసతియుం బరధనంబుఁ బరుషుం గలచోఁ
దిరుగకు పరోపకారము
పొరయంగలచోటఁ బుద్ధిపురికొల్పవనా. 15

1. యెఱుంగుచో.

క. తకుటములతో కిరహస్యము
వెరవరివగ సైరణయును వేషాఢ్యునిస
చ్చరితము దుర్జనుసఖ్యము
నరపతికరుణయును నీవునమ్మకు మదిలోఁ. 16

క. సారాచారవిచారత
నారూఢుం డగుచుఁ దను నిజావసరములం
జేరినవారికి హితుఁ డై
సైరణ గల ప్రభువుఁ గొలుపు సజ్జన వృత్తిన్. 17

వ. అని పెక్కునీతులు చెప్పి. 18

క. భూసురుఁడు సకలవిద్యా
భాసురుఁ డటు తోడఁగూడి పడఁతుక నియమో
ల్లాసినిగా శివమూర్తివి
కాసిని యనవొప్పుచున్న కాశికిఁ జనియెన్. 19

మ. జనకుం డేగిన దేవదత్తుఁ డిటు లాచారంబు రెట్టింప స
జ్జనసత్కారము లింటఁ జెల్లగ విశిష్టప్రాప్తకాలంబు చొ
ప్పున నిధ్మంబులుఁ బత్రము ల్ఫలములుం బుష్పంబులుం గానకం
బునఁదాఁ బంచయజ్ఞముల నెప్డుం జేయుచు న్నిల్వఁగన్. 20

మ. ఒకనాఁ డుజ్జయినీశుఁ డుత్సవమిషోద్యోగంబున న్వేఁటకై
వికసన్మానసుఁడై బలంబులు తను న్వేష్టింపఁగ బాణకా
ర్ముకహస్తుం డయి వాజినెక్కి పటహంబుల్ మ్రోయఁగా నేగె గం
డకశార్దూలవరాహసింహకరిగణ్యం బౌ నరణ్యానికిన్. 21

ఉ. అక్కడ వేఁట లాడుచు హయంబు రయంబునఁ దోలుకొంచుఁ దా
గ్రక్కున నొక్కపంది వెనుకం జని మార్గము దప్పి క్రంపలం

జిక్కి మది న్వితాకు పడి చింత మునుంగుచుఁ బండ్లుగోయఁగా
నొక్కెడ దేవదత్తుఁ గని యూరికి నేగెదుత్రోవ వేఁడినన్. 22

ఆ.వె. హయమువాగె వట్టి యల్లన ముందట
ముండ్లు దప్పఁ దిగిచి గండ్లు గడపి
దేవదత్తుఁ డిట్లు తెరువునఁ గూర్చిన
సేనఁ గలసె రాజశేఖరుండు. 23

క. తన యెక్కినతురగము నా
తని కిచ్చి సువర్ణనిర్మితం బగు వరవా
హనమున నొయ్యనఁ బురికిం
జనుదెంచెను బంచవాద్యశబ్దములులియన్. 24

వ. ఇట్లు చనుదెంచి నగరు ప్రవేశించి మహావిభవంబు మెఱయం గొలువునం గూర్చుండి. 25

ఆ.వె. అచటి విప్రునిపని యత్యుపకారంబు
గాఁ దలంచి యొక్కగ్రామ మిచ్చి
వరుసతోడ నెల్లవారల వీడ్కొల్పి
యంతిపురము సొచ్చె నవనివిభుఁడు. 26

క. అన్నెలఁతలతో రతిసం
పన్నుండై వరుసతోడ భావజుకేళిం
గొన్ని దినంబులు సలుపుచు
నున్నంతం బిన్నయాలి కొకనెల మసలెన్. 27

ఉ. చెక్కులు వెల్లఁబాఱె[1] గడుఁ జిట్టుము లయ్యె మొగంబు వాడెఁ జ
న్మొక్కులు నల్పుగూడె నడుముం దరులుం జెలువారె నారు సొం

1. పల్కఁబాఱె.

పెక్కెఁ గసుంగవ న్మెఱపు లేర్పడె నప్డు మనంబుకోరుకుల్
పెక్కువిధంబులం బరఁగెఁ బ్రీతిగ నాతికిఁ జీరచిక్కినన్. 28

క. పొత్తికడుపు మెఱుఁగెక్కెం
జిత్తంబున జడను దోఁచెఁ జెలికత్తెలతో
నొత్తిలిపలుకఁగ మ్రాన్పడు
మెత్తనిమై నడుఁచుని[1] నిదుర మేకొను విసువున్. 29

క. కొమ్మకుఁ బులు సింపయ్యెను
గమ్మని మ న్నంతకంటెఁ[2] గడుఁ జవికెక్కెం
దమ్మిమొనమొగ్గ లెక్కిన
తుమ్మెద లనఁ జన్నుదోయితుద కప్పారెన్. 30

ఆ.వె. చెలువ బయఁకలైన. జెవ్వవేటికి నన్న
సిగ్గుపడుచుఁ జెలువచెంత దలఁగుఁ
జెప్పంబూను గొన్నిచిహ్నంబు లెఱిఁగించు
నగవుచేసి మీఁదనొగులుచేయ.[3] 31

క. విశదముగ నడిగి యారా
జశిఖామణి కెఱుఁగఁ జెప్పి సఖులిం పగుస
ర్వశుభంబులు గూరిచి త
చ్ఛిశువునకు న్మీఁదఁ జీకుచెవి[4] గాకుండన్. 32

తే. మూఁడునెలలఁ జెలులు ముద్దలు[5]వెట్టిరి
యలరుఁగుడుము లైదునెలలఁ బెట్టి
రేడునెలల మ్రొక్కి రెజ్జపోలమ్మకు
సతికిఁ జూలువెళ్ళ జరుపుకొనుచు. 33

---

1. మెత్తనినడమెలఁగు 2. గమ్మఁదనంబంతకంటె. 3. నగము చేసి మీఁదనొగులుదెలియు. 4. చీడచెవి-జీపుచెవి, చీదచెవి. 5. ముద్దాలు.

క. నెలకొనినచూలువేళం
దలకొని మెయిదీఁగ మెఱుఁగు దనరం గనకో
జ్జ్వల మగు వేషంబున సతి
పులుకడిగినముత్తియంబు పోలిక నొప్పెన్. 34

ఆ వె. [1]ఇంతి మదిఁదలఁకుచు నెడమప్రక్కనిదిగొ
మెదలెననుచుఁజెప్ప సుదతులంతఁ
జంటిజిగురు గోర సంధించి చిరజీవి
యైనసుతుఁడు పుట్టు ననఁగఁ బొంగు. 35

క. ఆసతి కాన్పుఁడప్పమ
మాసంబునఁ గెంటిలంబమరఁబెట్టి[2] మహో
ల్లాసంబున నుండఁగనవ
మాసంబులు నిండె గర్భమహిమయు దలరన్. 36

తే. చన్నులురియఁ[3] బొదలె జఘనంబు ఘనమయ్యె
బలకవెన్నుదనరె మెఱుగువట్టె
రాజయోగ్యమైన రత్నంబు దాఁచిన
పసిఁడిపెట్టెయనఁగ నెసఁగెనపుడు. 37

క. నెలఁత శిశువునకుఁ బ్రొద్దుల
నెల నమృతమునించు నింద్రనీలపుమూఁకు
ళ్ళలరించిన బంగారపుఁ
గలశము లనఁ గుచయుగంబు కప్పున నొప్పెన్. 38

---

1. తొలుతచూలున మది దలఁకు నెడను ప్రక్క...చంటిజేలు గోరనంటి ...సుదతిపుట్టుననిన సుదతి పొంగు (చంటిజిలుగు). 2. గెంట్లమమర. 3. విరియ.

ఆ.వె. నాభి నెఱయవిరిసె నడుము నొవ్వఁదొడంగె
దాదు లంత నాయితంబు చేసి
కూడిమెలఁగ దండికుట్టులం బొదలక
నాతి యటు సుఖప్రసూతి యయ్యె. 39

క. క్రూరగ్రహవిరహితుఁడగు
తారాపతిబలము గలుగు తత్కాలమునన్
మారునికెనయగు చెదగినకు
మారుం డుదయించెహితులమదిముదమొందన్. 40

వ. అప్పుడు దాదులు. 41

ఆ.వె. నిసువుబొడ్డుమీదఁ బసిఁడిటంకంబిడి
యొయ్య నాభినాళ ముత్తరించి
ముత్తియములఁ జేట ముంచి యందిడి కను
దమ్ములందు సమ్మదమ్ము నిగుడ. 42

క. [1]కలిఁదోఁచి నూనెవ్రేలిడి
తలపుట్టియయందు నేతితైలంబును జొ
త్తిలరాచి మెత్తగాఁ బొదు
గలరించి[2]కుమారు నునిచి రాదాదు లటన్. 43

శా. క్షోణీనాయకుఁ డిట్టిమేలు విని తా సుస్నాతుఁడై యాదిక
ళ్యాణం బైన మహోత్సవంబున సముల్లాసంబుతో దానపా
రీణుండై నిజబంధులోకగురుధాత్రీదేవసంసేవన
త్రాణం బొప్పఁగఁ బెట్టె గోధరణిరత్నద్రవ్యమాద్యంబుగన్. 44

సీ. క్రమమున దాదు లక్కడను ముప్పటిలిన[3]
జలకంబు దేర్చి యాచెలువసుతుని

1. కలిగడిగి. 2. పొదుగుపొత్తులు. 3. ముప్పటముతైన, చిన్నయసూరి

కొనరఁగాఁ గాటుకయును జుక్కబొట్టును
బాటించి యాగడపకు వెలుపటఁ[1]
బొదకిళ్ళఁ దవుడు నిప్పులుఁ బత్తిగింజలు
నిడి యుద్ధముగఁ జిట్టు బడిసివైచి[2]
వేఁపరెమ్మలు నీళ్ళ వెసలలోపల నించి
కాపులు పురిటింట గట్టి చేసి

ఆ.వె. వాయనములకెల్ల వనితల రప్పించి
వారుదెచ్చినయవి వరుస నంది
పచ్చకప్పురంపుఁ బలుకులు వెట్టి వి
డియము లిచ్చిరింపు నయముగలుగ. 45

క. వెడలం బడితివి చక్కని
కొడుకుంబడసితివి రాజుకూరిమి బలిసెం
బడఁతీ నీ భాగ్యమునకుఁ
గడలే దని పొగడి రెల్ల కాంతలు నింతిన్. 46

ఉ. మండలనాయకుండును గ్రమంబున నాపురుడైన యంతఁ బం
డ్రెండవనాఁడు పాపనికి రేవతి గావున మీనరాశి చం
ద్రుం డని పేరు వెట్టి యతిరూఢిగఁ బెంపఁగ వాఁడు బాలచం
ద్రుండును బోలె నిచ్చలును దుష్టియుఁ బుష్టియుఁ గాంచుఁ గాంతితోన్. 47

సీ. వెలఁదులు వీని నవ్వింప నోయని నవ్వ
వేడుక మాటియు విఱుచుచుండు[3]

---

1. పచ్చనికూటఁబడిసి. 2. నిడియందముగ జుట్టువడసి వేసి-చిన్నయసూరి. 3. వెలదుకుల్ వినఁగనవ్వించ ననంగ నొయ్యనవ్వుచు మాతులల్ల విరుచు.

నూఁకరలిచ్చు[1] నయ్యుయ్యాలఁ జేరిన
నసు మెత్తివైచు ముందలయు నెత్తు
జోవలు వాడిన[2] భావించు నాలించు
చుండు నేడుపు మాను నుగ్గు లడుగుఁ
గోరి దగ్గఱఁగ నంగుష్ఠంబు[3] నోరిలో
నిడుకొనుదాఁ జన్ను గుడుచుభంగిఁ

ఆ.వె. జిన్నిపాదములును జేతులు నాడించు
జవనగతిని మొరయ రవళి దన్ను[4]
బోరగలి ఫణీంద్రు పోలికఁదలయెత్తి
యాడుఁ బలుక నందునందుఁ జూచు. 48

క. కూర్చుండు నురమునం జన
నేర్చును విద్దెంబు సేయనేర్చును భీతిం
దార్చుచుఁ దప్పటడుగు లొడఁ
గూర్చు జననిచెట్టపట్టుకొని నడపాడుఁ. 49

క. విందులు విందు లనుచు వే
డ్కఁ౦దనుఁ బిల్వంగ నగుమొగం బలరంగా
నందియలు మొరయఁగాఁ గురు
లుం దూలఁగ[5] వచ్చియంతలోఁగప్పుకొనుఁ. 50

క. నిలువెల్లను గనకం బై
పలు కంతయు నమృత మగుచుఁ బార్థివునకు ము

---

1. నూదరలిచ్చు. 2. జోలలువాడిననాలించు. 3. కాలియంగుళము దగ్గఱబట్టినోటిలో. 4. జన్నుగడియమొరయదన్నుచూచు. 5. మొరయ గుర్నాలుం దూలఁగ—వచ్చునింతలో నెత్తుకొనఁ.

ద్దులు చూపుచు నానాఁటికిఁ
బలుదెఱఁగులఁ బెరిఁగె నతని ప్రాణపదంబై. 51

వ. అంత నతండు తచ్ఛూద్రాకరణంబునాఁడు నానావిధంబు లగుదానంబుల
దీనుల విప్రులం బరితుష్టులం జేసి యాదేవదత్తునకు మఱియు నొక
సర్వసమృద్ధ గ్రామం బిచ్చి కుమారునిం బరీక్షాధికారిం గావించిన బహు
మానితుండై బహుదినంబులు తత్కార్యవిచక్షణత్వంబువలన విశిష్ట
పూజల నొందుచు విలోచనసుతుండు త్రిలోచనసుతుండునుం బోలెఁ
ద్యాగభోగానురాగంబులం జెలంగుచుండునంత.

క. నృపతి యొకనాఁడు గని ని
ష్కపటాత్మ ! పరీక్షణాధికారివి నీయ
త్యుపకారమునకుఁ దగఁ బ్ర
త్యుపకారము చాల దనియె నుర్వీసురుతోన్.  53

చ. అనవుడు దేవదత్తుఁడు ధరాధిప యిట్లన కేను నీకుఁ జే[1]
సిన యుపకార మింత నుతిచేసెద వేటికి నంచుఁ దత్ప్రియం
బొనరఁగఁబల్కి కొంతతడ వుండి గృహంబున కేగువేళ నా
తని సుతుఁ జంకఁ బెట్టుకొని తత్తఱ మందుచు వచ్చెఁ జెచ్చెరన్.  54

ఉ. అయ్యెడ వాని డాఁచి కనకాభరణంబులు పుచ్చి బంటుచేఁ
జయ్యన నిచ్చి యమ్ము మని సంతకుఁ బంపిన యంతలోన నేఁ
డెయ్యెడ కేగెనో శిశువు నెవ్వరు చంపిరొ యంచు నేడ్వఁగా
దయ్యె మెఱుంగుఱంతు వసుధాపతిగేహము నిండెఁ బెల్లుగన్.  55

క. అమ్మొఱ విని తలవరులు ర
యమ్మున నలుగడల జాడ లరయుచు నొకచో

1. దేవదత్తుఁడు ధరాధిపరత్నమ యేను నీకుఁ జే.

నమ్మంగ బంటుగని[1] యా
సొమ్ములతోఁ బట్టితెచ్చి చూపిరి పతికిన్. 56

వ. చూపిన నమ్మహీనాథుండును నీసొమ్ములు నీకెవ్వరు తెచ్చియిచ్చి యమ్ము మనిన నీవమ్మ చున్నవాఁడ వని యడిగిన దేవదత్తుండను బ్రాహ్మణుండు తెచ్చియిచ్చెనని యాతఁ డెఱిగించిన. 57

ఆ.వె. బంటువలన నెఱిఁగి బ్రాహ్మణు రప్పించి
నిలువఁ బెట్టి తప్పుఁ దెలియ నడుగ
నతఁడు మోమువాంచి యపరాధియునుఁబోలె
నుత్తరంబు లేక యూరకుండె. 58

క. చనువా రటు ధట్టింపఁగ[2]
ననుమానించుచును దైన్య మడరఁగ వెడఁగై
ధనలోభంబునఁ గొనిచని
జననాథా నీతనూజుఁ జంపితి ననియెన్. 59

సీ. అనుడు నారాయణా యని వీనిఁ బట్టి తి
త్త్రొలిపింపఁ దగు నని పలుకువారుఁ
గాళ్ళును జేతులు గనియలుగాఁ బట్టి
చిదిమింపఁ దగు నని పదరువారుఁ
గాయంబు నుగ్గుగా గలుగానుఁగలఁ బెట్టి
త్రిప్పుట తగు నని తెలుపువారు
మేన వెంటులు చుట్టి పైనగ్గితగిలించి
మిడికింపఁ దగు నని నొడువువారు.

ఆ.వె నగుచు జనులు దుర్వ్యాధార్తుండు వీఁడగు
ననుచు విన్నవింప నవనివిభుఁడు[3]

---

1. నమ్మంగఁ బట్టుకొని. 2. దండింపఁగ. 3. నైనజనులు వీఁడర్హుఁడు వధకని, విన్నవింపఁగఁ బృథివీశ్వరుఁడు.

తనయదుఃఖవహ్ని దనలోనఁ గ్రాఁగుచుఁ
జంపఁబూని తనదు తెంపు దలఁచి[1]. 60

వ. అద్దేవదత్తునితోడ. 61

క. అపకారముగా దిది నా
యుపకారము వాసె భూసురోత్తమ విను నీ
యుపకారమునకు నిది ప్ర
త్యుపకారం బయ్యె నింక నోడక పొమ్మీ. 62

ఆ.వె. అనుచు విడిచి మఱియు ధనమిచ్చి యనిపిన
హితులుదూఱశిశువుమృతికినోర్చి
యింత దెరువుచూపు టేయుపకారంబు[2]
గాఁదలంచి యేల కావ ననుడు. 63

క. వినుఁడిట నేఁ గలిగిన నా
తనయుండును గల్గఁగాక తప్పిన యెడఁ గా
ననమున నితఁడు తలఁగిపో
యిన ఖేదంబులలోన నే మగుదునే[3]. 64

వ. ఇట్లు గాకుండం జేసిన నీరాజ్యంబును సంతతియును నగపడె నాప్రాణం బులు గాచి నన్ను నిలిపినవానికి సెలవు సేయుట యెంత పని[4] నామీఁది యప్పు కొంతదీర్చుకొనం గలిగె నూరకుండుం డనిన. 65

క. పౌరుల్ హితులు దొరల్పరి
వారంబును రాజు వెఱ్ఱివాఁ డయ్యెఁ గదే
మూఱెఁడుత్రోవయుఁ జూపుట
గారాపుంబట్టి చావుగనియుం గాచెన్[5]. 66

---

1. పెంపెఱింగి. 2. టిదియుపకారంబ. 3. కాననమున నితఁడెడఁగల బో, యిననీ కానములోన నేమగుదునాకో. 4. నిలిపివ వానికిది యెంతపని. 5. గాలింబుచ్చెన్.

వ. అని చెవ్పనాడుచున్న యెడను. 67

ఆ.వె. దేవదత్తుఁడు నరదేవుని సద్గుణం
బెఱింగి సంతసించి యింటి కేగి
చందమామకూనచందంబుతో నున్న
శిశువుఁ దెచ్చి రాజుచేతి కిచ్చె. 68

వ. ఇట్లిచ్చిన పాపనిం జూచి. 69

క. విస్మయహర్షంబుల మం
దస్మితవదనాబ్జుఁ డగుచు ధరణీవరుఁ డా
కస్మికదురితము లడఁచెడి
యస్మత్కుల దైవ మనుచు నతనికి మ్రొక్కెన్. 70

ఉ. మ్రొక్కిన దేవదత్తుఁ డతిమోదము నొంది నరేంద్ర నీమనం
బెక్కడఁ జూడవేఁడి యలయించి మహావ్యథఁ దూలవుచ్చితిన్
మిక్కిలి తప్పుచేసి కడమీఱి భవద్గుణరత్నముల్ మెఱుం
గెక్కనొనర్చితిం బరుల కీకథ మంచితనంబు నొజ్జఁగాన్. 71

శా. అంచుం జెప్పిన నయ్యవంతివరుఁడున్ హర్షించుచు న్సంపదం
గంచిం బోలినయట్టి పట్టణము సత్కారంబుగా నిచ్చి మ
న్నించెం బాత్రుఁ డటంచు ధర్మసభకు న్నిర్ణేతగాఁ బ్రీతిఁ గా
వించెం గావున నీకునట్టిగుణ మన్వేషించినం గల్గునే 72

క. మగుడుము గద్దియ యెక్కుట
యగపడ దిఁక ననిన విక్రమార్కుగుణంబుల్
పొగడుచు బిగిచెడి ధారా
జగతీపతి చనియె నాత్మసదనంబునకున్. 73

వ. మఱియు నొక్కనాఁడు. 74

-: ఐదవబొమ్మ కథ. :-

క. తెల్లని యమృతాంబుధిలో
నల్లని తిరుమేను ధవళనలినములోనం
బ్రుద్కళ్ళెడు తుమ్మెద క్రియ రా
జిల్లఁగ విహరించుచున్న సిరివరుఁ గొలుతున్. 75

మ. అని చిత్తాబ్జములోఁ దలంచి సమయజ్ఞామోదితం బౌ దినం
బున సౌమ్యగ్రహదృష్టలగ్నమున నాభోజుండు వేడ్కన్ నృహా
సన మెక్కంజని పాదపద్మ మిడఁ జాల్చాలంచు నచ్చోటు కాం
చనపాంచాలిక వల్కె సర్వజనతాశ్చర్యం బవార్యంబుగన్[1]. 76

క. కార్యం బెఱుఁగవు దానా
చార్యుండగు విక్రమార్కు సరిపూనఁగ గాం
భీర్యముతోఁ గూడిన యౌ
దార్యము లే కేల యెక్కఁ దర మగునీకున్. 77

క అనవుడు విస్మితుఁ డై మీ
జనపతి గాంభీర్యదానచాతుర్యము లే
పనిపట్టులఁ గనుపట్టిన
వని యడిగిన భోజనృపతి కది యి ట్లనియెన్. 78

శా. ధారానాయక యాచకార్తజనతాదారిద్ర్య విద్రావణుం
డారూఢస్థిరకీర్తివల్లిపిభవవ్యాప్తాఖిలాశాంతవి
స్తారుం డూర్జితవిక్రమక్రమ నిరస్తక్షోణిపాలాగ్ర సం
భారోత్సాహుండు సాహసాంకఁడు దొప్పం జేసె రాజ్యం బిలన్. 79

క. భూతలమునఁ బుణ్యగుణ
ఖ్యాతుం డగు నతని చేతి కౌక్షేయకధా

1. ఆశ్చర్యంబు కార్యంబుగన్.

రాత్రీర్థంబున మునిఁగి య
రాతులు విహరింతు రమరరమణీయుతులై. 80

వ. అట్లేలుచుండు నతనిరాజ్యంబున నెలకు మూఁడువానలు దళంబుగాఁ గురియ జనులెల్ల నుల్లంబుల నుల్లాసంబు వెల్లివిరియ ధనధాన్యసమృద్ధులై యున్న యెడల రత్నగర్భాతలంబున రత్నాకరగుణప్రఖ్యాపనాపరుండునుం బోలె వణిగ్వరుం డగునొక్కరత్నవ్యవహారి దూరదేశంబుననుండి యుజ్జయిని కరుదెంచి. 81

క. అంబుధి పుత్తెంచిన క
ప్పం బన రేఖాంకబిందుభంగాదికదో
షంబులఁ బొరయని పదిర
త్నంబులు గుదిఁగుచ్చి తెచ్చి నరపతి కిచ్చెన్. 82

ఆ.వె. వానిఁ జూచి కొలువువార లద్భుతమంద
మానవేంద్రుఁ డాత్మలోన మెచ్చి
విలువనిశ్చయించి చులుకగా నతనికిఁ
దేటపడఁగ ధనము కోటియిచ్చె. 83

ఆ.వె. కోటిధనముఁ బుచ్చుకొని యగస్త్యునియుక్తి
నమరునాల్గుసాగరముల యందు
నుత్తమంబు సింహళోద్భవం బటుగాన
దీనిఁ గొనుము మనుజదేవయనుచు. 84

వ. ఇచ్చిన నదియును బ్రభాపటల విభాసిత సభామండపంబై యంబరమణి బింబ విడంబకం బగుచున్న మాణిక్యంబు గైకొని మానవేంద్రుండు విస్మయమానమానసుండై తన్మూల్యంబు కోటిధనం బిచ్చి యిట్టివి మఱియు నుం గలవే యని యడిగిన నావర్తకుండు. 85

ఆ.వె. దీనికంటె నొప్పు[1] దివ్యరత్నంబులు
గలవు మద్గృహమునఁ గొలఁదిమీఱ[2]
ధరణినాథ నాకు దశకోటి ధన మిచ్చి
భటునిబంపు పదియుఁ బంపువాఁడ. 86

క. అని చెప్పిన నాతనికా
ధన మిచ్చి భటాళిఁ జూచి తఱిదప్పకవే[3]
చనిరత్నంబులు గొని తె
చ్చినవానికి మెచ్చు గలదు చేకొనుఁ డనియెన్. 87

వ అనిన నసహాయశూరుండును నలఘుతరాంఘ్రితలలంఘనుండు నగు నొక్కజాంఘికుండు లేచి. 88

క. అచ్చట నారత్నంబులు
పుచ్చుకొనుచు నేడుదివసములు పో మఱునాఁ[4]
డిచ్చటికి నిన్నుఁ గొలువఁగ
వచ్చెద నీయడుగులాన వసుధాధీశా.

సీ. అని పంతమాడిన హర్షించి తాంబూల
మిప్పించి వ్యయమున కేడుమాడ
లొసఁగి వర్తకుఁ గూడి మసలకుమీ యని
యనిపిన వానిఁ దోడ్కొనుచు సెట్టి
యశ్వరత్నమునెక్కి యతివేగమున రేలుఁ
బగళులు నెచ్చోటఁ దగులువడక
నాలుగుదినముల నలువదియామడ
ల్చని వీడు సొత్తెంచి తనగృహమునఁ

1. మిగులు. 2. విలువమీఱి. 3. జనపతియా, తనికాధనమిచ్చి భటులఁ దప్పకపంచెం. 4. నేడుదివసములమఱునాఁ డేసిచ్చటికి.

ఆ వె. దేజరిల్లుచున్న దివ్యరత్నంబులుఁ
బదియు నిచ్చి రాచబంటు నంత
గవని వెడల ననిపె క్రమ్మఱ నేగిన
వాఁడు పటకు నడచి వచ్చె నట్ల.

క. లంఘితనగనగరసరి
త్సంఘాతుం డగుచు దినము దప్పక వడి ని
స్సంఘర్షాధ్వగుఁడై యా
జాంఘికుఁ డరుదెంచెఁ బురికి సంధ్యావేళన్. 91

క. కాలూఁదక యటఁ చని భూ
పాలుం గని మ్రొక్కి తనదు పంతంబునఁ ద
త్కాలోచిత దివసకర[1]
జ్వాలాకృతి వెలుఁగు నైదు సన్మణు లిచ్చెన్. 92

ఉ. ఇచ్చిన వానిఁ బుచ్చుకొని యేలిక యల్లనఁ జల్లచూపులం
దెచ్చినబంటుఁ జూచి మఱి తెమ్మిఁక నైదును నాకు నిప్పుడే
మిచ్చితి తోడి మానికము లేగతిఁ జిక్కిన వన్న[2] నాభటుం
డిచ్చఁ దలంకియుం చలఁక కిట్లనియెం గరము ల్మొగుడ్చుచున్. 93

ఆ.వె. మొదల సెట్టిచేతఁ బదిరత్నములుఁ గొని
మగిడి వచ్చుచోఁ గ్రమక్రమమునఁ
బార్థివేంద్ర నాకు భాగ్య మింకినభంగిఁ
బెద్దయడవిలోనఁ బ్రొద్దుగ్రుంకె. 94

వ. అక్కడ మఱియు నొక్క చిక్కుగలిగె. 95

---

1. దీపవర. 2. మఱితెమ్మిఁక నైదునుగాక నాకు నైదిచ్చితి—ఐదును నాకు నిప్పుడీవిచ్చితి.

సీ. ఘోషపర్వంగ వడిఁ దూర్పువాఱెడుగాడ్పు
సారతురంగ ప్రసార మనఁగ
సంపూర్ణజలమదశ్యామలాకృతు లైన
యంబుదంబులు కుంజరంబు లనఁగ
భూరిగర్జితములు భేరీరవములన
మెఱపు లాయుధముల మెఱుఁగు లనఁగఁ
గేకినాదములు మహాకాహళము లనఁ
జాతకంబులు భృత్యసంఘ మనఁగ

తే.గీ. శక్రచాపము[1] విజయధ్వజం బనంగ
నొప్పి భూతవిహిత[2] జీవనోదయమున
నవనినాయక నీదువాహ్యాళిఢాక
ననుకరించుచుఁ దోఁచె వర్షాగమంబు. 91

సీ. తొలితొలి సన్నంపుఁదుంపురు లొలుకఁగా
వెసఁ దిమితిమి యని[3] ముసురువట్టె
బిసబిస యని గాలి బెట్టుగాఁ బెటపెట
గణికలంతంతలు చినుకు లురిలెఁ
బిడుగు పెళిల్లునఁ బడియెనో యనఁగను
గడిఁదియుర్ములు బెడబెడ యనంగఁ
గ్రొక్కారుమెఱుఁగు తళుక్కని మెఱయఁగాఁ
బాసియుఁజీఁకు చూపఱఁ బెనంగ

తే.గీ. నించి కడవలు వడిఁ గ్రుమ్మరించినట్లు
పాము వ్రేలాడఁగట్టినభంగి దోఁప

1. చక్రవాకము. 2. నొప్పు-భూగోళహితజీవ. 3. నెసనిదేమిటియని.

వాన బోరునఁ గురియంగ వఱదనుండి
మిట్టుఁ బల్లంబు నొక్కటై మేరమీఱె. 97

ఉ. దండడి దంపశూకసమధారలు తోరము లై పడంగ మ
ధ్యందినవేళ యైన నభ మంతయుఁ జీకొని చీఁకుపర్వ న
క్తందినచిహ్నముల్మఱవఁగా నటు బోరన వాన వట్టి దై
నందినకల్పమో యిది యనన్ జలపూరము నిండె ధారుణిన్. 98

వ అట్టి వర్షోత్కర్షంబున మార్గంబు జలదుర్గమం బైన. 99

క. తత్కాలమ్మున నిలువక
యుత్కోచము చేసి తప్పియును భవదాజ్ఞా
సత్కారముఁ దలఁపుచుఁ[1] జని
యుత్కాలజలాఢ్య[2] మైన యొకనదిఁ గంటిన్.

ఆ వె. అచట నిలుచునంత నవ్వాన వెలియఁగ
నొకఁడు వచ్చె వాని యొద్దికేగి
దైన్యమొంది యేఱు దాఁటించు మని వేఁడు
కొనిన నాతఁ డీయకొనక పలికె. 101

క. వినుము మహానది దాఁటుట
యును గురువిప్రార్యనిందయును ధర్మసభా
జనవైరము దైవతలం
ఘనమును బరికింప హానికార్యములు సుమీ. 102

క. నారీహృదయంబును వ్యవ
హారినిజంబును నదీజలాపూరంబుం
జోరుని ధర్మస్థితియును
వైరుల చెలిమియును నమ్మవల దెవ్వరికిన్[3]. 103

---

1. సలుపుచు. 2. ఉత్కల్లోలాఢ్య. 3. నారుల, వ్యవహారుల, చోరుల, వైరుల యని చిన్నయసూరిగారి పాఠము.

క. అనలముఁ బన్నగమును దు
ర్జనుఁ డుదకముఁ గపియు[1] బ్రహ్మచారియు వారాం
గనయును నృపుఁ డగసాలెయుఁ
దనవా రని నమ్మవలదు తత్త్వజ్ఞునకున్. 114

క. అనవుడు నివి నీతులు గా
వన వచ్చునె విభునితోడ నాడినపంతం
బున నీపదిరత్నంబులు
గొని చని దర్శించి రాజు గొలువఁగవలయున్. 105

క. తలకొను మని ప్రార్థించిన
వలనుగ నాకార్యగౌరవ మ్మెఱిఁగి యతం
డలయక యిది సం దనుచును
వలనొప్పఁగఁ బుంటిచేయి పట్టినభంగిన్. 106

ఆ.వె. అవనిపాలుఁ గొల్వ నవసరం బైనచోఁ
జాలు నింతవడి విచార మేల
యైదుమానికంబు లందు నా కిచ్చిన
నిట్టె[1] యవలిదరిని బెట్టువాఁడ. 107

వ. అనిన. 108

సీ. అడిగిన రత్నంబు లన్నియు నిచ్చితి
నేని రాజద్రవ్యహాని పుట్టు
నీఁజెల్ల దని యున్న నీదినం బిచ్చోటఁ
దప్పెనా రాజాజ్ఞ దప్పఁ గలుగు
నిలలోనిధనికుల యిండ్ల హయంబులు
ధనధాన్యములును గాంచనముమణులు

1. బాచికలును దుర్జనుండును గన్యకయు-దుర్జనుఁడు జలంబులును.

పృషులాంబరములు మృగమదకర్పూర
చందనంబులుఁ బరిచారగణము

ఆ.వె. ధానధర్మములు సమానమై యుండును
వానికంటె భూమివరుని కలిమి
యెక్కుడగుచుఁ జెల్లు నెల్లదేశంబుల
రాజ్యమనఁగ నాజ్ఞ పూజ్య మగుట[1].

వ. అని విచారించు నెడలఁ దొల్లింటి నీతి తలంపునం బడియె. 110

క. ధనమునకు దానమును దప
మున కాచారమును రాజ్యమున కాజ్ఞయు జీ
వనమునకు యశము విద్యకు
వినయంబును నీతులకు వివేకము ఫలముల్[2].

క. ధరఁ దగువారలకుఁ దిర
స్కారణంబును సతుల కొండు శయ్యయు నుర్వీ
వరులకు నాజ్ఞాభంగము
సరి నివి యాయుధము లేని చావులు గావే. 112

మ. అని చింతించి ధరాతలేంద్ర భవదీయాజ్ఞాసముల్లంఘనం
బున కే నోర్వక యేనుమానికము లాపూర్ణాపగాతోయలం
ఘనపణ్యంబుగ నిచ్చినం గొని లతాగ్రగ్రంథిచే నన్ను నే
పున బంధించి రయంబుతో నతఁడు తత్పూరంబు దాఁటించినన్. 113

ఆ.వె. అరుగుదెంచి నీపదాంబుజంబులు గనుఁ
గొంటి నాజ్ఞఁ నడప[3] గంటి నేఁడు

---

1. యెక్కుడై చెలంగు నొక్కరాజ్యంబున రాజునాజ్ఞ చాలఁ బూజ్య మగుట. 2. బలముల్-చిన్నయసూరి. 3. దిరుగ.

రాజుసెలవు[1] లేక రత్నంబు లిచ్చిన
తప్పునకును శిక్ష దలఁపు నాకు. 114

క. అనవుడు నృపుఁ డుత్తమమణి
ధన మిచ్చియు విఘ్నమైనతజి నాజ్ఞాలం
ఘన మొనరింపక వచ్చితి
వని మెచ్చుగఁ జేతి మణులు వానికి నిచ్చెన్. 115

ఉ. కావున విక్రమార్కు సరిగావు నృపాలక చాలు నింటికిం[2]
బోవుట మేలు నాఁగ విని భోజుఁడు ఖిన్నముఖారవిందుఁడై[3]
భావములోన నాతని ప్రభావము నీగియు మెచ్చుచున్ సుహృ
ద్భావరయుక్తుఁడై మగిడి పోయెను నెంతయు వింతచొప్పునన్[4]. 116

వ. ఇట్లు పంచమద్వారంబున నుండి మగిడి మఱియు నుత్సుకుండై. 117

-: ఆఱవబొమ్మకథ :-

క. లక్ష్మీనాయకసాయకుఁ
బక్ష్మలనయనాంకవామభాగుని ఘనునిన్
లక్ష్మాహిమకరధరు రజ
తక్ష్మాధరసదను మదనదమనుం గొలుతున్. 118

ఆ.వె. అనుచుఁ గదఁగి భోజుఁడట గొన్నిదినములు
చనిన విబుధవందిజనులఁగూడి
యింద్రభద్రపీఠ మెక్కఁలగ్నంబుతోఁ
బొంతఁ జేరునంత బొమ్మ పలికె. 119

క. నిలు నిలువు విక్రమార్కుని
కొలఁదిని నిర్వ్యాజదానగుణ మటు నీకుం

1. రాచసెలవు. 2. విక్రమార్కునికిఁ గల్గు గుణంబులు చాల వింటికిం. 3. ఖిన్నముఖాబ్జతేజుఁడై. 4. భోజుఁడు పోయెను దొంటి చొప్పునన్.

గలుగక యెక్కం బూనుట
చెలఁగి నపుంసకుఁడు బోటిఁ జేరుట చుమ్మీ. 120

క. నావుడు భోజనృపాలుఁడు
భావంబున సిగ్గు గదురఁ, బాంచాలిక ! నీ
వావిక్రమార్క-వితరణ
మేవెరవున నొదవెఁ జెప్పు మేర్పడ నాకున్. 121

క. అనవుడు నాపుత్రిక యి
ట్లనియెం జిఱునవ్వుతోడ నవనీనాథా
విను మొప్పగఁ జెప్పెద నా
జననాయకు దానగుణము సామాన్యంబే. 122

క. సమరస్థలిఁ గపికేతుఁడు
విమతపురోన్మూలనమున వృషకేతుఁడు మా
నమున నహికేతుఁ డాకృతి
సమతను ఝషకేతుఁ డనఁగ జగతిం బరఁగెన్. 123

ఉ. అట్టి గుణంబులుం గల ధరాధిపుఁ డందఱఁ దండ్రి భంగిఁ జే
పట్టి వినిద్రబుద్ధిఁ బరిపాలన చేయుచు నుండఁగాఁ బ్రజల్
దట్టము లైన సంపదలఁ దారు కుబేరుని పెంపు మీఱియే
పట్టున దానధర్మములఁ బాడియుఁ దప్పక యొప్పి రప్పురిన్. 124

వ. ఇట్లు రాజ్యం బఖిలజనమనోరంజకం బగుచుండ. 125

సీ. కనికని మానినీజనమనోధనములు
తొలితొలి గిలుబాడు దొద్దకాఁడు
పువ్వురెమ్మలకు లేమవ్వ మెక్కించుచు
నంగజుతోనాడు సంగడీఁడు

రాచిల్కగములకు వాచవిఁ జుబ్బన
మూఱగా[1] నొనరించు సొంపుకాఁడు
కోకిలంబుల కెల్ల మూకభావంబులు
విడిపింప నడరెడు వెజ్జుఱేఁడు
ఆ.వె. తేఁటికదుపులకును దేనెతోఁ బుప్పొడి
మేపిమరపనేర్చు తీపులాఁడు
మ్రాఁకులకు ముదంబుఁ బ్రాయంబు వాటిల్ల
వింతఁ దోఁచె భువి వసంతుఁ డంత. 126

వ. అప్పు డామలయాచలంబు నుండి. 127

క. వే చని చని ఫణిసతులకు
వాచవి పుట్టించి[2] రత్నవతి యనునదిలో
వీచికలఁ దోఁగి[3] మెల్లన
వీచెం దెమ్మెరలు మరునివీచోపులనన్. 128

క. మరుఁ డరుదేరఁగ ముందఱఁ
దిరువీథులు దుడుచుకరణిఁ దిరుగుచుఁ బవనుం
డిరవుచెడ వీవ జడియఁగఁ
దరువులఁ గారాకు ధరణిఁ దఱచై రాలెన్. 129

క. బలిమియుఁ గలిమియుఁ జెలిమియు
నలవడ వచ్చిన వసంతుఁ డనుచుట్టముతోఁ
గలసిన నెలకొను పులకల
మొలకల క్రియఁ దరుల మొత్తముగఁ జిగురొత్తెన్. 130

క. చెలరేఁగి మరుఁడు విరహులు
దలఁకంగా దండుగదలు తఱి నతనికి మా

1. గుబ్బనమూర-చిన్నయసూరి. 2. రత్నవతి యగునదిలో. 3. దూఁగి.

వులుమొదలుగఁదలకొనుబహు
దళములనువసంతుఁడపుడుదగ మొనదీర్చెన్.　　131

క. దీపంబుల క్రియఁ బువ్వులు
దీపింపఁగ మోమగులు మది న్విరహులకుం
దాపంబు లినుమడింపఁగ
రూపించిన మన్మథాగ్నిరూపము దాల్చెన్.　　132

క. శ్రీరమణీయవసంతో
దారవ్యాకోచకుసుమతతి వనలక్ష్మీ
భూరివిభూషణభాండా
గారంబులకరణిఁ గర్ణికారము లొప్పెన్.　　133

క. బహుకిసలయఫలసుమనో
విహితోత్సవపికశుకాళివిహరణసౌఖ్యా
వహమహనీయగృహ శ్రీ
సహజములై చూడ నొప్పె సహకారంబుల్.　　134

సీ. ఫలరసంబులఁ గూడి యలుఁగులు వాఱెడి
　　పూఁదేనియలు వారిపూర మనఁగ
సాంద్రమధూళికాస్యందమందానిల
　　స్ఫురణంబు తరగల పొందనంగ
శుకతుండ సదృశకింశుకముకుళంబుల
　　కాంతులు విద్రుమౌఘంబు లనఁగ
మవ్వమెక్కిన వెల్లిక్రొవ్విరు లెల్లను
　　శంఖమౌక్తికఫేనసంఘ మనఁగఁ

ఆ.వె. దత్పరాగధూసరోత్పతద్భ్రమరాళి
　　శీకరంబు లనఁగఁ జెలువు మీఱి

యుదధిభంగిఁదత్పురోద్యానవనభూమి
మాధవాశ్రయమగుమహిమఁదాల్చె. 135

ఉ. గంధవహుండు వేగిరి పికంబులు గాయకపంక్తి మత్తపు
ష్పంధయము ల్బలంబు శుకసంఘము మంగళపాఠకుల్ మహా
బంధురకార్యవాది నిజబంధుఁడు చంద్రుడు మంత్రిగాఁగ గ
ర్వాంధుఁడు మన్మథుండు దనయాజ్ఞ దలంబుగ నేలెఁ దత్పురిన్. 136

క. తత్సమయంబున భూవరుఁ
డుత్సాహము రాజవృద్ధియును మెఱయ వసం
తోత్సవ మొనరింపుద మని
యుత్సుకుఁడై కదలె వైభవోద్రేకమునన్.[1]

వ తదనంతరంబున. 137

సీ. మంజులమంజీరశింజారవంబులు
వీనుల కందంద విందు లొసఁగఁ
గాంచన కాంచీప్రకాశవిలాసముల్
వలపుల పసిఁడి వన్నియ నిగుడ్పఁ
దారహారోజ్జ్వలస్తనకుంభదీప్తులు
ముఖచంద్రకళలతో ముచ్చటాడఁ
దాటంకరోచులం దఱిమిన కన్నోఁగ
మెలఁకువ లియదెస మెఱుఁగులీన

ఆ.వె. జల్లిముత్తియములు మొల్లపూదండలు
దల్లిత్రోడుభంగిఁ దడఁబడంగ
వలయరత్నరుచులు కెలఁకులఁ బొలయంగఁ
దలిరుఁబోఁడు లెదుర నిలిచి రిట్లు. 138

1. వైభవోత్సేకము.

వ. మఱియుం దదనురూప సఖీజనంబులును, ఛవసుగంధద్రవ్యహస్తంబు లగు పరిచారికాగణంబులును, విటనట పీఠమర్ద విదూషక వైతాళికవంది బృందంబులును, భూషావిశేషభూషితదేహంబు లగు నుత్సవ సందర్శ నాగతోత్సుక సందోహంబులును జేరి యక్కడక్కడ నిరుపక్కియల నిలుచునప్పుడు. (4)

క. ఒనరించినసీలని నడ
గని బొల్లనిఁ, గత్తలాని, గైరని, సారం
గని, జారని, జన్నని నిమ
వని మొదలుగఁ దెచ్చినిలిపె వాహకుఁ డెదురన్ 141

క. అక్కడ నొయ్యనఁ బచ్చల
పక్కెరతురగంబు నెక్కి పతి గదలుచు సొం
పెక్కఁ దనచిలుకవారువ
మెక్కి వసంతునకు మారుఁ డెదురేగుక్రియన్. 142

శా. రాజశ్రేష్ఠుఁ డు వాగె సన్నల గతుల్రాజిల్ల రేవంతు న
ట్లాజాడం బురుకొల్పునట్టి గతితో నమ్మేరగా మెల్పఁ దా
నాజాడం బురికొంచు నట్టి వడితో నామేరఁ దానిల్పుచున్
వాజీంద్రంబు మనోజవం బనఁగ నిర్వ్యాజోద్ధతిం దేలఁగన్. 143

క. విద్యుల్లతలకు సెనయగు
హృద్యాకృతులైన వనిత లేతేర మహా
వాద్యంబులు మ్రోయఁగ నృపుఁ
డుద్యానవనాంతభూమి కొయ్యనఁజనియెన్. 144

మ. చని యచ్చోట విభుండు చేరె సుమనోజాలప్రవాళావళీ[1]
జనితానేకసకామపంచశరచంచచ్చాపవల్లీగుణ

---

1. జాలాప్తలీలావనీ.

ధ్వనిశంకావహఝుంకృతిప్రవిలసత్సంగీతభృంగాంగనా
ఘనసంతోషవిశేషకల్పలతికాకందంబు మాకందముః. 145

వ. తత్ప్రదేశంబున శంబరభేదివేదికాకృత్యంబులు నివర్తించునంతకుం గ
తవాహనారోహుం డై యంకురిత కోరకిత ఫలిత ఫలినంబుణ నవలో
కించుచున్నయెడ విదూషకుం డొక్కచోఁ జోద్యభేద్యంబుగాఁ బద్యంబు
చెప్పి మామిడి సిరి వడయ వ్రాసితిఁ బత్రిక యందుకొన ననక యవధ
రింపు మిది తగు ననుచు నాశ్రయించినవారికి మామిడి కామునిగెలుపుంగ
లిమికి దుంప యగునను నర్థంబుగలుగ నొకయాకున వ్రాసి చేతి కిచ్చె
నదియెట్లనిన :- 146

క. మాకంద మలరవ్రాసితి
మాకంద మనాక చూడు మాకందమిటః.
మాకంద మనుచుఁ జేరిన
మాకందము మదన జయరమాకంద మగుః. 147

వ. ఇట్లున్న నది చదివి చిరునవ్వుతో నవ్విభుండు జాణ వవుదు వని పరిణ
మించిన నతండు చందనాశ్రితవృక్షసౌరభంబుగతి మాకు నిది నీప్రభా
వంబున నయ్యె నని కొనియాడి మఱియును. 148

క. నీ కెన యగు నాశ్రితర
క్షాకుశలత్వమునఁ దన్నుఁ గలసినపుణ్యా
శ్లోకపికమధుకరముల న
శోకంబులఁజేయు నిది యశోకంబు చుమీ. 149

క. వికలంబుగ నీవాసన
సకలంబును బువ్వులందు సంపూర్ణముగా
వకుళంబులందు రోలం
బకులం బిడి దీనిఁ జూడు పార్థివముఖ్యా. 150

క. భిన్నాగమ బలశంబర
భిన్నాగ మనంగ మిగులఁ బెంపొందిన యా
పున్నాగ మవధరింపుము
పున్నాగమనోజ్ఞకీర్తి పుణ్యాగణ్యా. 151

క. కంబూపమహంసలనిల
యం బూర్జితమూలబంధ మంభోనిధిగా
జంబూవృక్షముఁ జూచితె
జంబూద్వీపంబుసరి నిజం బూహింపన్. 152

క. సంచితపింఛసమంచిత
పంచాయుధమరకతాతపత్రం బన ని
శ్చంచలశాఖాంచిత మగు
చించావృక్షంబుఁ జూడు చిత్తజరూపా. 153

వ, దీనిప్రభావం బే మని వర్ణింపంబోలు. 154

క. చింత మది లేక మనుజులు
చింతించినకొలఁదిఁ జవులు చేకూర్చుచు ని
శ్చింతులఁగా నొనరించెడు
చింతకు సరి గలదె లోకచింతామణికిన్. 155

క. ఈచింతపంటిసరిగా
నోచెల యమృతంబుఁ జెప్ప నొప్పునె దానిన్
వాచవి గొని తమజిహ్వల
నేచవులును లేక చెడరె యింద్రాది సురల్. 156

క. భ్రాంతి వడి కల్పవృక్ష
ప్రాంతంబునఁ గూడుఁ గుర్కుఁ బట్టక సురల

క్రాంతంబు దీనికై మదిఁ
జింతించుటఁ జేసి పరఁగెఁ జింత యనంగన్. 157

క. మును జిగురునఁ బువ్వన నో
మనగాయల దోరపండ్ల మఱి యారఁగఁబం
డినపండ్ల నెల్లకాలముఁ
దనియఁగఁ జవు లొసఁగ నొండు తరువులు గలవే.[1] 158

క. ఉడుపతి తనలో నమృతము
గడలుకొనియుఁ బెక్కు చవులు గానక కృశుఁడై
విడిచినకళ లన్నియు నీ
గొడిసెల రూపమునఁ జింత గొలువఁగఁబోలున్. 159

క. వెస నిర్మించిన బ్రహ్మకు
రసికుఁడు మ్రొక్కిడుచు ఫలము రంజిల్లఁగ ష[2]
డ్రసములలో నిది నమలెడు
దెసఁ గని నోరూరు నాదిదేవునికైనన్. 160

ఆ.వె. గరిత లేని యిల్లు దొరలేని తగవును
జింతపండు లేని వింతచవియుఁ
జనవు లేనికొలువు శశి లేని రాత్రియు
ముక్కు లేని మొగము నొక్కరూపు. 161

మ. అని యిబ్బంగి విదూషకుండు చనవున్ హాస్యోచితం బైన చొ
ప్పునఁ దద్‌జ్ఞత్వము నేర్పడం బలుకుచు న్భూభర్తకు న్వాగ్వినో
దనసౌఖ్యంబులఁ బ్రొద్దుపుచ్చునెడ నుత్సాహంబుతోఁ గామిను
ల్వనసౌందర్యవిలోకలోలమతులై వర్తించి రయ్యెయెడన్. 162

---

1. జవు లొసఁగుచుండుతరువులు గలవే-నిట్టితరువులుగలవే. 2. రసికుఁడు "హాఖ్ఖళ నున్నరె, నొసవి" యనుచుఁ గన్నుఁడీఁడు నుడువఁడె.

క. అడుగులు గెందలిరాకులు
దొడవులు గ్రొవ్విరులు గురులు దుమ్మెదగుములుం
దడబడబడతులు బెడగడ
రెడు నడగల తీవెలన జరించిరి కవకల్. 163

సీ. ఎలమావిజొంపంబు లివెచూడుమనుచునొం
డొరులకు జూపుచు దిరుగువారు
గరములు బల్లవోత్కరములు దడబడ
డాయుచు బువ్వులు గోయువారు
బొలుపార దనువులు పుష్పవల్లులతోడ
గూడ డాగురుమూత లాడువారు
దిన్నని యేలల దీపులు రెట్టింప
దీగె యుయ్యల లెక్కి తూగువారు
తే.గీ. బువ్వుదేనియ గురియంగ బొన్న లెక్కి
మెఱపులట్లందువిరులకు మెలగువారు
నగుచుబాలికలు వనవిహారలీల
లెనయ జెలగిరి వనలక్ష్మ లనగ నచట. 164

ఉ. వెన్నలి వ్రేలగా బిఱదివ్రేకట మొయ్యన గ్రింది కీడ్వగా
జన్నులమీద గ్రిక్కిఱిసి సందెటిదండలు పొంతనిక్కగా
సన్నపుగౌనుదీగ గడుసన్నముగా మునివ్రేళ్ళ నిల్పి తా
బొన్నలు గోసె జేతులను బుప్పొడి యొప్పెడుకొమ్మ కొమ్మలన్. 165

ఉ. ఆ త్తఱి నత్తలోదరుల కందఱు కందుల కందరాని పూ
గుత్తుల జూపి వేకొల దిగోయుడు మీరని గ్రుచ్చి వానికై
యెత్తుచు జేయి దప్పె నని యించుక జాఱగనిచ్చి యక్కులన్
హత్తుచు నంగసంగసుఖ మందిరి కొందఱు ప్రేమ గాముకుల్. 166

ఉ. దేహము లాకుఁదీఁగెలకుఁ దేఁకువ సూప నవీనగుచ్ఛక
గ్రాహక లైనకాంతలకు ఘర్మజలం బుదయించుచుం బ్రియ
స్నేహరసాకృతిం జెలువు చేకొనఁగా మకరందబిందు సం
దోహసమావృతంబు లనఁ దోఁచెఁ దదీయముఖారవిందముల్. 167

ఉ. కాంతుఁడు వోలె సోలి యలకంబులుఁ బయ్యెద లొత్తుచు న్వన
శ్రాంతులు దీర్చుచు న్మిగులఁ జల్లనివాసన నావనస్థలో
పాంతనిదాఘవారికణహారివిహారి యనంగ నింతుల
న్సంతస మందఁ జేయుచు వసంతసమీరుఁడు వీచె నయ్యెడన్. 168

ఆ.వె. పువ్వుఁబోఁడు లంతఁ బుష్పాపచయకేళి
చాలు ననుచు నాత్మసఖులఁ గూడి
భూతలేంద్రుఁ డొక్క చూతతరుచ్ఛాయ
నుంట దెలిసి వేడ్క నొయ్య మగిడి. 169

క. మనసిజునకుఁ బొడసూపెడు
వనదేవత లనఁగ వచ్చి వనజానన లా
జననాయకునిం బువ్వులు
కనుకనిఁ గానుకలు చేసి కనుఁగొని రచటన్. 170

క. క్రొక్కారు మెఱపుగములను
లెక్కింపను సోయగముల లీలలుగల యా
చక్కనివనితలలోఁ బతి
చుక్కలలోఁ జంద్రు భంగిఁ జూడఁగ నొప్పెన్. 171

వ. ఇట్లుతరుణీగణ పరివృతుం డై యచ్చటువాసి చని పురోభాగంబున రంభా స్తంభశోభితంబును మృగనాభిలిప్తంబును ఘనసారరంగవల్లీతరంగితం బును బూర్ణకలశాలంకృతంబును మరువకావృతపర్యంతంబును నగువేదీ మధ్యంబున నరపతి రతిరాజానువర్తియైన ఋతుచక్రవర్తి నర్ఘ్యపాద్య

ధూపదీపాదిషోడశోపచారంబుల నారాధించి పంచమహావాద్యప్రపంచం
బుల నృత్తగీతాది మహోత్సవంబులు మెఱయఁ గర్పూరాదిసుగంధద్ర
వ్యంబులతో నింతులతో వసంతఖేలనం బొనర్చె. 172

క. వ్యక్తంబుగ సతిపైని
న్ముక్తం బగు కప్పురంబుముద్దర లల్పా
సక్తం బై యలకలపై
ముక్తాజాలకముచందమునఁ జెన్నొందెన్. 173

క. చెలఁగుచుఁ బతి చల్లినఁ దొ
య్యలులముఖాబ్జములఁ గొంత యంటి సుగంధం
బలవడియె మెఱుఁగుటద్దం
బుల నంటిన మెఱుఁగుజాతిపొడియును బోలెన్. 177

క. సురభితహరిదంతరనవ
పరిమళసంకీర్ణపూర్ణ పరిమళమునఁ ద
త్తరుణులముఖముకురంబులు
సరజస్సరసీరుహముల చందము నొందెన్. 178

క. సుందరులఁ గూడి వైభవ
బృందారకపతి వసంతపీతాంబరుఁ డై
బృందావనమున గోపీ
బృందాన్వితుఁ డైనకృష్ణువిధమున నొప్పెన్. 179

మత్తకోకిల. కుంభినీనికరంబుతో నొనగూడి యాతఁడుమహాటవీ
కుంభిచందము దోఁపగా నతిగుంభితప్రమదంబునం
గుంభినీపతి మందయానలఁ గూడి వేడుకతోడుతన్
జృంభితాంబర మౌ సరోవరసీమఁ జేరెఁ గ్రమంబునన్. 177

మత్తకోకిల. అందుఁ జొచ్చి చెలంగి సుందరు లందఱు న్మదమందుచుం
గ్రందుకొంచుఁ బరస్పరం బుదకంబు మోములఁ జల్లుచు
న్మందఱం దను ముట్టుకొమ్మని మున్గి దవ్వులఁ దేలుచుం
జందనంబు గరంగ లీలలు సల్పి రోలలు వాడుచున్. 178

సీ. వదనదర్పణములు వారిరుహంబులు
నలకజాలకములు నలికులములు
లోలనేత్రంబులు నీలోత్పలంబులుఁ
గుచకుంభయుగములుఁ గోకములును
బాహువులును బిసప్రకరంబులును లోఁతు
గలనాభిమండలములును సుళ్ళుఁ
దమలోన సరి యనఁ దారతమ్యము చూడ
నిన్నియు నొక్కచో నితఁడు గూర్చె

తే గీ. ననఁగ నంగనాసహితుఁడై యవనివిభుఁడు
యమునఁ గ్రీడించుగోపికారమణుకరణి
దివ్యనదిలోన నప్సరస్త్రీసమేతుఁ
డైన వజ్రినాఁ జెలఁగెఁ బద్మాకరమున. 179

క. వెలికిలఁబడి యీఁదెడునెడ
జలసంవృతగాత్రి యైనసతివదనముతో
నలవడఁగఁ జన్ను లొప్పెను
జలజాతము పొంతనున్న జక్కవ లనఁగన్. 180

క. ఓలోల యనఁగ నెచ్చెలి
యాలోఁ దను ముట్టవచ్చు టది గని పెలుచన్
లోలాక్షి మునిఁగి యీఁదెను
మీలకడను నయనరుచులు మెఱయించుక్రియన్. 181

క. కామినులు చేరి మెలఁగం
గా మును నిర్మలము నధికగంభీరము నౌ
నామడుఁగు గలఁగె ననఁగాఁ
గాముకచిత్తములు దానఁ గలఁగుట యరుదే. 182

క. పొలఁతులతనువుల జాఱిన
మలయజమును విరులు నెరయ మడుఁగొప్పెసము
జ్జ్వల మగువెన్నెలఁ జుక్కలు
గలయంగొని నిండియున్న గగనము భంగిన్. 183

వ. అంత జలకేళి చాలించి. 184

ఉ. కన్నులఁ గెంపు దోఁప నలికంబుల మౌక్తికజాలకాకృతిన్
సన్నపుబిందువు ల్మెఱయ జాఱిన కేశభరంబు లొప్పఁగాఁ
జన్నులనంటి పయ్యెదలు చందనపంకముచంద మందఁగా
నన్నరనాథుతో వెడలి రంబురుహాకర మంబుజాననల్. 185

వ. అంతం దదీయతటప్రదేశంబున ముక్తసిక్తవసనుం డగుచు వసుంధరాధ
మణుండు మెత్తనిపొత్తులం దనమేని తడియొత్తిన యనంతరంబ. 186

ఆ.వె. మలయజంబు నలఁది మౌక్తికహారంబు
లమర నుజ్జ్వలాంబరములు గట్టి
యమృతవీచి మిశ్రమై విశ్రమించిన
మందరాద్రిఁ బోలె మనుజవిభుఁడు. 187

వ. అట్టిచందంబున నాచందనగంధులును జందనకావులును బట్టెడకావులును
జెంగావులును గదంబకావులును గరకంచులును బొమ్మంచులును
ముడుగుబొమ్మంచులును ముయ్యంచులును జిలుకచాళ్ళును వేఁటచాళ్ళును
నిండువన్నెలును నుఱుతచాఱల వన్నెలును గంటకివన్నెలును బుప్పొడి
వన్నెలును రుద్రాక్షవన్నెలును నాగబంధంబులును బూజాబంధంబులును
జలపంజరంబులును గామవరంబులును సూరవరంబులును దారామండ

లంబులునుహంసావళులును హరిణావళులును దురగావళులును గజావళులును సింహావళులును ద్రౌపదీస్వయంవరంబులును లక్ష్మీవిలాసంబులును మదనవిలాసంబులును వసంతవిలాసంబులును రత్నకీలితంబులును రాయశృంగారంబులును గనకదండెలును గచ్చిలంబులును గర్పూరగంధులును బారువంపుగంధులును శ్రీతోఁపులును శ్రీరామతోఁపులును శ్రీకృష్ణవిలాసంబులును జీబులును సుగిపట్టంబులును సన్న వలిపంబులును వెలిపట్టులును హొంబట్టును బులిగోరుపట్టును నుదయ రాగపట్టును నేత్ర పట్టును నను పేష్కు గలపుట్టంబులు గట్టుకొని పాద ముద్రికలును మంజీరంబులును హంసకంబులును మణిరశనాగుణంబులును ముక్తాఫలావళులును బదకంబులును నంగదంబులును నంగుళీయకంబులును గ్రైవేయకంబులును రత్నతాటంకంబులును భ్రమరకంబులును లాలాటికంబులును మౌక్తికజాలకంబులును శేఖరంబులును నాదిగాఁగల యలంకరణంబులు ధరియించి యగరు చందన హరిచందన ఘనసారోదయ భాస్కరమృగమద ప్రముఖనిఖిల వాసనల నాశావకాశంబులు వాసించుచు నృపరత్నంబుం జేరునంత. 188

క. అంగీకృతశృంగారకు
రంగీనయనాంతరంగరంజకరంగ
ద్భృంగీరవహృదయంగమ
భంగీసంగీతుఁ డగుచుఁ బవనుఁడు వీచెన్. 189

వ. అట్టి యుల్లాససమయంబున. 190

క. రూపముగల యానందము
రూపించిన మన్మథుండు రుచిరాకృతితో
దీపించెడి శృంగారము
భూపతి యని కొలిచి రెలమిఁ బొలఁతుక లెల్లన్. 191

క. ఆవేళ భూమివల్లభుఁ
డావెలఁదులు గొలువ నొప్పె యక్షవధూబృం



దావృతుఁ డగు ధనదునిగతి
దేవస్త్రీసహితుఁ డైన దేవేంద్రుక్రియన్.

వ. ఇట్లనల్పకాలంబు విశ్రమించుచున్న యెడల ననతిదూర మాకందవనంబు నుండి యొక్కభూసురుండు చనుదెంచి తన్మహోత్సవం బవలోకించుచు భూలోకస్వర్గలోకం బిది గదా యితఁడు గదా మహాభాగ్యవంతుం డని కొనియాడుచమున్ను దా నధిక దారిద్ర్య పీడితుం డగుటం జేసి తన్ను నిందించుకొనుచుఁ దనలోన. 193

క. ధాత్రి దరిద్రుఁడు సభల న
పాత్రుఁడు కడుముచ్చు మిత్రబాంధవులయెడం
బుత్రకళత్రంబులయెడ
శత్రుం డఁట వాని బ్రదుకు చౌకౌఁ గాదే. 194

క. ఇలలో నెవ్వని కర్థము
గలదాతఁడు మాన్యుఁ డుచితకార్యజ్ఞుఁడు ని
ర్మలుఁడు బలవంతుఁ డార్యుఁడు
కులతిలకుఁడు సభ్యుఁ డధికగుణ గణ్యుండున్. 195

మ. అని చింతించి మహీసురుం డొకయుపాయం బాత్మనూహించి ము
న్నానరం జేసిన చండికాచరణపాదోపాస్తి చాలించి యా
జనపాలాగ్రణిపాలికిం జని మహాసంపత్తి యర్థించి కై
కొన నిం దొప్పు నటంచు వచ్చె మదిఁ గోర్కుల్ తీఁగలై సాఁగఁగన్.

వ. అతనిం జూచి యి ట్లని దీవించె. 197

క. "భూయాత్తే సంపద్దీ
ర్ఘాయు ర్భవతే" యటంచు నాశీర్వాదో
పాయనములతో నృపుఁ గని
డాయం జని నేర్పు చొప్పడరఁగాఁ బలికెన్. 198

ఉ. అంబుజబంధుతేజ మధురామ్రవణంబున నుండి సర్వలో
కాంబిక యైనచండికఁ బ్రియంబునఁ గొల్వఁగ నాకు నూఱువ
ర్షంబులు వోయె నంతటఁ బ్రసన్నత దేవత నిన్న నర్ధరా
త్రంబున దంతపంక్తి విశదద్యుతిచంద్రిక పర్వ నిట్లనెన్. 199

క. నీచేసినతపమునకు య
థోచితముగ విక్రమార్కుఁ డొసఁగెడు నతనిన్
వే చని వేఁడుము నావుడు
నీ చక్కటి నిన్నుఁ గొల్వ నేఁ బనివింటిన్. 200

వ. అని విన్నవించిన నవ్వసుంధరాపురందరుండు చండికయే యిట్లాన తిచ్చెనో కాక యీవిప్రుండే నెపంబున న్నబ్బించిధనంబు వడయం జూ చెనో యెట్లైన నన్నంతటివానింగాఁ దలంచి వచ్చుటంజేసి యీతని యాశా పరిపూర్తిచేసెద నని నిశ్చయించి. 201

ఆ.వె. దేవిమాట కల్ల గావింపఁగా రాదు
నిన్నరిత్త వంప నీతి గాదు
నీతపోమహత్త్వనియతికిఁ దగునంత
యనఘ యిష్ట మెద్దియడుగు మనిన. 202

క. మాకందవనములో ని
చ్చాకీర్తులు వెలయునట్లు చండిక పేరన్
నాకౌకనగరము వలయును
జేకొని నిర్మింపు రాజశేఖర యనినన్. 203

సీ. సంతోషమున మహీకాంతుఁ డచ్చటి కేగి
సర్వసామగ్రియుఁ జాలఁ గూర్చి
మహనీయగృహములు మండపంబులు సోమ
సూర్యవీథులుఁ గోటచుట్టుపరిఖ

లనువొందఁ జండికాయతనంబు నాపురిఁ
గట్టించి కాఁపులఁ బట్టి కొలిపి
నియుతసంఖ్యములుగ హయముల బంట్లను
నాఱునూఱేన్గుల నతని కిచ్చి

ఆ వె. రాజుఁ జేసి పిదప రాజ్యకట్నంబున
కనుచు మూఁడుకోటు లర్థ మొసఁగి
పటహపటునినాదభంగి దిక్కులఁ గీర్తి
పిచ్చలింప మగిడి వచ్చెఁ బురికి. 204

క. కావున నాతని సరిగా
నీ వీగతి భూమి కీర్తి నెఱపిన నెక్కం
గావచ్చు నిట్టి వితరణ
మేవెరవున దొరకదేని నింటికిఁ జనుమా. 205

వ. అని పల్కుటయు. 206

క. ఉల్లంబున భోజమహీ
వల్లభుఁ డాశ్చర్య మంది వదనాబ్జమున
న్వెల్లఁదనము వాటిల్లఁగ
నల్లనఁ దాఁ దిరిగి చనియె నంతఃపురికిన్. 207

శా. చక్రీభూతకఠోరశార్ఙ్గవితతజ్యావల్లరీముక్తబా
ణక్రూరోగ్రసమానసంస్ఫురణకీర్ణజ్వాలపుంభీభవ
చ్చక్రాస్త్రద్యుతిమాత్రనిర్దళితరక్షఃపక్షపాతద్విష
చ్చక్రాటోపతమఃప్రసారుని మహాచక్రేశపర్యంకునిన్. 208

శా. ఆలోలాలకజాలభృంగయుతవక్త్రాంభోరుహోజ్జృంభిత
ప్రాలేయాద్రితనూభవాకృతిమతిప్రాప్తాంధకచ్ఛేదనో

త్రాలాభీలకరాళశూలధరణత్రాతామరవ్రాతపూ
జాలక్ష్మీయుతపాదపద్మయుగళుం జంద్రార్ధచూడామణిన్. 209

మాలిని. ఉరగనికరవేషీ యోగనిద్రాభిలాషీ
గిరిధరవరదాయీ క్షీరవారాశిశాయీ
పురవిదళనదక్షా పుండరీకాయతాక్షా
స్మరహరహరిరూపా సత్యనిత్యస్వరూపా. 210

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్ట విభాళాది బిరుద ప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్ర భూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాఁటి పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీ కొఱవి వెన్నయామాత్యపుత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజగోపరాజ విరచితంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు విక్రమార్కు కృతజ్ఞత్వదాతృత్వప్రశంసనం బన్నది తృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## చతుర్థాశ్వాసము

### -: ఏడవబొమ్మ కథ :-

క. శ్రీస్తనకుంకుమసదృశగ
భస్తిసమూహప్రశస్తిపరిదీపితవ
క్షస్థలపటుతేజోమయ
కౌస్తుభకమనీయవేషి గంసద్వేషీ. 1

క. తలఁపున నిల్పి పెద్దల హితజ్ఞులఁ దద్జ్ఞులఁ గూర్చి భోజమం
డలవిభుఁ డిష్టలగ్నమున డాసి మహాసన మెక్కఁ బూనఁగాఁ
బలికెఁ దదీయపుత్రిక నృపాలక నిల్వుము విక్రమార్కభూ
తలపతిఁ బోలు తెంపు బలదర్పము లేకిట నెక్క వచ్చునే. 2

క. అనవుఁడు నాతనిసాహస
మును సత్వము నెట్టిచందమునఁ బెంపొదవె
న్వినిపింపు మనిన నుల్లస
మున నేడవబొమ్మ పలికె భోజునితోడన్. 3

శా. సత్యాలంకృతభాషణాభరణుఁ డుత్సాహప్రశస్తోదయుం
డత్యాసన్నహితోపభోగ్యవిభవాయత్తాధికప్రాభవ
ప్రత్యాదిష్టసురేశ్వరుండు నయసంపన్నిత్యుఁడా విక్రమా
దిత్యుం డుజ్జయినీపురిం బరఁగె నాదిత్యప్రభావుం డనన్. 4

వ. ఇట్టి విధంబున నతఁడు వ్యసనరాగద్వేష కామ క్రోధలోభమోహ మద మత్సర విరహిత సుజనప్రాజ్యం బగు రాజ్యంబు సేయ న్విద్యయందు వ్యసనంబును, కీర్తి సంపాదనంబునందు రాగంబును, పాపంబునెడ ద్వేషంబును, సంతతిసమృద్ధుల యెడం గామంబును, ధర్మవిరోధుల యెడఁ గ్రోధంబును, దుర్విషయంబులకడ లోభంబును, శిశువులకడ మోహంబును, బరోపకారంబులయెడ మదంబును, దానంబులయెడఁ బర స్పరమత్సరంబును బ్రవర్తిల్లఁ బ్రజలెల్ల నుల్లంబుల నుల్లసిల్లుచు భూవల్ల భుగుణంబులం బెల్లు గొనియాడుచుండ. 5

ఉ. అన్నరనాథువీట ధనదాఖ్యుఁడు సద్గుణుఁ డర్థసంపదం
గిన్నరనాథసన్నిభుఁడు కీర్తివిశాలుఁడు దానధర్మసం
పన్నుఁడు నీతిమంతుఁడు కృపాపరిపూర్ణుఁ డుదారబుద్ధి వి
ద్వన్నుతశాలి వైశ్యకులవర్ధనుఁ డుండుఁ బ్రజానుకూలుఁడై. 6

ఆ వె. అతఁ డనుదినంబు నవనిసురులఁగూడి
ధర్మశాస్త్రగోష్ఠి దగిలియుండి
యైహికంబు దక్కఁదని పరం బెఱుఁగుచు
విహితసకలదానమహిమ నెగడె. 7

క. హింసాతరంగితం బగు
సంసారపయోధిలోన జనులకు నెల్లం
గంసారిపాదపంకజ
సంసేవయ నావ యని ప్రశంసింపంగన్. 8

క. ఈక్రమమును విని ధనదుం
డక్రూరప్రియుని ద్వారకాధీశ్వరునిం
జక్రధరుని దర్శింప న
పక్రమమునఁ బతికిఁ జెప్పి పయనం బయ్యెన్. 9

ఆ వె. ఆప్తవర్గసహితుఁ డై యేగి దుర్గంబు
లూళ్ళు నదులుఁ గడచి యొక్కనాఁడు
వృక్షరమ్య మగుచు వెలయు నుపద్వీప
మందు[1] విడిసి విప్రశమార్థ మరిగి. 10

క. స్ఫాటికసోపానంబుల
హాటకమయభైరవాలయముముందట మి
న్నేటిగతి శుద్ధజలరుచిఁ
బాటిల్లఁగఁ గనియె నొక్కపద్మాకరమున్. 11

వ. అందుఁ గృతస్నానుండై యొంటిఁ బసిండిగుడిం బ్రవేశించి. 12

శా. ఆలోనం గనియె న్భుజాష్టక విభూషాకీర్ణరత్నప్రభా
జాలోన్మిశ్రితరక్తచందనపయస్సంధ్యాభ్రసంకాశదే
హాలంకారు మహోరగప్రకరజిహ్వాసన్నిభోగ్రానల
జ్వాలాకారకరాళకేశముఖదంష్ట్రాభైరవున్ భైరవున్. 13

క. అట్టిమహాభైరవునకు
దట్టం బగు భక్తితోడ దండాకృతిగాఁ
గట్టెదుర మ్రొక్కి లేచుచుఁ
బట్టికపైనున్న యొక్క పద్యముఁ గనియెన్. 14

ఆ.వె. ఎవ్వఁడైన నిచటి కేతెంచి తనతలఁ
దానె త్రెంచికొనినఁ దక్షణంబ
మొండెములును దలలు రెండునంటికొనంగఁ
బతియుఁ బడఁతుకయును బ్రదుకఁగలరు. 15

వ. అనునట్టి పద్యార్థంబునకుఁ గలంగి తత్త్వార్థం బవలోకించుచు. 16

---

1. అఖిలవృక్షరమ్యమగునుపద్వీపము నందు.

క. చంపుడుగుడి[1] యిది యనియా
దంపతులకళేబరములుఁ దలలుం గని త
త్సంపాదితభయరౌద్రా
కంపితుఁడై సెట్టి బెగడి కన్నులు మూసెన్. 17

క. తదనంతరంబ చెదరిన
హృదయముఁ దనలోన నెట్టకేలకు[2] నిలువం
బొదపెట్టి వెడలి యొక బా
రి దొలఁగె నని విడిదలకుఁ దిరిగి చనుదెంచెన్. 18

క. ఆరే యచటం బుచ్చి వి
కారవిహీనాత్ముఁ డగుచుఁ గలమునఁ బారా
వారము నడిమికిఁ జని యా
ద్వారావతిపురము సొచ్చి తత్సౌధములోన్. 19

మహాస్రగ్ధర, కనియె న్యూపుత్రజిష్ణున్ ఘనదురితమహాఖండనావిర్భవిష్ణున్
వనమాలాలంకరిష్ణున్ వ్రజవనవిహరద్వల్లవీకేలితృష్ణున్
దనుజేంద్రైకాసహిష్ణుం దరళమణిమయద్వారకాబద్ధధృష్ణున్
దినకృత్కన్యావరిష్ణున్ ద్విజపతిగతివర్ధిష్ణు గోపాలకృష్ణున్. 20

క. కనుఁగొని యాదేవునకుం
గనకంబులు మణులుఁ బూజ గావించి ప్రియం
బెనయఁ బ్రణమిల్లి నిటలం
బునఁ జేతులు మొగిచి వినయమున వినుతించెన్. 21

సీ. ఇరుజోడుమొగముల యెఱ్ఱని కొమరుండు
నేర్పునఁ బనులెల్లఁ దీర్పుచుండఁ

---

1. చంపెడుగుడి. 2. నెట్టకేనియు.

దప్పనియోజతోఁ దనపిన్నపాపల
నాడింపఁ దెల్లని కోడ లుండఁ
గలిమియౌ నిల్లాలు కలిమినీనెడుచూడ్కిఁ
బెంపుడుబిడ్డలఁ బెంచుచుండఁ
గమ్మని యమ్ములు గల్గు ముద్దులపట్టి
చిల్లంగి చేతలు చేయుచుండఁ

ఆ.వె. గాలిత్రేలఁ గన్నగారాబుఁగూఁతురు
మొదలివేల్పుఁ గూడి మురియుచుండ
నల్లపాలవెల్లి ఝల్లుగాఁ గాఁపుర
మెఱఁగి చేయు మేటి దొరవు నీవ. 22

సీ. పాదతీర్థం బతిపావనం బగుటకు
శిరమున నిడుకొన్న శివుఁడు సాక్షి
కలఁడన్న నెందైనఁ గలుగుట కుర్విలోఁ
బంబిన యుక్కుఁగంబంబు సాక్షి
తలఁచిన యంతనె తలఁగక యర్థుల
రక్షించుటకుఁ గరిరాజు సాక్షి
యాచంద్రతారార్కమగు దానశక్తికి
ధ్రువపదంబున నుండు ధ్రువుఁడు సాక్షి

తే.గీ. తాలిమికిఁ గాలఁ దన్నిన తపసి సాక్షి
భాగ్యమున కాదిలక్ష్మి చేపట్టు సాక్షి
త్రిభువనగురుండ వగుట విరించి సాక్షి
నిన్ను వర్ణింప నలవియె నీరజాక్ష. 23

నిరోష్ఠ్యదండకము :— జయకృష్ణ! జయకృష్ణ! కృష్ణ! స్థిరాస్యందనస్థాన
నానా దినధ్యాననానాసితానేక సేనారజోనీక రథ్యాతిరథ్యాళి సన్నాహస

ద్ధరాజన్య జన్యాగతానన్యసాదృశ్యదృశ్యాంగ హృష్యజ్జరాసంధసంధాన యంత్రాదియత్న క్షయాదాయి నీతి శ్రితాసార! సారాంతరజ్ఞానదాసాహిత ధ్యాన సన్నద్ధతేజః కళాసంచితానంది! నందాంతరంగాంతరంగన్నిజానం దనీరాకరాకారరాకానిశాధీశ! ధీశస్తసంచారసంచేయ సత్కీర్తినారీలసన్నా రదారాధితాచార ధీరాంగనానాయకాద్యంతరాజాతశాస్త్రార్థసారాశయాగణ్య! గణ్యాకృతిచ్ఛాయ రాధానిరంతస్తనాద్రిస్థలక్రీడనాయత్తచిత్తస్థిరాసక్తిలీ లానటీరంగ రంగస్థలీసాధనాహృష్ట దుష్టాహితాభేదనాకాలసంజాతరాగాఢ్య నేత్రాంతకంసారి హింసాకళాదక్ష! దక్షక్రియానాశనాకారారకాశాక రేశాది గర్జద్గణాధీశశక్రీసహక్రీజయిశ్రీరణాసార నిస్సారితాకారి నీరంధ్ర తేజోల సచ్చక్ర! చక్రాకృతి శ్లాఘనీయాంతశార్ఙ్గాతతజ్వాలతానిర్గతాఖండకాం డాగ్ర ఖండీకృతారాతి సంఘాత! ఘాతస్థలత్కాళియాహీంద్ర శీర్షాశిరంగ క్షితిక్రీడనాహర్షణాశ్చర్య కార్యాంగహారాయతిజ్ఞాన సత్యక్షణాసక్తచిత్తాది తేయాదిసిద్ధాంగనాకిన్నరీయక్షసంకీర్తితానంతకీర్తి స్రగాధార! ధారాళధారాధ రాకాశనీలాంజనేందిందిరానీల సచ్ఛీకర గ్రాహకాళింది హేలాకరాశాగ్ర హస్తాది విశ్రాంతి సాంగత్యశాంతాది సంతత్యహంకార! కారాగతారాతినారీ కనక్రందరాధ్యక్షనిశ్శేషణీశాతనాకేళిఖేలజ్జగజ్జాల! జాలాంతగాఢాంధకార చ్ఛిదానంద కృత్యాకరాదిత్య నిత్యాహితస్నేహసంరక్షితాశేష రక్షస్సతీసం ఘదృక్కజ్జలక్షాళనాశీలధారా జలాధారఖడ్గాగ్ర లగ్నాహితాసీకరక్తాధర న్యస్తరాగాంతరాసంగి సంగీతసంతుష్టసారంగరంగత్తరంగాదిగంగానదీకార ణాంఘ్రి స్థిరానంద సంక్రందనాగ్న్యర్కజాతాదితేయారినీరాధినాథానిలా ధ్యేశ గంగాధరాద్యష్ట దిగ్రక్షకశ్రేణికా శేఖరానర్ఘ్యరత్నాళినీరాజనారాజితా కార కాంతిచ్ఛటాకాంత సంధానితాలీల! లీలాలసచ్చారిణీగీతనీరేజసంచారిణీ రాజరాజాగ్రణీ. **24**

మ. అనుచుం బెక్కువిధంబులం బొగడి సాష్టాంగంబుగా మ్రొక్కి ధ
న్యున్గాఁ దన్నుఁ దలంచికొంచు జనమాన్యుం డౌచు నుజ్జేనిక

ల్లన నేతెంచి మహీతలేంద్రు నధికాహ్లాదంబుతోఁ గానుక
గ్గాని దర్శించిన నావణిక్ప్రవరు సద్గోష్ఠిం బ్రియం బందుచున్. 25

ఆ వె. వైశ్యచంద్ర నీవు ద్వారకానాయకు
చరణసేవ కేగి తెరువు నందుఁ
గ్రొత్త యేమి గంటి వత్తెఱం గెఱిఁగింపు
మనిన ధనదుఁ డిట్టు లనియెఁ బతికి. 26

క. ద్వారవతి కేగు తెరువునఁ
బారావారంబులో నుపద్వీపమునన్
భైరవుగుడిలోపల నతి
భైరవభావార్థమైన పద్యముఁ గంటిన్. 27

వ అది యెట్టిదనిన. 28

ఆ.వె. ఎవ్వఁడైన నిచటి కేతెంచి తనతలం
దానె త్రెంచుకొనినఁ దత్క్షణంబ
[1]మొండెములనుదలలు రెండు నంటుకొనంగఁ
బతియుఁ బడఁతుకయును బ్రతుకఁగలరు. 29

క. కథ గాదిది ముందట నా
మిథునము మొండెములుఁ దలలు మేదినిఁ బడవే
ప్రథహేతువులైనవి త
త్కథనంబున నామనంబు తలఁకెడు నిపుడున్. 30

ఉ నావుడు విక్రమార్కుఁడు మనంబున నుత్సుకుఁడై వణిక్పతీ
నీ వటు రమ్ము పోద మని నిర్మలఖడ్గసహాయుఁ డౌచు నా

---

1. రుండములకుఁ దలలు రెండు నంటుకొనఁగ? - తుండములకుఁ దలలు రెండు- చిన్నయ్యసూరి.

త్రోవన యేగి యచ్చటి సరోవరతీర్థము లాడి రక్తపూ
జావృతుఁ డైన భైరవుని సద్మము దగ్గఱి సెట్టి మాన్పఁగన్. 31

శా. తద్వారంబున సెట్టినుంచి చని యంతర్వేదిపై భుక్తిము
క్తిద్వారం బగు కాశినాథునకు భక్తిన్ మ్రొక్కి సంతుష్టుఁడై
యుద్వేగస్థితినుండి ధైర్యమతితో నుర్వీశుఁ డచ్చో మను
ష్యద్వంద్వద్విశిరఃకబంధములుఁ బద్యంబు న్నిరీక్షించుచున్. 32

క. తద్యోగవ్యంజక మగు
పద్యార్థం బెఱిఁగి దాని భావంబునకున్
సద్యోనిర్ణయముగ నృపుఁ
డుద్యోగముచేసె సాహసోద్ద్యోతితుఁడై. 33

ఆ.వె. భూపశేఖరుఁడు "పరోపకారార్థ మి
దం శరీర" మనుచుఁ దలఁపుకొలఁది
మృత్యుజిహ్వవోలె మెఱుఁగులీనెడునట్టి
కడిఁదిఁయడిద మెత్తి మెడకుఁబూనె 34

క. ఆలోన నతని సాహస
మాలోకించుచుఁ బ్రసన్నుఁడై పార్థివ నీ
పాలం గల్గితి నని భూ
పాలునిఖడ్గంబు క్షేత్రపాలుఁడు పట్టెన్. 35

ఉ. అప్పుడు మొండెముల్ దలలు నంటుకొనంగ వధూవరుల్ ప్రియం
బొప్పఁగ లేచి మ్రొక్కిన సముత్సుకమానసుఁ డౌచు భైరవుం
డిప్పటిసాహసంబునకు నే నిదె మెచ్చితి నిష్ట మేర్పడం
జెప్పుము నీకు నిత్తు నిటఁ జేకుఱ నన్న నతండు మ్రొక్కుచున్. 36

ఆ.వె దేవదేవ వీరికీవిధంబున శిర
శ్ఛేద[1] కృత్య మేల సిద్ధ మయ్యె

1. దేవ వీరికిట్టి తెఱఁగున నీశిరశ్ఛేద.

నానతిమ్ము నాకు నని విన్నవించిన
భైరవేశ్వరుండు పలికె నిట్లు. 37

క. రత్నోద్భవుఁ డనఁగా నొక
రత్నవ్యవహారిసుతుఁడు రత్నంబుల కీ
రత్ననిధిలోనఁ దిరుగుచు
యత్నంబున నిచట విడిసె నాప్తులుఁ దానున్. 38

క తద్వేళ మఱియు నొకఁడు స
రిద్వల్లభసలిల ముత్తరింపఁగ నొకచో
నుద్వాహమునకు నేగుచు
నీద్వీపముఁ జేరె నిజసుహృద్వర్గముతోన్. 39

వ. ఇక్కడ నయ్యిద్దఱు నిట్లొండొరువుల మహిమలు మెఱయింపుచుఁ గలసి మాటలాడునెడ రత్నోద్భవుండు నీనామం బెద్ది యేదేశంబునుండి యెచటి కేఁగుచున్నాఁడ వనిన నతండు నేఁ జంద్రకేతుం డనువాఁడ మగధదేశంబు నుండి రత్నద్వీపంబున కేఁగుచున్నవాఁడ నం దొక విశేషంబు గలదు. 40

క. పద్మాకృతి రేఖలు కర
పద్మంబుల నొప్పుచుండఁ బద్మకు నెనయై
పద్మావతి యనుకన్యక
పద్మానన గలదు జాతి పద్మిని యనఁగన్. 41

క. ప్రస్తుతలావణ్యగుణని
రస్తప్రసవాస్త్రమోహనాకారిణి సం
త్రస్తకురంగేక్షణ తా
లస్తని యది మదనరాజ్యలక్ష్మియుఁ బోలెన్. 42

చ కలువలుఁ జక్రవాకములుఁ గంజములున్బిసకాండము ల్మనం
బలరఁగ దీని లోచనకుచాననబాహుసమానలక్ష్మి గా

వలయు నటంచుఁ గోరి యుదవాసమునందుఁ దపంబు సేయుచు
న్నిలుచుటఁగాక యెప్పుడును నీటఁ జలిం బడనేల వానికిన్. 43

ఆ.వె. ఇట్టికన్య నాకు నిచ్చెద రమ్మని
దానితండ్రి తొల్లి తగినవారిఁ
బనిచినాఁడు గానఁ జనియెద ననుడు ర
త్నోద్భవుండుఁ దాను నుత్సహించి 44

క. ఆతరుణి యెవ్వరికి నౌ
నాతని బ్రదు కొప్పు ననుచు ననురక్తి మనో
జాతుసిచేఁతలఁ బడల న
తీతము మును విన్నభంగి దిట్టతనమునన్. 45

క. ఆకన్నియఁ దజ్జనకుఁడు
నా కిచ్చెద నంచు మొన్న నయముం బ్రియముం
గై కొనఁగఁ జెప్పి పుచ్చిన
నాకడ కే నేఁగుచంద మది యెఱుఁగవొకో. 46

వ. అనుడు మత్సరసముత్సేకంబున. 47

క. అతని పలుకులకు నాతం
డతికుపితుండైన వాఁడు నధికక్రోధా
న్వితుఁ డయ్యెను "మూలం వై
రతరోః స్త్రీ" యనినమాట ప్రకటంబయ్యెన్. 48

శా. అన్యోన్యం బిటు దూలుచు న్మనమునం దందేఁగుచో[1]నెవ్వనిం
గన్యారత్నము గోర దాతఁడు కులోత్కర్షంబు వాణిజ్యమున్

1. న్మనమె నేఁడండేగుచో.

సన్న్యాసంబును జేఁత పంత మని మాత్సర్యంబుతో నాత్మసౌ
జన్యం బెల్ల. దొఱంగి[1]లేచి చనుచో సంకల్పసంసిద్ధికై. 49

క. సద్భావము గైకొని ర
త్నోద్భవుఁ డిఁక దైవబలమ యుచితం బని తా
నద్భుతముగ మ్రొక్కుచు నిట
మద్భవనముఁ జొచ్చె దురభిమానముపేర్మిన్. 50

క. గుడిసొచ్చి నాకు సాఁగిలఁ
బడి మ్రొక్కుచుఁ బలికె నెన్నిభంగులనైనం
బడఁతుక యిది నా కబ్బిన
మిడిదల యొప్పించి నిన్ను మెప్పింతుఁజుమీ. 51

చ. అని యొడఁబాటు చేసి వినయంబున మ్రొక్కుచు నేఁగి చంద్రకే
తునిపని కేతు వుట్టఁ దనదొడ్డతనంబు నటించి రత్నకాం
చనమయ మైన దీవి రభసంబునఁ జేరి కడంకఁ గన్యకా
జనకుని గాంచి చెప్పె నిజసంవరణోద్యమ మప్పు డేర్పడన్. 52

సీ. ఆతఁడి నాచంద్రకేతుండు చనుదెంచి
తనరాక చెప్పినఁ దద్గురుండు
నిద్దఱ కర్చన లిచ్చినఁ దాంబూల
గంధపుష్పాక్షతల్ గైకొనంగఁ
దొడవులకెల్లను దొడవైన కన్నియఁ
దొడమీఁద నిడుకొన్న యెడనొకండు
తెల్లసంపెంగలు దివ్యంబు లివి యని
సమముగా నిచ్చినఁ జంద్రకేతుఁ

---

1. దొలంచి.

తే.గీ దిదియమేలని తనతలఁగదియఁదుఱిమెఁ
దొలుతదేవయోగ్యములనఁదోడియాతఁ
డిష్టదేవత కర్పించి యెలమిఁ బిదప
పీని ముడిచెద నని యొడిలోనదాఁచె. 53

చ. ఇరువురచేష్టలం గని మృగేక్షణ యల్లన లేచి హంససుం
దరగతి లోనికిం జనినఁ దండ్రియు నిద్దఱపేళ్ళు జాడలుం
జరితములుం దగం దెలిసి సామ్యము గల్గిన వీరిలోన నె
వ్వరి నవుఁగా దనం జను వివాదము బాలికచేతఁ దీఱెడుఁ౯. 54

క. ఆతరుణి మెచ్చి కైకొను
నాతఁడె మాయల్లుఁ డనుచు నచటికిఁ జని క
న్యాతిలకముఁ జంకిట నిడి
వాతెఱ ముద్దిడుచు బుజ్జవంబునఁ బలికె౯. 55

గీ. ఒడిఁ బ్రసూనముల్ దాఁచె రత్నోద్భవుండు
తుఱిమికొని యుండెఁ జంద్రకేతుండు దొల్త
నీకొలఁది యిద్దఱందును నీకుఁ జూడ
నొప్పుగా రసికుఁ డెవఁడొ చెప్పు మనిన. 56

క. పువ్వులు గొను మని యిచ్చిన
యవ్వేళన తుఱుముకొన్నయతఁ డెవ్వఁడొ వాఁ
డివ్వసుమతి నస్థిరుఁ డగు
నవ్వంబడు నొరులచేత నాకుం జూడ౯. 57

వ. అనినఁ దండ్రి విని యితండె జాణ యని నాకు నీతివాక్యంబు దోఁచు
చున్న యది యెట్లనిన. 58

క. వనితాభోగము లంచము
ధనము సుభాషితము విరులుఁ దాంబూలముఁ బం

డినపండ్లును సిద్ధాన్నం
బును దడయక కొన్నవాఁడె భువి జాణ యగున్. 59

వ. అనినం బద్మావతి యానీతివాక్యంబు దప్ప దిప్పటి కుసుమంబులు దివ్యం
బులని యిచ్చుటం జేసి తోడియాతండు దేవతార్పణంబు చేసి మఱిముడిచి
కొనం దలంచె నెయ్యి పాలలో నాలుకు టయ్యె దేవతాపరాయణుం
డగుట సకలమంగళహేతువు మానుషబలంబుకంటె దైవబలంబు ప్రబ
లంబు మఱి యింతియకాదు. 60

క ఆకుసుమంబులు దేవత
కై కోరికి డాఁచికొనినయది చూడఁగా
నీకడకు వచ్చునెడ ననుఁ
గైకొనుటకు మ్రొక్కు టొకటి గలుగఁగఁబోలున్. 61

మ. అనినం గూఁతు నలంకరించి మది నెయ్యం బెచ్చటం బుట్టె నా
తనిపై వైవుము వాఁడె భర్త యని నూత్నంబైన పుష్పస్రజం
బెనయం జేతికి నిచ్చి బంధులు నిజాభీష్టార్థముల్[1] వచ్చుక్రం
బున వాద్యంబులు మ్రోయఁగా నెలమితోఁ దోడ్కొంచు నేతెంచినన్. 62

క. రత్నద్వీపంబునఁ గల
రత్నంబులలోనిదివ్యరత్నము[2] కన్యా
రత్నము దా వనమాలిక
రత్నోద్భవుమీఁద వైచె రాగం బడరన్. 63

వ. అవ్వేళం బద్మినీరాగకారణంబగు గగనరత్నంబుపగిదిం బద్మావతీకృతాను
రాగుం డగురత్నోద్భవు శుభోదయంబునం జంద్రకేతుండు ప్రభాతచం
ద్రుకియం బ్రభాహీనుండై లోనం గుందుచు జలధిఁబడందలంచిన నది

1. భీష్టౌఘముల్, 2. మొదలిరత్నము.

తెలిసి యాసెట్టి తనతమ్ముని కూఁతుఁ గుముద్వతి నిచ్చెదనని యతని
రాకసఫలంబుగాననునయించి తెచ్చి. 64

ఉ. సంపద సొంపుమీఱఁగఁ బ్రసన్నమనస్కుఁడు సెట్టి వేడ్కతోఁ
బెంపడరంగ నల్లునకుఁ బెండిలిచేసి తదీయసత్క్రియా
లంపటుఁడై సువర్ణదశలక్షధనం బరణంబు నిచ్చియా
దంపతు లుల్లసిల్లఁగఁ బదంపడి వారల నంపె నింపునన్. 65

క. రత్నోద్భవుండు నిట కతి
యత్నంబున వచ్చి వంచితాప్తజనుఁడై
నూత్నవివాహశ్రీ యగు
పత్నిం జేపట్టి నాదుభవనము సొచ్చెన్. 66

వ. చొచ్చి ప్రణమిల్లి 67

శా. దేవా మ్రొక్కెదె వచ్చె నంచు శితశస్త్రం గంఠనాళంబు స
ద్భావాధిక్యము దోఁపఁ ద్రెంచుకొనినం బద్మావతీకన్య ప్రే
మావేశంబును భక్తియు న్నిగుడఁగా నాథుంగి నిచ్చో నిజ
గ్రీవాచ్ఛేదము చేసి వ్రాలెఁ బతిపైఁ గీర్ణోచ్ఛలద్రక్తయై 68

చ. అటఁ దమమూఁకలోన హితు లాతనిఁ గానక జాడ వట్టి యి
చ్చటి కరుదెంచి తున్కలయి చచ్చినవీరలఁ జూచి మద్గృహం
బిటనట నాదటం బొరలి యేడ్చుచు నెత్తులు మొత్తుకొంచు ను
త్కట మగుదుఃఖవహ్నిఁ గమఁ గ్రాఁగిరి వేఁగిరి దోఁగి రశ్రులన్. 69

సీ. తదనంతరంబ యిద్దఱ నెత్తికొని వెలి
కరుగఁ జూచిన నేను గరుణ కల్మి
మీలోన నొక్కఁడు మిడిదల యిచ్చిన
దంపతుల్ బ్రదుకుట తథ్య మనిన

నామాట కులికి మిన్నక కాలభైరవుం
డీలోన నిద్దఱ నిట్లు ద్రుంచె
నింక నెందఱఁ జంప నెంచినాఁడో యని
విడిచి కన్యని గుడివెడలి పాఱి

తే.గీ. రేను నామాట పద్యంబుగా నొనర్చి
వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన
మ్రొక్కఁ జనుదెంచి కాంచి విదిక్కుపడుచు
వెడలిమఱిచూడ రిట వెరవేఁకిపట్టి 70

క. వీరాగ్రణి యగు నీచే
వీరిద్దఱు బ్రదికి రింక వేఁడుము దగ నీ
కోరిన కోరిక లిచ్చెద
భూరమణీరమణ సర్వభూతదయాత్మా 71

వ. అనుడు నతండు మఱియుం బ్రణమిల్లి. 72

క. సకలార్థసిద్ధికైదే
వ! "కలౌ మైలారు భైరవా" యనుపలుకుల్
ప్రకటంబుగ రాజ్యముతో
వికలత్వము లేనిబ్రదుకు వీరల కిమ్మా. 73

మ. అనుచు న్వేఁడిన వానిసాహసము నత్యౌదార్యముఞ్ భైరవుం
డనురక్తిం గొనియాడి వారలకుఁ బ్రాజ్యం బైనరాజ్యంబుఁ జం
దనశైలస్థలిఁ గల్గ నిచ్చి తనలోఁ దా సన్నిధిం బొందినఞ్
ధనదుం గూడి కడంకతో మగిడె నాథాత్రీశుఁ డుజ్జైనికిఞ్. 74

క. ఆభూపతి గుణములు నీ
కేభంగులనైనఁగలుగ వింక మగుడఁ మనం

ప్రాభవముఁ గలిమ జాఱఁగ
నాభోజుఁడు తిరిగి చనియె నంతఃపురికిన్. 76

వ. అంతఁ గొంతకాలంబు చనఁగ.

—: ఎనిమిదవబొమ్మ కథ :—

క. కాశాబ్జమల్లికాకలి
కాశారదనీరదేందుకైరవహంసా
కాశాపగాంబుహిమసం
కాశాంగవికాసితప్రకాశు గిరీశున్. 77

చ. తలఁపుచు మ్రొక్కి భోజవసుధావరుఁ డిష్టులు దృష్టశాస్త్రవే
త్తలు శకునజ్ఞులు న్సముచితం బగు లగ్నము చెప్పఁగా సము
జ్జ్వలకరవాలహస్తుఁ డయి వచ్చి మహాసన మెక్కఁ బూనఁగా
నిలునిలు మంచుఁ బల్కెఁగడు నేర్పున నచ్చటి బొమ్మ యిమ్ములన్. 78

క. మోహమున భద్రపీఠా
రోహణ మగు ననుట గుణవిరోధము గాదే
సాహసభూషణుసరిగా
సాహసగుణగణము లేక చనునే యెక్కన్. 79

క. ఇవ్విధమునఁ బలికిన నృపుఁ
డవ్వీరుని బలిమి తెంపు లవి యెట్టి వన
న్నవ్వుచు నప్పాంచాలిక
నివ్వెఱఁగందంగఁ జెప్పె నిర్వచనముగన్. 80

శా. ఆకర్ణింపుము భోజభూవర నిలింపాధీశసంపాదితా
స్తోకస్నేహవివేకనాకయువతీస్తోత్రైకపాత్రుండు ధా

శ్రీకాంతాపరిభోగ్యభాగ్యనిధి కీర్తిన్ విక్రమాదిత్యుఁ డ
స్తోకచ్ఛత్రముగాఁ దనర్చుచు జగం బేలెం గృపాలోలుఁడై.

క. ద్వాత్రింశద్భాగములను
ద్వాత్రింశద్ద్వారమైన వజ్రాసనమున్
ద్వాత్రింశదాయుధములున్
ద్వాత్రింశల్లక్షణములుఁ దగునాతనికిన్. 82

సీ. దుర్గరక్షణమును దుష్టశిక్షణమును
శిష్టపాలనమును జేయవలయు
వర్ణధర్మములును వనములు గుళ్ళును
జలజాకరంబులు నిలుపవలయుఁ
గృషియు వాణిజ్యంబు గృహజీవధనములు
నాయవ్యయంబులు నరయవలయు
ననదల నర్థుల నార్తులఁ బాత్రులఁ
బూజ్యుల విప్రులఁ బ్రోవవలయు

తే.గీ. బలముఁదెంపుఁగలిగి యలుకయుఁగరుణయుఁ
జలము నిలుకడయును జరుపవలయు
నయముఁబ్రియమువైరిజయముఁగార్యముఁగొల్వు
నితరరాజగతుల నెఱుఁగవలయు. 83

క. అన నున్న నీతివిధమున
ననువుగ భూపతులవలన నయ్యెయుపవ
ర్తనముల జరిగెడు నృపవ
ర్తనములుఁ దెలియుచు నతండు ధరయేలంగన్. 84

క. చారులు చనుదెంచినఁ బతి
వారలచే నన్యదేశవార్తలు వినుచు

స్మీరు చరించిన యాకా
శ్మీరంబున నేమి గలవు చిత్రము లనినన్. 85

సీ. వసుధేశ యచ్చట వైశ్యుండు ధనపతి
యోజనాయతమైన యొక్కచెఱువు
గట్టించి లోఁతుగాఁ గావింప నందులోఁ
బుడిసెఁడునీళ్ళను బొడమకున్న
వగచి యింటికిఁ జని మగిడి నిచ్చలు నట్ల
వచ్చి యాకట్టపై వెచ్చనూర్చు
చుండఁగా ముప్పదిరెండులక్షణములు
గలవానికంఠరక్తంబు లిమ్ము

ఆ.వె. చెఱువు నిండు ననుచుఁ జెప్పె నంబరవాణి
దాని కాతఁ డట్టివానిఁ గూర్పఁ
బూని యేడుకోటు లైన బంగారునఁ
బ్రతిమ లేడు నిలిపెఁ, బద్య మొకటి. 86

ఆ.వె. "అవనిఁ ద్రిదశలక్షణాన్వితుఁ డగుధీరుఁ
డిచటఁ గంఠరక్త మిచ్చెనేని
సప్తకోటిమూల్యతప్తకాంచనముల
ప్రతిమ లేడు నతని పాలు సుమ్ము."

మ. అని యిట్టున్నది విస్మయం బిది నృపాలాగ్రేసరా నావుడు
న్విని యుత్సాహముతోడఁ దత్సహితుఁడై విశ్వంభరాధీశుఁడుం
జని యచ్చోటఁ దటాకమధ్యమున గర్జన్మర్దళధ్వానసం
జనితశ్రీరమణీప్రసాదవిలసత్సౌధంబు వీక్షించుచున్[1]. 88

---

1. శ్రీరమణీకటాక్ష విలసత్స్థానంబు వీక్షించుచున్. ప్రసాదమగునా సౌధంబు వీక్షించుచున్.

ఆ వె. అష్టదిక్కులందు నష్టభైరవులను
దాండవమున నొప్పుతాండవేశు
నెదుర శ్రీవరాహు నేఁబదిచేతుల
రాతికంబముతుదిఁ బ్రీతిఁ గనియె. 89

క. ఉర్వీశుఁడు సేతువునఁ జ
తుర్వింశతిమూర్తు లెదురఁ దోఁపఁగఁ ద్రిజగ
న్నిర్వాహకుఁ దన నిలిచిన
సర్వేశ్వరుఁ జూచి మ్రొక్కె సద్భావమునన్. 90

ఉ. అచ్చటిపద్యముం బ్రతిమ లన్నిటి నేర్పడఁ జూచి యాత్మలో
నచ్చెరువంది భూమివరుఁ డచ్చెఱు వప్పుడె నిండఁ జేయఁగా
నిచ్చఁ దలంచి వేళకొఱ కించుకసేపు సహించి యుండఁగా
నిచ్చయెఱుంగుసంగతి దినేశుఁడు డగ్గఱెఁ బశ్చిమాంబుధిన్. 91

ఉ. అంబరరత్నబింబ మపరాంబుధిఁ జేరఁగ నెండ శైలశృం
గంబుల ధాతురాగముల కైవడిఁ గెంపు వహించెఁ జక్రవా
కంబులు తల్లడిల్లె విహగంబులు గూండ్లకు నేఁగఁజొచ్చెఁ బ
ద్మంబులు వాడఁబాఱెఁ గుముదంబులు సొంపున కెక్కె నిక్కుచున్. 92

ఆ.వె. పండుటెండఁ దరులు పల్లవద్యుతులతో
మెండుకొనఁగ వరుణుమేడమీఁద
నుండి వెలుఁగు పసిఁడికుండ చందంబున
నెండజేఁడు గ్రుంకుగొండ నొప్పె. 93

సీ. అపరాబ్ధిఁ గ్రీడించు నంబరస్త్రీ యొద్ద
నిద్దమౌ కుంకుమముద్ద యనఁగ
నచట సంధ్యాదేవి కర్ఘ్యంబు లెత్తు ది
క్సతిచేతిమణిమయకలశ మనఁగ

వరుణుని ముందఱఁ బరిచారకులు నిల్వఁ
బట్టిన రత్నదర్పణ మనంగ
నస్తాచలం బను హస్తిమస్తకమునఁ
దిరమైన రక్తచామర మనంగ
తే.గీ. నిఖిలదిగ్వలయాంతమాణిక్య మనఁగ
నిట్ట ప్రాఁకిన పవడంపుఁ జుట్టయనఁగ
గట్టుతుద నున్న జేగుఱుగ ల్లనంగ
నరుణమండల మొప్పె దినాంతమందు. 94

క. అయ్యెడ నర్కునిమండల
మయ్యచలము డిగ్గి పశ్చిమాంబుధి సొచ్చెం
వయ్యందిఁగాఁచి కమ్మరి
చయ్యనఁ బదనిచ్చు నుక్కుచక్రము మాడ్కిన్. 95

తే ఏ విధమున మలక లైన దైవగతిని
సౌమ్యవానిన మఱి చేరు సౌమ్య నాఁగఁ
ద్రిభువనము లెల్లఁగలయఁగఁదిరిగి గగన
రత్నమప్పుడు రత్నాకరమునఁగలసె. 96

క. నెఱసంజఁ గ్రుంకు గుబ్బలి
చఱి జఱజఱ నినుఁడు డిగ్గజాఱుచుఁ జనునా
తఱి నఱిముఱి నెగసిన [1]జే
గుఱుధూళి యనంగఁ గెంపు గుఱికొని పర్వెన్. 97

క. మిన్నందెడుతేజంబున
నెన్నంగల యినుడు దీఱె నిదె యెడ రనుచు

---

1. తఱివడితో నెగసినజేగుఱు.

న్విన్నంతనె పఱతెంచెడు
మన్నీలన నపుడ యురులుమన్నీ లెసఁగెన్. 98

*క. లోకమున విగతదృష్టి వి
వేకంబునఁ జక్రవాకవిరహానలధూ
మాకారంబున జనములు
చీకాకుపడంగ దెసలఁ జీకటి గప్పెన్. 99

గీ. అర్కుఁడేఁగిన గాలాభ్రలీలఁ
దమము గప్పిన యెడ వియత్పథముదోఁచె
వరుస దప్పక దావపావకము సోఁకి
చనినపిమ్మట ఘనతృణస్థలము కరణి 100

క. నేలయు నింగియు నిండఁగ
వాలుచు దళమైన చీఁకువాలేచినఁ ద
త్కాలంబున జన మొప్పెను
నీలసలిలమునను గడవ నించినమాడ్కిన్. 101

సీ. యమునాజలానీల మౌచిమ్మ చీకటి
పెల్లున జగమెల్ల నల్లనైన
దిగినఁ దప్పెద మని యగజతోడను శూలి
తనవెండికొండపైఁ దలఁకుచుండ
నీదెస మఱి గానరా దని హరి లక్ష్మి
దోయిగా నమృతాబ్ధిఁబాయకుండ
దీనఁ బాసినఁ గానలే నని వాణి తో
డ్పడ బ్రహ్మ వెలిచమ్మి వెడలకుండఁ

---

*ఈపద్యము మొదలు **వఱకు నొకప్రతిలోనే కలవు.

తే.గీ. దెలుపు నలుపును ననియెడి తెలివి తలఁగి
పల్లమును మిట్టు నెఱుఁగక యెల్లజనులుఁ
బుట్టుచీఁకులగతి నంటి పోక దక్కి
యుండి రుదకంబులో మునిఁగున్నపగిది. 102

క. రాజిల్లెడు తారాగ్రహ
రాజింగ్రిక్కిఱిసి యంబరము గడు నొప్పెన్
రాజు చనుదెంచు నని యు
ద్భ్రాజితమైయున్న విరులపందిరిభంగిన్. 103

శా. దిగ్భామామృగనాభిలేపనము భాతి న్విస్రుతంబౌ తమః
ప్రాగ్భారంబు నిశావధూచికురభారస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
బ్రాగ్భాగంబునఁ దచ్ఛిఖావినిహతప్రవ్యక్తరక్తోత్పల
స్రగ్భావంబునఁ గెంపు దోఁచె రజనీరాజద్యుతివ్యాజమై 104

క. తరుణారుణకిరణోత్కర
పరిహృత ఘనతిమిర మైనప్రాగ్భాగమునం
బురుహూతునెదురనెత్తిన
కరదీపికకరణి శీతకరుఁ డుదయించెన్. 105

క. తనయుదయమె మదిఁ గోరెడు
నను విడిచె నినుండు కల్ల నాయెడ లేకుం
టనెఱుఁగఁ డని పూర్వాశాం
గన జగమున మ్రొడ్డు వట్టు గతి శశి మెఱసెన్. 106

సీ. ఉదయాచలము చఱి నున్న బంధూకంబు
కొమ్మను బొడమిన కుసుమమనఁగఁ
దత్ప్రదేశంబునఁ జలకొని పొడతెంచు
నలినీలతాపక్వఫల మనంగ

విరహిమృగంబుల వేఁటాడుమదనుండు
తివిరి పెట్టించిన దివియ యనఁగ
నమరంగ నింద్రాణి యాఖండలుని నివా
ళించెడు పసిఁడిపళ్ళెర మనంగ

తే.గీ. దోడుతోడన తనకెంపువీడుచుండఁ
దిమిరపటలంబు కొంత మీఁదికిఁ జలింపఁ
దెలివిపడలేఁతవెన్నెలమొలకలెత్తి
నిండుకొనియుండె నమృతాంశుమండలంబు. 107

ఉ. కోకములు న్సరోజములుఁ గుందుచుఁ గందుచునుండఁ గైరవా
నీకములుం జకోరములు నిక్కుచు సొక్కఁగ మానినీసము
త్సేకము నంధకారమును దిగ్గఁగ దిగ్గన లోకము న్నిజా
లోకము నుల్లసిల్లఁ గవిలోకము మెచ్చులు పిచ్చలింపఁగన్. 108

క. నడుమం గృష్ణుఁడు గలపా
ల్కడలిన జనియించి తండ్రికైవడి మూర్తిన్
బెడఁ గడరెడువాఁ డనఁగా
నుడుపతి తెలుపై కళంకయుతుఁడై మెఱసెన్. 109

క. తిమిరసముదాయమున న
ర్ధము నలుపై పూర్ణతుహినధామద్యుతి న
ర్ధము తెలుపై యాకాశము
యమునాగంగాంబుసంగమాకృతిఁ దాల్చెన్. 110

తే.గీ. మిత్రుఁ డేగిన యెడరున మేర దప్పి
వాలి చేకొన్న యిరులమన్నీలు పఱవ
యశముగతిఁ గ్రొత్తవెన్నెలదిశలఁ బర్వ
రాజు చనుదెంచె గగనదుర్గమునకంత. ** 111

క. ఇటునటుఁ జనకుండఁగఁ జెం
గటఁ జంద్రుం డాఁక నిడిన గతిఁ దప్పినచీఁ
కటి చెలికాంౘడన నంబుజ
పుటములలోఁ జంచరీకములు తగులొందెౝ. 112

క. భాగీరథియుదకంబు న
భోగంగయు వేఱుసేయఁ బోల దనుచు స
ద్వాగీశుఁడు గూర్చెనొ యన
వేగన భూగగనములను వెన్నెల నిండెన్. 113

సీ. తొలితొలి లేఁతవెన్నెల నాగ్రమింగుచుఁ
దనియఁ బిల్లలనోళ్ళఁ జొనిపి చొనిపి
ముదురువెన్నెలఁ బట్టి చదియంగ నమలుచు
మెచ్చుచుఁ బిల్లల కిచ్చి యిచ్చి
పండువెన్నెల దొడఁ బలుమాఱు నొక్కుచు
గమిగూడి యందంద కమిచి కమిచి
వెలినార సాఁగెడు వెన్నెలకాఁడలఁ
ద్రొక్కి ముక్కునఁ ద్రెంచి బొక్కిబొక్కి
తే.గీ. చొక్కి తత్ప్రవాహములోన సోలిసోలి
యడ్డమీఁదుచు గడ్డపై నాఁగియాఁగి
యెనసి బలఁగముతోఁగూడ[1] మునిఁగిమునిఁగి
కోరికలు మీరిఁబుచ్చెఁ[2] జకోరచయము. 114

చ. కలువలవిందు జక్కవలకందువ వెన్నెలతీవదుంప ము[3]
చ్చులమెడకోణ మంగజునిచూపరి చూపులయింపు జారకాం

---

1. యెనసి బుడుగులయట్టులు మునిఁగి-బుడిగి=బుంగముంత చి.సూ.——
2. మూగిముంచె 3. రాజుల మెడకోణ.

తలవెఱగొంగ రాత్రికులదైవము చల్లనిరాజు పంకజం
బుల ముకుగొయ్య[1] యచ్యుతుని ముద్దుమఱంది వెలింగె నయ్యెడన్. 115

క. కొడుకుసిరిఁ జూడ నుబ్బనఁ
గడఁగి వడి న్వెడలి వచ్చి కడు మీఱినపా
ల్కడలి యన నిండువెన్నెల
గడలుకొనుచు నెల్లకడలఁ గడు బెడఁ గడరెన్. 116

సీ. దిక్కులు గలయంగఁ బిక్కటిల్లిన పండు
వెన్నెల యాపాలవెల్లి యనఁగ
ముత్తియంబులభాతి మొత్తమౌ తారకా
గణములు లహరికాగణము లనఁగ
నుజ్జ్వలాకారమౌ నుడురాజబింబంబు
సెజ్జయై మెలఁగిన శేషుఁ డనఁగ
నందమై మృగనాభిబిందుసుందర మైన
యందులకందు ముకుందుఁ డనఁగ

ఆ.వె. నట్టివేళఁ గువలయానందకందమై
పుణ్యములకుఁ గలితభోగములకు[2]
గారణంబునాఁగఁ గందర్పజనని యై
రజనిలక్ష్మి మిగుల భజనకెక్కె. 117

ఉ. ఆతఱిఁ బార్థివుండు సమయం బిదె నిర్జన మంచు నిల్చి త
త్సేతువుమీఁద రక్తబలిదేవత[3] నిష్ఠఁ దలంచి ధర్మవి
ఖ్యాతముగాఁ బరోపకృతికై తల యిచ్చెద నంచు నుబ్బుచుం
జేతికృపాణమల్ల మెడఁ జేర్చె మెఱుంగులు తొంగలింపఁగన్[4]. 119

---

1. పంకజంబులకెదురెక్క. 2. యానందమై పుణ్యభాగులకును వారి భోగములకు. 3. రక్తజలదేవత. 4. కృపాణమెత్తి మెడఁజేర్చె మెఱుంగుత్రు రంగలింపఁగన్.

ఉ. అప్పుడు రక్తభోజిని తధస్త్రము వట్టి ప్రసన్నచిత్తయై
కప్పు తనూలత న్మెఱయఁగా నృపుముందట నిల్చి వేఁడు మే
నిప్పుడు మెచ్చితి న్వరము లిచ్చెద నావుడు మ్రొక్కియాత్మలోఁ
దప్పనిభక్తితోడ వసుధాపతి పల్కె నుదారవృత్తియై. 119

క. ఇచ్చటఁ గోరినకోరిక
లిచ్చెదనని యానతిచ్చి తే నడిగెద నా
కచ్చెరువుగ నీతలఁపున
నిచ్చెలు విదె నిండఁజేయు మిప్పుడు తల్లీ. 120

ఆ వె. అనుడు దేవిపల్కె నవనీశ నీధర్మ
బుద్ధిఁ జెలువు దానె పూర్ణమయ్యె
ధార్మికులకు సిద్ధితడయునే కప్పలఁ
గాచి యెలుక పాము గతికిఁ బుచ్చె. 121

—: శంఖపాలుని కథ :—

క. అనవుడు జనవిభుఁ డది యె
ట్లని యడిగిన దేవి చెప్పె నాకథ యిదిగో
వినుము హిమాద్రిసమీపం
బునఁ గడు లోఁతైన మడుఁగుపొలుపైయుండున్. 122

క. ముదమున నందులకప్పలు
వెదవెట్టిరె వెట్టికోరు వెట్టిరె యెదురే
కదకద దక్కుము పొదపొద
యదె వరవర వాఁగురూఁగు రనుచుం జెలఁగున్. 123

క. అట కంతటను ఫణత్రయ
పటుతరుడై యొక్కశంఖపాలుం డను పే

రిటి నాగేంద్రుఁడు చని దా
పటికప్పల[1] మ్రింగఁ జొచ్చి పద్యము చదివెన్. 124

క. "గుండియ చెదరక భువి నె
వ్వం డైన నిజాంగ మిచ్చువాఁడు గలిగినన్
గండూపదీయుతం బగు
మండూకౌఘంబుతిండి మానుదుఁ జుండీ" 125

క. అని ముమ్మాటు ముఖత్రయ
మునఁ జదువుచు మడుఁగుచుట్టు ముమ్మాఱు వివ
ర్తనచేసి మూఁటి మ్రింగును
ననుదినమును వ్రతముపోలె నచటం దిరుగున్. 126

శా. ఈమర్యాదల నున్నదాని చరితం బేపారఁగాఁ జూచి వి
శ్రామార్థంబుగ నొక్కకాకి చని వృక్షశ్రేణిపై బాంధవ
స్తోమంబు న్వినిపించి నిల్వక మహాచోద్యంబుగా నుత్తమ
ప్రేమాఢ్యం బగు మూషకంబునకుఁ జెప్పెం దత్క్రమం బేర్పడన్. 127

క. ఆమూషక మిది చూడఁగ
నీమహిఁ గడుఁ జిత్ర మనుచు నిచ్చఁ గుతుక ము
ద్దామముగఁ గాకితోడుగ
నామడువున కేఁగి యచటి యవనిజ మెక్కెన్. 128

క. అత్తరువుమీఁద నుండుచు
నత్తఱి నుదకంబులోన నహిభీతిఁ గడుం
గుత్తుక తుకతుక యనఁగాఁ
దత్తఱపడుచున్న భేకతతిఁ బొడఁగాంచెన్. 129

---

1. యప్పటికప్పల.

ఆ.వె. బ్రహ్మ "కప్పకాటు జాఁపనపోటును"
లేకయుండఁ జేసెఁ గాక నేఁడు
గలిగెనేని వైరిఁగని యిన్ని దునుమవె
దైవలిఖిత మేల తప్పు ననియె. 130

క. ఆలోనను వెడలి మహా
వ్యాళము చదువుచును మడువు వలగొనఁగాఁ ద
త్కాలంబున మూషక మిటు
చాలం గృపపుట్టి వాయసంబున కనియెన్, 131

చ. అలిగి వధించినప్పు డొరు లడ్డము వచ్చిరయేని నాఁడుఁగ
ప్పలు మగకప్పల న్విడువఁ బంతముచేసె వడిన్ భుజంగ మి
మ్ములు మన మడ్డమై నిలిచి ముక్తుల మౌదము రమ్ము నావుడుం
గలఁగి ఖగంబు బుద్ధి యిదిగాఁ దనుచుం దలయూఁచి యిట్లనున్. 132

ఉ. అన్నలొ తమ్ములో చెలులొ యాత్మజులో చనువారు వీరికై
యిన్నిక చావనేల యిది మేలె భువిన్ బలిభోజినయ్యు నా
యున్నెడ విశ్వసింప నొరునొద్దకుఁ జేరఁ బ్రమాద మైనఁ గ
న్నన్న నెఱింగి యొండెడకుఁ జాఁగుదుఁ బ్రాణముతీపి చూచితే. 133

క. వలవనిపని యిది ఫల మని
చలమునఁ దాఁ జచ్చి పడయుసంపద లేలా
యిలఁ బ్రాణము గలిగిన*బి
బ్బిలియాకేఱి తినవచ్చుఁ బెక్కుదినంబుల్. 134

అ.వె. మనుజుఁ డొక్కఁ డేటమునిఁగెడు దిగి నిల్వఁ
బట్టు మనిన భంగి నిట్టునీవు[1]

---

* బ్రబ్బిలియాకేఱి— 1. డొక్కఁడు (మనగు) గునుకుదియె (యే) దుగో దానఁ బెట్టు మనినభంగి నిట్టినీవు-చిఱుత కట్టి-చిన్నయసూరిగారు.

కొంత దెలియలేవు క్రొవ్విన గొఱియ దాఁ
జింతకట్టె మేయఁ జేరుటయ్యె. 135

ఆ.వె. ప్రాణమైన సుతులుఁ బత్నులుఁ జావఁగాఁ
జావలేరు వీనిచావు కింత
తన్నువాలినట్టి ధర్మంబు గలుగునే
చెడుగుబుద్ధు లింక విడువు నీవు. 136

క. అనవుడు నది యిట్లనియెను
విను మొక ప్రాణమునఁ బెక్కువిధముల ప్రాణుల్
మనఁగం జేసినపుణ్యం
బెనయున్ భువిలోనఁ గ్రతువు లెన్నియుఁ గూడన్. 137

క. ధనధాన్యములును సుతులును
వనితలుఁ దనతోడఁ గూడి వచ్చుట గలదే
జనహిత మగునడవడినిఁ జ
నిన ధర్మము దనకుఁ దోడునీడను బోలున్. 138

క. ధనము గలిగి పెట్టక యీ
జననంబున నెలుకనైతి జనులకు నిడువ
ర్తన సమకూరక యూరక
చనియెను దినము లొగి ధర్మసంచయ మేదీ. 139

క. పాపంబు పుట్టునెడఁ దా
నోపియు నుడుపంగలేక యూరక యున్నం
గాపురుషుం డాతం డగు
నాపాపము వానిఁ బొందు నండ్రు వివేకుల్. 140

క. క్షోణి "ననిత్యాని శరీ
రాణి" యనుచుఁ బెద్ద లెఱుక ప్రచురింపంగాఁ

ప్రాణిపరిపాలనమునకుఁ
ప్రాణము వంచింపనేల పరహితమతికిన్. 141

క. తనతనయులుఁ దనసతులును
దనవారలుఁ దనగృహంబుఁ దనసొమ్మనుచుం
దనుపున. దనరెడికప్పలఁ
దన దగు తను విచ్చి కాచి తనిపెదఁ బ్రీతిన్. 142

క. ఈగతి "ధర్మస్య త్వరి
తాగతి" యనుపలుకుకొలఁదిఁ దడయక నే నా
నాగేంద్రుని కెదిరించెద
నాగాంతకుఁ జేరుఖచరనందను మాడ్కిన్. 143

క. అని పలికి శంఖపాలుని
పని విఘ్నముఁ బొందఁజేయఁ బనిపూని గజా
ననుఁడు దనవాజిఁ బుత్తెం
చెనా యనఁగా మూషకంబు క్షితిపై నుఱికెన్. 144

సీ. ధవళాంశు మ్రింగి సుధాశక్తిఁ దెల్లని
దేహంబు వడసిన రాహు వనఁగ
భువనత్రయం బొక బుట్టఁ[1] బెట్టఁగఁ జాలు
వేఁడిమిపడగలు మూఁడు మెఱయ
భీషణం బై యున్న రోషాగ్నిఁ బొడమెడు
శిఖలకై వడిఁ గ్రాలు జిహ్వ లదర
దనలోని కీడు ముందటఁ దెల్పుమాడ్కి ని
శ్వాసంబుతో విషజ్వాల లొలుక

1. బుస్సఁ.

తే.గీ. [1]మోయుజేగంటచాడ్పునమ్రోగిమ్రోగి,
చదివి తిరిగెడునాగేంద్రునెదురనుండి
నీకు నాహార మిప్పుడు నేన యైతి
నిలిచికై కొను మనుచు నియ్యెలుక పలికె. 145

క. ఆపలుకున భుజగము తన
రూపంబు పరిత్యజించి రుచిరాకృతి వి
ద్యాపారంగతమతి యన
దీపించెడు విప్రుఁడై నుతించుచుఁ బలికెన్.  146

క. మూషకకులతిలక దయా
భూషణ నినుఁ బోలునట్టి పుణ్యులు గలరే
భాషణమాత్రంబున ని
ర్దోషుఁడ నై బ్రదుకఁ గంటిఁ దొల్లిటిభంగిన్. 147

సీ. తాపసుం డగుదీర్ఘతముఁ గొల్చి సాంగయు
క్తంబుగా వేదత్రయంబు చదివి
యతనిచే దేవకార్యమునకు నామం
త్రితుండనై యుండఁగా దొర యొకండు
తనయింటి పితృకార్యమునకు రమ్మనవుడుఁ
దద్గృహంబునఁ బదార్థములు పెక్కు
గలుగ నూహించి యక్కడి కేఁగి కుడిచిన
విని ఋషి చనుదెంచి నను నదల్చి
ఆ.వె మునుపు మాకు నీయకొని యట చని కూడు
కుడిచి తీవు కుడువఁ గూడ దనక

---

1. మోసియున్నట్టి ఘోరమౌముఖము లదర.

శ్రుతి యుతుండు వయ్యుశ్రుతిహీనజీవమై
పెనఁచి మ్రింగుచుండు భేకములను. 148

క. అని శపియించిన నే నా
తనికిన్ ధరఁ జాఁగి మ్రొక్కి తప్పు గలదు శి
ష్యునిఁ గరుణింపుము మునువది
వినవదువుల దురితమెడలివిరతియుఁగలుగన్. 149

తే.గీ. అనుడు నామాటదప్పదు వినుము నీకు
వేదము ల్మాఁడు పడగలై వెలయుఁగాన
శంఖపాలుండవై జలాశయముఁజేరి
మూఁటిఁదినుమనిపద్యంబు మొదలఁజెప్పె. 150

క. "గుండియ చెదరక భువి నె
వ్వం డైన నిజాంగ మిచ్చువాఁడు గలిగినన్
గండూపదీయుతం బగు
మండూకౌఘంబుతిండి మానుదుఁ జుండీ." 151

క. ఈకరణిం జదువుచు* నీ
వాకడ ముమ్మాటు దిరుగునవసరమునఁ ద
ద్భేకములఁ గావ ధైర్యము
గైకొని యొకఁ డడ్డమైన గతిఁ గను మనీయేన్. 152

క. కావున నిట నురగాకృతి
నీవిధమునఁ దిరిగి చదివి యిన్నిటిఁ గలయం
గా వధియించితిఁ గడపట
నీవెరవున దురిత మెల్ల నీఁగితి ననఘా.

1. * వ. అనుచున్. క. ఈకందముఁ. జదువుచు.

క. దీర్ఘతముని శాపం బను
నిర్ఘాతము సోఁకి వచ్చి నీ వచనసుధా
నిర్ఘర్షణమున మంటిని
దుర్ఘట మిది యనఁగ వింటిఁదుది గతిఁ గంటిన్. 154

మ. అని చెప్ప న్విని మూషకంబు గడుఁ జోద్యం బంది యవ్విప్రుఁడో
డ్కొని తా నుండు బిలంబుఁ జేరి యిదె కైకొమ్మంచు నం దున్న కాం
చన మెల్లం గొనివచ్చి యిచ్చి యుచితస్నానప్రదానస్పృహం
జనియెం గాశికి ధర్మరాశికిని మోక్షశ్రీప్రయోరాశికిన్. 155

మ. ధరణీదేవకుమారుఁడు న్మగిడి యుత్సాహంబుతోఁ దత్సరో
వరతీరంబున మూషకేశ్వరము నా వర్తిల్లు తీర్థంబు నీ
శ్వరగేహంబును గల్గఁ జేసి చని యాచార్యుం దగం గాంచి సు
స్థిరమౌ భక్తిఁ జతుర్థవేదముఁ బఠించెన్ ధర్మనిర్మాతయై.[1] 156

సీ. ఈవిధంబున నొక్కయెలుక ధర్మము సేయఁ
జింతించునంతలో సిద్ధి యయ్యె
సర్వలక్షణముల సంపూర్ణుఁ డవు నీవు
నీతలంపున నిది నిండు టరుదె
యదిగాన నొండెద్ది యైన న న్నడుగుము
నావుడు వసుమతీనాయకుండు
చెఱువుగట్టించిన సెట్టిధర్మం బెల్ల
సుడివడకుండఁగ నడపు తల్లి !

శా. యేనొనర్చునట్టి యీచేత మానవు
లెఱుఁగకుండఁ జేయు మిదియ చాలు
ననుచు మ్రొక్కి వీడుకొని గూఢచారియై
యిచ్చమెచ్చి మగిడి వచ్చెఁ బురికి. 157

1. నిర్ణేతయై.

క. ఏ రాజు నతని సరిగా
సిరికీర్తిగుణంబు లేక యెక్కుడు మనుజుఁడ
ధారానాయకుఁ డతని
స్వీకరుఁ డై మగిడె మోము సిగ్గున వ్రాలన్. 158

—: తొమ్మిదవ బొమ్మ కథ :—

వ. అంత నొక్కనాఁడు నవమద్వారంబునం బ్రవేశింపఁ గడంగి. 159

క. కలువకు నెల వగుతమ్మియు
వలిపం బగుపచ్చపట్టు వలయపుటలుగున్
తెలిగొల్లెయు వనమాలయుఁ
గలిమియు మానికము మేనఁ గలిగిన వేల్పున్. 160

ఉ. భక్తిఁ దలంచి భోజుఁడు శుభం బగులగ్నమునందు మౌళిపై
మౌక్తికరేఖ లొప్ప హితమాగధవందివసీపకద్విజా
సూక్తజయానులాపములు మున్ను గడంగెడు నంతనంత నా
శక్తి సువర్ణపుత్త్రిక వెసం బలికెన్ నృపు నడ్డపెట్టుచున్. 161

ఆ.వె. వినుము భోజరాజ విక్రమార్కుని బోలి
సత్త్వధైర్యములను జాలకనికి
విస్ఫురించి మెక్కఁ దివురుట పిచ్చుక
కొండ కైలమెక్కఁ గోరుటయ్య. 162

మ. అనుచుం బల్కి యతండు వాని బలధైర్యంబుల్ దగం జెప్పుమా
యనఁ బాంచాలిక పల్కె నాతఁడు రణవ్యాపారపారంగతుం
డనఘోదంచితవృత్తుఁడు సాహసధనుం డింద్రాదిమిత్రుండు స
జ్జనసంభావి యనారతం బుజ్జయిని రాజ్యప్రాజ్యుఁడై యేలఁగన్. 163

ఆ.వె. భట్టిమంత్రి సైన్యపాలి గోవిందచం
ద్రుఁడు త్రివిక్రముఁడు పురోహితుండు;

నప్పురోహితునకు నాత్మజుం డగు కమ
లాకరుం డన నవివేకి గలఁడు. 164

క. ఆకమలాకరుఁ డాకమ
లాకరసాదృశ్యముగ జడాశయుఁ డైనన్
శోకము మదిఁ బొదలంగ వి
వేకము పుట్టింపఁ దండ్రి వెరవున[1] దూఱెన్. 165

క. చుట్టములకుఁ దలిదండ్రుల
కెట్టియెడం బ్రియము నెఱపనేడపని చదువుల్
గట్టిగ నెఱుఁగనిపుత్రుఁడు
పుట్టుట కులమునకుఁ దెవులుపుట్టుట సుమ్మీ. 166

క, విను ముత్తమ మగుపుట్టువు
గనుపట్టెడు నట్టిరూపు గలమోదుగుఁబూ
వును మూర్ఖుండును బ్రబలెడు
వనమున భవనమునఁ దగినవాసన గలదే. 167

క. కులసతికి సిగ్గు క్షత్రియ
కులజునకున్ జయము వర్తకున కోపికయుం
గలిమికి వితరణమును వి
ప్రులకు న్విద్యయును దగినభూషణము లగున్. 168

క. పరులకు సోదరులకు భూ
వరులకుఁ గొనరాదు సర్వవశ్యము తానె
వ్వరి కిచ్చినఁ గోటిగుణో
త్తరవృద్ధి భజించు విద్య తనధన మెపుడున్. 169

1. వెరచుచు దూఱెన్.

క. పరభూమికిఁ జనుచోఁ ద
స్కరులకు నగపడదు ద్రేఁగుగా వెచ్చట నె
వ్వారి నైన హితులఁ జేయును
ధరలో మఱి విద్యఁబోల ధనములు గలవే. 170

ఉ. గద్యముఁ బద్యముం బెనుపఁ గైకొను టొండె, ధ్రువాప్రబంధసం
పద్యుతుఁ డౌట యొండె, మృదుభాషలఁ బ్రొద్దులు పుచ్చుటొండె, లో
కోద్యమలక్షణం బెఱుఁగు టొండె, గడు న్భజియించుఁగాక యే
విద్యలు నేరఁ డేనిఁ పశువే యగుఁగాదె గణించి చూచినన్.[1]

శా. సంగీతంబుఁ గవిత్వతత్త్వమును సౌజన్యంబు భావంబు స
త్సాంగత్యంబు నెఱుంగఁ డేని భువి నాశ్చర్యంబుగా వాలమున్
శృంగద్వంద్వములేని యెద్దతఁ డనం జెల్లుం దృణం బాతఁ డ
య్యాంగీకంబున మేయఁ డాపసులభాగ్యం బిచ్చుటం గల్గుటన్. 172

సీ. అనుచు నెగ్గించిన నాకమలాకరుం
డభిమానియై తనయాత్మలోన
విద్యలు నేర్చి వివేకినై కాని యీ
జనకువక్త్రము చూడననుచు వెడలి
కాశ్మీరదేశంబుకడ కేఁగి యొకయోరఁ
జంద్రకేతుం డనుసంజ్ఞఁ బరఁగు
నుత్తమద్విజుఁ గొల్చియుండగా నాతండు
క్రమమున సిద్ధసారస్వతంబు

తే.గీ. కరుణ నొసఁగిననతఁడు సాంగంబుగాఁగ
నాల్గువేదములును గావ్యనాటకములు
దర్శనంబులు నీతిశాస్త్రములు దివిరి
కలయ సంగీతసాహిత్య కళలు నేర్చి. 173

1. విద్యలునేరఁడేని బ్రధివింబశు వాతఁడెగాగణింపఁగన్.

వ. అభిజ్ఞుండై గురునానతివడసి తిరిగి దేశవిశేషంబులఁజూడం జరియించుచు నొక్కనాడు.

క. కాంచనమణిమయరుచికలి[1]
కాంచితనిజసాలవలయ మై భూమిసతీ
కాంచీగుణ మన మించిన
కాంచీపట్టణము నతఁడు గాంచెం గడఁకన్. 175

క. ఆనగరమునకుఁ జని జను
సేనుం డనురాజుచేతఁ జిత్రంబగు వి
ద్యానిపుణతఁ బూజ్యుండై
యానెపమునఁ గొన్నిదినము లచ్చట నిలిచెన్. 176

వ. అంత నొక్కనాఁ డతనియెదుట విటలోకమోహిని యను వారకామిని లలిత విలాసినియై పొలసె నది యెట్టి దనిన

సీ. శృంగారరసములోఁ జేవశోధించి వి
దించి యీసతి నొనరించె నొక్కొ
మెఱుపులన్నియుఁ గూర్చి మెదపి రూపుగఁ జేర్చి
యీసరోజాననఁ జేసెనొక్కొ
కాక బంగారులోఁ గాంతిసాధించి యీ
చంచలనేత్రఁ గావించెనొక్కొ
యుడురాజుఁ జేపట్టి పిడిచి సారంబున
నీపడంతుక రచియించెనొక్కొ

ఆ.వె. చక్కఁదనమునెల్ల నొక్కచోటనుగూడఁ
గూర్చి యీనెలఁత నొనర్చెనొక్కొ

---

1. కాంచనమయతటరుచికలి, కాంచిత - కాంచనమణిమయ తటరుచి కాంచిత-

యనఁగ రత్నపుత్రికాకృతి రసికుల
చూపుగములకెల్లఁ దీపు లొసగు. 178

క. ఆకామినిఁ గనుగొని కమ
లాకరుఁడు ప్రమత్తచిత్తుఁడై కందర్పో
ద్రేకమునఁ జేరునెడ నా
లోకించి యొకండు వింతలుగ నిట్లనియెన్. 179

క. ఈనరమోహినిఁ బొందం
గానేఁగినరాత్రి వచ్చి ఘనదంష్ట్రిం డన్
దానవుఁడు చంపుఁగావున
హానింబడనేల తిరిగి యరుదె మ్మిటకున్. 180

ఉ. నావుడు నుల్కి భూమిసురనందనుఁడు న్నరమోహినీరతే
చ్ఛావిరతాత్ముఁడై నిలిచి సత్యముగా జనులెల్లఁ జెప్పగాఁ
దా విని చోద్యమంది వసుధావరు వీడ్కొని యొయ్య నొయ్య వి
ద్యాపినయాఢ్యుఁడై తిరిగి తండ్రిఁ గనుంగొన వచ్చె నూరికిన్. 181

మ. అచటం దల్లికిఁ దండ్రికి న్వరుస సాష్టాంగంబుగా మ్రొక్కినం
బ్రచురప్రేమరసాకృతిం బ్రమదబాష్పస్యంద మందంబుగా
రచితాలింగను లై, కుమారక! సుధీరత్నంబవై వచ్చితే
సుచరిత్రా! యిది భాగ్య మంచు మదిలో సొంపొంది రాదంపతుల్. 182

శా. తద్యోగంబునఁ దండ్రి మిక్కిలియు నాత్మంబొంగి సద్వృత్తికిం
జోద్యం బంది యనంతరంబ ధరణీశుం గానఁగా నేఁగి నా
యుద్యోగంబున జాణ య య్యె నని యేనూహించెదన్ వీనికిన్
విద్యాచాతురి గల్గు టీవు కరుణ న్వీక్షింపుమా నావుడున్. 183

మ. క్షితినాథుండు నిజాదరంబునఁ గృతాశీర్వాదుఁడౌనప్పరో
హితపుత్రుండు సభాస్థలి న్బుధగణం బింపొందఁగాఁ దా నకం

పితుఁడై శాస్త్రపురాణకావ్య నిగమ స్మృతర్క సంగీత సం
గతి మర్మజ్ఞతతోఁ బ్రసంగ మెలమిం గావింపఁగా ని ట్లనున్. 184

క. యత్నమునఁ దెలియ నన్నియు
రత్నాకరుభాతి దుస్తరం బగు విద్యా
రత్నము గవితాతత్త్వము
నూత్నముగా నందుఁ గలుగు నును పెఱిఁగితివే 185

క. నావుడు కమలాకరుఁ డను
దేవా నీ వానతిచ్చితివి నిజ మది వి
ద్యావారిధి కడ గానఁగ
నావారిజభవునకైన నలవియె తలఁపన్. 186

ఆ.వె. అట్ల యయ్యు సంస్కృతాదిభాషలు నేర్చి
కవిత యెఱిఁగి యెల్లకడలఁ దిరిగి
తెలిసినాఁడ నిచటఁ గల లక్షణముకంటె
నూతనంబు లేదు భూతలేంద్ర. 187

క. గణములు గణవర్ణంబులు
గణతారలు గణరసములు గణదేవతలున్
గణజాతులు గణఫలములు
గణుతింపఁగ నొక్క విధమ కవితల కెల్లన్. 188

వ. ఇట్టి విధం బయ్యును నంధ్ర మండలంబునం [1]గోనదేశంబునం దెలుఁగుం గవితకు బ్రాలు[2] వన్ను నను నియమంబులు చూచినాఁడ నవి యియ్యెడం దఱచు గాకుంట నపూర్వం బవధరింపుము. 189

---

1. గోణదేశంబున 2. బ్రాలు-బ్రాలునని రెండురూపములు గలవు.

శా. పుణ్యస్త్రీకి గణింప[1] మంగళగుణంబు ల్సొమ్ములై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సురూపవ్యక్తి భూషాకృతుల్
గణ్యం బౌగతి సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారము లౌఁ దెనుంగునకుఁ బ్రాల్వళ్ళుం గడు న్వన్నియల్ 190

ఆ.వె. పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్ళు లేని బేలుగవిత
వన్నెలెల్లఁగూర్చివ్రాయుచోఁగాటుక
వన్నె లేని ప్రతిమవ్రాఁతఁబోలు. 191

క. తప్పక వళ్ళును బ్రాలును
ముప్పిరిగొనఁ దగినశబ్దములు మెఱుఁగెక్కఁ
జెప్పిన కవితాచాతురి
యొప్పమువెట్టిన పసిండియొఱపున మెఱయున్. 192

క. పాదముల వళ్ళుఁ బ్రాసము
లాదిమము ద్వితీయ మైనయక్షరములు త
త్పాదంబుల యతు లవి సం
వాదముగాకుండఁ దగిన వళ్ళిదవలయున్. 193

వ. అందు వళ్ళన్నవి—స్వరవళ్ళు, వ్యంజనస్వరవళ్ళు, గూఢస్వరవ్యంజన వళ్ళు, వర్గవళ్ళు, సరసవళ్ళు, నెక్కటివళ్ళు, సంయుక్తవళ్ళు, ననుస్వార వళ్ళుఁ, బోలిక వళ్ళు, వృద్ధివళ్ళుఁ బ్లుతవళ్ళు, నిత్యసమాసవళ్ళు, బ్రాదివళ్ళుఁ నాఁ ద్రయోదశవిధంబులయ్యె నందు స్వరవ ళ్లెట్టి వనిన 194

క. అదయియ మైఔలకు నౌ
నిద్వయము ఋఋూలు గూడ నేఏలకు నౌ
నుద్వయ మౌ నోఓలకు
విద్వన్నుత వళ్ళు సెల్లు వీద్వడఁ దమలోన్. 195

1 గుణంబు

ఇంక వ్యంజనస్వరవళ్ళు—

క. ఈకొలదిఁ గాక కాదులు
గై కొని చెప్పుదురు వళ్ళకడ నీస్వరముల్
పైకొనఁగఁ దత్స్వరంబులు
నాకడ వళ్ళౌ నృపాలకాన్వయతిలకా. 196

ఇంక గూఢస్వరవ్యంజనవళ్ళు—

క. ఆన్యోన్యపరీక్షాదిప
దన్యాసములందు సంస్కృతస్వరములు[1] పూ
ర్వన్యాయంబుగ నఁగు న
న్యోన్యము వడి హల్లుసెల్లు నూతనకర్ణా. 197

ఇంక వర్గవళ్ళు—

క. రమణీజన్మమన్మథ భూ
రమణా నిజపంచమాక్షరము వర్జ్యముగాఁ
దమనాలుగక్షరమ్ములుఁ
దమలోఁ వళ్ళయ్యెఁ గచటతపవర్గములన్. 198

ఇంక సరసవళ్ళు—

క. వయముగ చఛజఝశషసలు
నియహలు నణలునుజెలంగు[2] యతి మీఁద నసం
శయగతిఁ దమలో విద్వాడు
జయలక్ష్మీయువతిభోగసౌభాగ్యనిధీ[3] 199

ఇంక నెక్కటివళ్ళు—

క. నరవరవంశవిభూషణ
మరవఱలను వళ్ళొగిఁదమకుఁ దామె యగున్

1. సంభృతస్వరములు. 2. బెనంగి. 3. సౌందర్యనిధీ.

ధరజ్ఞణలుమొదలవిన మం
తరపదములఁ గలుగునేని దగునట్టులగుఁన్. 200

ఇంక సంయుక్తవళ్ళు—

క. బుధసమ్మతి మిశ్రితబహు
విధవర్ణములందు వళ్ళు వివరింపంగా
నధరీకృతఫల్గునశా
ర్జధరనిభా యెల్లయక్షరమ్ములుఁ జెల్లున్. 201

ఇంక ననుస్వారవళ్ళు—

క. అమరంగ వర్గస్థితవ
ర్ణములపైనుంద బిందులూఁదినం బంచమవ
ర్ణములును వళ్ళగు జయసం
భ్రమపరిచితపరనృపాల మానితకీర్తీ. 202

ఇంకఁ బోలికవళ్ళు—

క. పోలును[1] బుపుబుభులకు మూ
పోలికవడి యనఁగ నంత్యమున యతి మీఁదం
దేలి బుకారముపట్లను
భూలోకసురేంద్ర యోగ్యముగఁ జనుదెంచున్. 203

క. తెలుఁగుననదికెడి శబ్దం
బులమీఁదిమకార మందముగ స్వత్వమునన్
నిలుచు నట పావడికినై
పలుకుటకంటెను భజించుఁ బావడియైనన్. 204

---

1. పోలఁగ

ఇంక వృద్ధివళ్ళు—

క. సుగుణైధిత నగరౌషధి
నగౌఘనైకాది యోజనలసంధులఁ బెం
పుగ వృద్ధు లండ్రు వానికి
నగు నయహాలు వళ్ళు నరవరౌఘశరణ్యా. 205

ఇంకఁ బ్లుతవళ్ళు—

క. గానప్రశ్నవిధానా
హ్వానములఁ ద్రిమాత్రమైన యత్వము నుభయా
ధీనమునై వళ్ళకుఁ జన
నౌ[1]నిది నీవేమి యెఱుఁగవా సర్వజ్ఞా. 206

ఇంక నిత్యసమాసవళ్ళు—

క. డాయఁగ సమసింపఁగఁ బా
రాయణ నారాయణాంతరంగానేకా
నాయాసాదులఁ గర్ణర
సాయనముగ రెండువళ్ళు జరుగుచునుండున్.. 207

క. ఇది చేతిది పోచక పి
న్నది కట్టెఁడు దానికంటె నల్లల ననునీ
పదముల నుభయముగొన-ను
న్నదివళ్ళకు ననుమతంబు నరలోకేంద్రా. 208

ఇంకఁ బ్రాదివళ్ళు—

క. మేదినఁ బ్రపరిప్రతినిపే
రాదురుపాపాత్యవవినిరాజన్వభిసం

---

1. జనఁగా,

సూదపృథులన నిరువది
ప్రాదులు యతి తత్స్వరములు హల్లులుఁ జెల్లున్. 209

సీ. ప్రమదజనేక్షణప్రార్థితసౌందర్య
యాచకసంతతిప్రార్థనీయ
పృథ్వీసురప్రజాభీష్టసంధాయక
యిభముఖ్యసైనికాభీష్టయాత్ర
పరమధర్మక్రియోపాయసంచితకీర్తి
యరిదుర్గసాధనోపాయవేది
వివిధశాస్త్రాగమవీక్షణతాత్పర్య
యిందిరాసత్కృపావీక్షణీయ

ఆ,వె. రాజనీతి గుణనిరంతరవైభవ
యష్టసిద్ధిబలనిరంతరాయ
ప్రాదివళ్ళ కిది యుదాహరణం బయ్యె
విద్వదంబుజార్క విక్రమార్క. 210

వ. మఱియుం బ్రాసంబు లన్నవి దుష్కరప్రాసంబు, ద్విప్రాసంబు త్రిప్రాసంబు, చతుష్ప్రాసం, బంత్యప్రాసం, బనుప్రాసంబు నన నాఱుదెఱంగులయ్యె నందు దుష్కర ప్రాసం బన్నది. 211

క. దృఙ్మంజులవిలసన్మృగ
దృఙ్మన్మథరూప వసుమతీవరతిలకా
దిఙ్మండలభరితయశ
స్స్రిఙ్మండన యిట్లు దుష్కరప్రాస మగున్. 212

ద్విప్రాసము:—

క. నవరసములు నమరం బద
వివరణభరణీయమైన వెరవునఁ గావ్య

ప్రవరమతులైన కవులీ
వివరంబునఁ జెప్పిరేని ద్విప్రాస మగుꣳ. 213

త్రిప్రాసము:—

క. సరములు గూర్చిన క్రియ న
క్షరములు పాదములఁ గలయఁ గవిరాజమనో
హరము లన సముచితార్థ
స్థిరములుగాఁ జెప్ప నిట్లు త్రిప్రాస మగుꣳ. 214

చతుష్ప్రాసము:—

క భూషణముగఁ గైకొని రస
పోషణముగఁ గ్రాలు నర్థపోషణమున ని
ర్దూషణముగఁ జెప్పిన కవి
తోషణముగఁ గృతుల నివి చతుష్ప్రాసమగుꣳ. 215

అంత్యప్రాసము:—

క. అనుపమపుణ్యవిశేషా
ఘనబలవిద్వేషినికరఖండనరోషా
వినయనయవినుతవేషా
విను మంత్యప్రాస మయ్యె విక్రమభూషా. 216

అనుప్రాసము:—

క. ఈప్రాసప్రకరంబు శ్రు
తిప్రసవదళప్రభాప్రదీప్తం బై లో
కప్రకటార్థప్రసృతి న
నుప్రహితంబైనచో ననుప్రాస మగుꣳ. 217

క. అని లక్షణయుక్తముగా
వినిపించిన సంతసించి విభుఁ డద్దేశం

బునఁ బరఁగెడు నుడుగులఁ గల
సునుపునఁ పద్యంబుఁ జెపుమనుడు నిట్లనియెఁ. 218

సీ. పొదలినకూటమి పిదప మెల్పునఁ గల
గనయంబు డాకేలఁ గొనితెమల్చి
పోఁడిమి గలపాఁపటేఁ దను సెజ్జపై
నూఁతగా వలకేల నొయ్య హత్తి
క్రొమ్ముడిఁ జెరివిన కమ్మనిక్రొవ్విరు
లెడలి వెన్నున జాజి కడలుకొనఁగ
లేచి వేంచేయుచోఁ జూచి వెన్నుఁడు సొంపు
రెట్టింపఁ గ్రమ్మఱఁబట్టి యెడఁదఁ

తే.గీ. దమక మినుమడిగాఁగొసుదక్కఁదొడిగి
బిగువుఁగౌఁగిటఁగదియంగ ఁదిగిచితివుట
మోవిగదియంగఁ గోర్కులుమూరిఁబుచ్చు
కలిమి యాబిడ చూడ్కులుగా చుఁగాత. 219

వ. అని చదివినం జెవులకుం జవులు చిలుకు నచటి పలుకు సరసభావంబు లకుం బులకించి నృపతితిలకుం డిచటి యాబిడ యనుశబ్దం బది స్త్రీ వాచకం బుగదా యనవుడు విద్యాకరుం డగుకమలాకరుం డిట్లనియె.

సీ. ఎలనాఁగ తొయ్యలి యింతి ముద్దియ నాతి
ప్రోయాలు పొలఁతుక పువ్వుఁబోణి
చెలువ కలువకంటి చేడియ నెలఁతుక
మగువ మెఱుఁగుబోఁడి మచ్చెకంటి
యుగ్మలి యాబిడ యువిద వాలుంగంటి
యన్ను చిగురుఁబోణి యతివ పడఁతి
తేమ క్రాల్గంటియుఁ జామ పొలఁతి కొమ్మ
తీఁగఁబోఁడి మదఁతి తెఱవ బోటి

ఆ.వె. వెలఁది ముదిత గొంతి మెలఁతుక పడఁతుక
నెలఁత యిగురుఁబోఁడి తలిరుఁబోడి
యనఁగ సతుల పేళ్ళు తెనుఁగున నలువది
వెలయుచుండు నిట్లు విక్రమార్క. 291

వ. అనిన నచ్చాతురికిం బరిణమించి ధరణీరమణుం డారీతి రత్నమాలిక యతని యఖుత నిడి కర్ణానందంబుగా నాకర్ణించితి విలోకానందంబుగా విలోకించితి నిట్టి దెద్దియేనియు వింత గలిగినఁ జెప్పు మనవుడు నాకమలాకరుండు. 222

క. అవనీశ నీగుణంబులు
చెవులకుఁ జవు లొసఁగి విందు సేయుచునుండుఁ
నవలావణ్యమయం బగు
భవదాకృతి చూపు గనులపండువ గాదే. 223

మ. జగతీనాయక! సర్వవిస్మయనివాసం బైన నీ విప్పు డిం
పుగ న న్నచ్చెరు వేమి గంటి వని సంబోధించి తేఁ జెప్పఁగాఁ
దగ ద ట్లయ్యును విన్నవింతు నిజవిద్యాకాంక్ష నాఁ డేఁగి యొ
క్కగతిఁ సస్యఫల ప్రశస్యతలమౌ కాశ్మీరదేశంబునఁ. 224

తే.గీ. అగ్రహారములోన బుధాగ్రగణ్యుఁ
జంద్రచూడుని గురునిఁ బ్రసన్నుఁ జేసి
సిద్ధసారస్వతమున వాక్సిద్ధి వడసి
వీడుకొని తిరిగితిని నావిద్య మెఱసి. 225

మ. భవదాజ్ఞావశవర్తులౌ నృపులతో భాషించుచు న్వచ్చి వ
చ్చి వియత్సంచరరమ్యహర్మ్యగణమై చెల్వారు కాంచీపురం
బవలోకించి యటేఁగి యందు జయసేనాఖ్యుఁ విభుం గాంచి యు
త్సవలీల న్నెలనాళ్ళు నిల్చితి మనస్సంభావ్యసంభావనఁ. 226

క. ఆవీటను నరమోహిని
నావెలయుచు నిఖిలమోహనం బైన మహా
లావణ్యంబున మరుసం
జీవనిక్రియ నున్న యొక్క చెలువం గంటిన్. 227

సీ. క్రాలుగన్నుల నెమ్మొగమ్మున గళమున
నబ్జవిజృంభణ మాలిసేయు
జఘనస్థలంబునఁ జనుఁగవ నతనాభిఁ
జక్రవైభవము నతిక్రమించు
స్వరమునఁ దనుమార్దవమున బింబాధర
ద్యుతిఁ బ్రవాళగుణంబు నోటుపఱుచుఁ
బదతలంబుల మురిపంబులఁ బయ్యెదఁ
బల్లవరాగంబు ప్రబలఁ బోలయుఁ

తే.గీ. గన్నయంతన కన్నులకఱవు దీర్చు
నట్టిరూపంబు వర్ణింప నలవి గాదు
చెప్పవచ్చునె పడియచ్చు సేయఁ దరమె
రక్షణోపేంద్ర విక్రమార్క క్షితీంద్ర. 228

తే గీ. అనెలఁత రాక్షసాశ్రిత యౌటఁ జేసి
పాముతల నున్నరత్నంబుభాతి నుండు
గోరి యెవఁడైన దానిని జేరెనేని
దానవుఁడు రేయి పఱతెంచి వానిఁజంపు. 229

మ. ఇది చిత్రం బని చెప్పిన న్విని ధరిత్రీశుండు కౌతూహలం
బు దలిర్పం గమలాకరా యచటియంభోజాననం జూడనే
గుదమే రమ్మని వానిఁ దోడుకొనుచుం గ్రూరాసి చేఁదోడుగాఁ
గదలెం గాంచికిఁ గాంచనాంచితనిజక్ష్మాకామినీకాంచికిన్. 230

వ. ఇట్లు కతిపయదివసంబుల కాపురి సొచ్చి గూఢవేషంబునం దిరుగుచు రాజమార్గంబున నున్న నరమోహినిం జూచి తదీయలావణ్యపయోధిలో మునింగిన దృష్టిం దివియంజాలక తనుఁ దాన సవరించుకొని. 231

క. సురకిన్నరపన్నగఖే
చరకన్యలఁ జూచినాఁడ సరిపోల్పఁగ నే
తరుణులు లే రీతరుణికి
నరమోహిని యనఁగ నున్ననామంబ తగున్. 232

క. చూపులు మర్మము గాఁడెడు
తూపులు మురిపముల వలపుఁదూపులసరికిం.[1]
బ్రాపులు సతినిలు వంతయుఁ
దీపులు నగు మన్మథాస్త్రదేవతచుమ్మీ. 233

క. ఈపొలఁతి రాక్షసాశ్రిత
యై పన్నగసహితచందనాకృతి మెఱయున్
దీపితయై వెఱపించెడి
వ్యాపారము కొలఁదిఁ జూడవలయును మనకున్. 234

క. కావున నీ వింటికిఁ జని
నే వచ్చెద ననుచుఁ జెప్పు నెలఁతుక తోడన్
నావుడుఁ గమలాకరుఁడును
నా వెలఁదికిఁ జెప్పి వచ్చి నరపతి ꠰కనియెన్. 235

తే గీ దేవ యీ మాటఁజెప్పినఁ దెఱవనవ్వి
యొయ్యఁబలుకుచు నిదురకు నియ్యకొనుచుఁ
గర్బురుం డనునొక్క రక్కసుఁడు గలఁడు
వాని మఱవక రమ్మని చెప్పె[2]వనిత.

---

1. మరుకున్. 2. నొక్కచిక్కనుగలదొక్కరక్షసుండుఁ చేరిచనుదెంచు నీవింతఁ జేరుమనియె.

క. నావుఁడు నావీరవరుం
డావిప్రునిచేతఁ బోఁక లాకులు విరులుఁ
రోవెలయుం దగఁ బంపిన
నావెలఁదియు నందుకొనియె నతివిస్మిత యై. 237

సీ. అయ్యెడ దశరథునాజ్ఞపోలిక బ్రహ్మ
కట్టడిఁ గాలంబు గడవరాక
జనకజ కెనయైన దినలక్ష్మి తనతోడు
నీడకై వడిఁ దోడఁ గూడినడువ
సౌమిత్రిగతి [1]మునిసవనంబునకు మున్ను
దోడై నయరుణుంతు తోడుగాఁగ
సాకేతపురిలోన జనులవక్త్రంబుల
నడువున జలజము ల్వాడువాఱఁ

తే.గీ. గైకవంకవారిపగిదిఁ గలువ లుబ్బఁ
జిత్రకూటముక్రియ న స్తశిఖరి దాఁటి
రాక్షసులభంగి నటఁ దిమిరంబునడువ
వనముసొచ్చె రఘువరునివరుస వినుఁడు. 238

ఆ.వె. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలో
వ్రాలఁ జుక్కలు దలఁబ్రాలుగాఁగఁ
గెంపు హోమవహ్నిక్రియ నొప్పఁగా ద్విజ
రాజు పెండ్లియాడె రాత్రిసతిని. 239

క. నలఁగినవిరులును గుఱుమా
పులయిన చీరలును నుదుటి బొట్టులు నెడగా
జులుఁ గమ్మటాకులును సొ
మ్ములుగాఁ దమక్రంతలందు మురిసిరి జంతల్. 240

---

1. సాహసమునకుమున్నుగా.

సీ. తిలకంబుఁ గొప్పపువ్వులుఁ బూఁతలును గను
పట్టఁగా మెలఁగెడుదట్టవిటులు
నిఱుకిండ్లఁబాతికపరక ముడ్చి
గొని ముసుంగిడి చొచ్చుగూఢవిటులు
బోఁటికత్తియలు పల్మాటును బిలువఁగా
మెరవడిఁ దాయేఁగు మేటివిటులుఁ
గనియుఁగానకయుండఁగా నోరముసుఁగుల
నగపడ్డచో నిల్వఁ దగినవిబులుఁ

ఆ.వె. బెట్టలేమి వెడలఁగొట్టిన చోటికిఁ
బొంచి పడపుచెఱచు క్రించువిటులుఁ[1]
గ్రందుకొనఁగ వారకాంతలవాడలఁ
బచ్చపిఁటివాఁడు పెచ్చుపెరిగె. 241

వ. అట్టియెడఁ గొందఱు విటులు లంజియలతల్లుల శిఱుసులకు వెఱచి యందఱు నొక్కెడఁగూడి తమలో నిట్లని వితర్కించిరి.

క. మునుమున్నుగ గొఱియలుఁ గూ
డునుమొదలుగ నిడక చనువిటునిఁబణ్యస్త్రీ
జనని మెడ విఱిచి కొను నది
ధనముపయిం గాచియున్న దయ్యము చుమ్మీ. 243

వ. అనుడు మఱియు నొకరుం డిట్లనియె. 244

క. వారాంగన మధురసవి
స్తారాకృతి యనఁగఁ జెల్లు దజ్జనని విటుం
జేరఁగనీ దచ్చట సహ
కారఫలము పొంతనున్న కడుఁదురు చుమ్మీ. 245

1. చొచ్చివెరవు చేరచిపుచ్చువిటులు.

వ. అనిన మఱియు నొక్కరుండు. 246

క. వెలయాలితల్లి కూఁతుం
గలఁచి విటుఁడు వచ్చెనేని గలుషించినఁ దాఁ
దలతోన మ్రింగునది ని
ర్మలజల మగు మడుఁగులోని మకరము చుమ్మీ. 247

వ. నావుడు నితరుండు.

క. పరికింప లంజతల్లికి
దొరయైనను దుచ్ఛుఁడైన దొరకినఁ జాలుం
బొరిగొను నది యీపురిలో
నరమోహిని నంటియున్న నరభోజిసుమీ. 249

వ. నా విని యపరుండు. 250

క. పుడమి నీఁక లంజతల్లిం
గడుమీఱిన యట్టికీడు గలదే యది యె
య్యెడఁ జూచినఁ గూఁతునకు
న్నెడకోణము దొడ్డ గుదియ[1] మిండలకెల్లన్. 251

వ. అనవుడుఁ దోడివాఁడు. 252

క. ఆకూఁతుఁ గన్నయప్పుడ
చేకొని తజ్జననియాకుఁ జింపక వెడఁగై
లోకేశుఁడు పామునకుం
గాకికిఁ గలయాయు వేల కలుగఁగఁ జేసెన్. 253

వ. అనినం దత్సఖుండు. 254

ఉ. ప్రేమరసంబు తేటలనఁ బెక్కు గుణంబులు గూర్చి వారకాం
తామణులన్ సృజించి పరతంత్రతఁ ద్రోయఁగనున్న దిగ్గనం[2]

1. త్రాపుగుదియ. 2. తోదనయున్నదెగ్గునన్.

దామరచూలి లంజియలతల్లులఁ జంపఁడు లంజకాఁడు గా
కేమనవచ్చు నాతని నటేని విటావలి నిస్తరింపదే. 225

వ. అని పెక్కువిధంబుల వితర్కించుచున్న మఱియు నొక్కెడం గొందఱు సుందరులు పానగోష్ఠికిం గడంగి కాదంబంబును, మాధవంబును, నైక్షవంబు, క్షీరంబు, నాసవంబు, వార్షంబు, రతిఫలంబు లనఁ బాకభేదంబుల మూలస్కంధకుసుమ ఫలసంభవంబుల బహువిధంబుల మధురంబులైన మధువిశేషంబు లెల్లం బరిమళద్రవ్యపరిమిళితంబుగాఁ గూర్చి పాత్రఁబుల నించిన- 256

క. అతిమధురంబైన నిజా
మృతరసములకంటె నిదియమే లని తారా
పతి చేరెనొక్కొయనఁ ద
ద్ప్రతిబింబము లలరె దివ్యపాత్రంబులలోఁ. 257

వ. అప్పుడు. 258

సీ. కామాక్షికిని మహాకాళికిఁ జండికి
 నక్కజియ్యకుఁ[1] గాళి కంటకకును
వింధ్యవాసిని కేకవీరకు మున్నుగా
 నెల్లవేల్పులకు బిందించి మ్రొక్కి
త్రావుచు నెడనెడఁ దాల్పుగా వండిన
 నంజుటిపొరకలు నంజుకొనుచు
గ్రుక్కెఁడు చవిచూడు మక్కయీమధువని
 తీపులు దమలోనఁ జూపుకొనుచు

తే.గీ. నెట్టివస్తువు గ్గడియించెనీతఁడనుచు
బ్రహ్మఁగొనియాడి యిదెసాఁకఁ బట్టుమనుచుఁ

1. గన్నజియ్యకు.

బొట్టకొలఁదిగఁ బోంట్లకుఁ బోసిపోసి
పరిణమించిరి యొండొండఁ దరుణులెల్ల. 259

సీ. ఈవారుణీరసం బీశుండు దన కడి
సమకూరకునికి విషంబు ద్రావె
మధువైరి యగుట నీమధువున కెడరయ్యు
హరి మాధవాఖ్యను శరణుసొచ్చె.
నీసురలేక గంగాసార మున్న యా
తలఁజేరెఁ జంద్రుండు బలుపుదక్కి
యీమదిరాస్వాద మెడలి విఘ్నేశుండు
పొగులఁగా లోలోనఁబొట్టయుబ్బె
ఆ.వె. నిట్టిమద్యము గని పట్టిత్రావఁగలేక
శక్తిసేవసేసె షణ్ముఖుండు
అనుచుఁ జతురమైన యతివ మైరేయంబుఁ
బొగడుచుండ నొక్కపొలఁతి వలికె. 260

క. పరిమళముఁ గొన్నయంతనె
పరవశమై మేను హర్షభరితం బగు నీ
సుర గలుగ నమృతమునకుఁ
సుర లంబుధిద్రచ్చి రిట్టిచోద్యము గలదే. 261

వ. అనవుడు నొక్కర్తు. 262

క. సుఖమూలతల్లి మనోభవు
సఖి యీసుర దొల్లిశుక్రుశాపంబున స
న్ముఖులకు నెడగాకుండిన
నఖిలజనులచేత దక్కునా మన కనినఁ.[1] 263

1. నిఖిలజనులచేతఁ దక్కనేర్చునెమాకుఁ.

వ. మఱియొక్కర్తు. 264

క. ఎక్కడ శుక్రునిశాపం
బిక్కడఁ గొందఱకు భాగ్య మించుక యైనన్
లెక్కకునెక్కనికతమున
డక్కెఁజు మీ మధువు లేర్పడ న్మనకెల్లన్.[1]

వ. అని తమనేర్పులం గొనియాడుచు నానందంబున మాటలు తొట్రువడఁ బలుకుచుం బయ్యెదలు సవరించుటలు మఱచి లజ్జలు దొలంగ బహుప్రకారంబుల నున్మత్త భావంబులు దోఁపం బ్రవర్తిల్లి. 266

ఉ. ఇంపు మనంబులోన నటియింపఁగఁ జెక్కులమీఁదఁ గన్నులం
గెంపువహింప మోవిఁగల కెంపు చలింపఁగ ఘర్మబిందువుల్
పెంపిరివోవ ముద్దుమొగముల్ మెఱుపెక్క రతాంతసంగతిన్
సొంపువహించి రంగనలు సోలుచు నమ్మదిరామదంబునన్. 267

సీ. అక్కమీతల్లి మాయత్త[2] యౌ నెఱిఁగితిఁ
గోడలితల్లి నాకూఁతు రగుట
మాతల్లిమఱఁది మామామ సఖ్యులక్రియ
నుయ్యెఁ[3] జంకిటనిడి యొయ్యనరిగె
మా బావకొడుకు నామఱఁది గాలపువేఁటఁ
గొమ్ములకుందేలుఁ గొట్టితెచ్చె
నిదిసెప్పఁ గొఱఁతని యిదికల్లసేయక
చెవులారఁజూడు నేఁజెప్పినట్టు

తే.గీ. లనుచు లోకవిరోధోక్తులాడుకొనుచు
సొలపులూరఁగ నోరచూపులునటింప

---

1. దక్కెంబో మధువు నేఁడు దగమనకెల్లన్. 2. మాయక్క.
3. నొయ్య-నయ్య.

వట్టినగవులఁ జప్పట్లువెట్టికొనుచు
నాడఁజొచ్చిరి చేడెలు పాడిపాడి. 268

వ. ఇట్టివినోదంబులు సూచుచు విక్రమాదిత్యుండు త్రివిక్రమాపత్యంబు తోడరా నరమోహిని గేహంబున కేఁగి తదాళీపరిచరితసముచితోపచారంబులు గైకొని హంసతూలికాపర్యంకంబుపై సుఖాసీనుండై సరస వాక్యంబులం బ్రొద్దుపుచ్చి. 269

క. నరమోహిని మీరక్కసుఁ
డరుదెంచి తలంగకుండ నాలోపల ని
న్నరయుచు నుండెద నని భూ
సురయుతుఁడై యధిపుఁ డట్టిసొచ్చెఁ బుద్ధిన్. 270

క. ఆలోన నొదిఁగి యున్నెడ
నీలాలక శయ్యమీఁద నిద్రింపఁగ నా
భీలనయనాంతదంత
జ్వాలలు నిగుడంగ నసుర వచ్చెం బెలుచన్ 271

ఉ. అచ్చట నొంటినున్న సతి నార్చుచు వేసి యదల్చి నీవిటుం
డెచ్చట డాఁగెఁ జూపు మని యాడ్చి గృహాంగణసీమ కేఁగఁగాఁ
జెచ్చెర విక్రమార్కుఁ డొకసింహము చాడ్పున నేన వీఁడుగో[1]
వచ్చితినంచు నార్పుఁగొని[2] వచ్చెఁ గరాళకృపాణపాణియై. 272

క. అటువచ్చిన దనుజుఁడు గిట
కిటఁ బండులు గీఁటుకొనుచుఁ గినుకవొడమి యు
ద్భటవృత్తి నెగసినం గని
భటధర్మము దప్పి తోడి పాఱితి వనుచున్. 273

---

1 వీఁడకో. 2. నార్పుకొని.

క. దుర్బలుఁడ వోరి సీదగు
దోర్బల మిది యెంత నన్ను దొరసెదు విను నేఁ
గర్బురుఁడఁ దొల్లి నాచే
నర్బుదసంఖ్యలుగ మనుజు లణఁగిరిచుమ్మీ. 274

శా. వారిం గుండఁగ నేఁగు మంచు గద వైవంజేరినన్ భీముఁడా
కౌరవ్యేంద్రుని నేలఁ గూల్చుగతి నాహ్మానాయకుండుం దదీ
యోరుద్వంద్వము నొంచి కూల్చి భువి దైత్యున్ ఖండతుండంబుగా
ఘోరాస్త్రాహతిఁ ద్రోవుచేసె, సుర లుత్క్రోశించి[1] వర్ణింపఁగన్. 275

క. రక్కసుఁడనియెడు చీకఁటి
నుక్కడఁపి శుభోదయమున నొప్పుచుఁ దమకున్
దిక్కైన విక్రమార్కుని
నక్కమలాకరుఁడు చూచి హర్షం బందెన్.

క. తత్సాహసబలధైర్యస
ముత్సేకంబులకుఁ జోద్య మొందుచుఁ బ్రియసం
విత్సమ్మతి నరమోహిని
యుత్సుకయై మ్రొక్కి పలికె నోభూనాథా. 277

క. నామంబున నరమోహిని
నామెఱయఁగ వీనిచేత నరఘాతినినా
నామీఁద నున్నకీ డిదె
నీమాహాత్మ్యమునఁ బాసె నిమిషములోనన్. 278

క. కావున నాకేవిధమునఁ
గావం బ్రోవంగ నీవ కర్తవు పను లొఁ

1. సురలుత్క్రోచించి.

గావనక యెద్దిపంచినఁ
గావించెద నుడిగమునకుఁ గైకొను నన్నున్. 279

గీ. అనుడు వసుమతివల్లభుం డల్ల నవ్వి
యెద్దిపంచినఁ గావింపనియ్యకొంటి
వనజలోచన జాతిఁ బద్మినివి నీవు
సరసగంభీరుని గమలాకరు భజింపు. 280

క. ఓకమలాకర మునునీ
వీకమలానన భజింప నింపొందితి నేఁ
డీకాంతామణిఁ గైకొని
యేకాంతక్రీడ నిలువు మిచ్చట సుఖివై. 281

వ. అని పరస్పరకరగ్రహణంబు చేయించి.

ఆ.వె. లంకలోని రాజ్యలక్ష్మి విభీషణు
కిచ్చి వచ్చు రాఘువేంద్రు పగిది
దితిజుఁ జంపి వారసతి నాశ్రితున కిచ్చి
విజయలక్ష్మిఁ గూడి విభుఁడు గదలి. 283

క. వాలుంగంటి నిలువు మని
వాలాయింపంగ నేఁగవలయు ననుచు న
వ్వాలుమగఁడు మెఱుఁగారెడు
వాలు సహాయముగ మగిడి వచ్చెం బురికిన్. 284

క. కావున నీకీగుణములు
లేవైనను గద్దె నెక్క లే విట చుగుడం
బోవుట మే లనవుడు భో
జావనిపతి సిగ్గుపడుచు నల్లనఁ దిరిగెన్. 285

శా. జీమూతాళికురంగనాభిశశభృచ్చిహ్నామరేంద్రోపల[1]
వ్యోదీవమేంతసామజాతయమునాహోమాగ్ని ధూమాంజన
శ్యామాకారు సమస్తకల్మషతమస్సందోహమార్తాండు ను
ద్దామానంతయశోభిరాముని రమాధాముస్ గుణస్తోమునిన్. 286

శా. సర్వాధీశ్వరకుందచందనపయశ్చంద్రాబ్జమందాకినీ
కర్పూరామృతహారహీరతుహినాకారానుకారాకృతిన్
దర్పారూఢపికద్విరేఫశుకబృందారోహకోత్సాహకం
దర్పాటోపవనాంతదావదహనుం దైత్రిలోక్యరక్షామణిన్.

మాలిని. వివిధసురవరేణ్యా వేదవేదాంతగణ్యా
భవతిమిరదినేంద్రా భక్తకారుణ్యసాంద్రా
సవినయజయలోలా సర్వలోకానుపాలా[2]
భవమధురిపురూపా భవ్యదివ్యస్వరూపా.[3]

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టివిఖాళాది బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వరవెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపుత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు రత్నోద్భవుకథయును మూషకోపాఖ్యానంబును విక్రమార్కుని సాహసికత్వమహౌదార్యత్వంబులును గమలాకరుకథయునన్నది చతుర్థాశ్వాసము.

---

1. శితిభృచ్ఛ్రీశ్యామలేంద్రోపల. 2. సర్వలోకానుకూలా, 3. భవతుడవి జరక్షా పద్మపత్రాయతేక్షా.

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## పంచమాశ్వాసము

క. శ్రీమత్పన్నగఫణమణి
ధామావృతబాలతుహినధామాంశునిభ
వ్యోమాపగాంబుసుమనో
దామాచరితావతంసు దక్షధ్వంసున్.[1] 1

ఉ. ఇచ్చఁ దలంచి భోజధరణీశ్వరుఁ డంత గ్రహానుకూలత
నొచ్చగునట్టిలగ్నమున నిల్చి మహాసన మెక్కఁబూనఁగా
నచ్చటిబొమ్మ వల్కె విను మర్థికి నుజ్జయినీపురీశ్వరుం
డిచ్చినభంగి నీగి మెఱయింపక నీ కిది యెక్కవచ్చునే. 2

క. అనవుఁడు జనవల్లభుఁ డా
తనివితరణ మెట్లు మెఱసెఁ దగఁ జెప్పు మనం
దనమోవి[2] మందహాసం
బునటింపఁగ నిట్లు దశమపుత్రిక పలికెన్. 3

### —: పదవబొమ్మ కథ :—

సీ. ఎవ్వనిసాహసం బేవేళఁ జూచినఁ
బరహితంబుల కెల్లఁ బట్టుఁగొమ్మ
యెవ్వనియాజ్ఞ భూమీశుల శిరముల
మౌళిరత్నావళిమాడ్కి మెఱయు

1. తావతంసి దక్షధ్వంసీ. 2. మోము.

నెవ్వనివైభవం బెల్లయాచకులకు
ముంగిటిపెన్నిధి భంగిఁ దోఁచు
నెవ్వనిసత్కీర్తి యీరేడుజగముల
నాటపట్టుగ నిండి యాడుచుండు

తే.గీ. నతఁడు సామాన్యజనుఁడె ధీరాధినాథ
నిర్మలాత్మకుఁ డత్యంతధర్మమూర్తి
శత్రుసమవర్తి నృపలోకచక్రవర్తి
సత్యసంధుడు విక్రమాదిత్యవిభుఁడు. 4

క. అట్టివిభుం డుజ్జయినీ
పట్టణమున రాజ్యలక్ష్మిఁ బరఁగుచుఁ బ్రజఁ జే
పట్టి తగం బెంచి సంపద
దట్టంబుగ నిల్పి తల్లిదండ్రులమీఱెన్. 5

వ. అట్టిదినంబుల.

క. అకళంకచిత్తుఁ డార్యుఁడు
సకలాగమమంత్రతంత్రసారజ్ఞుఁడు భి
క్షుకవేషధారి యవధూ
తకుఁ డనఁగా నపుడు వచ్చెఁ దత్పురమునకున్. 7

ఉ. అచ్చటి దేవతాగృహమునందు గతస్పృహవృత్తి నుండఁగా
నచ్చెరువంది పౌరజను లాతనివర్తన విన్నవించినం
జెచ్చెరఁ దోడితెం డని ప్రసిద్ధులఁ బంచిన రాకతక్కినం
దచ్చరితంబుఁ జూడ వసుధావరుఁ డయ్యెడకేఁగె వేడుకన్. 8

క. అవనీసురరక్షకుఁ డగు
నవనీశ్వరవరుఁడు చనినయవసరమున న
య్యవధూతకల్మషుం డగు
నవధూంతకుఁ డతనిఁ గరుణ నవలోకించెన్. 9

క. తత్కారవిహితోపాయన
సత్కార మనుగ్రహించి సంయమిపతి వి
ద్వత్కులరత్నము భూవరుఁ
దత్కాలసముచితగోష్ఠిఁ దగులంజేసెన్. 10

క. మా టిడక యాతఁ డడిగిన
మాటలలో సకలశాస్త్రమర్మంబులు ప
ల్మాటును నానావిధములఁ
దేటపడం దెలిపె భూపతికిఁ బ్రియ మడరన్. 11

క. నిధ్యానంబున నజున క
సాధ్యం బగుతత్త్వబోధసారము కుదురౌ
నధ్యాత్మవిద్యమర్మము
మధ్యమజగతీశునకు సమస్తముఁ జెప్పెన్. 12

సీ. క్షోణిపానీయతేజోవాయుగగనాఖ్య
పంచభూతాంశసంబంధమైన
మేనిలోఁ గర్ణనాసానేత్రజిహ్వాత్వ
గాహ్వాయపంచేంద్రియములగోష్ఠి.
శబ్దగంధాంగరసస్పర్శసంజ్ఞిక
పంచవిషయములఁ బొలుపఱుచు
ప్రాణప్రభృతిపంచపవన ప్రసారంబు
హృదయాదిపదములఁ బొదలుబుద్ధిఁ

ఆ.వె. గూడి నిలిచి యుండు కుంభకపూరక
రేచకములగతి వివేచకంబుఁ
జిత్తకమలచక్రజీవాత్మపరమాత్మ
యోగసాధనముల నొనరఁ జెప్పి. 13

క. యోగము కల్మషబంధవి
యోగము పంచేంద్రియాభియోగము, పుణ్యో
ద్యోగము, ముక్తివధూసం
యోగము పరతత్త్వపదనియోగము సుమ్మీ. 14

ఆ.వె. దుఃఖసాధ్యమయ్యుఁ దొడరి యభ్యాసంబుఁ
జేయఁజేయ యోగసిద్ధి పెంపు
దినఁగఁ దినఁగ వేము తియ్యనౌకైవడిఁ
బిదపఁ బరమహర్షపదము సుమ్ము. 15

సీ. హఠయోగమంత్రయోగాష్టాంగయోగసా
ధనయోగలయయోగధర్మములకు
యమనియమాసనధ్యాన ధారణశక్తిఁ
బవననిరోధంబుఁ బట్టుకొలిపి
నాభిచక్రోపరినలిన మధ్యంబున
నీవారశూకసన్నిభ విభాతి
వెలిఁగెడు తేజంబువెలుఁగునఁ గరఁగిన
యమృతంబు మదిలోన ననువువార

తే.గీ. నందుఁ గలుగుట సచ్చిదానందమయ్యె
నచటితేజస్స్వరూపంబె యచ్యుతుండు
పంచవింశతితత్త్వప్రపంచమునకు
నతఁడె కారణమాదినారాయణుండు. 16

క. కరణాసనభేదంబుల
వెరవెఱిఁగి తదంగయోగ వితరణసరణిం
బరికించి పెనఁగనేర్చిన
మరగుఁ జుమీ ముక్తికాంత మర్మజ్ఞునకున్. 17

క. అని బహువిధములఁ జెప్పఁగ
విని జనపతి తెలిసి యోగవిద్యావిభవం
బున రాజయోగి యనఁగా
జనకునిక్రియఁ బ్రజలఁ బెంచె జనకునిభంగిన్. 17

వ. ఇట్లు కొంతకాలంబు పుచ్చి తన్ముఖకళలం జూచి యోతాపసోత్తమ నీకెన్ని యేండ్లయ్యె నని యడిగిన నతండు యోగికిఁ గాలక్రమంబు విచారింప నేల నూఱేండ్లు వేయేండ్లని యెన్నిక గలదే సిద్ధయోగంబున వజ్ర శరీరంబు దుర్లభంబు గాదు. 19

క. బాధావిరహితగతికుఁడు
బోధాహితపరమహర్ష పూర్ణుఁడు నిజవాం
ఛాధీనమరణుఁ డీక్షణ
సాధితచిన్మూర్తి యోగి సామాన్యుండే. 20

క. తలనరసినఁ జెక్కులపై
వళు లెగసిన మేని బిగువు వదలిన నేత్రం
బుల నెట్టిసెరలు విరిసిన
జెలువెడలిన యతఁడు[1] యోగసిద్ధుఁడె ధాత్రిన్. 21

క. అనఁ దద్వచనామృతసే
చనమున యోగంబు సిద్ధిచందము దెలియన్
మనమునఁ గౌతుకకందళి
మొనసూపిన నృపుని నెఱిఁగి మునినాయకుఁడున్.

ఆ. వె. ఎద్దియైన నీకు నెఱిఁగింతు నడుగుము
సిగ్గుపడకు మనుడు క్షితివరుండు

1. జెలువించుక యెడయ.

మరణభయము లేనిమార్గంబుచేకుఱు
సిద్ధయోగనియతిఁ జెప్పుమనియెతిఁ. 23

మ. అనిన న్న్యాసముతో జరామరణశూన్యం బైన మృత్యుంజయం
బను మంత్రంబును హోమతంత్రమును హవ్యద్రవ్యభేదంబు సా
ధనయోగంబుఁ గ్రమంబునం దెలిపి విద్యాదక్షిణానుగ్రహం
బున మన్నించి నరేంద్రు వీడుకొని విప్రుం డేఁగె వింధ్యాద్రికిన్. 24

సీ. క్షితివరుం డిట యోగసిద్ధికై మంత్రిపై
రాజ్యభారం బిడి రాముపగిది
జటిలుఁడై మేన భస్మముఁ బూసి వల్కల
ధారియై కాననాంతమున కేఁగి
ఋషిభంగి గంగలోఁ ద్రిషవణస్నానుఁడై
జపతపంబులఁ బురశ్చరణ చేసి
మంత్రపూతంబుగా మధుతిలదూర్వాజ్య
హోమంబు జరుపుచు నేమమునను

తే.గీ. నక్తము నుపోష్యమును నేక భుక్తమనఁగఁ
గలుగుదినముల సిద్ధయోగముననుండి
కందమూలముల నశనకాంక్ష దీర్చి
వ్రతము చరియించె నట్లేకవత్సరంబు. 25

వ. తదనంతరంబ యొకనాఁటి హోమసమయంబున. 26

క. ఆహుతి వోయఁగఁ గాంతితి
రోహితుఁడై లోహితాశ్వరోచిఃపటలీ
రోహితుడై యాకుండము
లో హితుఁ డై నిల్చె నీలలోహితుఁ డంతన్. 27

వ. తదాకారంబు గని సాఁగిమ్రొక్కి నిలిచిన. 28

క. మృత్యుంజయుఁడతనితపః
కృత్యమునకుఁ జిత్తవృత్తికిం దగఁగ జరా
మృత్యునివారక మగు ఫల
మత్యాదరణంబుతోడ నాతని కిచ్చెన్. 29

వ. ఇచ్చి తిరోహితుం డైన. 30

ఆ.వె. అట్టిఫలము చేత నంది జనేశ్వరుం
డీశ్వరునకుమ్రొక్కి శాశ్వతముగ
నంగసిద్ధి గంటి నని యుల్లసిల్లుచు
మగిడి వచ్చునట్టి మార్గమునను. 31

చ. పదములుఁ జేతులు న్ముడిఁగి పండులు డుల్లి నిజస్వరంబు గ
ద్గదికఁ బెనంగ నంగమున గ్రంథులు వాఱఁగఁ గుష్ఠరోగముల్
ముదిమియుఁ గూడి రూపు బలుపుం బొలియింపఁగ దైన్యజీవనా
స్పద మగుబ్రాహ్మణుండు జనపాలున కడ్డమువచ్చి యిట్లనున్. 32

క. ముదిమియు రోగముఁ గూడం
బొదలెడు నిదె మేను నిలువఁబూనదు నాకున్
మది నెఱుఁగుదేని మం దీ
పదనున సమకూర్చి యిమ్ము పరమదయాత్మా. 33

ఆ.వె. అనిన నతనిఁ దోడుకొనిపోయి తనయింట
మందుమ్రాఁ కొనర్ప మదిఁ దలంచి
యాతఁ డంతమార మరుదేర లేఁ డని
యాత్మఁ జూచి విక్రమార్కవిభుఁడు. 34

ఆ.వె. కలిగి పెట్టలేక కష్టుఁ డైయున్న దు
ర్గుణుని పాపమునకుఁ గొలఁది లేదు

తన్ను మాని యైన ధర్మంబు చేసిన
యతనిపుణ్యమునకు నవధి లేదు. 35

క. తుదిముట్టని బ్రతుకున కా
పదఁ బొదలెడివాఁడు దానపాత్రం బని స
మ్మదమున నార్తులకొఱకై
సదయులు ప్రాణములు తొల్లి చాగము లిడరే. 36

వ. అని తొల్లింటి రాజులం బ్రశంసించి తనలో శంకింపక
సాహసాంకుండు మహోదారుండై 37

క. ప్రాణము లడుగఁడు వృద్ధ
క్షోణిసురుఁ డితఁడు మందుఁ గోరెడు దేహ
త్రాణము గావించెద నని
క్షోణీశుఁడు చేతిపండుఁ గోరిక నిచ్చెన్. 38

శా. దివ్యం బౌఫల మిచ్చినం దిని ధరిత్రీనిర్జరుం డంతఁగు
ష్ఠవ్యాధిస్థవిరత్వదూరతమమై సంపూర్ణ తేజఃకణా
భివ్యాప్తం బగు దివ్యదేహ మటుఁ బ్రాపింపంగ నిర్మోకము
క్తవ్యాళేంద్రుని భంగి నొప్పెఁ బతి చోద్యం బంది హర్షింపఁగన్. 39

క. అర్థికి నీక్రియ నిచ్చి కృ
తార్థుండై కదలి వచ్చె నటుగావున న
ప్పార్థివునకు సరిహూనమి
వ్యర్థము నీతలఁపు భోజవసుధాధీశా. 40

క. నావుడు భోజక్షితిపతి
భావంబునఁ జోద్యహర్షభరితుం డై ల
జ్జావనతవదనుఁ డగుచు హి
తావృతుఁ డై మగిడి పోయె నంతఃపురికిన్. 41

వ. మఱియుఁ గొన్నిదినంబులు సనిన నేకాదశద్వారవీక్షకుండై. 41

—పదునొకొండవబొమ్మ కథ—

క. సూక్ష్మముగఁ దలఁచెద న్మృగ 42
లక్ష్మకళారమ్యు వీరలక్ష్మీగమ్యుఁ
లక్ష్మీలలనావక్షో
జక్ష్మాధరసక్తు భక్తసంహా న్నృసింహుఁ. 43

క. అని నియమంబున భోజుం
డనువగులగ్నమునఁ జేర నరిగి మహేంద్రా
సన మెక్కఁబోఁగ నిలునిలు
మని యచ్చటిబొమ్మ పలికె నచ్చెరు వందన్. 44

క. పరికింప విక్రమార్కుని
సరిపూనఁ బరోపకారసత్త్వంబులు సు
స్థిరముగఁ గలగనివానికిఁ
దరమే యిట దీని నెక్క ధారాధీశా. 45

క. అనవుడు నవ్వసుధాపతి
చనునతనిపరోపకారసత్త్వగుణము లె
ట్లనఁ బాంచాలికయును స
ద్వినయంబున భోజనృపతి వినని ట్లనియెఁ.[1] 46

క. జననాథ రాజసముఖం
బున నున్ననరుండు యోగ్యము నయోగ్యముఁ[2] బ

---

1. వ. అనవుడు నవ్వసుమతీపతి యతని పరోపకార సత్త్వగుణంబు లెట్టివనినఁ బాంచాలిక సవినయంబుగాని ట్లనియె. అని యొకప్రతిలో వచన మున్నది. 2. రాజసమ్ముఖ, మున నరుఁదవయోగకార్యములుగా వెసఁ.

లిక్కైన నవ్వుఁ గా దన కూరక
వినవలయును సరస మైన విరసం బైనన్. 47

ఆ.వె. పలుకఁ దగినపలుకు పలుకక యున్నను
బలుకు వినియు విననిపగిది నున్నఁ
బలుకఁ జూచువానిఁ బలుకకు మన్నను
బలుకుతేల తల్లి సొలయు నతని. 48

వ. కావున. 49

క. వ్యక్తంబుగఁ జెప్పెద నను
రక్తుఁడ వై విను మవంతిరాజుగుణము నా
యుక్తిం జులుకం జూడకు
యుక్తులయెడ నాఁటదాని యోగ్యత గలదే. 50

మ. సత్యవచోవిశారదుఁడు, శారదనీరదసంస్ఫురద్యశో
నిత్యుఁడు నిత్యదానగణనీయుఁడు విజ్ఞజనావళీమనో
వృత్త్యనుసారి సారబలవిక్రమకృత్యుఁడు నాఁగ విక్రమా
దిత్యుఁ డవంతి యేలె నలుదిక్కులరాజులు పంపుసేయఁగన్. 51

వ. అట్టిమహీపాలుండు షణ్మాసరాజ్యప్రతిపాలనంబును షణ్మాసదేశాంతర వనాంతర ప్రవాసంబును నవశ్యకర్తవ్యం బగుటం జేసి యొక్క సమయంబున రాజ్యం బరాజకంబు గాకుండ భట్టి నుజ్జయిని నునిచి యసహాయశూరుండు గావున నొంటి నిగూఢవేషంబున దేశాంతరనగర గహనవిశేషంబులు చూచుచుం జని చని యొక్కనాఁడు. 52

ఉ. పణ్యపథంబు భంగి భయభంగము నొందక చొచ్చె దండకా
రణ్యము శైలగర్భితహిరణ్యము తాపసచిత్తనిత్యకా
రుణ్యము గంధబంధురసరోజరజోవనరాజిలక్ష్మణా
గణ్యము[1] పత్రపుష్పఫలగణ్యముఁ బుణ్యజనానుగుణ్యముల్. 53

---

1. రజోవనరాజితాజలక్షణ్యము.

వ. చొచ్చి యనుష్టుప్ఛందంబునుం బోలె హంసరుతయుతంబై త్రిష్టుప్ఛందం బునుం బోలె భ్రమరవిలసితం బై జగతీచ్ఛందంబునుం బోలెఁ గుసుమవిచి త్రాంబరం బై యతిజగతీచ్ఛందంబునుం బోలె మత్తమయూరసేవితం బై శక్వరీచ్ఛందంబునుం బోలె సింహోద్ధతాశ్రయం బై యతిశక్వరీ చ్ఛందంబును బోలె సుకేసరభాసురం బై యష్టిచ్ఛందంబునుం బోలె హరిణీసంశ్రితం బై ధృతిచ్ఛందంబునుం బోలె మత్తకోకిలాకలితం బై యతిధృతిచ్ఛందంబునుఁ బోలె శార్దూలవిక్రీడితలక్షితం బై కృతిచ్ఛందంబు నుం బోలె నుత్పలమాలాయుక్తం బై ప్రకృతిచ్ఛందంబునుం బోలెఁ జంపకమాలాసహితం బై సంకృతిచ్ఛందంబునుం బోలె సరసిజచిహ్నిత కౌంచపదాంకితంబై[1] యుత్కృతిచ్ఛందంబునుం బోలె భుజంగవిజృం భిత సంగతంబై యున్న యవ్వనాంతరంబునం దిరుగునప్పుడు. 54

క. ఇల నందఱుఁ దను సైరిం
పలే రనుచు వెట్టయైన బ్రదుకోల్లక తాఁ
గలుమడుఁగు లుఱికెనో యన[2]
జలజాప్తుం డస్తశిఖరిచఱి దిగబడియెన్. 55

వ. అప్పుడు. 56

క. బహుయోజనదూరము లగు
గహనంబుల నుండి యెగసి కలకలములతో
విహగంబులు నిలయమహీ
రుహముల కరుదెంచెఁ బంక్తిరూపం బలరన్. 57

---

1. క్రౌంచపదమును సరసిజచిహ్నితమును సంకృతిచ్ఛందములోఁ గనఁబ డుచున్నవి. ప్రకృతిచ్ఛందములోని దని వ్రాయబడినది. 2. దనుసైఁపక, పలుతెఱఁగుల ననఁగ నట్టిబ్రదుకోర్వకతా, గెలఁకుల గ్రేళ్ళుఱికెనొ యన.

క. బంధురమహాంధదిక్కా-
లంధరగజగండమండలప్రచలితపు
ష్పంధయనిభనీలిమ జగ
దంధంకరణప్రసార మై తమ మొదవెన్. 58

వ. తత్సమయంబున. 59

ఆ.వె. ఆదిమూర్తిక్రియ సహస్రశాఖలను స
హస్రపాదములను నవనిగగన
భాగపూర్ణ మగుచు భవ్యమై ద్విజకుల[1]
సేవ్య మైనతరువుఁ జేరె విభుఁడు. 60

సీ. ఏమ్రానిమూలంబు లిలకు నాధార మై
శేషపడగలతోఁ జెలిమి సేయు
నేవనస్పతికొమ్మ లెక్కి యాడంగ ది
గంతబాలికలకు నందికోలు
ఏవృక్షమునఁ గల యి ర్లహర్నిశ మంధ
తమసంబునకు నుండఁ దల్లియిల్లు
ఏపాదపముతుద నెడనెడఁ గాలూఁద
రవిహయంబులకు విశ్రామభూమి

ఆ.వె యేమహీజమునిలు వెల్లపక్షుల కునికి-
పట్టు నాఁగ నెగడి ఫలదళముల
నబ్జరాగమరకతాంచితైకస్తంభ
హార్మ్యసామ్యమందు నట్టివటము. 61

---

1. హస్రశిఖర రమ్యమౌచునెపుడు, భూమిగగనభాగపూర్ణమైద్విజకుల-

క. ఆవటముక్రిందఁ దలిరుల
నావటముగ శయ్యఁదీర్చి యందు సమస్త
క్ష్మావరమణికోటీర
స్థావరనిజశాసనుండు శయితుం డయ్యెన్. 62

వ. ఆవేళ నాతరుశాఖాంతరంబున నున్న చిరజీవి యను వృద్ధపక్షీశ్వరుండు తన చుట్టు వచ్చి యున్నపిట్టలం జూచి మీరు దిరిగిన వనంబుల నపూర్వంబులేమి గంటి రని యడిగిన వానిలోఁ గుక్షింభరికుం డనువిహంగం బోస్వామీ నీ వెఱుంగని యపూర్వంబులు లే వట్లున్నను నొకటివింటి నవధరింపుము. 63

మ. ఖగవంశోత్తమ నేఁడు గుంపుగ నుషఃకాలంబున న్వేడ్కతో
గగనాభోగము నిండ నే మెగసి పక్షశ్రేణివాతోద్ధతి
న్నగము ల్దూలఁగఁ బోయి వింధ్యముచటి న్నానాదిగంతాగతం
బగు నాత్మీయగణంబుఁ గూడి యొకపుణ్యారణ్యమధ్యంబునన్. 64

క. కంకాలఖండనుండను
కంకము విహగములు గొలువఁగా నిజమిత్రా
తంకం బగుశోకాంబుధిఁ
గ్రుంకఁగ నేఁగితిమి వానికుంచుట దెలియన్. 65

క. ఏఁగినఁ నాతం డశ్రులు
దోఁగిననయనములఁ జూపు దోఁపక తనలోఁ
గ్రాఁగుచునుండఁగ నేమా
పాఁ గెఱిఁగినభంగినొయ్యఁ బలికితి మతనిన్. 66

క. పిట్టలము మేము నీకల
చుట్టాలము మమ్ము నేల చూడవు నీకీ
పట్టున వలవనిశోకము
పుట్టెడుకత మేమి చెప్పు పొందుపడంగన్. 67

ఉ. నావుడుఁ జూచి యతఁడు మనంబు యథాస్థితి నిల్పి యిట్లను
న్వేవురు బాంధవు ల్గలుగ వేదనఁ బొందఁగ నాకు నేల మీ
కీవిధిచొ ప్పెఱుంగఁ ద.గునేని వినుం డిఁక వింధ్యకందర
గ్రామముఁ జెంది యుండె నొకరక్కసుఁ డక్కడ నిక్కువంబుగన్. 68

శా. ఆమాంసాశనుఁ డుక్కు మిక్కుటిలఁగా నాత్మాంతికద్వాదశ
గ్రామాంకస్థుల నెల్లవారలఁ దినంగా నందఱు న్భీతి మై
స్తోమం బై చని సాఁగి మ్రొక్కి యొకమర్త్యు న్నిత్యము న్ని బహి
ర్భూమి న్నిల్పెద మారగింపుము నవాపూపాదియుక్తంబుగన్. 69

మ. అని సంప్రార్థన చేసి యేఁగి నిజమర్యాదావిధిం బ్రాప్తుఁ డౌ
మనుజుం గమ్మనిపిండివంటలును సన్మానంబుతోఁ దెచ్చి య
ప్పనసేయం గని యార్చుచు న్వెదలి వ్యాపాదించి[1] తృప్తాస్యగాఁ
దినుచుండుం దనుజుండు యత్నమునఁ బత్నీయుక్తుఁడై నిచ్చలున్. 70

వ. ఇట్లనుదినంబును నరబలి జరగు నెల్లిటిదినంబున. 71

క. షన్మిత్రుఁ డైన యొక్కద్వి
జన్మకుమారకుని వరుస చనుదెంచిన దే
తన్మూలము నాశోకము
సన్మార్గికిఁ గలియుగమున సౌఖ్యము గలదే. 72

మ. అనిన న్విస్మయ మంది మేము ఖగవర్యా నీకు నవ్విప్రబా
లునకుం జుట్టఱికంబు కీలుం జెప్పుమా నావుడున్
వినరయ్యా యుపకారహీనుఁడ భయావిష్టుండ నిర్భాగ్యజీ
వనుఁడం జెప్పెద దీనికారణము మీవాలాయపుంబల్కులన్. 73

---

1. యార్భాటించి.

ఉ. ఏనును బిల్లలుం గలయ నెల్లెడఁ ద్రుళుచు నుల్లసిల్లుచుం
గాననభూమిలోఁ దిరుగఁగా నొకచెం చురు లొడ్డిపోయినం
గానక తూఱుచో మెడలుఁ గాళ్లను జుట్టలుగొన్న దిక్కులన్
దీనులమై కలంగి నలుదిక్కులుఁ జూచుచునున్నయత్తఱిన్. 74

క. ఫలకుసుమసమిత్పర్ణం
బుల కట చనుదెంచి మమ్ముఁ బొడఁగని కరుణా
కలితుఁ డయి యక్కుమారకుఁ
డలజడిఁ బడకుండఁ ద్రెంచె నయ్యురు లెల్లన్. 75

క. అతనికృప నిట్లు బ్రదికితి
క్షితి రాఁబులుఁగులకు నెల్ల సేవ్యుఁడనై విం
శతివర్షంబులు పెరిఁగితి
గతి సేసిన యతనికీడు గనుఁగొనవలసెన్.[1] 76

క. తనకుపకారము చేసిన
మనుజునకు న్మేలు గోర మరగక[2] దుఃఖం
బున కడ్డుపడక యుండిన
జనునిబ్రదుకు మేఁకయఱితిచన్నుం బోలున్. 77

క. రాక్షసిని జంపనోపను
బక్షిని దుర్బలుఁడ నన్నుఁ బ్రతినిధ గాఁగన్
భక్షింపు మనిన మాంస
ప్రక్షీణతఁ జూచి వాఁడు పైఁబడఁ డిటకున్. 78

చ. అనవుడుఁ దత్ప్రతిక్రియ కుపాయము గానక చింతఁ జెంది యా
తనిఁ దగ నూఱడించి మదిఁ దారుచు వచ్చితి మేము నావుడు

1 గతిగానక యతనికీడు గనుఁగొనఁబడియెన్. 2. మేలుఁజేయ మదిగానక.

న్విని చిరజీవి పల్కె నరవిందభవుం డలికంబునందు వ్రా
సినయది తప్పనే పరులచేతఁ జరాచర భూతకోటికిన్. 79

క. ఈ క్రమమునఁ బలుకఁగ విని
విక్రమభూషణుఁడు బాలవిప్రత్రాణో
పక్రమమున నిద్రింపక
శుక్రోదయవేళ కెదురు చూదుచు నుండెన్. 80

ఆ.వె. అంత భార్గవోదయంబైన వెలుఁగునఁ
దెరువు గానవచ్చు తెఱఁ గెఱింగి
కదలె వింధ్యగిరికి గండభేరుండాది
ఘోర మైనయడవిఁ గొంకులేక. 81

చ. జలజల మంచునీ రొలుకఁ జల్లనిగాడ్పులు వీవఁ దారక
ల్మలమల మ్రగ్గఁ జీఁకటి క్రమంబున డిగ్గ విహంగసంఘము
ల్మలకలఁ బల్కఁ దూర్పున వికాసము కెంపునఁ గూడియాడఁగా
బలబలఁ దెల్లవాఱె జనపాలకుఁ డేఁగు వనాంతరంబునన్. 82

క. ఒకసారె యేడుతేజులు[1]
వికలాంగుఁడు సూతుఁ డనిలవీథి తెరువుగా
నొకరథమునఁ ద్రిభువనములు
నొకనాఁటనె తిరుగునాతఁ డుదయము సేసెన్. 83

క. ఆపర్వత మెక్కుచు గజ
రూపంబగు తిమిర మణఁచి లోహితకాంతి
వ్యాపితకరనఖరుండై
దీపించె మృగేంద్రుకరణి దినమణి కణఁకన్. 84

---

1. ఒకతేజికేడుపేరులు.

సీ. పూర్వదిక్సతి యొద్దఁ బొలుపారు గొడుగుపై
ఖచితమౌ మాణిక్యకలశ మనఁగ
విబుధబాలురఁ గూడి వేడుకతోడ జ
యంతుఁ డాడెడి బట్టుబంతి యనఁగఁ
బ్రాచీవధూటికాఫాలభాగంబునఁ
బెట్టిన కెంపులబొట్టనంగ
దెలివితో నాడెడి దివసఫణీంద్రుని
తలమీఁద నున్న రత్నం బనంగ
రక్తకాంతి మెఱయ రచితరక్తాశోక
కింశుకాగ్రగుచ్ఛసంశయంబు
పొడుపుఁగొండమీఁదఁబొడతెంచెఁద్రైలోక్య
మండనంబు భానుమండలంబు.

క. దల మగుదీధితి నుదయా
చల మలరఁగ రూపబోధజననచ్ఛాయా
కలితం బై యర్కునిమం
డల మప్పుడు రత్నదర్పణముగతి నొప్పెన్. 86

సీ. ఎవ్వనియుదయ మీరేడులోకములకు
దిక్కాలవృత్తులు దెలుపుచుండు
నెవ్వనితేజ మగ్నీందువై భవముల
కాధారమును దానయై వెలుంగు
నెవ్వనిమండలం బెల్లయోగీంద్రులుఁ
జేరుముక్తికి మణిద్వారభూమి
యెవ్వనిమూర్తి వాణీశశంకరవిష్ణు
రూపమౌ వేదస్వరూప మంద్రు

ఆ.వె. ఎవ్వఁ డిష్టజనుల కిష్టదర్శనమునఁ
బావసంచయంబుఁ బాపుచుండు
నట్టిలోకమిత్రుఁ డైన తేజోనిధి
కోకములకు విరహశోక మణఁచె. 87

మ. గిరిశృంగంబుల గైరికాకృతిని శాఖిశ్రేణిపైఁ బల్లవో
త్కరలీలం గరిరాజకుంభముల మీఁద న్రక్తచూర్ణాకృతిన్
శరధిద్వీపములం బ్రవాళరుచిఁ గాసారంబుల న్శోణపు
ష్కరకాంతిం దరుణాతపంగబడరె దిక్కాంతాంగకాశ్మీర మై. 88

చ. కలువలవైరి జక్కవలఁ గావఁగఁబూనిన దాత ముజ్జగం
బులకును సాక్షి యంబరవిభూషణ మానెలతాల్పువేల్పుకు
న్వలపలికన్ను ముక్తి తలవాకిలి చీఁకటిపీడుకోలు నా
వెలుఁగులఱేఁడు తామరలవిందు వెలుంగుచునుండె నయ్యెడన్. 89

క. సంధ్యావందనవిధి యా
వింధ్యానదిలోనఁ దీర్చి విభుఁ డనవరతా
వంధ్యారంభుం డల్లన
వింధ్యాద్రిబిలంబుఁ జేరె విప్రునిఁ గావన్. 90

క. కాలుని కేళీశైలముఁ
బోలెడునచ్చోటి యస్థిపుంజముఁ గని భూ
పాలుఁడు మనమున నధికకృ
పాళుం డై వధ్యభూమి బలియై విలిచెన్. 91

ఆ.వె. అంత నింతిఁ గూడి యసుర యార్చుచు వచ్చి
యోరి పిండివంట లుజ్జగించి
నేఁడు నీ వె వచ్చినాడఁ విదేమిరా
యనుడుఁ దెలియఁబలికె మనుజవిభుఁడు. 92

క. ఓరాక్షస నే నొక్కని
   కారికినై యడ్డువడితిఁ బరదేశిఁ బ్రియా
   హారముగ మెసవు పక్వా
   హారంబులు వెనుకవచ్చునంతకు నన్నున్. 94

మ. అనినం జిత్తములోన దానవుఁడు చోద్యం బందుచు న్నీదుపూ
   నినసత్కార్యము సెల్లు మెచ్చితిఁ జుమీ నీకిష్ట మెద్దేని వేఁ
   డిన నే నిచ్చెద నావుడుం గరుణదృష్టిం గల్గ నీక్షించి య
   జ్జననాథుండు పరోపకారకరణోత్సాహంబుతో నిట్లనున్. 95

క. ఇప్పుడు నీ వాడినయది
   తప్పకుమీ తలచుగాఁగ దానవులకడం
   దప్పను గల వని పెద్దలు
   చెప్పుదు రొకచోట సత్యశీలము లేదే. 96

చ. నయమునఁ బూర్వదేవతలు నాఁగఁ బ్రసిద్ధికి నెక్కె రాక్షసా
   న్వయము జగంబులో నసురవంశవిభూషణ[1] మీవు నీవచో
   నియమముఁ దప్పనేరుతువె నీదుకళత్రము సాక్షి గాఁగ నా
   ప్రియమును నీవునుం బ్రియము పెంపునఁ జేయుము[2] నిన్ను వేఁడెదన్. 96

క. దనుజేంద్ర నేఁడు మొదలుగ
   మనుజాహారంబు గొనుట మానుము కృపతో
   జనులకుఁ బ్రియ మొసఁగుచు నీ
   వనమున నెలకొనుము వింధ్యవాసిని కెనయై. 97

తే.గీ అనుడునవ్వరమిచ్చెదననితలంచి
   ముదితహృదయుఁడై తనయింతిమోముఁజూచి
   యితనిసరిపోల్ప నెవ్వరి నెన్న వచ్చు
   వనిత యీతఁడు జీమూతవాహమీఁడె. 98

---

1. శిరోమణివీవు. 2. నీదునప్రియము పెంపును జేకుర.

వ. అనిన నా రాక్షసి కుతూహలంబున నిట్లనియె. 99

—: జీమూతవాహనుచరిత్రము. :—

క. జీమూతవాహనుఁ డెవ్వం
డేమి ఘనత[1] చేసి వెలసె నిక్కథఁ దెలియం
గా మనుజాంతక చెప్పుము
నా మనమున హర్ష వల్లి నాటుకొనంగన్. 100

వ. అనుడు నద్దనుజుండు పుణ్యపురుషుని యెదురం[2] బుణ్యపురుష కీర్తనం
బుచితం బని యిట్లనియె. 101

సీ. ప్రాలేయగిరిమీఁద భానుబింబద్యుతి
మణిమయప్రాకారమహిమతోడఁ
దిరమైన కాంచనపురములో జీమూత
కేతుఁడు నాఁగ విఖ్యాతయశుఁడు
ఖచరవల్లభుఁ డొకకనకవతీసంజ్ఞఁ
బరఁగెడుకన్యకఁ బరిణయించి
ప్రీతిసందిల్ల జీమూతవాహుం డనఁ
దగునట్టి పుత్రరత్నంబుఁ బడసి

ఆ.వె. రాజ్యలక్ష్మిచేతఁ బూజ్యుఁ డై కడపటి
వార్ధకమున భోగవాంఛ వదలి
నిజపదమునఁ బుత్రు నిలిపి నీతులు సెప్పి
వనితఁ గూడి యేఁగె వనమునకును. 102

క. జీమూతవాహనుండు మ
హామహిమాఖండలుండు యాచకజనచం

1. ఏమితగవు చేసి. 2. పుణ్యపురుషుఁడు వినం బుణ్యపురుష.

తామణి శరణాగతర
క్షామణి ఖచరేంద్రకులశిఖామణి యయ్యెన్. 103

క. పితృదత్తమైన కల్ప
క్షితిరుహ మర్థులకు నొసఁగి చిక్కిన ధనసం
హతిఁ దనబంట్లకుఁ బ్రజలకు
హితులకుఁ దగ నిచ్చె రిపుల కెడ రిడి యనఁగన్. 104

ఆ.వె. పురముఁ గొనఁ దలంచు, నరులఁ జంపఁగఁబూని
జీవహింస కోడి చింతనొంది
తల్లిదండ్రు లున్నఁ దగుఁగాక యిదియేల
యనుచు గురులజాడ నారుగఁ దలఁచె. 105

వ. తలఁచి సఖుం డైన మధుకరుం గూర్చుకొని యరిగి తజ్జననీజనకులం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన వారలు సంతుష్టాంతరంగులై యుండం జేరి. 106

క. తత్పదపంకజసేవా
తత్పరమతి విపులుఁ బండ్లుఁ దాఁ దెచ్చుచు నా
సత్పురుషుఁడు మలయమహీ
భృత్పార్శ్వమునం జరించెఁ బితృభక్తుఁ డనన్. 107

మ. ఒకనాఁ డిష్టసఖుండుఁ దాను ఫలపుష్పోపార్జనాసక్తితో
వికచాంభోజసరోవరంబుల నవావిర్భూతచూతాది జా
లకజాలంబుల రాజకీరమదరోలంబాగ్రపుష్పంబులం
బ్రకటశ్రీగుణగణ్యమౌ నొక తపోరణ్యంబు సొత్తెరఁగన్. 108

క ముందఱ గౌరీమందిర
మందారనవారవిందమాకందలతా

కుందమకరందబిందు
స్పందానందనుఁడు మందపవనుఁడు వీచెన్. 109

వ. అంతఁ దదాగతకుసుమామోదవాసిత మలయసమీరాప్యాయన శరీరాయా సాపహరుండై. 110

క. ఎడపని కూరిమితో న
య్యెడఁ బుత్రికి నీడ యైన హిమశైలము కై
వడి బెడఁ గడరెడు పటికపు
గుడి బొడఁగని యక్కుమారకుం డటుచేరెన్. 111

క. అంగనమున నభ్యంతర,
సంగీతాకర్ణనమునఁ జలియింపక వే
డ్కం గసవు మేయకున్నకు
రంగంబులఁ జూచె నంతరంగం బలరన్. 112

వ. చూచి తత్సంగీతప్రసంగసాంగత్యకారణం బగు జాణం జూతము రమ్మని యిష్టసఖుం డైన మధుకరుం గూడి తద్ద్వారంబుఁ దూఱి. 113

సీ. చిన్ని చన్నులమీఁదఁ జేర్చినవీణియ
చేఁదోడుగా శ్రుతిస్థితులఁ దీర్చి
సరిగమపధని లన్సప్తస్వరంబుల
గమకంబు లయవిభేదముల నెఱపి
నాదామృతంబున ననిచినక్రియఁ దంత్రిఁ
బెనఁగొని నఖకాంతి గొనలుసాఁగ
రాగకదంబంబు రంజిల్లఁ జేయుచు
నాలతి వీనుల కమృత మొసఁగ

ఆ.వె. గానరసవశమునఁ గనుఁగవ మోడ్చుచు
బోటిఁగూడి వాణిబోటిఁ బోలె

గౌరిఁ బాడుచున్న కన్యకారత్నంబుఁ
జూచె నచట బాలఖేచరుండు 114

వ. అంతఁదదీయలావణ్యమధుమత్తనయనమధుకరుండై మధుకరునితోనిట్లనియె

క. వనితారత్నము నవయౌ
వనయై పొదరింట నున్నవనలక్ష్మి క్రియన్
దొన నున్నమరునిబాణం
బన నున్నది యిచట మోహనాకృతితోడన్. 116

సీ. ఇది దేవకామిని యేని నింద్రుని వేయు
గన్నులు సఫలము ల్గాక యున్నె
యిది నాగకన్యక యేనిఁ బాతాళంబు
సోముఁడు లేఁ డని శూన్య మగున్నె
యిది ఖేచరాంగన యేనిమాజాతికిఁ
బ్రభయెక్కు- చెఱకునఁ బండుగాదె
యిది సిద్ధబాలిక యేని లోకంబులో
సిద్ధకులంబు ప్రసిద్ధిఁ గనదె

ఆ.వె. యిది వనాంతలక్ష్మి[1] యేని వనం బెల్లఁ
బల్లవింపకున్నె యెల్లయపుడు
నిది సుధాంశురేఖ యేని యీాగుడి నున్న
శిలలు చంద్రకాంతశిలలు గావె. 117

క. పరసతులను దల్లులఁగాఁ
బరికించెడు నాకు దీనిపైఁ జిత్తం బే
వెరవునఁ దగిలెనొ యిది కృత
పరిణయ గాకుండఁబోలుఁ బరికింపుదమా. 118

1. వసంతలక్ష్మి.

వ. అని యంతకుమున్న నిజదర్శనంబునఁ జంద్రావలోకనంబునం గరంగు చంద్ర కాంతంబు క్రియఁ జిత్తంబు గరంగి మేన ఘర్మజలంబులు మణిగణభూషణంబులుగా లజ్జారాగనిమగ్నయైనను బేటంబున గాటంబగునా టాటంబునఁ దుంట విల్తుండు మానంబు వేఁటాడ[1] బోటి పూఁబొదమాటు సౌరం దలంచునెడ వసంతానుగమ్యమానుండగు మీనకేతనుని ఛాతిదగ్గఱి యోలీలావతి నీ వెవ్వతెవాన పీగౌరీగేహంబున కరుగుదేరం గారణం బేమి నావుడు విని చతురికయను తత్సఖి తేచి బాలికకుఁ బ్రౌఢత్వంబు గలదె యేను విన్నవించెద నవధరింపుఁడు. 119

క. వసుమతిఁ బరఁగిన మిత్రా
వసుసోదరి సిద్ధవంశవరుఁ డగు విశ్వా
వసుసుత మలయవతి విభా
వసునిభుఁడగువరుని వేఁడవచ్చిన దిటకున్. 120

వ. అనిన నక్కుమారుండు నామాట తప్పదిది కన్యక యగుట వింటివే యనుడు నమ్మధుకరుండు దైవయోగమ్మున సమాన వయోరూపంబులు గలవధూవరు లిట్లు గూడుదురేయని- 121

క. వనరుహగర్భుని నేరమి
ననురూపసువస్తుయోగ మగపడదు జగం
బున మీబోంట్లకు నగపడుఁ
గనకము రత్నమ్ముఁ గూడుకైవడి నొకచోన్. 122

వ. అని చతురికం జూచి నిజసఖుని దెసం జూపి. 123

క. జీమూతకేతుసుతుఁ దరి
జీమూతసమీరణుండు చిత్తజనిభుఁ డౌ

---

1 తుంటవిల్తుచే మానసంబు పేటెత్త. చి. సూ.

జీమూతవాహుఁ డీతఁడు
జీమూతస్థిరుఁడు ఖచరశేఖరుఁడు చుమీ. 124

క. అనవుడు నది మలయనతిం
గనుఁగొని యిది గౌరికరుణఁ గలిగెం జెలియా
మునువిందు మితఁడు రూపసి
యనఘుఁడు వరియింపు మితని నతిమోదమునన్. 125

ఉ. నావుడుఁ గన్యకామణి మనంబునఁ గూరిమి నాటుకొల్ప నా
భావజుబాణము ల్మిగులఁ బజ్జఁ జరించినఁ దత్పరాగమో
నా విలసిల్లి లేఁజెమట నవ్యముగాఁ గుచసీమఁ దోఁప ల
జ్జావనతాస్య యై నిజవయస్యకు నుత్తర మీక యుండినన్. 126

వ. చతురిక మఱియు నొత్తి పలుకునప్పుడు. 127

సీ. జనని పుత్తెంచిన సఖి వచ్చి పిల్చిన నిఁక నుండరా దని యిచ్చఁ దలఁచి
పోయినఁ బ్రియుఁడెట పోవునో యని నిల్చి తడసినఁగోపించుఁ దల్లియనుచు
గదలి వేదన మదిఁ బొదలఁగా నేటికి నెదురీఁదుచాట్పున నింటి కేగి
బలవంత మైన యావలవంత మదిలోన వేఁగుచు నొకచోట వెచ్చనూర్చు

ఆ.వె. చున్నఁ జూచిచెలియలొయ్యనఁజదెంచి
హృదయతాపమెఱిఁగిమదిఁగలంగి
చంద్రకాంతవేది శయ్యాతలంబు పైఁ
జేర్చి శిశిరవిధులు సేయునపుడు. 128

క. పుప్పొడియుఁ బువ్వుఁ దేనెయుఁ
గప్పురమును జందనంబుఁ గలపిన పన్నీ
రప్పొలఁతుకపైఁ జిలికిన
నిప్పపయిం జిలికినట్టి నెయ్యిం బోలెన్. 129

సీ. కుప్పలు గొనఁ జల్లుపుప్పొడియెరువుగాఁ
బొరిఁబొరివిరహాగ్నిఁ బొగులఁజొచ్చె[1]
ఘనసారమిళితచందనపంక మురమునఁ
దొడిఁదొడి నెఱియలు విడిచి చిటిలె
సెజ్జపై బఱచిన చెంగల్వరేకులు
స్రుక్కిమై సోఁకినఁ జూర్ణమయ్యె
విసనకఱ్ఱలు చేసి విసరుచో నావులఁ
గదలీదళంబులు గ్రాఁగి ముఱిఁగె

ఆ వె. మోవికెంపు డిందె ముత్తియంబులు గందెఁ
గంకణముల లక్క కరఁగిపాఱెఁ
జలువమందు లెల్లఁ జెలువ యుందఁగఁ జేయ
నెడఁద మదనతాపమినుమడించె. 130

క. కలకలఁ బలికెడు చిలుకల
కలకలములుఁ గోకిలముల కలరవములు నా
కులపఱుప నళికులంబులు
నులుకఁగ నయనముల జలము లొలికెం జెలికిన్. 131

వ. ఇట్లు పెచ్చుగిల్లిన[2] పచ్చవిల్తువెచ్చ వెచ్చు నెచ్చెలిం జూచి కలంగి ప్రబలదర్పితుం డగు నాదర్పకుని దూఱం దలంచి చతురయై చతురిక యిట్లనియె. 132

క. వలరాజ నిన్ను రూపున
గెలిచిన జీమూతవాహు గెంటింపఁగ తే
కలుషమతి నబల నొంచెదు
పలువురు వినిరేని బంటుపంతము డిగదే 133

1. విర విర విరహాగ్ని విరియఁజొచ్చె. 2. పిచ్చగిల్లిన-పెచ్చు పెరిఁగిన.

మ. అళులారా యలికుంతలం జెలిమితో నానంద మందింపుఁడీ
చిలుకా చిల్కలకొల్కి నేపక సఖీస్నేహంబు వాటింపుమీ
వలరాజా వలవంత మాన్పుము పికద్వంద్వంబ యీద్వంద్వముం
గలయం గోరుము మారుతా మరలుమీ కన్నంత నిక్కన్నియన్. 184

వ. అనునప్పు డక్కుమారఖేచరున కైన యత్తాపమునకుం దాప యగు నాది
ఖేచరుం డాదిత్యుండు కాంతి సడలినట్టు దిరిగి చని ఘనపుష్పరాశితల్పం
బునం దనమేను సేర్చిన. 185

క. జడనిధి వెలువడి యెఱ్ఱఁగఁ
బొడమెడు కిరణములు శిఖిలపోలిక నిగుడం
గడఁగి యుడురాజు విరహుల
బడబానల మనఁగ నుదయపర్వత మెక్కెన్. 186

ఆ.వె. అంత జగమునిండ నచ్చవెన్నెల పర్వ
నందులోని వేఁడిఁ గంది కుంది
కాఁగఁబెట్టినయుదకంబులోపల నున్న
మీనువోలె బాల మిడుకఁజొచ్చె. 187

వ. ఇట్లధికపరితాపంబునం బురపురం బొక్కుచున్న కన్నియం జూచి కళ
వళించి చెలులు మెత్తన నెత్తుకొని చని గుడువెంద పందిరి క్రింద నర
విందతల్పంబుపై నిడి దైవం బేమి దలంచునో యని దానిమేని కట్టా
వులం గ్రాఁగిన తమ్మి సవరించు కొనుచు. 188

క. తను వంట నోడి వనజా
ననకును జేమంతిపువ్వునం గొని పన్నీ
రెనయ మెయిఁ బూయుచోఁ గ్రాఁ
గిన పెనమున నొలుకు నూనె క్రియఁ జుయికొట్టెన్.[1] 189

1. చుంయనియెన్-చుఱుకంటెన్.

క. అస్తోకంబుగ నత్తా
శస్తని కుచమండలమున లలనలచే వి
న్యస్త మగుచకదనము నవ
కస్తూరీలేపనంబుకై వడిఁ దోఁచెన్. 140

వ. అవి యన్నియుం జూచి డగ్గఱ బెగ్గిలి చతురిక న్యాయనిష్ఠురోక్తులఁ జంద్రు నుద్దేశించి 141

క. ఉడురాజ నీవు పొడిచిన
జడనిధి యుడుక్కెక్కి వెక్కసంబునఁ బొంగున్.
బడబాగ్ని మీఱి నావుడుఁ
బడఁతుక నీవేఁడిఁ జిమిడిపడ కెట్లుండున్. 142

క. హరిణాక్షి చూడ్కిఁ గన్నుల
సిరిగోల్ప డీ యిట్టినిన్నుఁ జేరిన నీ పీ
తరుణిఁ దెగఁజూడఁ బోలుదు
పరికింపఁగ నెపుడుఁ బక్షపాతివి గావే. 143

మ. అమృతాంభోనిధి జన్మభూమి సురభూజైరావతశ్రీసుధా
ప్రముఖంబుల్ లగు తోడఁబుట్టుగు లుమాప్రాణేశుజూటంబు గే
హము బింబం బమృతం బనగ జగదాహ్లాదంబుగా నిన్నుఁజూ
తుము నీవేఁడిమి కాలకూటమునకుం దోఁబుట్టు వయ్యెంగదా.[1] 144

ఆ.వె. నాఁడు నేఁడు నీకు నాఁడుఁదోబుట్టువు
లేదె కరుణ లేదు లేశ మైనఁ
బొలఁతిమొగముతోడి పొత్తెనఁ బరికించి
చల్లసేయుమయ్య చందమామ. 145

---

1. దోఁబుట్టువౌటంజుమీ-నౌటంగదా.

వ. అని వేఁడుకొని మలయవతిం జూచి. 146

సీ. వనిత నీకన్ను లొయ్యన విచ్చి చూడవే
మారుబాణము లరుదేరనోడు
నబల మావీనుల కమృతంబు చిలుకఁగాఁ
బలుకవే చిలుకలు పలుకనోడుఁ
గోమలీ నీదు ముంగురులు పాటింపవే
తేఁటిదాఁటులు కొంత దాఁటనోడు
ధవళాక్షి నీముఖదర్పణం బెత్తవే
సోముఁడు నీదెసఁ జూడనోడుఁ

ఆ.వె. బడఁతి మమ్ముఁ దగినపనిఁ బంపఁజీరవే
కోకిలంబు లిచటఁ గూయనోడు
మగువ చల్ల నూర్పు నిగిడింపవే యింద
మలయమారుతంబు మలయనోడు 147

వ. అని ధైర్యంబు పట్టుకొల్పిన నమ్ముద్దియ తనవేదన దీఱ తెఱంగు చెప్పంబూని ప్రీడావశంబున నోడి మారుప్రేరణం దవులుకొని చెలిం జూచి. 148

క. ప్రథమముననుండి చిత్త
వ్యథ యెఱుఁగుదు ప్రాణసఖివి వలనై నమునో
రథ మొనగూర్పక యీమ
న్మథుబారికిఁ ద్రోవ నీకు నాయం బగునే. 149

క. రతిపతికిఁ దోడుపడి యో
చతురిక వెనువెంట మందు చల్లుచు నన్నుఁ
బతిమాలించెద వకటా
హితులుం బగవారిఁ గూడి రేమనవచ్చుఁ. 150

వ. అనిన నోయమ్మ నీ నెమ్మనంబున నింత యమ్మలికం బేల నమ్మ షుతనిం దెచ్చెద నూఱడు మని చతురిక మనోహారిక యను సఖిం జూచి యీచేడియ గౌరీ ధామంబున జీమూతకేతు కుమారు సుకుమారుం జూచి వలచినయది యది మనరాజున కెఱింగించుట విచారం బగునే. 151

క. చెప్పినఁ బతిగోపించును
జెప్పకయుండినను బాల చిక్కఁడు మనకుం
దప్పులు దొలఁగునుపాయము
చొప్పడు నేదేనిఁ బ్రదుకుఁ[1] జూడఁగ వలయున్. 152

క. అని తలపోయుచు నుండఁగ
వనజంబులు వెలయఁ గుముదవనములు సొలయం
గనుకని చీఁకటి పొలియఁగఁ
దనరుచి దివిఁగలయఁ బొలయఁ దపనుఁడు పొడిచెన్.[2] 153

సీ. ఆవేళఁ జతురిక యనువునఁ బ్రాణంబు
నిలుపంగఁబూని యానెలఁత లేపి
యిష్టునిఁ గూర్చెద నేతెమ్ము గౌరిని
వాసమ్ముకడ కని యాసగొలిపి
కొని చని మాధవీకుంజంబులోపలఁ
జల్లని పల్లవశయ్య నునిచి
వగవకు జీమూతవాహనుం దెచ్చెద
నని నాలు గడుగులు నడచునంత

---

1. చొప్పడు నేదినిఁ బ్రదుకు చి. సూ. తప్పదుయేపనియైనను ముప్పవు మునకేమియైన మోసమువచ్చున్. 2. క. మనసిజునియేపు జాఱఁగఁ...తన రుచి దివిగలయ బాలతపనుఁడు పొడిచెన్.

ఆ.వె.. నెదుర మదనుచేత హృదయసంతాపంబు
పొదలఁబువ్వుఁబొదల మెదలఁబూని
సంగడీనిఁ గూడి యంగనఁ దలఁచుచుఁ
బలవరించు నతనిపలుకు వినియె. 154

వ. అది యెట్లన్నను. 155

ఉ. మారుని మోహనాస్త్రము, సమస్తవిలాసలిహారభూమి, శృం
గారరసంబుతేట, తొలుకారుమెఱుంగులపుట్టినిల్లు, సం
సారసుఖంబు లేమొలక, చక్కఁదనంబులప్రోక కాఁకబం
గారముచేగ, యాతరుణి కిన్నులపండువ గాదె చూచినన్. 156

క. నెఱిచెడి యింటికిఁ జనునా
తఱి మొగమున కెగయు తేఁటిదాఁటునకై తాఁ
జెఱికడఁ బెడమఱి చూచినఁ
జుఱుకుననానెఱనునాఁటెఁజూ పెనుదూపై.[1] 157

వ. తన్మూలంబుగా మన్మథుండు బాణవిరహితుండయ్యె నని తదనంతరంబ.[2]

క. మదనుని యేనమ్ములు నా
హృదయాగ్నిని భస్మమయ్యె నిదిమొదలుగనీ
పదునాలుగులోకములుమ
బ్రదుకుఁ గదా వీనిచేతిబాధకు వెలి యై. 159

క మధుకర తన్ముఖపంకజ
మధుకరభావమున మిగుల మత్తిల్లి సుధా

1. నె, నడునాటంజూపె మన్ననంజడమాలై. చిఱికునఁ బెడమరిచూచిన
నెఱసఖిఁజేరిననాగనె 2. తన్మూలంబుగాఁ బెడమఱిమాచిన మన్మథుండు తెగఁ
జూచుట లోకోపకారంబయ్యె.

మధుర మగు నావధూమణి
యధరము చవిచూడఁ గలుగునా యికనాకున్. 160

వ అట్టిబోటి కూటమి లేక మదిం గంది కుంది బ్రతుకుకంటెఁ బ్రాణంబులు దొఱంగుప మే లనినమధుకరుం డొకసమారచింతీరవ యింతలోధీరత్వంబు విడుతురే నావుడు నభిమానించి. 161

క. పూచినరసాలభూజముఁ
జూచితిఁ జంద్రాతపమ్ముఁ జొచ్చితి నిన్నన్
నీచేతికదళిదళముల
వీచోపులగాలినుంటి వీరుఁడఁ గానే. 162

వ. అనునెడం జతురిక దగ్గఱి తనచెలి వల పెఱింగింపం బూని. 163

క. వీరుఁడవు మేరుభూధర
ధీరుఁడ వత్యంతదానదీక్షాజితమం
దారుఁడవు భూరికరుణో
దారుఁడ వయితేని బాల దయఁ జూడుమికన్. 164

వ. అని మఱియును[1] 165

క మలయాచలసానువుపై
మలయుచుఁ జనుదేర గౌరిమందిరమున ని
ర్మలయశుఁడ వైన నిను మా
మలయవతీకన్య చూచె మానముదూలన్. 166

క. అది మొదలుగ మరునమ్ములఁ
జెదరినధైర్యమున జేయి చెక్కిట నిడి స

1. ఈక్రిందిని దశావస్థలకందములు.

మ్మఁద ముడిగి మనము నీపై
గదియించును జూడ్కి బాష్పకణములు దొరఁగన్. 167

క. భావజనిభుఁ డగు నాతని
భావంబునఁ గూర్మి నిలిపి పరిరంభణసం
భావన సుఖ మొనగూర్చెడు
దైవము నాపాలఁ గలుగదా యని తలఁచున్. 168

క. అనిమేషంబునఁ బ్రియునిం
గనుఁగొనఁగాఁగోరుకన్నుఁగవ కడ్డము వ
చ్చినఁదనుఁగోపించు నొకో
యని కన్నులఁ జేర నిద్ర యలుకుచునుండున్. 169

క. విను గడు సన్నం బగునీ
మనముఁ బ్రవేశింప నిదియ మత మగు నని ద
స్సెనొకాక యనఁగ నంగన
తనతనువునఁ దనుపు లేక తనువై యుండున్. 170

క. సారసములు నారసములు
హారంబులు కంటకప్రహారంబులు క
ర్పూరము విషపూరము శృం
గారము బంగార మయ్యెఁ గామినిమదికిన్. 171

క. నేనుం దానును నొక్కటి
దా నుండఁగ నొరునిఁ దగిలెఁగా యనుచు నుదా
సీనంబు వీడుకోలుగ
మానినికిన్ లజ్జ దలఁగె మరు బేటమునన్. 172

క. పలికెఁ బొడసూపెఁ బ్రియుఁడదె
పిలిచె నను గిరచంద్రపికములయెడ వా

గ్విలసనరవములుఁ బలుకులు
మొలతేరఁగ సంభ్రమించు మ్రొక్కను లేచున్. 173

క. మోహమున మన్మథానల
దాహముపె ల్లెఱుఁగలేక తనప్రాణంబుల్
దేహమునఁగలుగుటకు సం
దేహముగాఁ జెయ్యిఁలుడిగి దృష్టి మొగుడ్చున్. 174

క. సతి విడిచిన ప్రాణంబులు
పతి నిలుపఁగ నుండె నేఁగఁ బాడియె యతఁడీ
యతివ డిగవిడిచి తలఁగిన
నతివేగమ తలఁగి పోద మని యున్న వనా. 175

క. ఖేచరవంశవిభూషణ
యేచోట వసింపలేక యెత్తుఁబయన మై
నాచెలిప్రాణంబులునినుఁ
జూచినతావుననయెదురుచూచుచు నుండున్.[1] 176

మ. అని చెప్పంగ లతాగృహంబుకడఁ బ్రాణాధీశుచే నేఁడు మ
న్నన లేదింకిట నెన్నిజన్మములకైనన్ ఖర్ర జీమూతవా
హనుఁడౌఁగాత మటంచుఁదీఁగెయు రిలో నాబాలకంఠంబుఁదూ
ర్చిన లోకాంబిక యైన యంబిక కృపం జేపట్టి తా నిట్లనున్. 177

క. హృద్యాకారిణి యీమర
ణోద్యోగం బుడుగు బాలుఁడుత్తముఁడు యశో
విద్యోతితుఁ డధికాయువు
విద్యాధరచక్రవర్తి విభుఁడౌనీకున్. 178

1. మది, గోచరమగు తావులేక గొంకుచునుండున్.

వ. అనిన ననుమానించునెడ నచ్చతురికయు వియచ్చరకుమారుండునుం బఱ
తెంచి కంఠంబున నున్న లతాపాశం బూడ్చి భుజలతాపాశంబిడి యింత
తెంపు సేయుదురే యేమిదె వచ్చుచున్నవార మని బుజ్జగించిన నజ్జీవిష
వగు నజ్జోటి లజ్జామజ్జదవనతాననయై పులకించి గురుని యనుమతి
లేమిం గొందలపడు నెడ మనోహరిణి యనుసఖి వచ్చి గౌరీప్రసాదవిభ
వం బిట్టిదిగదే యని. 179

ఆ.వె. అమ్మ నీవు గోరినట్లు మీతండ్రియు
నతని కిచ్చెద నని యెఱుఁగఁజెప్పె
మీకుఁ బెండ్లి సేయ మిత్రావసువునకు
నానతిచ్చె నటకు నరుగుదెమ్ము. 180

ఆ.వె. అన్నమాటఁ బొంగి కన్నులఁ బ్రియునికిఁ
గన్నె మ్రొక్కి యేఁగె నన్నకడకుఁ
జిత్త ముల్లసిల్ల జీమూతవాహనుం
డాత్మగురులకడకు నరుగుదెంచె. 181

వ. తదనంతరంబున మిత్రావసుండు జీమూతకేతుం డున్నకడకు వచ్చి
యవ్వధూవరుల పరస్పరానురాగం బెఱుకపడం జెప్పి ప్రార్థించి తదను
మతి వివాహవేళ నిశ్చయించి నానానగరనివాసులైన కిన్నరకింపురుష
గరుడగంధర్వ సిద్ధసాధ్య విద్యాధరులం గూర్చి యుభయవర్గంబులుగా
నేర్చి సకలశృంగారాభి రామంబుగా నొనర్చిన కళ్యాణమండపంబున
నున్నసురేంద్రాదిసురలు వధూవరులం జూచి సదృశకులవయోరూపలావ
ణ్యంబులు గల మథునంబుం గూర్చుటకుం బితామహునింగొనియాడుచుండ

సీ. అప్సరఃస్త్రీలుకళ్యాణగానంబులు
తెఱఁ గొప్పఁ బాడగాఁ దివ్యమునులు

ప్రకటించి మంగళాష్టకములు చదువంగ
రత్నములం దలఁబ్రాలుగాఁగ[1]
నగ్నిదేవుండు ప్రత్యక్షమై సాక్షిగాఁ
దగ బ్రహ్మమునులు మంత్రములు సెప్ప
నిర్జరకాంతలు నివ్వాళులిడఁ[2] గల్ప
వృక్షంబు లొగిఁ బుష్పవృష్టి గురియ

ఆ.వె. సురలు పరిణమింప సురదుందుభులు మ్రోయ
నారదుండు దీవెనలుగఁ బాడ
విశ్వమెల్లఁ బొగడ విశ్వావసునికూఁతుఁ
బరిణయించె ఖచరవరసుతుండు. 183

తే.గీ. పరిణయోత్సవంబు జరిపి సిద్ధవిభుండు
గారవమున నెల్లవారనని పె
శ్రీసమేతుఁ డైన జీమూతవాహనుఁడు
గురుపదాంబుజములు గోరి చనియె. 184

క జనకుని యనుమతిఁ గతిప౯
దినములు రతితంత్రగతులఁ దేలుచు వనితా
జనతానురాగుఁడై చం
దనగిరిపై నతఁడు మనము దవియ సుఖించె౯. 185

ఉ. అంతట నొక్కనాఁడు ప్రణయాన్వితుఁ డౌ తమబావఁ గూడి ప
ర్యంతవనాంతభూమిఁ గలయం జరియించుచు వింతకాంతి న
త్యంతసముజ్జ్వలం బయిన యస్థిసమాహముఁ గాంచి పర్వత
ప్రాంతమున న్మరద్ధ ననిభం బది యేటిది బావ నావుడు౯. 186

---

1. చేతనంబ్రాలుగాఁగ 2. వాసుకిసుతు ౛నివాళింపఁగా. సిద్ధకాంతలు నివళింపఁగా.

వ. అతండి ట్లనియె. 187

క. పక్షీంద్రుఁడు పక్షానిల
విక్షిప్తం బైన జలధి వేఁటాడి మహా
చక్షుశ్శ్రవముల నిత్యము
భక్షించుచునుండుఁ దొంటిపగ మొదలాఱఁ. 188

క. ఆగరుడికి వెఱచి మహా
నాగేంద్రుఁడు వచ్చి యనుదినము నొకపాము
న్నీగుంటికడకు నేనై
వేగమె పుత్తెంతు నింక వేఁటాడకుమీ. 189

ఉ. దుర్భర పక్షపాతహతిఁ దోయధి పాయలుగాఁగ వచ్చు నీ
యార్భట మెల్లెడ ల్విని భయంబున నందు భుజంగమాంగనా
గర్భము లెల్ల నూడిపడఁగా నిది నీధనహాని[1] గావునన్
నిర్భకయవృత్తినుండగరుణింపుము నీకుఁ బ్రయాసమేటికిన్. 190

మ. అని ప్రార్థించి యహీంద్రుఁ డేఁగి దినమర్యాదన్ ఫణిం బంపఁగా
వినతాపుత్రుఁడుఁ దించు నుండు నవి భావింప న్మతాసంఖ్యముల్
విను మాతెల్పు తదస్థికూటము జగద్విఖ్యాత మీతార్క్ష్యవ
ర్తనమిచ్చో మసనంబున న్నిలువ యుక్తంబౌనె లోకోత్తమా. 191

ఆ.వె. అనుచు దానశూరుఁ డగువానిమది నొందు
పుట్టకుండ మరలి పోద మనుచుఁ
బిలుచునంతఁ దండ్రి పిలువఁ బుత్తెంచినఁ
బాసిపోయె సిద్ధపతిసుతుండు. 192

ఆ.వె. అంత నక్కుమారుఁ డహిరాజు మది దూఱి
గరుడువలన నురగమరణములకు

1. నిర్భరహాని. 2. బ్రదుకు

మూల మయ్యె దాన నేలికతన మెద్ది
యేది పెద్దతన మదేటితగవు[1]. 193

క. అకటా నాగేంద్రుఁడు స్రు
క్కక జిహ్వలు రెండువేలు గలుగఁగ నొకనా
లుకనైనఁ దన్నుఁ దినిస
ర్పకులము రక్షింపు మనుచుఁ బలుకం దగదే. 194

సీ. అని కరుణాకరుండై యేఁగుచో నొక్క
వృద్ధకామిని పుత్రువెనుకఁ దగిలి
హా శంఖచూడ వంశాధార యోయన్న
నీచిన్నిమో మెందుఁ జూచుదాన
పక్షినాయకుబారిఁ బడఁద్రోచి యే నెట్లు
నిలుతుఁ బ్రాణంబుతో నీవు సనఁగ
బంధువు లందఱుఁ బగఱ కొప్పించిరి
యింకిట నీకు దిక్కెవ్వ రయ్య

ఆ వె. యనుచుఁ బలవరింపఁ గనుఁగొని యది దాని
జననిఁగా నెఱింగి మనుపఁబూని
వీనిఁగాచువాఁడ వెఱవకు మోయమ్మ
యనిన గరుఁడుఁ డనుచు నబల బెగడి. 195

క. పైచీరఁగొడుకుఁ గప్పినఁ
జూచి యతం డేను వినతసుతుఁడంగా నే
ఖేచరకులజుఁడ నీసుతుఁ
గాచెద బెగ డుడుగు నన్ను గరుడనికిత్తుఁజా. 196

1. బ్రదుకు.

వ. అనిన బెగ డుడిగి యప్పుడతఁ డిమ్మాట యింక నొకమాటాడుఁ డనిన నతండు నవ్వి. 197

క. నేలయు నుదకముఁ దేజము
గాలియు నాకసము నెఱుఁగఁ గాచితి నాకై
కోలిదె రెం డాడఁగ నా
నాలుక మీకులమువారి నాలుక లటులే? 198

ఉ. మేరువు సంచలించిన సమీరుఁడు నిల్చినభూమి గ్రుంగినం
దారక లెల్ల డుల్లిన సుధాకరుఁ డగ్నికణంబు లొల్కినన్
వారిధు లింకిన న్నభము వ్రాలిన భానుఁడు చల్లనైన నం
భోరుహసూతి దప్పినను బొంకుదునే మునుపాడి క్రమ్మఱన్. 199

ఉ. నావుడు నాగకాంత కరుణాకర యో ఖచరేంద్ర నాసుతుం
గావఁగఁ బూని వచ్చితివి కన్నతనూజునికంటె నీయెడన్
భావము సార్ద్రమైనయది పన్నగవైరికి నిన్ను నిచ్చి యే
త్రోవల నేఁగుదున్ బ్రదుకుత్రోవ విచారము లేదు నా కిఁకన్. 200

ఆ.వె. అన్న నీకు నతిచిరాయువు గావుత
మన్న శంఖచూడుఁ డతనిఁ జూచి
కరముఁ జోద్యమంది కరములు మొగిడించి
విన్నఁదనములేక విన్నవించె. 201

క. వసుధఁ గొఱగాని కడుఁబా
లసులము పులుకాసిపుర్వులము[1] మాకై నీ
యసువులఁ బగఱకు నొసఁగుట
కసవునకై రత్న మమ్మఁ గడఁగుట గాదే. 202

---

1. కుటిలప్రచారులము.

శా. సంసారాటవిలోపలం గలవు మత్సామాన్యముల్ వ్యర్థముల్
హింసామూలము లైన జంతువు లసంఖ్యేయంబు లోఖేచరో
త్తంసా నీకెనయైనవారు గలరే ధర్మాధికు ల్వెంచలో
హంసానీకము లేదుగాక బకభేకౌఘంబు లేకుండునే. 203

క. మావంటివారి నూర్వురఁ
గావఁగఁ జాలుదువు నీ వొకనిఁ గాచుటకున్
జీవం బిచ్చిన నార్తుల
కేవెరవున బ్రదుకవచ్చు నెడరైన యెడన్. 204

క. మాకులమువారు విడిచిరి
నీ కీకృపసేయనేల నీ చుట్టమనే
శోకమునఁ జావకుండఁగ
నీకాంతను మసలిఁ గావు మింతియ చాలున్. 205

చ. అనవుడు ఖేచరేంద్రసుతుఁ డచ్చెరువంది ఫణీంద్రనందనా
విను మిది యేల నాపనికి విఘ్నము చేసెద వింతకాల మీ
వనమున నర్థి వేఁడమి దివానిశము ల్మదిఁ గుందుచుందు నేఁ
డనఘ పరోపకారసమయం బిటు గల్గిన నుబ్బి వచ్చితిన్. 206

చ. తనయులు భార్య లన్నలును దమ్ములుఁ జుట్టలు సంగడీండ్రు యౌ
వనము ధనంబు నంచు మది వారక ప్రాణములైన నిచ్చి తా
ననదను నార్తు దీను శరణాగతుఁ[1] గావనివాఁ డజాగళ
స్తన మని యండ్రు వానికి యశంబును ధర్మము నెట్లు చేకుఱున్. 207

ఉ. లావు భయార్తరక్షణము లాభము పుణ్యము దేహశుద్ధి స
ద్భావము భూషణం బెఱుక ధర్మము సత్కృప ప్రాభవంబు సం

1. ననద ననాథు నార్తు శరణాగతు.

భావన పాడి సత్యపరిపాలన మే లుపకార మెయ్యెడన్.
భావన కీర్తి యాయువు శుభంబు నిజాప్తులు ధాత్రిలోపలన్.[1] 208

క. జాణ "లనిత్యాని శరీ
రాణి" యనుచుఁ దెలిపి చెప్పరా[2] భువినాత్మ
ప్రాణంబు లిచ్చి యార్త
త్రాణం బొనరింపవలయు తత్త్వజ్ఞులకున్[3]. 209

తే.గీ. నీవు లేవేని నొరులకుఁ గావవశమె
ధన్య నీవు బ్రదికిన నీతల్లి బ్రదుకు
నదియు కారణముగ వైరి కడ్డపడుదు
నీవు గోరిన యట్ల యీనెలఁతఁ గాతు. 210

ఆ.వె. అనుచు వధ్యచిహ్నమైన రక్తాంశుక
మడిగి మ్రొక్కినంత నతని నిల్పి
యేల ఖేచరేంద్ర యీదివ్యదేహంబుఁ
బాముకొఱకు విడువఁ బాడియవునె. 211

క. క్షోణీమండలమునఁ గల
ప్రాణుల కెడరైన నడ్డపడుచుఁ దదీయ
త్రాణం బొనరించుచు నీ
ప్రాణంబులతోడఁ గీర్తిఁ బడయందగదే. 212

ఆ.వె. శంఖధవళ మైన శంఖపాలకులంబు
శంఖచూడు చేతఁ జాలఁ గందె
ననఁగ మీఁదఁ బుట్టు నపకీర్తి నాకది
చావు గాదె బ్రదుకుత్రోవ యేది. 213

---

1. చా వపకీర్తి యశంబు నిజాప్తులు హీనజంతువుల్. 2. యుండగా.
3. ధర్మజ్ఞులకున్.

వ. కావున నన్ను మన్నించెదవేని సీతెంపు మాని మరలు మని పునఃపునః ప్రణామంబు లాచరించి యాతని వేఁడికొని తల్లిం జూచి యోయమ్మ నెమ్మనంబున బమ్మరింపకుము నాకెన్నిజన్మంబులైన సీవ జననివి గ మ్మని మ్రొక్కి వీడుకొని దేవతాప్రణామోన్ముఖుం డై చని యాపొంత.

క. గోకర్ణ రాజకంకణు
గోకర్ణ నివాసుఁ జాపగుణగోకర్ణుఁ,
గోకర్ణశాయిమిత్రుని
గోకర్ణేశ్వరునిఁ జూచుకోరిక నేఁగెఁ. 215

సీ. అట ఖేచరాత్మజుఁ డార్తునిఁ గాచుట
చేకూరు టెట్లని చింతనొంది
యర్ణవతీరగోకర్ణంబునకు వాఁడు
చని వచ్చునంతకుం జనఁ దలంచి
యత్తవారిచ్చిన యరుణాంశుకంబులు
వధ్యచిహ్నమునకు వలనుగాఁగఁ
బులకించి చని వధ్యశిలయెక్కి మదిఁజొక్కి
గారుడాగమనంబుఁ గోరుచుండి

ఆ.వె. తల్లి కనకవతియుఁ దండ్రిఖేచరపతి
కాంత మలయవతియె గాఁగనాకు
నీపరోపకార మెల్లజన్మంబులఁ
గలుగ వలయుననుచుఁ దలఁచునపుడు. 216

మ. గిరు లల్లాడఁగ నర్కుతేరు దొలఁగం గీర్ణంబులై మింటిపైఁ
దరువుల్ గ్రద్దలభంగి నాడఁగ సముద్రం బెల్ల ఘూర్ణిల్లఁగాఁ

1. వడిఁబొంగి.

హరిదంతంబులు పక్షకాంతి నవసంధ్యాలీలఁ గీలింపఁగా
గరుడుం డార్చుచు వచ్చె నచ్చటికి నాకారంబు ఘోరంబుగన్. 217

ఉ. వచ్చి యతండు మస్తమున వ్రయ్యలు వారఁగఁ దన్ని ముక్కునన్
గ్రుచ్చి వియత్పథంబునకుఁ గొంచుఁ జనంగఁ గిరీటరత్నముల్
చెచ్చెర మాంసఖండముల చెల్వున భూమిఁ బడంగ నిచ్చలో
మెచ్చి కుమారకుండు ధృతిమేరువు మే లౌనగూడె నా కనన్. 218

ఉ. అంబరసీమనుండి మలయాద్రిశిలాస్థలి వ్రాలి యేకచి
త్తంబున మాంసఖండములు దర్పము గ్రమ్మగఁ ద్రెంచి మ్రింగఁగా
నంబరచారినందనుఁడు హర్షరసంబున మేను వొంగ వ
క్త్రాంబుజ ముల్లసిల్లఁ బులకాంకితుఁడై విహగేంద్రుఁ జూచినన్. 219

వ. అంతఁ బక్షీంద్రుండు. 220

ఉ. వేదన మేను స్రుక్క దరవిందముకాంతిఁ దొఱంగ దాననం
బాదరణంబు నాయెడ మహాఘన మైనది యంతరంగ మా
మోదతరంగితంబు నిజమూర్తివిలాసము దివ్య మిట్టి కా
కోదరజాతి లేదు సుగుణోత్తమ యెవ్వఁడ వీవు నావుడున్. 221

ఉ. ఎవ్వఁడ నైన నేమి[1] మది నిన్నివిచారము లేల నీకు నొం
డెవ్వఁడు భక్షణం బగు నహీశ్వరబంధువు[2] గాక యియ్యెడన్
మవ్వము దప్ప దంగలత మానవు గంటుల రక్తపూరముల్
క్రొవ్వినమాంస మున్నయది కొమ్ము భుజింపు భుజంగమాంతకా. 222

క. అనునెడ నాగోకర్ణే
శునకుం బ్రణమిల్లి శంఖచూడుఁడు మగుడం
జనుదెంచి వధ్యశిలమీఁ
ద నవం బగు రక్తబిందుతతిఁ బొడఁగాంచెన్. 223

---

1. నైతి నేమి. 2. నహీంద్రులఁ దిందువు.

ఆ.వె. కాంచి మున్నతండు వంచించి వచ్చుట
తెలిసి తన్నుఁ దాన తిట్టికొనుచుఁ
గులముఁ గావనైతి గురునాజ్ఞఁ దప్పితి
నన్ను డాఁచి యొకని మన్నిగొంటి. 224

ఆ.వె. ఇట్టి కష్టజీవ మేటికి నాకని
చాఁ గడంగి యచటి కేఁగుదెంచి[1]
ఖేచరేంద్రతనయుఁ జూచుచుఁ దలయూఁచి
భుజగవైరిఁ జూచి భుజగవరుఁడు. 225

మ. వినతానందన దీనరక్షణపరుఁ విద్యాధరేంద్రాత్మజుం
దిన ధర్మం బగునే సహింపు మకటా దృష్టింపవే పాములం
దినవే యాచవి మున్నెఱుంగవె భవద్భృతాత్ముఁడౌ రాజుపం
పున నే వచ్చితి నాగపుత్రుఁడ ననుం బోనీక భక్షింపుమా. 226

వ. అనిన గరుడుండు పడియున్న యక్కుమారకుం జూచి నే నెఱుంగనైతి నీ కీదుర్మరణోద్యోగం బేల యనవుడు నతం డే మని చెప్పుదు నాయత్నం బంతయు విఫలం బయ్యె. 227

క. వికలము లగుప్రాణంబుల
నొకయుపకారంబు సేయనోపుదు నని కౌ
తుకమున నినుఁ గొలువఁగ వీఁ
డకటా యవసానవైరి యై చనుదెంచెఁ. 228

చ. అనునెడ శంఖచూడుఁడు రయంబున డగ్గఱ వచ్చి యెత్తి యో
ఘనకరుణార్ద్రమానస యకారణబాంధవ సత్యసంధ యీ

1. పోఁగడంగి యచటి కేఁగుదెంచి-చావఁదలఁచి యచటి క్రేవవచ్చి.

వినతసుతుండు నీ వనువివేకము లేక యహీంద్రుఁ డంచు నీ
సునఁ దెగటార్చి నొక్కొ యనుచుం దను వంటఁగఁ జేర్చి యేద్వఁగన్.

ఆ.వె. వధ్యచిహ్న మైనవసనంబుఁ జూచితి
నెఱుఁగనైతి నీతఁ డెవ్వఁ డనిన
వ్యోమచరవిభుండు జీమూతవాహను
డనుడు వెఱఁగుపడుచు నడలి గరుడి. 230

క. మందరతటముఖ హిమవ
త్కందరముల మలయసీమఁ గైలాసమునన్
బృందారకసుందరు లా
నందంబునఁ బాడు ఖచరనందనుఁ డితఁడే. 231

క. కడుఁ బుణ్యుం డగు నీతని
మడియించిన శోకవహ్ని మడియుట కంటెన్
సుడిగొని జడనిధి నుడికెడు
బడబాగ్నిం బడుదుఁ గడిఁదిపాపం బడఁగన్. 232

సీ. అనుచు నంతకమున్న తనయుకిరీటర
త్నంబు కోడలియంకతలముమీఁదఁ
బడిన నాపదఁ దుక పతిశేఖరం బని
బెగడుచు ముందటం బెట్టె నంతఁ
గాంతయుఁ దాను నిర్ఘాతపాతం బైన
తరువుకైవడిఁ గూలి తడసి తెలిసి
ఫణిఫణామణి యని భావించి సుతునిది
గాఁ జూచి తన్మ్రోలి గలుగు పెఱిఁగి

తే.గీ. మూర్ఛనొందుచు శోకాగ్నిమునిఁగి
యాఁలుఁగోడలుఁ దనతోడ నడలినడువ

మారుతప్రేరితం బగుపూరిబొమ్మ
ఖాతి నేతెంచె జీమూతకేతుఁ డటకు. 233

వ. ఇట్లు చనుదెంచి యట గురుజనప్రాణభయాకులుం డైనెత్తుట జొత్తిల్లిన యురగ కుమారునిమీఁద నొరగిన కుమారుప్రోల వాలి. 234

సీ. ఓయయ్య మీబావయును నీవు నాడుచు
నున్నార లని నమ్మి యుంటిఁగాక[1]
దవ్వేగనిత్తునే [2]తడసిన రానైతిఁ
గుణరత్న మౌ నిన్నుఁ గోలుపడితి
రాజ్యంబు విడిచి యరణ్యంబుఁ జేరియు
నీసేవ సౌఖ్యంబు నెగడఁగంటి
సద్భక్తిసేయవే సరగున నోయన్న[3]
చెడుగుఁబాములకేల జీవమీయ

ఆ.వె. గరుడనఖముఖాగ్రఘాతంబునకుఁ జొరఁ
బూనె మెత్తనైన మే నదెట్లు
మాకు దిక్కుఁగలరె యోకరుణాకర
చీఁకు చేతికోల చిన్నికుఱ్ఱ.[4] 235

వ. అని పలవరించుచు మేనంటి చూచుచుండఁ గనకవతియుం గనుఁగవ నశ్రుపూరంబు తోరంబుగాఁ బెదవులు దడుపుచు మొగము వెలవెలం బుచ్చుచుఁ గోదలిం గూడి గోడాడుచు. 236

సీ ఓతండ్రి యందఱ నొక్కపెట్టునఁ జంపఁ
గడఁగితి వొకపాముఁ గావఁబూని

---

1. నున్నారటంచు నేనుంటిఁగాక. 2. ధర్మైకనిరత- 3. సద్భక్తిసేయ వేసరితివో యోయన్న. 4. చెఱుకు చేతికోల చిన్నికూన.

ధనకనకాదులు తనియ నిత్తురు గాక
ప్రాణంబు లొసఁగెడుప్రభుఁడు గలఁడె
తనతల్లికడుపు చల్లన చేసికొన నోపి
శంఖచూడుఁడు నీకుఁ జా వొనర్చెఁ
జీఁకువట్టినకోల యీకుమారుం డని
గరుడుని కేలొకో కరుణలేదు

ఆ వె. దైవమేల యిట్లు దలఁచె నే నెట్లోర్తు
నేమి సేయుదాన నెందుఁ జొత్తుఁ
బాసి యేఁగఁ దగునె మూసినముత్తెమ
పంజరమ్ముచిలుక పసిఁడిబొమ్మ. 237

క. మలయవతిమీఁదిప్రేమము
మలయించెనె దైవ మిట్లు మ మ్మొడచేసెం
బలుకొకటి బ్రాఁతి చిలుకల
కొలికీ నాచందమామకూనా నీకుఁజా. 238

వ. అని విలాపింపంగఁ బ్రాణహానికి శంకించెద రని తన ప్రాణంబులు చిక్కఁబట్టి యల్లన కనువిచ్చి జననీజనకులం జూచి. 239

క. గురులార మీరు నాకై
పురపురఁ బొక్కంగవలదు భువి "ధర్మస్య
త్వరితాగతి" యనుపలుకునఁ
బరహిత మొనరింపఁ గంటి బ్రదు కిది గాదే. 240

ఉ. అస్థిగృహంబు దేహము దురాశలఁ జిల్లులు వోవఁ స్రుక్కి రో
గస్థితిఁ జిక్కి చచ్చు టధికం బగుమోసము గాక, దానిలో

నస్థిర మైన|ప్రాణమున నగ్గువ[1] మిక్కిలిగా జగంబునన్
సుస్థిర మైనకీర్తిఁ గొన జూచిన లాభమునం గొఱంతయే 241

వ. కావున వగ పుడిగి నాగకుమారు నాకుమారుగాఁ దలంచుకొనుం డని సా
యాసకృతాంజలి యై యంత్యప్రణామం బొనరించిన సవినయానతుం డై
వినతాసుతుం డోకుమారచంద్రా నాయజ్ఞాననిద్ర దొలంగె నీధైర్యసాహ
సపరోపకారగుణంబులం బరిణమించితి నా కేమిహితం బానతిమ్మనివ.

క. దయసేయుము పాములపై
భయభీతులఁగావు ధర్మపథమునఁ జను ని
శ్చయ మిది దురితము దీనను
లయ మగు నుదకమునఁ బడ్డలవణముభంగిన్. 243

క. అని చెప్పి శంఖచూడా
వినుమా గురుజనులసేవ విడువకు మిఁక నీ
జనని కడు బెగడకుండఁగఁ
జనుమీ యని పలికి హృదయజలజములోనన్. 244

క. రుద్రునిఁ దలఁచుచుఁ గీర్తిస
ముద్రుండు పరోపకారమున నలసిన యా
ముద్ర తన మేనఁ దోఁపఁగ
నిద్రించినగరణి దీర్ఘనిద్రం జెందెన్. 245

వ. అంతం దత్సహచరీసహితు లయిన జననీజనకులు తమ యురోముఖశిరో
ఘాత హాహాకారమహారావంబులు మలయగహ్వరంబున నుపబృంహితంబు
లై దిక్కులుపిక్కటిల్ల బిట్టేడ్చుచు మూర్ఛిల్లుచు నుభయకృతోపచారంబు
లఁదెలియుచు నలయుచుఁ బలవరించుచు. 246

---

1. అన్నువ, అధృత.

ఆ.వె. పురము ధనము రాజ్యభోగంబు విడిచియు
మమ్ముఁ గలసి యిచట మాయనుజ్ఞ
నబలఁ గూడి పిదప నందఱఁ బాసి నేఁ
డొంటి నేఁగ నీకు నుచిత మగునె. 247

వ. అనవుడు ననుగమనోద్యోగ గావున మలయవతీకన్య ధైర్యం బవలంబించి.

క. ప్రాణము కొఱకై యితరుల
ప్రాణము దినుచుండు వాని ప్రాణము గావం
బ్రాణం బేడఁబాసిన నా
ప్రాణేశుం డిపుడు మనలఁ బాయుట యరుదే. 249

క. మనకుండుట యి ట్లెఱిఁగియు
మన కుండుట తగునె యితనిమార్గంబున నా
మనమరిగెడు గతిఁదడయక
మన మరిగెడు తెఱఁగుఁ గనుఁడు మఱి వగపేలా. 250

ఆ.వె. అనిన శంఖచూడుఁ డందఱచావుల
కేన మూల మైతి నితనివెంట
నరుగువాఁడ ననిన నాదికారణ మేన
మున్న సత్తు ననియెఁ బన్నగారి. 251

క. నావుడు మీ కిందఱకుం[1]
జావం బనిలేదు సుతునిజాడనె యేఁగం
గావలయుం జితి వేగమె
కావింపుము శంఖచూడ కడుఁ బుణ్య మగుఁ. 252

ఆ.వె. అనుడు నభముఁ జూచి యమరవర్గములార
ఘనపరోపకారమునకు మెచ్చి

1. కిద్దఱకుం.

యమృత మైనఁ జల్లి యన్న ప్రాణంబులు
గావరయ్య మమ్ముఁ బ్రోవరయ్య. 253

వ. అని జననీజనకులు (క్రమంబున) వేఁడినఁ దజ్జీవనోపాయం బెఱింగి విహగేంద్రుం డింద్రుం బ్రార్థించి యమృతంబుం దెచ్చి యిచ్చుట విపన్నంబు లగు పన్నగంబుల తోడ నిప్పన్నగకుమారరక్షకుం గాచెద నని పూని. 254

ఉ. పోయుదుఁ బ్రాణము ల్మగుడఁ బూనిక దప్పిన మేరు వబ్ధిలోఁ
ద్రోయుదు నెల్లదేవతలఁ దోలుదు నాకముఁ బట్టి పాడుగాఁ
జేయుదు నష్టదిక్పతులఁ జెండుదు మేదినిఁ గ్రింద మీఁదుగా
వ్రేయుదు వీనిపై నమృతవృష్టి వడిం గురియింతు నింతటన్. 255

క. అని గరుడుఁ డెగసి యేఁగినఁ
దనయునిదెసఁ జూడలేమిఁ దడయక ఫణినం
దనుచేత ఖచరసతి చం
దనచితు లొనరించు కొనియెఁ దత్పార్శ్వమునన్. 256

వ. అంత నత్యంతసతీమండనంబులు గైగొని మలయవతి పతిచితికిం బ్రదక్షిణంబు గాఁ దిరుగుచు గౌరి నుద్దేశించి. 257

క. ఓయంబిక యుత్తముఁ డధి
కాయువు విద్యాధరేంద్రుఁ డగుఁ బతి యనుచు
న్నాయుద్యోగం బుడిపితి
నీయానతి దప్పె నింక నిన్నేమందున్. 258

క. అని దూఱఁగ ముందఱఁ గాం
చనలతగతి మెఱుఁగుదీఁగ చాడ్పునఁ గాత్యా
యని వచ్చి పుత్రినిలునిలు
మని తత్పతిమీఁదఁ జేతియమృతము చల్లెన్. 259

క. చల్లిన సంజీవితుఁ డై
యల్లన సుఖనిద్ర దెలియునను వున నతఁ డు
త్ఫుల్లముఖుం డై గజముఖు
తల్లికిఁ బ్రణమిల్లెఁ దల్లిదండ్రులుఁదానుఁ. 260

క. మగలకు మగఁ డగుమరునిం
దేగఁ జూచిన శివునిదిక్కు దృక్కుల నిడి యా
మగతనము సగము చేసిన
మగువా మాపాలఁ గలిగి మన్నించితివే. 261

వ. అని యందఱు నానందంబున వందనం బొనర్ప మలయవతి కృతాంజలి యై

క. గరళము మ్రింగినపతికి
న్మరణముఁ దప్పించి మెఱయు మంగళసూత్రా
భరణము గలదేవత వని
పరిచర్య యొనర్చినట్టిఫల మిటఁ గంటిఁ. 263

క. అనిమ్రొక్కఁగ దివిఁ దూర్య
ధ్వను లొలయఁగ సకలదేవతలుఁ గొనియాడ
న్వినతానందనుకతమున
ననిమిషకుసుమములతోడ నమృతము గురిసెఁ. 264

క. ఆయమృతంబున నస్థిని
కాయము సప్రాణ మైనకాయంబుల న
త్యాయతఫణమణిరుచి సము
దాయము మెఱుఁ గిడఁగ నెగసె దర్వీకరముల్. 265

క. చెలులుం జుట్టలుఁ గలయం
జెల రేఁగి సుధాంబుపూర్తి చెలువునఁ బాముల్

చెలఁగుచు మలయాచలమున
సెలయేఱులభంగి జలధిఁ జేరఁగఁ బాఱెన్. 266

ఆ వె. అంత నమరసిద్ధయక్షగంధర్వులు
గొలువ గగనతటిని జలకమార్చి
సిరులు మిగుల గౌరి జీమూతవాహను
ఖచరచక్రవర్తిగా నొనర్చె. 267

వ. అట్టియెడ నత్యంతసంతుష్టాంతరంగుం డై గరుత్మంతుండు చనుదెంచి నీకెద్దియిష్టంబు వేఁడు మనిన నక్కుమారుం డురగహరణం బుడిగి దృఢప్రతిజ్ఞుండవుగమ్మిం తియ చాలు నీప్రసాదంబున నాకేమియుం గొఱంత లేదు. 268

క. అనదలఁ గాచితి నాగరు
జనముల ప్రాణములు నిలిచె సర్వేశ్వరిమ
న్నన గలిగె నీవు మెచ్చితి
విను రాజ్యం బబ్బెనేమి వేఁడెద నింకన్. 269

చ. అని వినయోక్తిఁ బల్కి జగదంబికఁ గ్రమ్మఱఁ బ్రస్తుతించి య
జ్జననికి మ్రొక్కి యిష్టజనసంగతుఁ డై చని తొల్లి యున్నకాం
చనపురిఁ జొచ్చి రాజ్యసుఖసంపదఁ దేలుచునేలుచుండెన
వ్వనితయు దాను నాత్మగురువందననందితచిత్తవృత్తియై. 270

వ. కావున నట్టిపరోపకారశూరుం డెవ్వఁడు గలఁడు. 271

ఆ వె. వింటి మతనిఁ దొల్లి కంటి మీతని నేఁడు
వింధు మిప్పు డొక్కవిక్రమార్కు
ననిన నతనివనిత దనుజేంద్ర విక్రమా
దిత్యుఁ డీతఁ డొక్క తెలియు మనియె. 272

వ. నావుడు నారక్కసుం డోనరోత్తమ నీ వడిగినవరం బిచ్చితిఁ బుణ్యపురుషుండవు బొంకకు నీ వెవ్వండ వనిన నవ్వసుమతీవల్లభుండు పూర్వదేవుండవు నీ వెఱుంగవే విక్రమార్కుండ నగుదు నాచరిత్రంబు జనులెఱుంగకుండఁ గృప చేసి శాంతుండవు గమ్మని మ్రొక్కి తదనుజ్ఞాతుం డై యజ్ఞాతభావంబున మగిడి నిజపురంబగు నుజ్జయినీపురంబునకుం జనుదెంచెం గావున. 273

క. ఇట్టిగుణంబులు నీ కే
పట్టున సమకూరకునికిఁ బార్థివ చను మి
ట్టట్టును బొరలకు మనవుడు
దిట్టతనం బుడిగి వసుమతీపతి మగిడెన్. 274

—: పండ్రెండవబొమ్మ కథ :—

వ. మఱియుం గొన్నిదినంబు లరిగిన. 275

క. కంబూపమగళ మృగమద
జంబాలీకృతమహావిషద్యుతిసదృశ
స్తంబేరమచర్మాంబరు
లంబోదరగురుఁ గృపావలంబునిఁ గొలుతున్. 276

చ. అని మదిలో దలంచుచు ధరాధిపుఁ డిష్ట జనోపదిష్టమౌ
దినమున నెక్కఁ బూని యరుదేరఁగ నచ్చటిబొమ్మ చూచి యో
జనవర విక్రమార్కుగతి సాహసదానగుణంబులేక నీ
కెనయఁగ దేవతాసనము నెక్కఁగవచ్చునె[1] నిల్వు నావుడున్. 277

క. అతనికడ నట్టిసాహస
వితరణగుణ మెట్లు చెల్లె వినిపింపు మనం

1. యెత్తున నమరాసనంబు వెసఁ ద్రొక్కఁగ వచ్చునె.

బతిగుణములు పండ్రెండవ
ప్రతిమ యెఱింగింప భోజపతి కి ట్లనియెన్. 278

మ. విను మావిక్రమభూషణుండు విమలోర్వీనాథసందోహత
ర్జనసంపన్నజయాభిరాముఁడు సదాచారప్రచారోచితా
త్మనయప్రాభవధర్మనందనుఁడు విద్వత్పాలనాకేళిసం
జనితానందుఁడు సాగరాంతముగ నీక్ష్మామండలం బేలఁగన్. 279

ఆ.వె. అతనివీట నర్థపతి కెనయగు భద్ర
సేనుఁ డనఁగ నొక్కసెట్టి గలఁడు
వాని కొకఁడు గలిగె దానసుందరుఁడు పు
రందరుం డనంగ నందనుండు. 280

క. ఆకోమటి కడపటఁ బర
లోకమునకుఁ జనిన నర్థలోభ ముడిగి సు
శ్లోకుండు పురందరుఁ డీ
లోకము గొనియాడ దానలోలుం డయ్యెన్.[1] 281

క. అతని దగువ్యయముఁ గనుఁగొని
హితు లందఱు వచ్చి బుద్ధి యిదిగాదుచిత
స్థితినడువు మహౌదార్యో
న్నతి దారిద్ర్యంబు వచ్చు నరపతి కైనన్.[2] 282

ఆ.వె. ధనము గలుగువాఁడె ధన్యుండుమాన్యుండు
ధనముగలుగువాఁడె ఘనుఁడుజగతి

---

1. క. ఆకాశసాగరాంతర...... శ్లోకుఁడు పురందరుండీ, లోకము గొనియాత దానలోలుం డయ్యెన్. 2. సమున్నతి ధనమునఁ జొప్పడు హీనత దారిద్ర్యమునవచ్చు.

ధనము గలుగువాఁడె తగవులకాధ్యుండు
ధనముగలుగువాఁడె మనుజవిభుఁడు. 283

ఆ.వె. ధనము గలిగె నేని ధర్మార్థకామమో
క్షముల నచట నచట జరుపవచ్చు
ధనముగలుగువేళ జను లెల్లఁదమవారు
ధనము లేనివానిమనికి చావు 284

మ. అని చెప్ప న్విని యప్పురందరుఁడు గర్వాక్రాంతుఁడై నవ్వి యి
ట్లనియెన్ దానము భోగముం దగవుఁ జేయం బాడి గాదేని యా
ధన మేలా మఱి లాభ మేల సుఖికిన్ దారిద్ర్యమే మేలు నాఁ
జనదే మర్త్యుఁడు మంటిపాలయిన నేసౌఖ్యంబు భోగించెడున్. 285

క. మును దనకుం గానున్నది
పనివడి యగు నారికేళఫలరసముక్రియం
జనునున్నది చనుఁ గరి గ్ర
క్కున మ్రింగిన వెలఁగపండుగుంజును బోలెన్. 286

క. తొడఁ గట్టఁ బూయఁ బెట్టం
గుడువం జెప్పదురు గాక గొనకొని గడియం
జెడియెడి బ్రదుకున కిడుమం
బొడివోసికొనంగఁ జెప్ప బుధులుం గలరే.[1] 287

చ. అనుచు ననాదరంబున నిజాప్తుల దూఱి యుదారబుద్ధిఁ జం
దనమృదుపుష్పవస్త్రవనితాపరిభోగవిషక్తచిత్తుఁ డై
యనుదినమున్ ధనంబుఁ గలయ న్వెదచల్లుచు నొయ్యనొయ్య ని
ర్ధనదశ నొంది వంది యనుతాపము నందుచుఁ గంది కుందుచున్. 288

---

1. బుద్ధులు గలవే.

క. మురిసినయూరనె కడపటఁ
దిరియుట యది సచ్చు టనుచు ధృతిమాలి పురం
దరుఁ డొకనెపమున దేశాం
తర మరిగెన్ మిత్రు లెల్లఁ దను నవ్వంగన్. 289

వ. ఇట్లరిగి. 290

ఉ. అక్కడ నక్కడం గల నయంబుఁ బ్రియంబు సువస్తుజాతముం
జక్కనికాంతల న్రతిరసజ్ఞులఁ జూచుచు నాదరంబుతో
నొక్కొకయూరఁ గర్ణనయనోత్సవలీలల నిచ్చ మెచ్చుచుం
బెక్కుదినంబు లుండెఁ దనపేరు నిజాప్తు లెఱుంగకుండఁగన్. 291

క. ఒకనాఁడు మధురలోపల
నొకచోద్యం బెఱిఁగి మగిడి యుజ్జయినీభ
ర్తకు విన్నవింతు నని[1] యిం
చుక రవణముతోడ వచ్చెఁ జుట్టలు పొగడన్. 292

ఉ. వచ్చినవానిఁ జూచి జనవల్లభుఁ డీవు చరించు భూమిలో
నచ్చెరు వేమి గంటి వని యానతి యిచ్చిన నప్పురందరుం
డిచ్చకు వచ్చున ట్లడిగె నీధరణీవరుఁ డంచు నాత్మలో
మెచ్చుచు విన్నవించెఁ బతిమె చ్చొనఁగూడ యథాక్రమంబునన్. 293

సీ. ఈపురి వెడలి యే నెల్లతీర్థంబులుఁ
దిరుగుచుఁ గేదారధరణి కేఁగి
మగిడి వచ్చుచు హేమమణిమయప్రాకార
రమ్యమౌ మధురాపురంబుఁ జూచి
చని యొప్పిదం బెల్లఁ గనుఁగొని రేయొక్క
ద్విజునింటిపొంత నిద్రించునప్పు

1. వినిపించెదనని.

ధనద ననాథ నిరాధారఁ గావరే
యనుచు పీతెంచె నార్తారవంబు[1]

ఆ వె. దాని కుల్కి మిగుల దయ గలియును లావు
లేమి యేమియు ననలేక యుండి
రేపకడన లేచి యాపురజనుల న
య్యబలవార్త దెలియ నడిగి వింటి. 294

వ. ఎట్లనిన. 295

క. చెల్వొనరెడు పురి చేరువ
బిల్వవనాంతమున రేయి భీమాకృతితో
నిల్వలనిభుఁ డొకదనుజుఁడు
చెల్వం బెనుకశల మొత్తి చెండుచు నుండున్. 296

క. ఆపొలఁతుక రేయెల్లను
వాపోవుచునుండ నసుర వారింపంగా
నోపరు పరు లెవ్వరుఁ బృ
థ్వీపాలక యేను విన్న తెఱఁగిది చుమ్మీ.[2] 297

ఉ. నావుడుఁ జోద్యమంది నరనాథుఁ డనాథఁ గృశాంగి నంగనం
గావఁ గడంగి హస్తమున ఖడ్గము తోడుగ సెట్టిఁ గూడి యా
త్రోవన యేఁగి దూరగతి దోఁపఁగ నల్లన నొక్కనాఁడు ల
క్ష్మీవిభవాఢ్య మౌ మధురఁ జేరె నినుం డపరాద్రిఁ జేరఁగన్. 298

క. మలయుచు నెయ్యేడఁ గలయం
దెలివిపడ న్వెలిఁగి భువనదీపము చనినన్

---

1. మహార్తరవము- చి. సూ. 2. బృథ్వీపాలక దీనికతము దేవర యెఱుఁగున్.

మలినాకృతితోఁ గాటుక
మలక[1] క్రియనున్నభము తిమిరమయ మై పొలిచెన్. 299

ఆ.వె. అప్పు డధిపుఁ డాపురాంతికవనభూమి
యమున పగిదినున్న తమముఁ జూచి
వైశ్యతనయ వెఱవ వల దని తెలుపుచు
నచట నసురరాక యరయుచుండె. 300

ఆ.వె. వాలుఁగంటిమొఱ్ఱ వాలాయమగు నాన
వాలుగాఁగఁ జీకువాలు సొచ్చి
వాలు పెఱికికొనుచు వాలుమగం డేఁగె
వాలు దైత్యునుదుటి వ్రాలు దుడువ. 301

క. ఈరీతిఁ గాచియుండఁగ
నారాక్షసుఁ డంత నంగనామణి మొత్తం
గా రావము వినవచ్చిన
నారాజును నాలకించి యతిరభసమునన్. 302

క. వెఱవకు వెఱవకు తరుణీ
మొఱ యాలించితి[2] నృపాలముఖ్యుఁడ నీకై
పఱతెంచితిఁ బరిపరిగాఁ
గఱకు టసుర(జెండివైతుఁ[3]గాచెదనిన్నున్. 303

వ. అని. 304

శా. ఓరీరాక్షస వట్టిగర్వమున నీ వుప్పొంగి దీనానన
న్నారీరత్నము నేల నొంచె దిటు లన్యాయంబు గావింతువే

---

1. కాటుకమలక=మసిమూఁకుడు. 2. మొఱగగు వచ్చితి. 3. టసురనిపు డెచెండి.

యేరా చెప్పఁగనైన మున్నెఱుఁగవే యే విక్రమార్కుండ నీ
క్రూరత్వంబును దర్పము నృపలిమియు న్నూపార్చెద న్నిల్వుమా. 305

క. అనవుడు రోషంబున ని
ట్లను మాయాబలసమగ్రుఁ డగుదుందుభికి
న్మనుమఁడ నోరి నరాధమ
ఘనభుజదర్పుఁడఁ గఠోరకరుఁడం జుమ్మీ. 306

క. ఆలమునఁ బంద[1]పగతుల
నాలం బొనరించినట్టు లాడెద విటు నా
పాలం బడితివి[2] నేఁడు నృ
పాలాధమ నిన్ను భూతబలి గావింతుఁ. 307

క. నీకొలఁదివారియెముకలు
నాకోఱలసందిఁ జిక్కె నలుతునుసీ వే
లోకము సొచ్చిననైననుఁ
జోకార్చెద నిన్నుఁ బదరి[3]పోవక నిలుమా. 308

వ. అనిన వీరరసభీషణంబులగు భాషణంబుల విక్రమభూషణుండును దోర్దం
డమండితారాతి రాజమండలదండితప్రచండ భుజాగ్రమండనాయమాన
మండలాగ్రధరుం డగుచు నద్దండిమగ లొండొరులందలంపడి. 309

క. మదకరులకరణి సింగపుఁ
గొదమలక్రియఁ బులులభంగి గురుపోతులప్ర
ల్లదముల[4] శరభంబులగతిఁ
గదిసిరి కదనమున కవని గ్రక్కదలంగ. 310

ఉ. బంధురవిక్రమస్ఫురితబాహులు దైత్యుఁడుఁ బార్థివుండుఁ గ్రో
ధాంధత మీఱి పోరిరి దశాననుఁడు న్రఘునాయకుండు న

1. ఆలమునఁబడిన. 2. నాపాలునఁబడితివి. 3. బెదరి. 4. బెట్టిదమున.

య్యంధకుఁడుఁ హరుండు నరకాసురుఁడు న్నలినాక్షుడుఁ న్జరా
సంధుఁడు వాయుసూనుఁడును జంభుఁడు నింద్రుఁడుఁ బోరుకైవడిఁ. 311

వ. ఇట్లు పోరునెడఁ బ్రభాతం బైనఁ దత్కాలోచితంబుగ. 312

క. క్రందఱి తనతేజమునఁ[1] బు
రందరుదెసఁ దెలివిగలుగ రాత్రించరునిఁ
బ్రమందించె విక్రమార్కుఁడు
సుందరి ముఖపంకజమున సొంపు నటింపఁ. 313

ఆ.వె. మండలేశ్వరుండు మండలాగ్రంబున
దండి మిగులఁ గలిగి దండిదైత్యుఁ
జెండి పాఱవైచి చండాంశువిధమున
నుండెఁ గండ లుర్విఁ గుండుకొనఁగ.[2] 314

ఆ.వె. దిశలఁ దెలివి గలిగె దివ్యతూర్యంబులు
చెలఁగె నారదుండు మలసి యాడె
నాకసమున నిల్చి యమరవర్గము జన
విభుని మీఁదఁ బుష్పవృష్టి గురిసె. 315

ఆ.వె. నృపుఁడు సంతసిల్లి నీరజాననఁ జూచి
పడఁతి యిట్లు కొట్టఁబడఁగ నీకు
నేమికతము దీని నెఱిఁగింపవచ్చు నేఁ
జెప్పు మనిన వినతి చేసి పలికె. 316

ఆ.వె. వసుమతీరమణ యవంతిదేశంబులో
ధర్మశర్మ యనఁగఁ దగినవిప్రు
భార్య, గాంతిమతి నకార్యంబు గావించి
కులము చెఱిచి మిగుల గుఱుచనైతి.[3] 317

---

1. కెందలిరుతేజమునను. 2. మెండుకొనఁగ. 3. కులముచెడితి మిగులఁ గుటిలనైతి.

ఉ. భవ్యుఁడు ధర్మశర్మ తనబాంధవవర్గము చెప్పఁగా మదీ
యవ్యభిచార మల్లెఱిఁగి యాత్మఁ గలంగియు కామినీ నహం
తవ్య[1] యటంచుఁ దెంపుడిగి దానవుచేతికశాహతి న్నరీ
రవ్యథఁ గుందుచుండు బహురాత్రులు నీ వని శాప మిచ్చినన్. 318

క. వడవడ వడఁకుచు మానము
సడలఁగ ధరఁ జాఁగి మ్రొక్కి శాపావధి యె
న్నఁడు నాకుఁ గలుగు ననుచుం
దడవోర్వమి విన్నవింప దయతో నతఁడున్. 319

క. అసహాయశూరుఁ డగునొక
వసుధాపతి వచ్చి రేలు వగఁబెట్టెడున
య్యసురుఁ బొరిగొన్న యప్పుడ
వెస నీశాపమునకెల్లవీడ్కో లనియెన్.[2] 320

శా. ఆశాపంబున నీనిబారిఁ బడి దేహం బెల్ల మ్రందంగ న
య్యాశాబంధముపేర్మిఁ బ్రాణములఁ బాయంజాల కే నుండఁగా
నీశస్త్రప్రభ నాతమం బడఁపి వన్నించెం గృపం జూడు భూ
మీశాధీశ్వర ! నీకు మే లొకటయేనిచ్చోటఁ గావించెదన్. 321

సీ. ఇక్కడి గుడితూర్పు దిక్కునఁబక్కిచె[3]
ట్టున్నది దానికి నుత్తరమునఁ
[4]బరువెఁడు దవ్వన బరివెంక పడుమటి
నెలవునఁ దొమ్మిది నిధులమీఁటి
దనుజుఁడు దాఁచిన ధనము పెక్కున్నది
కైకొమ్ము నామీఁదఁ గరుణసేయు

---

1. ఇంతిదా నహంతవ్య- 2. వెసనీపాపమున కదియెపీడ్కోలరయన్.
3. పరికెచెట్టు- (బరివెంకకుఁ బక్కి నామాంతరము. పరికె వృక్షవిశేషము.)
4. పరువుదవ్వన-

చనియెద నని (మ్రొక్కి వనిత యేఁగిన రాజు
వెఱఁగంది యిక్కువ వెదకి కాంచి
ఆ.వె. దీనుఁ డైన భద్రసేనతనూజున
కిచ్చి వేడ్క మగిడి వచ్చెఁ బురికి
నిట్టిగుణము లేక యిది యెక్కవచ్చునే
బొమ్మ్మ చాలు నింక భోజరాజ. 322

క. అనవుడు నంతకు నంతకు
విన నింపగు నతని తెంపు విని సభ యెల్లన్
మన మలరఁగ నవమానం
బును[1] సిగ్గును ముడివడంగ భోజుఁడు మగిడెన్. 323

శా. అక్షీణప్రతిపక్షభావసముదగ్రాటోపజాగ్రన్మనో
రక్షోనాయకపక్షతక్షణవిహారక్షిప్త కౌక్షేయకుం
గుక్షిన్యస్తసమస్తలోకభరణక్షుణ్ణాక్షయాత్మావృతి
ప్రక్షేపోచితు వాహనీకృతమహాపక్షీశు లక్ష్మీశునిన్. 324

శా. ఉల్లాసోద్ధతచండతాండవవిహారోత్తుంగరంగజ్జటా
వల్లీమండలమల్లికాకుసుమభావప్రాప్తబాలేందుసం
ఫుల్లేందీవర రేణుసంగకబరీభూతాభ్రకూలంకషా
కల్లోలోపరిబిందుమౌక్తికమయాకల్పోత్తమాంగున్ శివున్. 325

మాలిని. ధరణిధరవిభూషా ధర్మనిర్మాణతోషా
సరసిజభవసేవ్యా సంతతాత్మీయభావ్యా
నిరుపమనిజలీలా నిత్యకళ్యాణశీలా
పురహరహరిరూపా భుక్తిముక్తి స్వరూపా. 326

1. ననురాగంబున.

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాదిబిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్ర మహారాష్ట్రభూపాలరూపనూపురసుందరచరణారవింద సనద ప్రోలి పురవరాధీశ్వర వెలనాటి పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్యపుత్ర హరితసగోత్రపవిత్ర సకల సుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బైనసింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కు మహౌదార్యంబును జీమూతవాహనోపాఖ్యానంబును సాహసాంకునిసాహసౌదార్యంబులును నన్నది పంచమాశ్వాసము.

—▭—

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## షష్ఠాశ్వాసము.

### —* పదుమూఁడవ బొమ్మకథ *—

క. శ్రీకరుణారసమయ విభ
వాకరనయనద్వయప్రభాసితు ఘనసా
భీకమలస్థితనుతు విను
తాకారు వికారదూరు నఖిలాధారున్.

క. మనమునఁ దలఁచుచు భోజుం
డనువగు లగ్నమున నెక్క నరుదేరఁగ నా
సనపాంచాలిక నిలునిలు
మని జనులకు నెల్ల విస్మయంబుగఁ బలికెన్.

క. సత్వము సాహసమును దా
తృత్వమ్మును విక్రమార్కు తెలుఁగునఁ గనకే
సత్వరగతి నరుదేరఁ బ్ర
భుత్వము ఘన మౌనె యతని బురుడించెదవే.

క. మదిఁ దలఁచి చూడు నావుడు
విదితంబుగఁ దద్గుణములు వినిపింపుము స
మ్మద మొదవ నిచట ననినం
బదుమూఁడవబొమ్మ భోజపతి కి ట్లనియెన్.

ఉ. ఖండితవైరిమండలుఁ డఖండపరాక్రమదర్పశాలి యా
ఖండలవైభవుండు త్రిజగద్భరితామలకీర్తిచంద్రికా
మండితమండలాగ్రుఁడు సమగ్రజయాస్పదబాహుయుగ్ముఁడై
చండతరప్రతాపుఁ డగుసాహసభూషణుఁ డుర్వి యేలుచున్.

ఆ.వె. ఆఱునెలలు గడపి యంత దేశాంతర
మరిగి వనము లూళ్ళఁ దిరుగుచుండి
కనియె గంగపొంత జనమేజయుం డను
ధర్మశాలి దైన ధర్మపురము.

క. ఆయగ్రహార మొయ్యన
డాయఁగ మాపైన నొక్కటన్ ద్విజునింటన్
రేయుండి రేపకడ నది
తోయంబులఁ గ్రుంకఁ జనుచు ధూర్జటిఁదలఁచెన్.

ఉ. కాముని గాల్చి బూడిదను గంధముగాఁ గొని యెద్దు నెక్కుచుం
బాములుఁ దోలు నెమ్ములుఁ గపాలములుం దనమేని సొమ్ముగా
గాములఁ గూడి యాడుచును గాడు గృహంబుగ నున్నవాఁడు గం
గామృత మౌఁదలం జిలికి నంత సదాశివుఁ డయ్యె నెల్లెడన్,

క. అనుచుం గనుఁగొనెఁ గృతముని
జనసంగన్ ద్విజసురంగఁ జపలతరంగన్
ఘనకంకణలసదంగన్
జనితామితదురితభంగ జాహ్నవి గంగన్.

వ. కని మ్రొక్కి శుచియై సచేలస్నానంబు సేయుచు.

క. మలినుఁడు మై గడఁగిన ని
ర్మలుఁ డౌ టది చెల్లు లోకమాతా! నీలో

దలఁ దడిపినఁ జలి లే దని
వెలయుట యాహారునినుదుటివేఁడిమిఁజుమ్మీ.

ఆ.వె. ఒకనియడుగుఁ జేరి యొకనియౌఁదల యెక్కి
యొకనివెంటవచ్చియొకనిఁగలసి
వెడలి పాఱి తనుచు విందు మట్లయ్యునీ
జీవనంబు లోకపావనంబు.

వ. అని కొనియాడుచున్ జలకమాడి శివార్చన దీర్చి సూర్యునిం
పునఁ బ్రణుతించి యూరిదెసఁ బోవఁగ వీనుల కెల్లఁ దేనియల్
చినుకఁ బురాణవాక్యములు చెప్పెడివిప్రుని జూచి యమ్మహా
జనసభఁ జేరి మ్రొక్కి సరసస్థితితో వినుచుండ నయ్యెఁదన్.

ఆ.వె. దానధర్మములకుఁ బూనక తనపొట్ట
నినుపుకొనఁ దలంచు జనుఁడె పశువు
పసరమైనమెఱుఁగు బండియీడుచుదున్ను
నంతకంటెఁ గష్టుఁడండ్రు బుధులు.

క. వదనము ప్రసాదసదనము
హృదయము సదయంబు మాట లింపుల తేటల్
మెదలుట మేలునఁ బొదలుట
సదమలవర్తనుల కివియ సహజగుణంబుల్.

క. సురలకు ధరణీసురులకు
హరిహరులకుఁ బ్రియ మొనర్చుయాగము లెల్లన్
సరిగూర్చి యెత్తుచోటను
శరణాగతరక్షణంబు సరిగా వెందున్.

చ. అని చదువం బురాణవచనార్థము సత్యముగా నెఱింగి స
జ్జనులు మనంబులోనఁ గడు సంతమందుచు నుండఁగా భయం

బున మదిఁ దల్లడిల్లుచును బొబ్బలు వెట్టుచు నొక్కవృద్ధకా
మిని పఱతెంచి వారల సమీపమున న్మొరచేసి యేడ్చుచున్. 17

ఆ.వె. పొలములోన జింకఁ బులి వట్టు కైవడి
వడి నెదిర్చి సంధ్యవార్చువేళ
గంగలోన మొసలి మ్రింగెను నాపతి
ననదఁ గావరయ్య యయ్యలార! 18

వ. అనుచుం బెదవులు దడుపుచు దీనవదనయై మ్రొక్కిన నక్కఱంబుగా నక్కా
మిని యక్కఱఁ జక్కఁబెట్టలేమి నక్కటా యనుచు నొక్కటియు ననలేక
విప్రజాతి గావున నొండొరులమొగంబులు చూచుచు నున్నెడ నిగుఱు
గప్పిన నిప్పు చొప్పున యప్పురుషరత్నం బప్పుడ దిగ్గున లేచి. 19

త. తల్లీ!యిఁక నుల్లంబునఁ
దల్లడ మందకుము మొసలితలఁ ద్రెంపుదు నీ
వల్లభు విడిపింతును నే
కల్లోలిని గలఁతు హల్లకల్లోలముగన్. 20

ఆ.వె. అనుచు నభయమిచ్చి యటఖడ్గసహితుఁడై
గంగఁజొచ్చి రాజపుంగవుండు
కొంకులేక యీఁదిఁ అంకెలు వేయుచుఁ
గడఁది మొసలిఁద్రుణముగాఁ దలంచె. 21

ఆ.వె. పిడుగుకంటె మిగుల బెడిదమౌ నడిదంబు
పూని డాసి వ్రేసి దానిఁద్రుంచి
యంటఁగోఱ లెడపి గంటి మంత్రించుచు
బడుగుబాఁపనయ్య వెడలనడిపె. 22

క. నిజనామము దలఁచిన నం
బుజనాభుఁడు వచ్చి మొసలిఁబొరిగొనికరుణన్

గజపుంగవుఁ గాచిన క్రియ
ద్విజపుంగవుఁ గాచి మనుజదేవుఁడు వెడలెన్. 23

శా. ఆవేళన్ జను లెల్ల నుల్లములఁ జోద్యం బందుచు న్మేలు మే
లీవీరాగ్రణి సాటిచెప్పఁ గలరే యేవీరు లైన న్భువిన్
దైవం బీతనిపాలఁ గల్గె నని వింత ల్గాఁ బ్రశంసింపఁగా
నావిప్రుండు నిజ ప్రియాసహితుఁ డై హర్షించి దీవించుచున్. 24

ఉ. సాహసికాగ్రగణ్య! రభసంబున నీ వరుదెంచి యమ్మహా
గ్రాహముఁ ద్రుంచి నన్నుఁ గృపఁ గాచితి దీనికి మాఱు మేలుగా
నీహిత మే నొనర్చెదను నీ వతిదుర్లభ మంచు దీని సం
దేహము లేక కై కొనుము దేవసమానుఁడ వీవు గావునన్. 25

క. ఓపురుషవర్య నేనొక
తాపసు దయఁ దొల్లి నర్మదాతీరమునన్
గోపాలమంత్రజపమున
నోపినక్రియఁ దపము సేయుచుండఁగ నాకున్. 26

వ. ఒక్కనాఁటి రాత్రి సుఖస్వప్నావసరమున. 27

సీ. మేఘంబు కడఁబొల్చు మెఱపుకై వడినున్న
పీతాంబరముదిండు బిగియఁగట్టి
తరుణాతపద్యుతి హరిచందనం బొప్ప
రవిభంగి నురమున రత్న మలర
యమునాజలమ్ముపై నమరునెత్తమ్ముల
తమ్ములౌ తెలిగన్నుఁదమ్ములమరఁ
గరిరాజుశిరమున ఘనరత్నఖచిత మౌ
దండచాడ్పునఁ బీలిదండ యమర

ఆ.వె. వన్నెలన్నియుఁ దనలోనివన్నెలనఁగఁ
గరుణఁబొడవైనరూప శృంగారమనఁగ
గోపికల మరులుకొల్పిన దీపులాఁడు
రమణఁగనుపట్టె గోపాలరత్న మెదుర. 28

వ. ఇట్లు సన్నిహితుం డై. 29

శా. ఆ దేవుండు మహాప్రసన్న వదనుం డై యాత్మలోనం గృపా
శ్రీదై వాఱఁగ నన్నుఁ జూచి తలఁపు ల్సిద్ధించు నీ కిప్పు డో
భూదేవోత్తమ నీజపంబును దపంబు న్నాత్మఁ గై కొంటి నే
నీదైవంబు ఫలంబు దీనికిఁ దగన్ నిర్మించి నీ కిచ్చెదన్. 30

వ. వినుము స్ఫటికసౌపానంబులును గనకఘంటికలును నింద్రనీల స్తంభం బులును మహారజత కుడ్యంబులును రమ్యహర్మ్యంబులును చీనాంశుకధ్వజం బును గుసుమితపర్యంతవనంబును విద్యాధరీగణంబును గామగమనంబును గలుగు దివ్యవిమానంబు దేహావసానసమయంబునఁ బ్రాపించు నని యాన తిచ్చి చనియె నట్టిఫలంబు నీ కిచ్చి కృతార్థుండ నయ్యెదఁ గై కొను మ నిన నమ్మనుజేంద్రుండు. 31

క. ఆత్యాతురుఁ డని నిను నా
నిత్యకృపావృత్తిఁ గాచి నిలిపితి గాకేఁ
బ్రత్యుపకారంబున కీ
కృత్యము సేయుదునె దీనికిం బ్రియ మేలా. 32

గీ. అనదఁ గాచుట కులవిద్యయంద్రుమాకు
రాజపుత్రుండనిదియ ధర్మంబుగాదె
నీకుఁజేసినమేలుగాఁగై కొనకుము.
క్షత్రియకులంబుభువి దానపాత్రమగునె. 33

ఉ. నావుడు విప్రుఁ డిట్టివచనంబుల నాతని విక్రమార్కుఁగా
భావములోపలం దెలిసి పార్థివశేఖర! నేఁడు నీ వవం
తీవిభుఁ డౌట నే నెఱిఁగితి న్మఱి యన్యుల కిట్టివిత్తము
న్గావును సాహసంబు శుభలక్షణము ల్వినయంబుఁ గల్గునే. 84

వ. ఇది కడుమేలు చేకుఱె నరేశ్వర! నిన్గనుఁగొంటి బ్రహ్మకున్
వదన భుజోరుపాదముల వర్ణము లుద్భవమందె నాల్గు చ
క్కదనమునందు విప్రులకు క్షత్రియజాతికి నొక్కవేళ మే
లొదవఁగఁ బెట్టుడుం గొనుటయుం దమలోపలఁ జెల్లువీర్వ్వరన్. 85

ఉ. ఈదురవస్థ కడ్డువడి హీనుని విప్రుని గాచె నంచు నీ
మేదినిలోనఁ గీర్తియును మేలుఁ దలిర్పదె విన్నవించుచో
నాదరణంబు సేయఁ దగదా సుకృతం బిది దుష్టదానమే
కా దననేల కొమ్మనుచుఁ గైకొనఁ బ్రార్థనచేసి యిచ్చినన్. 86

ఉ. కైకొని విప్రు వీడుకొని గంగకు భక్తి నమస్కరించి కం
ఠాకర వాలయోగవిధిదండ సమన్వితుఁ డై నృపాలుఁ డ
స్తోకమనః ప్రసాదమున జోగివిధంబున నంతనంత ను
త్సేకము లేక యేగి బహుదేశములుంగలయం జరించుచున్. 87

—: బ్రహ్మరాక్షసుని కథ :—

సీ. రుచిరసరోలంబరోలంబకలకంఠ
  కలకంఠ కులవృత కలకలంబు
బంధూకబంధుసౌగంధకగంధి ని
  కేతన కేతకీ కేతనంబు
పరిభూతభూత ప్రపంచాస్యనాగేంద్ర
  నాగేంద్ర నాగేంద్ర భోగభూమి

సేకసముత్సేక భీకరసూకర
కాసార కాసార భాసురంబు

సీ. చలపలాశపలాశరసాలసాల
తాలహింతాలశీతలోత్తాలతలము
మృగమృగాదనమృగనాభిమృగమయంబు
వింధ్యవనము సొత్తెంచె నవంధ్యబలుఁడు. 38

క. అక్కడఁ గడు దూరము చని
యొక్కెడనిలుచుండి దాహమొలయఁగ జలమే
దిక్కునఁ గానక చీకటి
నక్కజముగ నిండి శూన్యమగుగుడిఁగనియెన్. 39

క. శాశ్వతముగ నాముందఱ
నీశ్వరలక్ష్మీశభారతీశ్వరమయమై
విశ్వజనాశ్రయముగనొక
యశ్వత్థముఁ జూచి చేర నరుగఁగఁ గ్రిందన్. 40

క. వెడఁదమొగంబును గోఱలు
మిడిగ్రుడ్లును గుఱచ చెవులు మిడిమీసమ్ముల్
సుడిగొన్న వెండ్రుకలతో
సుడియఁగ నొక బ్రహ్మరాక్షసుం గనుఁగొనియెన్. 41

మ. కని నిశ్శంకుఁడు సాహసాంకుఁడు మహాకౌతూహలుం డై రయం
బున డాయం జని యిట్టి కాఱడవిలో భూతంబవై యున్కి యె
వ్వనిమూలంబున నయ్యె నెవ్వఁడవు సర్వంబుందగం జెప్పుమా
యనిన న్నివ్వెఱఁ గంది వాఁడు నిజవృత్తాంతస్మృతి న్నమ్రుఁడై. 42

క. ధరఁ గలపురాణముని వ్యా
కరణంబుల శాస్త్రముల నిగమములఁ గవితం

బరిణతుఁడ మాళవేంద్రుని
పురోహితుఁడ జన్మసంజ్ఞఁ బురుహూతుండన్. 43

గీ. అధిపుకొలువున నేఁ బరీక్షాధికారి
నగుటఁజేసియు నొకవిప్రుఁ దెగడి పుచ్చి
యట్టికీడున నిర్జనం బైనయడవిఁ
జచ్చి గతి లేక బ్రహ్మరాక్షసుఁడ నైతి. 44

క. ఈయెడ నే నుండఁగ నిదె
వేయేఁడులు చనియెఁ గీడు విడువదు బలిమిన్
నీయట్టిపురుషరత్నం
బీయలజడి వాపనోపు నీశ్వరుకరుణన్. 45

ఉ. నావుడు వానిదీనవచనంబులకుం గరుణార్ద్రచిత్తుఁ డై
భూవరుఁ డాత్మలోనఁ దలపోసి వినిశ్చయబుద్ధి నీయస
ద్భావముఁ బాపనోపెడు నెవంబుగఁ జిత్తమునం దలంచి నా
జీవము వేఁడినం గొఱఁత సేయక యిచ్చెద వేఁడు మియ్యెడన్. 46

చ. అనవుడు వాఁడు సంతసము నచ్చెరువుం గడుఁ బిచ్చలింపఁగా
మనమునఁ బొంగి పాపము క్రమంబునఁ బాయఁగ గంగలోన వి
ప్రునిఁదగ గాచి కైకొనిన పుణ్యము నీకడఁ గల్గఁబోలు నిం
పెనయఁగ ముక్తిమార్గమున నేగెద నాఫల మిమ్ము నావుడున్. 47

ఆ వె. బ్రహ్మరక్షణమునఁ బడసిన సుకృతంబు
బ్రహ్మరక్షకుండు భక్తి నొసఁగ
బ్రహ్మరాక్షసుండు బ్రహ్మమీఱినపరి
బ్రహ్మపదముఁ జేరి భవ్యుఁ డయ్యె. 48

క. నిష్పాపదేహుఁ డై గతి
నిష్పన్నం బైన నెగసి నెలఁతలు గొలువం

బుష్పాయుధసముఁ డై మణి
పుష్పకమున నుండి మ్రొక్కి పోయెన్ దివికిన్ 49

వ. ఇట్లతం దరిగిన తదనంతరంబ 50

శా. ధాత్రీపాలక శేఖరుండు నటఁ దత్కార్యంబు సంధిల్లఁగాఁ
జిత్రం బంది విదేశపర్యటన మీక్షింపంగ నాకున్ జగ
న్మైత్రీకారణ మయ్యె నంచు మది నానందించుచు న్గాఢచా
రిత్రుండై మగిడె న్యశంబు దిశలన్ రెట్టింప నుజ్జైనికిన్. 51

క. కావున నీకీగుణములు
లే వీజన్మమున నెక్కలే వీ వనినన్
భావం బెదలఁగ ధారా
భూవల్లభుఁ డంత నంతిపురమున కరిగెన్. 52

—: పదునాల్గవబొమ్మ కథ :—

వ. మఱియును గతిపయదినంబులు చనిన. 53

క. కదలనివిల్లును గాలిం
బొదలెడు నారియును నిద్రవోయెడుశరముం
బదనుఁడు జడముడియుంగల
ముదిజోదున్మొదలి వేల్పుముదమునఁ దలఁతున్. 54

క. అని భోజుఁడొక్కవేళం
గనకాంబరభూషణములు గడు బెడఁ గడరం
జని సింహాసన మెక్కఁగఁ
గని పదునాలుగవబొమ్మ కలకలఁ బలికెన్. 55

క. ఓనరనాయక! చెల్లని
పూనిక లవి నెఱపనేల భువి నుజ్జయినీ

మానవనాథుని కెనయగు
దానగుణము లేక యెక్కఁ దరమే నీకున్. 56

క. నావుడు నాతని వితరణ
మే వెరవున నెచట నొదవె నెఱిఁగింపు మనన్
భావజ్ఞులు మనమున సం
భావింపఁగ నిట్లు సాలభంజిక పలికెన్. 57

క. ఆయవనీపతి కీర్తి
స్థేయుఁడు పరనృపకులావిధేయుఁడు ధృతిగాం
గేయుఁడు వితరణగుణరా
ధేయుఁడు జవసత్వవైనతేయుఁడు చుమ్మీ. 58

ఉ. పార్థివుఁ డొక్కనాఁ డవనిభారము మంత్రికి నప్పగించి ధ
ర్మార్థము మేన నించుక ప్రయాసము దోఁపఁ జరింపకుండినన్
వ్యర్థము జీవనం బని నయంబున వెల్వడి యోగివేషి యై
తీర్థములుం బురంబులు విదేశములుం దగ సంచరించుచున్. 59

క. అగణిత సౌధోజ్జ్వలరుచి
గగనస్థలి యభ్రగంగగతి నమరంగా
నగపక్షవైరినగరము
నగియెడుగతి నున్న యొక్కనగరముఁ గనియెన్. 60

క. ఆనగరముచేరువ ను
ద్యానవనాంతరమునందు నలరెడునదిలో
స్నానంబుచేసి సిద్ధ
స్థానం బగు నచటిగుడికిఁ జని సంప్రీతిన్. 61

క. అంబురుహంబులు దనహ
స్తాంబురుహంబులఁ దెమల్చి యతిధీరుండై

త్ర్యంబకునిదేవి యగు జగ
దంబకు నంబికకు భక్తి నర్చన లిచ్చెన్. 62

ఉ. ఆకడ మున్న చండికకు నర్చన లిచ్చుచుఁ గొల్చియున్న య
స్తోకతపః ప్రసిద్ధుఁ డవధూతుఁడు చూచి యుదారమూర్తి నీ
వీకడ కేల వచ్చి తను దేను విదేశిఁ బరిభ్రమించుచున్
మీకృపఁ గోరి తీర్థములు మెట్టుచు నిక్కడ కేగుదెంచితిన్. 63

క. అనవుఁడు నాతఁడు నవ్వుచు,
ననుమానములేదు విక్రమార్కుఁడ వగుటం
గని యెఱుఁగుదుఁ బూర్వంబున
ననుమూఢునిజేసి మొఱఁగ నాయంబగునే.

వ. అనిన నతం డే నియ్యెడం బరదేశినగుట దప్పదు సకల రాజ్యభారంబున నీతిధురంధరుం డగు మంత్రిశిరోమణి భట్టిం బురంబున నిల్పి భవాదృశు లగు పురుషరత్నంబులం జూచుట కారణంబుగాఁ దీర్థంబులం దిరుగుచున్న వాఁడ ననిన నజ్ఞనవల్లభునకు బుద్ధి సెప్పుచు సిద్ధవల్లభుం డిట్లనియె.

క. పూజ్యుఁడవు సకలతిమిరహ
రజ్యోతీరూప మైనరవిమూర్తివి నీ
రాజ్యంబు నిఖిలధర్మ
ప్రాజ్యం బది విడిచి యిటకు రాఁదగ వగునే. 64

క. ధనముం గృషియును విద్యయు
వనితయు నృపసేవనంబు వాణిజ్యంబుం
దనధర్మంబుఁ జికిత్సయు
ననుదినమును గట్టిగాఁగ నరయఁగ వలయున్. 67

ఆ.వె. ధరణిఁ దిరుగ నన్యధరణీపతులచేత
నచట నొందు కార్య మయ్యెనేని

దిక్కు గలదె జేలః ద్రిమ్మరుటదియేల
చాలునింక మగిడి చనుము పురికి. 68

ఉ. నావుడు భూవరుండు మునినాథుననుం గృపఁజూచి పల్కుచో
నీవచనంబు దప్ప దది నీతియుతం బగు వస్తురక్షకున్
దైవికమానుషంబు లనఁ దద్గుణముల్ ద్వివిధంబు లందులో
వేవురు దైవమెక్కు దన వేవురు నుద్యమ మెక్కుడం డ్రిలన్. 69

ఉ. ఈయెడఁ గర్మ భూమియగు దెవ్వరికైనను బుద్ధి నేర్పునం
జేయఁగ లేదు కాలమెదచేసిన నేతము లెత్తి కాల్వలుం
బాయలుఁ గోళ్ళ నూతులును బావులు రాట్నములున్ జలార్థమై
చేయఁగనాయెఁ గాక మఱి చేయనినాఁ దవి తామె పుట్టునే 70

క. ధాత మును నోరుఁ గన్నులుఁ
జేతులు దగ నిచ్చికుడువఁ జేకూర్చినచోఁ
జేతఁ గడి యందుకొనఁదే
నాతఱిఁ గడి యేగి వచ్చి యంగిటఁ బడునే. 71

క. ఉత్తముఁ డుద్యోగఫలా
యత్తుఁడు భాగ్యాభిలాషి యధముఁడు రెంటం
జిత్తంబు గొల్పు మధ్యముఁ
డుత్తముకడ నుండ లక్ష్మియొడఁబడు నెపుడుఁ. 72

వ. అట్లయ్యును మానుషకృత్యంబున కుపహతి గలదు గాని దైవకృతంబు నకుఁ జేటు లే దని మున్నునాకుఁ బ్రసన్నుండైన పరమేశ్వరునిమీఁద భారం బిడి నిశ్చింతుండ నై చరియింపుదు. 73

ఆ.వె. లావు లేని వేళ దైవంబు గలిగిన
నెచట నైన లక్ష్మి యేగుదెంచు

నడవిఁ జొచ్చినంత యక్షులకృపఁజేసి
రాజశేఖరునకు రాజ్యమయ్యె. 74

—: రాజశేఖరునికథ :—

ఉ. నావుడు రాజశేఖరుఁడు నా నతఁ డెవ్వఁడు యక్షదైవసం
భావనయెట్లు గల్గె జనపాలక ! యాకథఁ జెప్పు మన్న నా
భూవరుఁ డిట్లనుఁ ద్రవిళభూమివరుం డతఁ డాజి శత్రులం
ద్రోవులుగా నొనర్చి సిరి వొందఁగ రాజ్యము సేయుచుండఁగన్. 74

ఉ. నొచ్చినవారి సూను లగునూర్వురు రాజులు దండుగూడిపై
వచ్చినఁ గోటలోనఁ బరివారము గొంచెము గావున న్వడి
న్విచ్చి చనంగ నానృపతి వేగమ పత్నియుఁ దానుఁ గానలోఁ
జొచ్చి నిగూఢమార్గమున స్రుక్కుచుఁ గందుచు లోనఁ గుందుచున్. 76

ఉ. అక్కడఁ బ్రొద్దు గ్రుంకఁగ మహావటవృక్షముఁ జేరి విన్ననై
చెక్కిటఁ జేయిఁ జేర్చి తనచేడియ చింత మునుంగ నాత్మలోఁ
బొక్కుచు నిద్రలేక తలపోయఁగ నానడురేయి వింతగా
నెక్కటి మఱ్ఱిమీఁద గల యేవురు యక్షులు కార్యదక్షులై. 71

చ. మనకు విహారదుర్గ మగు మద్రపురంబున కీశుఁ డైన యా
జనపతి నిన్నఁ జచ్చె మఱి సంతతి లేదు తదీయరక్షకె
వ్వని నిఁక నిల్పి రాజ్యసుఖవైభవ మిత్తము చెప్పుఁడంచు నే
ర్పునఁ దమలోనఁ గూడి తలపోయుచునుండఁగ నొక్కఁ డిట్లనున్. 78

ఉ. ఇంతవిచార మేల మన కీవటవృక్షము క్రిందనున్న భూ
కాంతుని నప్పురంబునకు గర్తగఁ జేయుద మెల్లి నావుడున్
సంతసమంది యందఱును సమ్మత మౌ నిది యంచుఁ బల్కినం
జింత దొఱంగి యానృపతి చెల్వయుఁ దానును నుల్లసిల్లగన్. 79

ఉ. ఆకమలాప్రసూతుఁ డుదయాద్రికిఁ జేరుచుఁ దూర్పుదిక్కునం
జేకొని కెంపుగుంపు గొనఁ జేయుచుఁ దారల పెంపు డింపఁగా
జీకటి రాజశేఖరుని చీకటితోరన కూడి పాయఁగా
నాకడ యక్షు లాతనికి నప్పురమార్గముఁ జెప్పి యంపఁగన్. 80

ఉ. భాస్కరుఁ డంతలో నుదయపర్వత మెక్కఁగ భూవిభుండు శ్రీ
యస్కరి యైనలక్ష్మిక్రియ యంగన తోడుగ నేగి కానలోఁ
దస్కరమార్గము ల్గడచి దవ్వులఁ[1] గాంచెఁ దటాంతకీలితా
హస్కరరత్నజాలవలయం బగుయక్షవిహారదుర్గమున్. 81

ఉ. ఆనగరంబుచేరువ వనాంతముఁ జొచ్చి సరోవరంబులో
స్నానము చేసి భాస్కరుని సౌరజపంబునఁ గొల్చుచుండఁగా
మానవు లెల్ల నెవ్వనికి మద్రపురాధిపతిత్వ మిత్త మం
చూనినచర్చనున్నయెడ నొయ్యన యక్షులు బుద్ధి గొల్పినన్. 82

క. మదకరిణిచేతి కొక చ
క్కదనపు వనమాల[2] యిచ్చి కదలించినచో
నది యెవ్వనిమెడ నిడియెను
విదితంబుగ నతఁడెమనకు విభుఁడౌననుచున్. 83

క. అందఱు నొక మదహస్తిని
నందముగ నలంకరించి హస్తాగ్రమునం
జెందొవలదండ యిడి వే
డ్కం[3] దూర్యధ్వనులు చెలఁగఁగదలించినచోన్. 84

క. ఊంఘాలినెదురుకొనఁ జను
కుంభీంద్రునితోడి పిడియొకో యిది యనఁగాఁ

---

1. గాంచెను రత్నకారితా హస్కరరత్నరాజినిలయంబగు. 2. చక్కద మగువనమాల. 3. వెనుకం దూర్యధ్వనులు.

గుంభిని పురి వెల్వడి యా
కుంభినిపతియలుత ధ్వంద తొమరుగ వైచెఁ. 85

వ. ఇట్లేనుఁగు పువ్వులదండ మెడ వైచిన. 86

ఉ. ఆర్ద్రవిశేషుఁ డాత్మసతి యప్సరలక్షియఁ బోలె మున్నుగా
భద్రగజంబునెక్కి కవిపాఠకగాయకకీర్తనీయుఁడై
మద్రపురంబు సొచ్చెఁ దను మంత్రులు గొల్వ మహాసనస్థుఁడై
రుద్రసఖుండు వోలె నతిరూఢికి నెక్కె నుదారసంపదః. 87

మ. రమణీచందనగీతవాద్యకుసుమస్రగ్వస్త్రభూషాదిభో
గములం గోరికి మీఱిఁబోవ నతిసౌఖ్యం బందుచు న్మంత్రివ
ర్గము కార్యంబులు దీర్పఁ బౌరు లనురాగం బంది నందింప రా
జ్యము సేయంగ సహింపలేక బలిమి న్సామంతభూమీపతుల్. 88

ఉ. ఎక్కడివాఁడొ వీఁడు మన మిందఱ ముండఁగఁ దేరకాఁడు దా
నిక్కడఁ జేరి మద్రపుర మేలెడి వీనికి రాజ్యమిం కిటం
దక్కిన హాని యౌ నని కడంగి తదుద్ధరణాభిలాషులై
యొక్కెడ దండు గూడుకొని యుక్కునఁ గోటకుఁ జుట్టుముట్టినః. 89

ఆ.వె. అపుడు సంధిమాట లైన నాడింపక
దొరల నైనఁ బోరి కరుగఁ డనక
ధరణివల్లభుండు తానైనఁ గదలక
యతిపతోడ నెత్త మాడుచుండె. 90

వ. అయ్యవసరంబున మంత్రులును దొరలును బరివారంబును వైరు లెత్తి వచ్చి కోటమీఁద విడిసినప్పుడు నీ వూరకునికి రాజధర్మంబగునె మాకునైన నెల వాన తిమ్మనిన విని యు విననిభంగి నున్నఁ దత్కాంతారత్నంబు పాచికలు చేతంబట్టుకొని. 91

ఆ.వె. తఱిమి సామదానదండభేదములలో
నొకట నైన వైర ముడుపపలయుఁ
బగతు రెల్లఁ గూడి పై నెత్తివచ్చిన
నెత్త మాడుచుండ నీతి యౌనె.[1] 92

క. అనవుడు జనవల్లభుఁ డిది
మనచేతల నౌనె [2]దైవమాయాగతమై
చననున్నవి చను నెచటను
మననున్నవి మను జలాగ్నిమధ్యములందున్. 93

క. వృక్షముననున్న యేగురు
యక్షులు మనరాజ్యమొసఁగ హరియింపఁగ న
ధ్యక్షులు మన కిది పనియే
యక్షంబులు వైవు చాలు నాడుద మబలా. 94

వ. అని యనంతరంబ తత్కృతస్మరణంబుగాఁబలికిన మనంబున నెఱింగికొని యయ్యక్షు లక్షణంబ మన మిచ్చిన రాజ్యంబున కుపద్రవంబు పుట్టుచున్న యది యొక యుపాయంబు తర్కింపవలయు నని వచ్చి యాకూడిన రాజుల లోఁ బరస్పరవైరంబును మనోవైకల్యంబును బుట్టించిన నాదండు రెండ ట్టలై. 95

మ. తమలోఁ బోరుచు నస్త్రఘట్టన సముద్యద్భూరివహ్నిస్ఫులిం
గము లాశాంతములం బిశంగములుగాఁ గావింపఁగా బాహువి
క్రమముల్ చూపి గజాదిసైన్యములు గ్రమ్మగ్గం దోర మై రక్తపూ
రము కెంధూళి నణంపఁగాఁ గడఁగి రారాజన్యు లాజి న్వడిన్. 96

---

1. పైవచ్చి విడిసిన యపుడు నెత్తమాడ నర్హమగునె. 2. దైవమత మేగతి యోచన నున్నవి వేగమచను.

ఉ. అక్కలహంబు చూచి చని యానృపశేఖరుఁ డాజిభూమిలోఁ
జిక్కిన యశ్వరత్నములు సింధురబృందములున్ రథంబులుం
బెక్కుధనంబు లస్త్రములు భేరులు జోళ్ళును గోటలోనికిం
గ్రక్కునఁ గొంచు నేగి యధికం బగుసంపద నేలె నప్పురిన్. 97

వ. అనిన విని యయ్యవధూతకుం డిది భాగ్యం బంటి వేని పూర్వకృతసుకృతి విశేషంబున నిది లభించెం గాక కానినాఁ డిటు గా నేర్చునే తొల్లి శ్రేఁడునుం జేయవేని నింతియ కాదు యక్షసహాయంబు గలిగియు నుద్యోగి యయ్యరణ్యంబు గడచి మద్రపురంబుఁ జేరిన కతంబున రాజ్యంబు గలిగెం గావున దైవంబున కుద్యోగంబు ఫలసాధకం బగు నదికారణంబుగ నీవును రాజ్యంబేమఱక పాలింపు మౌ మ్మని వీడ్కొలుపుచు. 98

క. నీమహిమకుఁ గడు నెలవగు
భూమీశ్వర! భూమి నిది యపూర్వం బనుచుం
గామితఫలదాయక మై
లేమి యుడుపు చంద్రకాంతలింగము నిచ్చెన్. 99

క. ఇచ్చినఁ గైకొని పురికి
న్వచ్చు నెడ న్విప్రుఁ డొకఁడు వదనము వాడ
న్వెచ్చని యూర్పుల నాఁకట
వెచ్చుచుఁ జనుదెంచి మనుజవిభు దీవించెన్. 100

ఆ.వె. మూఁడు దినము లయ్యె వేఁడంగ నెచ్చట
గమికెఁడన్న మైనఁగలుగదయ్యె
గ్రాసమాత్రమేమి గలిగిన నాకిచ్చి
నన్నుఁ గరుణఁ బ్రోవు మన్నఁ జూచి. 101

క. ఇక్కడ నన్నము దొరకదు
దిక్కతనికి నెద్ది పసిఁడి దినరా దిఁ

యక్కజుకు నడ్డ మగు నని
లెక్కింపక చేతి సిద్ధలింగము నిచ్చెన్. 102

వ. ఇచ్చిన. 103

శా. ఆవిప్రుండు మణిప్రభావమున దివ్యాకారుఁడై తుత్తిపా
సావైకల్యము లెల్ల బాసి చనియెన్ క్ష్మాపాలు దీవించుచున్
దేవేంద్రప్రతిమానుఁ డౌనతఁడు నాదేశాంతరవ్యాప్తి నా
కీవెంటన్ హిత మయ్యె నంచుఁ గళతో నేతెంచె నుజ్జేనికిన్. 104

ఆ.వె. నీకు నట్టిగుణము లేక యీగద్దియ
నెక్కరాదు చలము దక్కు మనిన
నచ్చెరువుఁ బ్రియంబు నొచ్చెముఁ బెనఁగొనఁ
దిరిగి భోజుఁ దంతిపురము సొచ్చె. 105

వ. అంతటఁ గొన్ని దినంబు లరిగిన. 106

—* పదునైదవకథ *—

క. కమలారిఁ గమలహితదృ
క్కమలుని గమలాంకనాభికమలాకరునిం
గమలాంకరమణిరమణుం
గమలాసనహృదయకమల కమలప్రియునిన్. 107

క. మదిఁ దలఁచుచు భోజుం డొక
సుదినంబున నెక్కఁ గోరుచుం జనుదేరన్
మొదలనె వారించుచు నా
పదియేనవబొమ్మ యిట్లుపలికెం బెలుచన్. 108

క. మర్యాద యెఱుఁగ విది తగు
కార్యమె యీవిక్రమార్కు కరణిని నీకున్

ధైర్యము సాహసమును నౌ
దార్యమ్మును లేక యెక్కఁ దగవే దీనిన్. 109

వ. అనవుడు నతని సాహసాదికోదారభావంబు లెట్టి వనిన నప్పాంచాలిక సప్రపంచంబుగా ని ట్లని చెప్పం దొడంగె. 110

ఉ. ఏ మనిచెప్పఁ దక్కిన నరేశ్వరు లెవ్వరుఁ గారు గాని నేఁ
డీమహి విక్రమార్క విభు నీడున కౌదు రమోఘబాణ సం
గ్రామమున వ్రతి న్విమతఖండన మై బలిమి న్మఖప్రభన్
రాముఁడుఁ గాముఁడుం బరశురాముఁడు భీముఁడు సోముఁడుంగదా. 111

ఆ.వె. అట్టి మనుజవిభుఁడు భట్టి ప్రధానిగా
నయ్యవంతి నేలు నాదినములఁ
గలఁడు వేదవేది ఘనుఁడు ధర్మజ్ఞుఁడు
సుశ్రుతుండు నాఁగ నాశ్రితుండు. 112

ఉ. సుశ్రుతుఁ డెల్లతీర్థములఁ జూచెద నంచు దృఢవ్రతస్థుఁడై
యాశ్రితకల్పవృక్ష మగు నాపతిపంపున నేగి ధర్మ స
మ్మిశ్రముగా సుదేశములు మెట్టుచుఁ బుణ్యముఁ గూడఁబెట్టుచు
న్విశ్రుత మైనతన్మహిమ వించు వెసం జనియెం బ్రయాగకున్. 113

మ. తరగ ల్శ్వేతులు పక్షిజాతములంకూఁత ల్కంకణక్వాణముల్
[1]నురువు ల్తెల్లని చామరంబు లన నన్యోన్యంబు నుప్పొంగుచు
న్సరి గంగాయమునల్ తగం గొలువఁగా ఛాయావటచ్ఛత్రసం
స్ఫురణం జెల్వగు తీర్థరాజ మచటం జొచ్చెం బ్రశంసించుచున్. 114

క. నీలము ముత్యముఁ గూర్చిన
పోలిక హరిహరులు గూడుపొందున నొకచోఁ

---

1. అరుదౌ ఫేనము వెల్లచామరలనన్.

గ్రాలెడి గంగాయమునల
నోలాడె నినుండు మకరయుతుఁడౌ వేళన్. 115

మత్తకోకిల: అందు భక్తులు ముక్తిశ్రీవకు నందుకోలగు నందమౌ
బిందుమాధవదేవునిం గని ప్రీతిఁ గొల్చి వినీతుఁడై
యిందుశేఖరు విశ్వనాథు ననేకభంగులఁ గొల్చినా
పొందుచేకుఱ నేగె విప్రుఁడు పుణ్యరాశికిఁ గాశికిన్. 116

వ. అచ్చటంగదలి యట్లేగి యష్టభైరవేశ్వరంబును భూతభైరవేశ్వరంబును గాలభైరవేశ్వరంబును, గపాలేశ్వరంబును, బాతాళభైరవేశ్వరంబును, మతంగేశ్వరంబును, జంబుకేశ్వరంబును, మణికర్ణికేశ్వరంబును, సాంబాదిత్యంబును, గరుడాదిత్యంబును, లోలార్కంబును, బిందుమాధవంబును మున్నుగాఁగల బహుకోటితీర్థంబులచేత నలంకృతంబైన పంచక్రోశంబుఁ బ్రవేశించుచుఁ దద్గుణప్రశంసోన్ముఖుండై. 117

క. శివుఁ డిందుఁ బడ్డవానికిఁ
జెవి మంత్రముఁ జెప్పఁ బూని శిర మటు వంపన్
శవముపయిఁ బడినసురనది
శివపదరాజ్యోచితాభిషేకము సుమ్మీ. 118

క. ఉడు మైనఁ దొండ యైనను
గడఁ జైనను దుప్పియైనఁ గడువెస పీటం
బడునప్పుడె పురుషుండును
బడఁతియు నగురూపు వడసి పదనేరదదే. 119

వ. అని కొనియాడుచు. 120

శా. ప్రాలేయాచలచందనద్రవ సుధాప్రాచుర్యవీచీలస
త్కేలీడోల విశాలశీలసుమనఃస్త్రీజాలఫాలస్థలా

వ్యాలోలాలకమాలికానుకలనావ్యాలంబరోలంబలీ
లాలోలాంబుజచిహ్నితం గనియె మధ్యాహ్నంబునన్ జాహ్నవిన్. 121

వ. కని యందు నిమజ్జనం బొనర్చి భస్మత్రిపుండ్రాదిశైవలక్షణలక్షితుండై సకల దైవతారాధ్యుండగు విశ్వేశ్వర శ్రీమన్మహాదేవుని సందర్శించి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి నిటలతటకరకమలపుటుండై నుతియించుచు.

శా. వింటి న్సర్వపురాణము ల్దివిజు లేవెంట న్నినుం బోలరే
రంటిం దీర్థవిలోకనా జపతపోయజ్ఞాదిపుణ్యంబు లొం
డొంటి న్మీఱంగ భాగ్యవైభవము నే డుప్పొంగ ముక్కంటి ని
న్గంటిన్ జన్మఫలంబు గంటి నిచటం గాశీశ విశ్వేశ్వరా! 123

మ. నినుం జూడం జనుదెంచు నప్పుడె పెద వ్వెక్కొన్న మార్గశ్రమం
బున విచ్ఛాయములైన భక్తులపదాంభోజంబు లత్యంత న
మ్రమనిలింపావళిమౌళిరత్నములచే రక్తాతిరక్తప్రభం
గనుపట్టున్ శివరాజ్యపట్ట మగుచుం గాశీపురాధీశ్వరా. 124

వ అని కొనియాడి కృతకృత్యుండై యందు మాసత్రయంబు గడపి పదంపడి ఫల్గునవర్ధనంబును, జిహ్వాలోలంబును, దక్షిణమానసంబును, నుత్తరమానసంబును, బ్రహ్మసరోవరంబును మున్నుగాఁ గల స్థలంబులఁ బితృపిండప్రదానతర్పణపరుండై, పితృముక్తికారణంబులగునీశానవిష్ణుకమలాసనకార్తికేయవహ్నిత్రయాగ్నిరజనీశగణేశ్వరాదిదేవతాచతుర్దశపాదంబులను, నక్షయవటచ్ఛాయయు,జనార్దనహస్తంబును మొదలగుస్థలంబులఁ దృప్తితపితృతర్పణుండై గదాధరునకుం బ్రణమిల్లి, యుగళగౌరికిమ్రొక్కి మగిడివచ్చుచో నొక మహావనంబున. 125

సీ. కన్యకాధీన మై ఘనవైభవంబుతో
మణిమయప్రాకారమహిమ గలిగి

పురుషవర్జిత మైన పురము గనుంగొని
యట నొక్క దేవాలయంబుఁ జేరి
దానిచేరువ నుక్కనూనెకొ ప్పెర పొంత
విపులమౌ కనక మండపముక్రింద
మోహనం బైన వివాహవేదికమీఁది
[1]రత్నపట్టికలోని వ్రాఁత చూచి

ఆ.వె. నరుఁడు తైలకటాహంబు నడుమఁబడిన
నెఱయఁగందర్పసంజీవినీసమాఖ్య
నమరుకన్యయురాజ్యంబునతనిసొమ్ము
లనుచునేర్పడియున్నపద్యంబుచదివి. 126

వ. దానికి విస్మయభయ సంశయాన్వితుండై. 127

క. ఈయుదుకునూనె దగ్గఱఁ
బోయినఁ దాఁ జచ్చుఁబో యీవిభవం
బేయనుభవమున కగు నని
డాయక మది నులుకు మిక్కుటంబై మగిడెన్. 128

క. ఉజ్జయిని కరుగుదెంచి సు
హృజ్జనములఁ గూడి వార లెల్లం బ్రీతిం
బజ్జం జనుదేరం జని
యజ్జనవల్లభుని నుతుల నభినందించెన్. 129

క. ఆవిక్రమార్కుఁ డతిసం
భావనమైఁ గుశల మడిగి పరభూముల నీ

1. పసిండి ఘంటికలోని.

వేవెంటఁ దిరిగి చోద్యము
లేవేఁ జూచితివొ చెప్పు మేర్పడ నన్నణ. 130

సీ. ధరణీశ యెల్లతీర్థంబులు చూచుచు
వెలసిన త్రిస్థానములకు నేగి
మగిడియేతెంచుచో మాణిక్యమయమైన
పురములోగుడియొద్దఁబొంగిక్రాఁగు
నూనెకొప్పెరఁగంటి నానూనెలోపలఁ
బడ్డవారికి నట్టి పట్టణంబు
నందులకన్యయు నగపడు నని యున్న
పద్యంబుఁ జూచితిఁ జోద్యమదియు

ఆ.వె. ననిన సాహసాంకు డచ్చెరువందుచు
నాపురంబు చూత మనుచుఁ గదలి
చనియె నతనిఁ గూడి శస్త్రసహాయుఁడై
దుర్గమంబు లైనమార్గములను. 131

వ. చని చని యచట దేదీప్యమానం బైనపురంబు సొచ్చి తద్విభవంబు వర్ణించుచు ముందఱ నతిసుందరం బైన పందిరిక్రింద సువర్ణమయ జలపూర్ణ కలశంబులను మృగనాభిలేపనంబులను ముక్తాఫలరంగవల్లికలను, గనకరంభాస్తంభంబులను, రత్నతోరణంబులను నలంకృతంబైన వివాహవేదిపై పలకలోని పద్యంబు చూచి సముత్సుకుం డై. 132

క. చేరువగుండములోపలఁ
గోరికతో జలకమాడి గుడిలో లక్ష్మీ
నారాయణులం గాంచియు
ఘోరం బగు నుడుకునూనెకొప్పెరఁ జేరెణ. 133

వ. ఇట్లు చేరి. 134

క. సలసలఁ గ్రాఁగెడు తైలము
కొలఁది యెఱుఁగఁ దలఁచు భంగి గుణరత్నసము
జ్జ్వలుఁడు గుబేలున నుఱికెను
జలనిధిలో నస్తమించు జలజాప్తు క్రియన్. 135

వ. అంత సంధ్యాంగనయుం బోలె హరిచందనారుణపయోధరభారయు నార
క్తాంబరయు వికసదిందీవరాక్షియు రాగవతియు నైన కందర్పసంజీవనీనాగ
కన్య చనుదెంచి నిజవిద్యాప్రభావంబున నారాజుం బునరుజ్జీవితుం
జేసిన. 136

ఆ.వె. జలజకాంతి మెఱయ జలధివెల్వడి తూర్పుఁ
గొండ యెక్కినట్టి యెండతేని
చొప్పు దోఁప నూనెకొప్పెర వెల్వడి
నిలిచె విప్రుమోము తెలివికెక్క. 137

ఉ. ఆతనిఁ జూచి కన్య వినయంబున మ్రొక్కి యమేయసాహస
ఖ్యాతచరిత్ర!నాదువ్రతకల్పత నేఁడు ఫలించె నే నిఁక
స్నీతగుదాసి నైతిఁ గరుణింపుము రాజ్య మనుగ్రహింపు సం
ప్రీతి యొనర్చుదానఁ దగురీతి ననుం బని వంపు మిత్తఱిన్. 138

ఉ. నావుడు దాసివేని విను నావచనం బిఁకఁ ద్రోపుసేయ కీ
దేవసమానునిన్ ధరణిదేవుని సుశ్రుతు నాశ్రయింపు త
ద్భావము పల్లవింప నని పార్థివుఁ డానతి యిచ్చె నంత న
జ్జావనతాస్య యాచె నెదురాడక లేమ వరించె విప్రునిన్. 139

మ. ధరణినాయకుఁ డిట్లు చేకుఱినకాంతారత్నమున్ రాజ్యమున్
ధరణీదేవున కిచ్చి నిల్పి తనయత్నం బిగతిన్ ధర్మసం
చరణాసక్తి ఫలించె నంచు మదిలో సంతోష మువ్పొంగఁగా
నరుదెంచె న్నిజదానధర్మగుణగణ్యుం డైన యుజ్జేనికిన్. 140

క. విను మదికారణముగ నో
జననాయక యెక్కఁ దగదు చను మనవుఁడు నె
మ్మనమున నచ్చెరు వందుచు
మనుజేంద్రుఁడు సదనమునకు మగుడంజనియెన్. 141

శా. ఉష్ణాంశుద్విజరాజలోచను నపాయోపేతతావచ్ఛిదా
నిష్ణాతస్థిరతత్త్వబోధమయమౌనస్వాంత పంకేజవ
ర్తిష్ణుఁ న్విష్ణు నగణ్యపుణ్యధనవర్ధిష్ణు న్గదాధృష్ణు భ్రా
జిష్ణు న్సంతతకృష్ణ కాంతిచయరోచిష్ణుం దమోజిష్ణునిన్. 142

ఉ. నిర్జరసిద్ధసాధ్యభజనీయపదాంబుజయుగ్ముఁ దిగ్మపా
దార్జునరశ్మిమారుతహితాక్షుని రక్షితయక్షరక్షకున్
గర్జితఖాసురప్రళయకాలసమంచితపంచవక్త్రి న
త్యూర్జితతర్జనాచరణదుర్జయు దుర్జనదూరు ధూర్జటిన్. 143

మాలిని. ప్రవిమలతరచిత్తా బ్రహ్మసంస్తుత్యవృత్తా
భువనభరితకీర్తీ పుణ్యలావణ్యమూర్తీ
దివిజభరణలోలా దీనరక్షానుకూలా
భవమురరిపురూపా భాగ్యభోగ్యస్వరూపా. 144

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలీకభేకఫణీంద్ర వీరఘోట్టవిభా
ళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్ర
భూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెల
నాఁటిపృథివీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొరవి వెన్నయామాత్యపౌత్ర హరిత
సగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతం బైన
సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కుని ధైర్యసాహ
సౌదార్యప్రశంస యన్నది షష్ఠాశ్వాసము.

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## సప్తమాశ్వాసము.

క. శ్రీ సంపన్న కుబేర
ప్రాసాదోపవనపవనపానస్ఫురదు
ల్లాసఫణీంద్ర ఫణామణి
భాసురనిజమూర్తిఁ బరమపావనకీర్తీ. 1

క. మదిలోపలఁ దలఁచుచు న
భ్యుదయం బగునట్టిలగ్నమున గద్దియపైఁ
బదమిడునెడ వారించుచుఁ
బదియాఱవబొమ్మ భోజపతి కిట్లనియెన్. 2

—* పదాఱవబొమ్మ చెప్పినకథ *—

క. అతిశయముగ నుజ్జయినీ
క్షితిపతిక్రియ దానగుణము సిద్ధింపక సం
గతిమాలినచేఁతల సుర
పతిసింహాసనముమీఁదఁ బదమిడఁ దరమే. 3

వ. నావుడు నతనియతిశయగుణజాలం బెట్టి దనిన. 4

మ. వినుమీ భోజధరాతలేంద్రః త్రిజగద్విఖ్యాతకీర్తిప్రియుం
డనుకూలక్షితిపాలరక్షణకళాయత్తప్రతాపుండు స
జ్జనచిత్తాంబుజమిత్త్రుఁ డిష్టవనితాసంభోగపంచాయుధుం
డనఘుం డుజ్జయినీవిభుండు నిజరాజ్యం బింపుతో నేలఁగన్. 5

శా. ఆరాజన్యశిరోమణిం గొలువ నెయ్యం బొప్పఁగా నింపు పెం
పారం దక్కినభూమిపాలురు మహాయత్నంబుతో రత్నము
ల్నారీరత్నములుం దురంగములును న్నాగంబులు న్మున్నుగాఁ
జేర న్వచ్చి వనంబులో విడిసి రాసీమావిభాగంబులన్. 6

ఉ. ఇంతులమానభంగము మహీరుహపంక్తులదర్పమూల మ
త్యంతమహోత్సవంబుల విహారము జాణలభోగభాగ్య మా
కింతుని ప్రాపు కోకిలశుకంబుల వాచవిపంట నాఁ బ్రజల్
సంతసమంద నంతట వసంతము వచ్చె వనాంతభూమికిన్. 7

మ. మొదలన్ దక్షిణమారుతంబు వనభూము ల్సోఁకుచు న్వేఁక ను
న్మదపంచాయుధవహ్ని చిహ్న మగు ధూమంబో యన న్వేవఁగాఁ
దుద లొక్కించుక యెండఁ గందు వెరలం ద్రోచెం గదల్ స్రుక్కఁగాఁ
బద నింకెన్ బిరు సయ్యెఁ బండె బడియెం బర్ణంబు లుర్వీస్థలిన్. 8

క. కాకులలోఁ గోకిలములు
కాకులఁ బడలేక కులము గలయఁగఁ బవనుం
డాకులపా టొనరింపఁగ
నాకులపా టయ్యె విరహు లగులోకులకున్. 9

క. శీలము వదలనిపథికుల
తాలిమిఁ దూలించు మారుతము పెల్లున నా
భీలం బగుమదనాగ్ని
జ్వాలలక్రియ బాలపల్లవము లొప్పారెన్. 10

శా. ఏచెం గ్రొన్నన మాధవీలతలపై నింపెక్కి సంపెంగలుం
బూచె న్మావులుఁ బొన్నలుం బొగడలుం బొల్పొందె రాచిల్కలు
న్వాచాలత్వము సూపెఁ బుప్పొడి దిశ ల్వాసింప సొంపారఁగా
వీచెం గమ్మనితెమ్మెర ల్మరునకు వీచోపులై ప్రాపులై. 11

శా. కాయం జొచ్చెరసాలము ల్విరహు లాకంపింపఁగాఁ గోయిల
ల్గాయం జొచ్చె మనోజదిగ్విజయ మాఘోషించుచుం దుమ్మెదల్
మ్రోయంజొచ్చె నపీనపుష్పశరము ల్మాత్రంబుగాఁ జిత్తజుం
డేయంజొచ్చె సతు ల్మదిం గలఁగఁగా నెచ్చోటులం దానయై. 12

సీ. గంధబంధురుఁ డైన గంధవాహుండు ము
న్నేర్చినపట్టపుటేనుఁగు[1] గనఁగఁ
బచ్చపక్కెరలట్లు పక్షంబు లొప్పారు
వరకీరములు వారువము లనంగఁ
బదహతిఁ బుప్పొళ్ళు పర్వఁగా నేతెంచు
నలులమూఁకలు కాలిబలములనఁగఁ
బంచమస్వరములఁ బరిణమింపఁగఁజేయు
పికములు కీర్తిగాయకు లనంగ

ఆ.వె. నేచియున్న మావు లెల్ల గొల్లైన లన
లలిత మైనరాజ్యలక్ష్మి మెఱసి
యితరనృపులభంగి ఋతుచక్రవర్తియు
నతనిఁ గొల్వవచ్చి యచట విడిసె.

క. ఆవృత్తాంతము దెలియం
గా విని సచివేంద్రుఁ డచట గందర్పసఖుఁ
భూవరులను సత్క్రియ సం
భావింపఁ దలంచి సార్వభౌముని కనియెన్. 13

ఆ.వె. ధరణిపాలురెల్ల ధరణీశ మిమ్ముఁ గొల్వ
వచ్చియున్నవారు వనములోన

1. పట్టపు నేనుఁగు.

గౌరవంబు మెఱసి వారల కవసరం
బిచ్చి కరుణఁ జూడ నిచ్చగింపు. 14

క. ఇంతియకాదు నరేశ్వర
యింతులతొలు వేఁట[1] ఋతువు లేలెడుఘనుఁ డా
కంతుని ప్రాణసఖుండు వ
సంతుం డున్నాఁడు కొలువఁ జనఁగావలయున్. 15

క. "కాలో వసంత" యను వా
క్యాలంకృతి నన్నిఋతువులం దధికుఁడు త
త్కాలోచితపూజలచేఁ
గాలాత్మకుఁ డైనవిభుఁడు కడుఁ బ్రియ మందున్. 16

ఆ,వె. పూజ్యులైనవారిఁ బూజింపకున్నచో
మేలు దొలఁగునండ్రు మేదినీశ
యష్టసిద్ధు లాది నగపడ్డ వనక నేఁ
డవ్వసంతపూజ కరుగవలయు. 17

క. అనవుడు నౌఁగా కనినం
జని యుపవనమధ్యమున వసంతోత్సవఖే
లనమునకుఁ దగినవస్తువు
లొనగూర్చియమాత్యచంద్రుఁడొయ్యనమగిడెన్. 18

వ. ఇట్లు మగిడి. 19

ఉ. పంచశరాధిదేవతలపట్టులుగా మణివేదిపంక్తి ని
ర్మించితి రత్నమండపము మించులబట్టల మేలుకట్లు గ

1. తొలునెట, తలవెంట.

ట్టించితిఁ గాంతి దిక్కుల నటింపఁగఁ గాంచనతోరణంబు లె
త్తించితి విన్నవింప నరుదెంచితి రాఁ గరుణించు భూవరా. 20

సీ. అని విన్నవించిన జనవల్లభుండును
జతురంగబలములు సరస నడువ
భేరులు శంఖము ల్పెద్దగౌరులు మ్రోయ
దిక్కుల నినదంబు పిక్కటిలఁగఁ
గవిరాజగాయక స్తవములు నిగుడంగ
శూరులు ధీరులుఁ జేరికొల్వ
నమ్మహోత్సవమున కాభరణంబులౌ
నంగనారత్నంబు లరుగుదేరఁ

ఆ.వె. బ్రజలకెల్లను గన్నులపండుగౌచు
వాయు వేగ మను త్తమాశ్వంబు నెక్కి
గతులఁ ద్రొక్కించి మెఱయుచు గవనివెడలి
యరిగె నుద్యానవనములో నవనివిభుఁడు. 21

ఉ. అప్పుడు చేరవచ్చి సమయం బిది దర్శనయోగ్యమంచు న
వ్వొప్పెడుకాంతలుం దురగయూథము రత్నచయంబు మున్నుగాఁ
గప్పము లెల్లఁ దెచ్చి మది గప్పెడుభీతి దొలంగ న మ్రము లై
యొప్పన చేసి రాన్నృపతు లుజ్జయినీపతికిం గ్రమంబునన్. 22

సీ. అంగాధిపతి వీఁడె వంగాధిపతి వాఁడె
నేపాళపతి వాఁడె భూపతిలక
కర్ణాటపతి వీఁడె కాంభోజపతి వాఁడె
సౌవీరపతి వాఁడె సార్వభౌమ
గూర్జరపతి వీఁడె కోంకణపతి వాఁడె
కుంతలపతివాఁడె కంతురూప

బర్బరపతి వీఁడె పాంచాలపతి వాఁడె
మత్స్యాధిపతి వాఁడె మానవేంద్ర

ఆ.వె. యనుచు వేలువేల నందఱ నెఱిఁగించి
యధిపుచేతఁ గుశల మడుగఁజేసి
వీడియముల గారవింపించె నీతిస్వ
తంత్రబుద్ధి యైన మంత్రివరుఁడు.

క. అజ్జనపతు లందఱుఁ దన
పజ్జం జనుదేర మండపములోనికి వి
ద్వజ్జనచింతామణి యగు
నుజ్జయినీధరణిపాలుఁ డొయ్యనఁ జనియెన్. 25

ఉ. అందు వసంతుని న్రతి ననంగుని లక్ష్మి నుపేంద్రు గౌరి న
య్యిందుకళాధరు న్శచి సురేంద్రుఁ గ్రమంబునఁ బూజచేయఁగా
దుందుభిమర్దళప్రముఖతూర్యరవంబులు నింద నేర్పున
న్సుందరు లాటపాటల వినోదము సూపిరి తీపులంటఁగన్. 26

వ అప్పుడు కర్పూరాదిసుగంధద్రవ్యంబులు వసంతచాలనం బొనర్చెడి వారిలో నుండి కలహకంటకుం డను రాచలెంక వెడలి వచ్చుచుఁ దనమీసములను నంటిన సుగంధంబు విదిర్చికొనుచుఁ జూచిన నెదుర నున్న యేకాంగవీరుం డను నంగపతిలెంక తనదు దురభిమానంబునం గనలి. 27

క. ఏరా ముందఱ గానక
నేరమి పైఁ దెచ్చుకొనుచు నీమీసలు నా
చేరువ షడిపెట్టెద విది
యోరీ యేకాంగవీరుఁ డుంట యెఱుఁగవే. 28

క నావుడుఁ బరిమాళించెద
నీవుండుట యెఱిఁగి కాదె యిది వ్రేటుగ నేఁ

గావించెదఁ బేరికిఁ దగు
లా వించుక కలిగె నేని లటపట లేలా. 29

వ. అనినం దివియు మనుచు నయ్యుద్ధముం గప్పిన దుప్పట్లు తొలంగవైచి జిట్టునం గతాఁకంబులు దుస్సిన దగ్గఱంగల తలవరులెదసొచ్చి పట్టి తొలం గం దిగిచి యీమహోత్సవంబులో నిట్టిగలబలు సేయ మీయట్టి బలుబం ట్లకు సందిక్రంతలజగడంబులు వల దని తోడ్కొని చని రత్నమండపముఖ శాల యైన కొల్వుమండపంబులో నున్న గోవిందచంద్రుం డనుపడవాలు ముందటం బెట్టి యీకలహకంటకుం డంగాధిపతిలెంకతోఁ బోట్లాడఁగడగ్గ ఱునెడ మానిపించి యిద్దఱం దోడితెచ్చితి మవధరింపు మనిన నతండును.

క. తగునోయి కలహకంటక
జగడంబులు సేయ నొండు సమయము లేదే
పగపాటి నీకు నితనికిఁ
దగిలిన దీవిందుతో వితండము గలదే. 31

ఆ.వె. అనుచు నతని దూటి యాతనిదెసఁజూచి
యితనితోడ జగడ మేల యయ్యె
ననుడు నతఁడు వలికె నను నితఁ డిప్పుడు
వ్రేసెఁగాన నిట్టివివర మయ్యె.[1] 32

క. ఆపడవాలును దమభటుఁ
గోపించుచుఁ గవులఁ బాఠకుల శూరుల నా
లోపలఁ గూర్చుండఁగ నిడి
యాపొడి దగంగఁ దీర్పుఁ డని నియమించెన్. 33

సీ. వారలు నేకాంగవీరుఁడ వ్రేటున
కై తగిలినవాఁడ వనుచుఁ జూచి

1. వైచెగాన నిట్టివైరమయ్యె.

కలహకంటకయేలకలహంబుగై కొంటి
వనుడుఁ బోట్లాడ వేడ్క యయ్యేననుడు
మఱి తావు లేదె యీమర్మ మేర్పడఁ జెప్పు
మనవుడు వ్రేయుటయదినిజంబు
నామీసములసుగంధము విదిర్చికొనంగ
నితఁడు నేనుండుటయెఱుఁగ వనిన

ఆ.వె. మాటమీఁద నదియె వ్రేటుగాఁ జేసితిఁ
బిఱికి వీఁడు బిరుకపిట్టయంత
గాని లేఁడు వీనిఁ గై కొందునా నేను
జెండి పొఱవైతు ఖండనమున. 84

వ. అని పలికినఁ గలహకంటకుం గోపించి తుచ్ఛపుంబలుకులు పలుకుదురె పగవాని ఘనతచేసినఁ దనదొడ్డతనం బెక్కుడగు నతని హీనంబుగాఁ బలికిన సరిపూనికెం దానును హీనుం డగు నింతియ కాదు విక్రమార్కుండును నంగాధిపతియును మిత్రులు వారికన్నులం బుట్టిన కొడుకులు మీలో జగడంబు వలవదు. 85

క. మగతనము నెఱపఁ బూనియుఁ
బగ యేమియు లేనిచోటఁ [1]బరిమాళింపం
దగ దతనికి నది నీకును
దిగులువడ న్నిలువనాడఁ దగ దాతనితోఁ. 86

గీ. అనఁ గలహకంటకుం డను నల్ల నవ్వి
పంతమౌ మీరెఱుంగని పాడిగలదె
గుడికొలువుబంటు మల్లనికొలఁది పంత
మయ్యె నిచ్చట నదియెట్టు లంటిరేని. 87

---

1. బగగలిపింపదగతని కేని నీకును.

వ. ఒకఁడు దేవరభాండాగారంబు నింటికడం బాలెము వడం గొలిచి పళ్లెరం బులఁ బ్రసాదంబు దినుచుఁ బోతుక్రియ నుండ నొకనాఁడు దేవర దర్శింప వచ్చి వారిసందడిలో నొక్క యీడిగ తనకాలు ద్రొక్కినం గోపించి యే మిరా బంటుమల్లు నన్నెఱుంగవా తన్నితి వనిన నతండు నేనెఱుంగన యీ సందడిలోఁ గాలు దాఁకె ననిన నెరయం దన్ని యెఱుంగ నని నం బోని చ్చెదనా యనుచు నందంద దట్టించిన నయ్యీడిగ డాకేలి కటారి వలకేల నందుకొని తన్నినాఁడ నే మనియెదవురా యనిన నతని బిఱుసు చూచి బంటుమల్లండు స్రుక్కి యేమియు నే మనియెద దేవర కూడిగంపుబంటుం గాన దోస మనియెద ననియెం గావున. 38

క. ఆపంతము గాకుండఁగ
నాపేరును నతనిపేరు నాణెంబులుగా
మీపిన్నవాండ్ర మమ్మును
జేపట్టియొకింతవేడ్క సేయింపఁదగుణా. 39

వ. అని మ్రొక్కిన నట యంగపతిభటుండు- 40

ఆ.వె. మీకుఁ బిన్నవాఁడ నేకాంగవీరుండ
అంకెవైచిన నడబింక మైన
నగినఁ గేరడించిన స్మీసలంటినఁ
[1]బట్టి తివియ నాకుఁ బాడిగాదె. 41

ఆ.వె. నృపులుగవులుభటులుఁగృపణులుశూరులు
నొక్కచోటఁగూడియున్నవారు
వీరుమెచ్చమమ్మువిడిచిమన్నించుట
ఘనతయిదియుమీకుననుచుమ్రొక్కె. 42

---

1. చూడ నిదియు నాకుఁ బాడిగాదె.

క. అమ్మాటలు విని పెద్దలు
మమ్మాట మన్నించి మీరు మాకిట జగడం
బిమ్మనినఁ గలహకంటకుఁ
డెమ్మెయి మెయికొనక యున్న నిరవదనిమతిన్. 43

వ. మీర లిద్దఱు రాచలెంకలు గావున నారాజులు సూడంగఁ బోట్లాడవలయు నాయితపడి రం డనిన మాకు నిదియ యాయితంబు బంటువానికిం గటారి చేత నున్నంజాలదె యనుడు నేమియు బంటుతనంబునకుఁ గొఱత గాదు రాజు వెడలివచ్చునంతకుం బోయి రండని యొండొండ యనిపినం జని రనంతరంబ. 44

సీ. కఱకంచువలిపెంబు గట్టిగాఁ గాసించి
చెలిత్రాడుకాసెపై బలియఁజుట్టి
దేహంబు కప్పఁగా లోహకంచుకలీల
జిగిబిగిగల నల్లజిగు రమర్చి
వక్షఃస్థలంబున రక్షపూసలపేరు
దండతాయెతులును దగ ధరించి
తిలకంబు దళముగాఁ దీర్చి చుంగులపాగ
తలముడితోఁ జొళ్లెమలవరించి

ఆ.వె. కేలఁ బల్లతియును నీలి నూలునఁ బూని
కేలిగతిఁ గటారికోల వట్టి
సంగడీలుగొల్వఁ జనుదెంచెనొకమత్త
గజముఖంగి కలహకంటకుండు. 45

వ. అటఁ గొందఱు సంగడీలం గూడి. 46

క. నగుమొగమలరఁగఁ గస్తురి
తిగురు మెయిన్నలఁది గాసె దిటమై మెఱయన్

మగతనముఁ గటారియుఁ దో
డుగ నయ్యేకాంగవీరుఁడుం జనుదెంచెన్. 47

సీ. అపుడుచక్కలలోన నమృతాంశుగతిదోఁప
రాజులు గొలువంగ రాజు వెడలి
వచ్చినఁదత్పరివారసమేతుఁడై
పడవాలు డగ్గఱి భటులఁ జూపి
వారివైరముఁ బరివారంబుఁ దగవును
మున్నుగా నన్నియు విన్నవించెఁ
దనలెంకఁ దిట్టి యిద్దఱ నొక్కటిగఁ జేయ
భట్టి నంగాధిపుం బాలుపెట్టె

ఆ.వె. వారు మాకు సెలవుగా రెండుమాటలు
విడువుఁడనియునృపునివెఱపుసూపఁ
బనిచెఁ గర్త గాన బంటుతనమునకు
విడుతురయ్య......... 48

క. నావుడు నిద్దఱుఁ జని పృ
థ్వీవరునకు వాంఛ్రదచలము వినిపించిన నే
నీవీర్యుల నొప్పించుట
భావం బొడఁబడ దటంచుఁ బతి చింతించెన్. 49

క. ఆవేళ నమాత్యుండు మ
హీవర నీమాట సేయ రేమనవచ్చున్
లావరులై లెంకల మని
కావరమున నున్నవారు గైకొన రౌరులన్. 50

ఆ.వె. పసుల కుయ్యిగాదు బ్రాహ్మణుచెఱగాదు
స్వామిహితముగాదు వ్రతము గాదు

లోకహితముగాని యేకాంగివోరునఁ
జచ్చువాని కేమి స్వర్గమౌనె. 51

వ. నాపుడు వీరకులోత్తముం డగు వీరకులోత్తముండు. 52

ఆ.వె. మానభంగ మైనమరణంబు శూరుల
కదియ చూడ నాత్మహత్య గాదె
యాత్మహత్య పాప మది నీవయెఱుఁగుదు
పాప మొందకున్నబ్రదుకు బ్రదుకు. 53

వ బ్రేసినబ్రేటును గాఁడినమాటయును లేకయుండుటది మహావ్రతంబు. 54

క. బొంకుట సుర సేవించుట
బొంకమి వేయశ్వమేధములఫలము భటుం
డంకమున సత్యమునకై
శంకింపక వచ్చెనేని స్వర్గము గాదే. 55

క. అది యెట్లనినను మిత్రుఁడు
మదిఁ గలఁగెడుననియు వీంద్రుడుమడిసెదరనియుం
గొదికెడు నామన మనవుఁడు
నిదియెంత ప్రసంగమనుచుహితమతిఁబలికెఙ. 56

క. [1]అంగాధిపతియు నేనును
ముంగల నిరుదెసల నిల్చి మొనయుకటారుల్
ఖంగనఁగఁ బట్టి బంట్లకు
భంగము గాకుండ మనసుఁ బట్టెద మనఘా. 57

క. అనునెడ నిద్దఱు బంటులుఁ
జనుదెంచి కడంక మ్రొక్కి జనవర మముఁ జూ

1. ఛంగున దాటుచు రాజుకు, ముంగల.

ద నవధరించియు విడుమా
యనవుడుఁ బంతముల కొలఁదు లడిగె న్వారిఁ. 58

వ. అప్పు డొక్కదండనె పోట్లాడంబూని యేకాంగవీరుండు. 59

సీ. పుల్లతి వెట్టిన భూమికిఁ గొసరిన
నెదిరిపోటునకుఁ జేయొదుఁగుచున్న
దండకై దప్పినఁ దప్పఁ గేళ్లరికిన
బంతంబుగొన్నఁ జౌకళము గొన్న
దాణికిఁ జొచ్చిన దాఁచిన మానిన
నరువనొడ్డిన బయలాసపడినఁ
జాఁగఁబొడువకున్న లాఁగంబునకుఁగొన్న
మడమ గెంటిన వ్రేళ్ళు మగుడఁబడిన

ఆ.వె. గాయిమాయిలైనఁ దలవంచి పొడిచిన
బారుగాఁ దలంచు పంతమిదియె
కదిసి యొక్కపోటు పదిముఖంబులుగాఁగఁ
బొడుచువాఁడ దేవరడుగులాన. 60

వ. అను నంతకమున్న వానిపంతంబులకొలంది బుల్లతిమున్నగా నన్నియుం
గొని యున్న కలహకంటకుండు. 16

సీ. మఱిఁ గాకదృష్టి నేమఱక రక్షించుచు
సూకరదృష్టిమై ఢాకగొలిపి
గర్జనసేయక మార్జాలదృష్టిమైఁ
దరలక పరుజించి తాఁకఁబూని
భల్లూకదృష్టి నపాంగసంగతి గని
కపిదృష్టి వంచించి కాపుసూపి
చేష్టదప్పక గృధ్రదృష్టి గనుంగొని
యెయ్యన ఫణిదృష్టి నొడియఁజూచి

ఆ.వె. మనసుదేఱఁజూచియును జూడకున్నట్లు
దృఢముగాఁగఁ జోరదృష్టి నడఁగి
జంకిమీఁదనొడిసిశార్దూలదృష్టిఁబై
బడుటసురియకాంౘ్ర పంతమిదియ. 62

క. తొమ్మిదిదృష్టులలో నా
యిమ్మగు పులిదృష్టిఁ జొచ్చి యెముతొమ్ము కతా
రమ్మున నది తొలుపోటుగ
గ్రుమ్మెద నేనొండు లేక కుంభినిఁ గూలఁగ. 63

వ. అనుడు వింతపంతంబుల కచ్చెరు వంది పొందుగాఁ జూచి విడువుం దన భట్టియు నంగాధీశ్వరుండును నిలువంబడి విస్తారంబు గలుగ వైహాళి దీర్చి యెల్లజనులం గూర్చుండనిడి గలబపుట్టకుండ నెడ నెడం దలవరుల నిలిపి పట్టెడువారల మాట మాటలలోనఁ బట్టుం డని నియమించి నలువురుబంట్ల నడుమనిడి కతారంబు లొక్కకొలందిగాఁ గొలిచి నిమ్మపండ్ల దొడసి యెడ గలుగ బంట్లచేతి కిచ్చినం బుమ్ముకొని యవ్వీరులు చూచువారిచూపుగముల కెల్లఁ దార లక్ష్యంబు లగుచు ధీరధీరంబుగఁ జొచ్చి. 64

క. క్రమింగెడు కృష్ణోరగముల
భంగి న్బెబ్బులులక్రియ నిభంబులకరణిన్
సింగములభాతి నలవడు
సంగతితోఁ గదిసి రెల్లజనులుం బొగడన్. 65

వ. కదియుచుం గలహకంటకుండు తెలిసి పొడువు మోయన్న యని తెలుపుచు ఘాతగొనంగ నోహో చాలుం బట్టుం డని యుద్ధం బిట్టింపి భట్టి నృపుని దగ్గఱందెచ్చి వీరిజగడంబులు సంతసపడియె[1] ననిన. 66

---

1. వీరి జగడంబులంతరపడియె.

క. విను కలహకంటకుఁడ గ్ర
కుఁడన నాతని గౌఁగిలించుకొను మనవుడు నే
మని సంతసపడుదు మొకటి
యును పీడము పోటులాట యుడిపితిగేలా. 67

గీ. అనుడుదెలిసిపొడువుమమాయన్నయంటి
యన్నదమ్ములకొకకలహంబుగలదె
యనిన దక్కఁడలపడుచు నెట్లాడిరేని
నేమి దప్పగుననుడు మంత్రీశ్వరుండు. 68

క. ఓక లహకంటకుఁడయిది
నీకొఱకై కాదు శత్రునిఁ దగ్గఱుచుఁ,
రాకొట్టి పిలిచి మది ను
ద్రేకము పుట్టించి పోటు దెలుపఁగవలయుఁ. 69

ఆ.వె. కవులు పొగడువేళఁ గాంతలు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణము సేయువేళ రాకొట్టి పిలుచుట
పాడి యిదియ మిగుల భజన కెక్కు. 70

వ. వెండియు నీ వెంత చలంబు గొన్నను గారణంబు లేనిజగడంబు గావున భగవతియు బేతాళుండును నట్లాడించి రింకఁ బాడిగాని చేఁతలకుం జొరక రమ్మని దగ్గఱం దిగిచిన నప్పుడ రాజులుం బరివారంబును బ్రజలు నిదియ పంతంబనం గలహకంటకుండును నేకాంగవీరుండును గౌఁగిలించుకొని యొరయని యడుగులం బడిన. 71

మ. ధరణీనాయకుఁ డిద్దఱ న్సమముగాఁ దాంబూల జాంబూనదాం
బరభూషాదుల నాదరించి వరుసం బార్శ్వంబుల న్రాజులుం

పరివారంబుఁ గవీంద్రులుం గొలువఁగా భద్రాసనాసీనుఁడై
సరసాలాపకథానుకర్ణనముల న్సంప్రీతితో నుండఁగన్. 72

క. ధనహీనుం డొకవిప్రుం
డనువగుచోఁ బెండ్లిసేయ నర్థము వేడం
దనయచెయి పట్టుకొనుచుం
జనుదెంచెన్ దైన్యవృత్తి జనపతికడకున్. 73

చ. దినకరతేజుఁ డౌ జనపతిం గని దీవన లిచ్చి విప్రుఁ డి
ట్లనియె నృపాలశేఖర దయాపరిపూర్ణ మదీయభాగ్యజీ
వన యిది నాతనూభవ వివాహము సాగదు నేఁడు మేరగా
నెనిమిదియేఁడు లయ్యె ధనహీనుఁడఁ గావున వేఁడవచ్చితిన్. 74

సీ. రాజ్యంబు వదలక రసికత్వ మెడలక
జయశీల ముడుగక నయము చెడక
దీనులఁ జంపక దేశంబు నొంపక
నిజ ముజ్జగింపక నేర్పు గలిగి
విప్రులఁ జుట్టాల వెన్నుసొచ్చినయట్టి
వారిని గొల్చినవారిఁ బ్రజల
హర్షంబుతోఁ గాచి యన్యాయముడుపుచు
మున్ను చెప్పినరీతిఁ జెన్నుమీఱి

ఆ.వె. చేఁత లొండు లేక ప్రాఁతల విడువక
యశము కలిమి దమకు వశముగాఁగ
వసుధయేలు రాజవర్గంబులోన న
య్యాదివిష్ణుమూర్తి వంద్రుడు నిన్ను. 75

వ. ఈసీసపద్యంబులో గీతసహితంబుగా నాలుపాదంబుల మొదలియక్షరం
బులు, నందర్భంబుల మొదలియక్షరంబులుఁ గ్రమంబునం గూడుకొనంగ

నైన నా విన్నపం బవధరింపు మనిన నచ్చెరు వంది క్రమ్మఱం జదివించి మొదళ్ళ నర్థంబులఁ బంద్రెండక్షరంబుల నిడుకొని "రాజ దీని వివాహము చేయవయ్యా" యని యున్న బంధకవిత్వంబున కతివిస్మితుం డై తద్దైన్యం బుడుపం బూని. 76

క. జననాయకుండు విప్రున
కెనిమిదికో ట్లర్థ మిచ్చి యెల్లనరేంద్రుల్
తనుఁగొల్చినడువఁగా నొ
య్యనఁబురికరుదెంచె వైభవాఢ్యత మెఱయన్. 77

క. కావున నీవాతని సరి
కావు నృపా మగిడిచనుట కార్యం బనినన్,
భావమునఁ దద్గుణము సం
భావించుచు భోజవిభుఁడు మగుడంజనియెన్. 78

వ. మఱియుఁ గొన్ని దినంబు లరిగినఁ బదియేడవవాకిటం జనం జూచి. 79

—* పదునేడవబొమ్మ కథ *—

క. నీలాంబరసోదరు రజ
నీలాంఛనదివసచిహ్న నేత్రవిలాసున్
నీలగ్రీవప్రియసఖు
నీలోత్పలనీలవర్ణు నీలారమణున్. 80

శా. తాత్పర్యంబున సంస్తుతించుచుఁ బ్రశస్తం బైనలగ్నంబునన్
సత్పాత్ర ప్రదిపాదితార్థుఁడయి భోజక్షోణిపాలుండు సం
పత్పూర్ణంబగు వైభవంబు మెఱయ నృపాసనం బెక్కఁగాఁ
దత్పాంచాలిక నిల్వు నిల్వు మని తంత్రస్ఫూర్తిగా నిట్లనున్. 81

క. నృపరత్న మైనయుజ్జయి
నిపతిక్రియ సాహసాదినిపుణత్వము న

త్యుపకారంబును గలుగక
చపలమతీ దీని నెక్కఁ జనునే నీకున్. 82

క. ఉర్వీనాయకుఁ డయ్యును
నిర్వాణుల మీఱి యర్థనిస్పృహుఁ డగునా
సర్వజ్ఞుని సద్గుణములు
నిర్వచనముగాఁగ వినుము నే వినిపింతున్. 83

క. మాటలయం దెఱిఁగెద వే
నాఁటను ముంజేతికంకణంబున కద్దం
బేటికి వితరణగుణమునఁ
బాటిల్లెడి గుణము లెల్లఁ బ్రభువుల కుర్విన్. 84

క. మతిగలిగి చదువుఁ జిలుకలు
[1]హతమందంగాను బోటులాడుం బశువుల్
వితరణ మెవ్వనిగుణమగుఁ
జతురుఁడు శూరుండు నతఁడె జనులం దెల్లన్. 85

అ.వె. విక్రమార్కుబాహువిక్రమం బుర్విలో
నరులచేతనెల్ల నరులుగొనఁగఁ
గీర్తనీయ మైన కీర్తిఁ గీర్తించుచు
నర్థు లర్థములఁ గృతార్థు లైరి. 86

సీ. అదివసముల వర్షాత్యయోచితముగా
దలమైన వానలు వెలుచునంతఁ
దెల్లవాఱినయట్టితెఱఁగున నావేళఁ
దనమేళనం బెల్లజనులు పొగడ

1. హతముగఁ బోట్లాడు పసులు నజ్ఞానకృతుల్.

హంసనాదములు కాహళలుగాఁదత్పక్ష
లఘుతాడనములు తాళములుగాఁగ
మదములఁ గ్రాలు తుమ్మెదలఝుంకారమ్ము
లమరినవీణాస్వరములొయనఁగ

ఆ వె. యోగనిద్రఁజెందియున్నవిష్ణునిమేలు
కొలుపఁగడఁగు గాయకుం డనంగ
బంధుజీవ హర్షపరమౌచుఁ దద్రాగ
మయముగా శరత్సమయమొనర్చె. 87

క. శరదాగమమున నంభో
ధరపటలము విచ్చి చనిన దపనుండు మహా
కరి తెరవెల్వాడు క్రియఁ బు
ష్కరవిలసన మలరఁ జెలఁగెఁ గరసత్వమునన్. 88

క. పంకంబులాఱె నేఱుల
పొంకంబులు డిగ్గె తెల్లు పూచెను భువి ని
శ్శంకముగ నంచపిండు కొ
లంకుల విహరించె నట జలమ్ములుదేఱెన్. 89

ఉ. దీప్రముఖంబులొచు నలుదిక్కులు నేర్పడ దుగ్ధసింధుపూ
ర ప్రభ నొప్పువెన్నెలలు రాత్రి దివాకృతిఁ దేజరిల్ల లో
కప్రియుఁ డైనచంద్రు సమకక్ష్యలఁ జుక్కలు నిక్కఁగాఁ దదీ
యప్రతిబింబలీలఁ గుముదావళి వొల్చె సరోవరంబులన్. 90

ఉ. తెల్లనిరాజహంసలను దెల్లనికల్వలఁ దెల్లఁదమ్ములం
దెల్లని తెల్లుఁబువ్వులను దెల్లనిశీతమరీచిరోచులం
దెల్లనిచుక్కలన్ జగము తెల్లనయై యమృతాబ్ధిమీఱినం
దెల్లనికన్నుదోయిగల దేవర వచ్చె శరత్తు చూడఁగన్. 91

క. జడి గాక వెట్టి గాకయు
వడ గాకయుఁ జలియుఁ గాక వఱపిడి యనియే
ర్పడక యిలుఁ బసిమివండఁగ
బడుగులుప్రియమందిరనఁగఁ బ్రభులకుఁదగదే. 92

చ. అవని నవంతిభూమివరుఁ డాదిగఁ బార్థివు లెల్ల లక్ష్మియు
త్సవములు మున్నుగాఁ గడుఁ బ్రశస్తములౌ సమయంబులందు స
త్కవులను బాఠకోత్తముల గాయకుల న్నటుల న్వితీర్ణివై
భవములఁ దన్పఁజొచ్చిరి ప్రభావసమృద్ధుల నిందు పుట్టఁగన్. 93

ఉ. అట్టిదినంబుల న్నృపకులాగ్రణిదానసమృద్ధి యొక్కఁడన్
బట్టు నుతింపఁగాఁ బరనృపాలకు లచ్చెరువంది మెచ్చ నా
యట్టిమహీశుఁ డర్థులఁ గృతార్థులఁ జేయుచుఁ గీర్తిచేకుఱం
బెట్టెడునట్టిసద్గుణము పెంపున నాతని మీఱనోపఁడా. 94

క. అని యడిగిన నాబట్టో
య్యన నవ్వుచు నోనృపాల హరునిప్రసాదం
బున సిద్ధపురుషుఁ డగు నా
జననాథుఁడు గుణములందు సామాన్యుండే. 95

ఉ. దానక్షాత్రంబులు నా
మానవపతియందకాని మఱి యొందుదెసం
గానము విను మాతని సరి
పూనెద మనఁ దరమె తరణిపుత్రునకైనన్. 96

మ. అనినం జిత్తములోన లజ్జయు వృథాహంకారముం బుట్టఁగాఁ
దనలోఁ దాన యడంచికొంచు మృదువస్త్రస్వర్ణభూషాదు లా
తని కింపొందఁగ నిచ్చి పుచ్చి పిదపన్ దానంబున న్విక్రమా
ర్కునిసాదృశ్యము నొందఁగోరుమతి నాక్షోణీశ్వరుం డుండఁగన్. 97

సీ. ఒకనాఁడుకొల్వులోనికి సిద్ధుఁ డొకరుండు
చనుదెంచి సుఖగోష్ఠి జరపునపుడు
తాపసోత్తమ నాకు దానగుణంబున
విక్రమార్కుని మీఱ వెరవు గలదె
యనవుడు సాహసహవనంబు చేసిన
సిద్ధించు నందుల చేఁత వినుము
యోగినీచక్రంబు నొందుకుండములోన
నొక లక్ష గోఘృతాహుతులఁ బోసి

ఆ.వె. పొదలఁజేసి మేను పూర్ణాహుతిగ వేల్చి
వెనుకఁదత్ప్రసాదముననె బ్రదికి
దాన విభవమునకుఁ దగినంత వేఁడుము
మెఱసి సాహసాంకు మీఱవచ్చు 98

చ. అనవుఁడు నుత్సహించి నృపుఁ డాతని వీడ్కొని రాత్రి సర్వయో
గినులఁ దలంచుచుం జని సకీలకమంత్రజపంబుతోఁ దదీ
యనిలయవహ్నికుండమున నాహుతు లన్నియుఁ బోసి తెంపునం
దనువును వేల్చె నిత్యమగు దానము దేహముకంటెఁ దీపిగాన్. 99

క. ఆయెడ యోగిను లాజన
నాయకు బ్రదికించి నిలిపి నరనాథః మము
న్నీయత్నంబునకుం దగ
నేయిష్టంబైన నడుగు మిచ్చెద మనుడున్. 100

క. దండాకృతిగా జనపా
లుండును ధరఁ జాఁగి నిచ్చలును ధనములు నా
భాండాగారము లేడును
నిండం గురుజింపుఁ డనిన నేర్పున వారున్. 101

క. నిచ్చలు నీవిటు చేసిన
నిచ్చెద మీకొలఁది నిండు లేదును నింద
న్వెచ్చించుకొమ్ము నావుడు
నచ్చట నృపుఁ డియ్యకొని గృహంబునకరిగెన్. 102

ఉ. ప్రొద్దున లేచి యిండ్లు ధనపూర్ణము లౌట యెఱింగి యాత్మలోఁ
దద్దయు సంతసిల్లి వసుధావరుఁ డుజ్జయినీశు మీఱుచుం
బెద్దల నంధులన్ హితులఁ బేదల నందఱఁ గూర్చి యర్థముల్
దొడ్డలు చేసె దాననిరతుం డనఁ బైకము చిక్కకుండఁగన్. 103

క. ఈగతి ననుదినమును భాం
డాగారములెల్ల రిత్తలైనం దనువ
య్యోగినులకు నాహుతిగ ని
యోగించుచు నిచ్చు ధనములొసఁగుచునుండున్. 104

ఉ. ఈక్రియఁబర్వుకీర్తి నుతియించుచు యాచకు లెల్లఁ జెప్పఁగా
నాక్రమ మేర్పడ న్విని ప్రియంబును జోద్యము నగ్గలింపఁగా
విక్రమభూషణుండు మునివేషముతో నటకేగి యోగినీ
చక్రగృహంబులో నతని సత్త్వముఁ జూడఁ దలంచి యుండఁగన్. 105

ఉ. ఆనగరంబులోని నృపుఁ డల్లన రే యరుదెంచి మంత్రని
ష్ఠానిరతాత్ముఁ డై జపము సల్పి ఘృతాహుతులిచ్చి యగ్నిలో
మేనును వేల్చి యోగినులమెచ్చున దొల్లిటిరూపుదాల్చి యా
పూనిక నర్థము ల్వడసి పోయి భజించె వితీర్ణిఁ గర్ణుఁడై. 106

క. మఱునాఁటిరాత్రి మునుకడఁ
దటి యెఱిఁగి యవంతి విభుఁడు దయదైవాఱం
గొఱఁతపడకుండ వెరవుగ
నెఱమంటలకుంత మున్న యెద కరుదెంచెన్. 107

క. ఆ హోమకుండమునఁ దన
దేహమువేల్వంగ నచటి దేవత లెలమి
న్సాహసము మానుపుచు నీ
యీహిత మేదేని వేఁడు మిచ్చెద మనినన్. 108

ఆ.వె. ఇచటి భూమిపాలుఁ డీక్రియ నిచ్చలు
మిడుకునగ్నిలోనఁ బడక మున్న
యతనియిండ్లు లెపుడు నర్థంబుచేనిండి
యుండునట్లుగ వర మిండు చాలు. 109

క. అనవుడుఁ గొనియాడుచు న
ట్లొనరించెద మనుచుఁ బలికి యోగినులంతం
జనిరి నిగూఢుండై నృపుఁ
డు నవంతికి మగిడె నొక్కఁడును బెంపెక్కన్. 110

సీ. తదనంతరంబ యాతఁడుతొంటిక్రియవచ్చి
యాగంబు సేయఁగాయోగమాత
లరుదెంచి నృపుని ప్రయాసంబునకు నడ్డ
మై విక్రమార్కధాత్రీవిభుండు
తనమేనువేల్వఁ గైకొని మమ్ము మెచ్చించి
నీయిండ్లు ధనమున నిండఁజేసె
నిచ్చలుఁ జావక విచ్చలవిడి ధన
మెంతైన నర్థుల కిచ్చికొమ్ము

ఆ.వె. నావుడు నతండు దురభిమానంబు విడిచి
విస్మయంబును లజ్జయు విస్తరిల్ల
మీఁఱఁజూచటు తనుమీఱి మెఱసినట్టి
యతనిఁ బొగడుచు నగరికి నరిగెఁగాన. 111

క. నీవును నాక్రియ నింటికిఁ
బోవుట మే లనుచుఁ గనకపుత్రిక వలుకం
గా విని యాతఁడు నుజ్జే
నీవల్లభు కృపయుఁ దెంపు నేర్పునఁ బొగడెన్. 112

క. లగ్నము దప్పినచొప్పుల
భగ్నంబగు యత్నమునకుఁ బౌరులు మది ను
ద్విగ్ను లయి చనఁగ లజ్జా
మగ్నుండై భోజరాజు మగుడం జనియెన్. 113

—పదునెనిమిదవ బొమ్మకథ—

వ. తదనంతరంబ యొకదినంబున నష్టాదశద్వారంబునం బ్రవేశోన్ముఖుండై.

క. వెలిపట్టును బులితోలును
మలయజమును బూదిపూఁత మణులున్ ఫణులుం
దిలకము నెఱగన్నుం గల
వెలఁదియు మగవాఁడునైన వేల్పుఁ దలంతున్. 115

మ. అని భోజక్షితినాయకుం డమరపీఠారోహణవ్యగ్రుఁ డై
చనుదేరం గని బొమ్మ వల్కెఁ ధరణీశా విక్రమాదిత్యు చా
డ్పున వేడ్కన్ ఘనధైర్యము న్వితరణంబు న్లేక నీకిమహా
సన మెక్కం దర మౌనె యాతని మహోత్సాహంబు సామాన్యమే. 116

క. జనవర నిర్వచనముగా
విను ముజ్జయినీవిభుండు విష్ణునిక్రియఁ బా
లనశక్తి మెఱసి మనుజుల
మన మలరఁగ మనుపుచుండి మహియేలంగన్. 117

ఉ. క్రూరుఁడు నీరసాత్ముఁడును గుచ్ఛిత బుద్ధియు దూషకుండు నా
చారవిహీనుఁడున్ ఖలుఁడు సత్యవిదూరుఁడు దుర్నయాఢ్యుఁడుం

జోరుఁడు నస్థిరుండు నలసుండును దుర్బలుఁడు న్మదాంధుఁడు
న్మారవికారకష్టుఁడును మందుఁడు మందునకైన లేఁ డిలన్. 118

క. ఆదివసంబులలో నొక
వైదేశికుఁ డరుగుదెంచి వసుధాపతిచే
నాదృతుఁ డై యతనికి నా
నాదేశస్థితులు నేర్పునం జెప్పంగన్. 119

ఆ.వె. మాటలందె యతని మహియెల్లఁ దిరిగిన
ఘనుని సిద్ధపురుషుఁగా నెఱింగి
మిగుల నాదరించి జగతీవరుండు త
త్కథలు వినుచు మఱియుఁ గౌతుకమున. 120

క. నిశ్చయముగ భువిఁ దీర్ఘపు
రశ్చరణాసక్తి నుత్తరము దక్షిణముం
బశ్చిమముఁ దూర్పుఁ దిరిగితి
వాశ్చర్యం బేమిగంటి వానతి యిమ్మా. 121

క. నావుడు నాతఁడు నేఁ బృ
థ్వీవలయం బెల్లఁ గలయఁ దిరిగితి నుదయ
గ్రావసమీపంబున నా
నావిధమణిరమ్య మైన నగరము గంటిన్. 122

క. కనకాహ్వయ మను నగరము
కనకాచలతట మనంగఁ గాంతిం బొలుచున్
ఘనమండల మందుచు న
ర్కునిమండల మనఁగఁ బసిఁడిగుడి గల దచటన్. 123

క. సూర్యప్రభయను నది త
త్పర్యంతమునందునుండి పాఱుఁగ నతిగాం

ధైర్యంబు గలిగి నడుకొని
మర్యాదనె సీరు నిలిచి మడుఁగై యుండున్. 124

ఆ.వె. అచటఁ జంద్రకాంతఖచితసౌపానమై
నాల్గుదెసలఁ గాంచనంబులైన
హర్మ్యముల భజించు నఘనాశనం బనఁ
గలదు తీర్థము కడ గానరాదు. 125

మ. విను మావింధ్యమునందుఁ బ్రొద్దున శిరోవిన్యస్తపీఠాంక మై
కనక స్తంభము పుట్టి పుట్టి యినుఁడాకాశంబు ప్రాఁకంగఁ దా
నును నాఁచొప్పునఁ జక్కఁగాఁ బెరిఁగి భానుం జేరి మధ్యందినం
బునఁ దద్బింబము ముట్టి క్రమ్మఱు నదిం బ్రొద్దున్ దిగం జాఱఁగన్.

ఆ.వె. ఇనుఁడు గ్రుంకువేళ నిక్కడఁ దాఁ గ్రుంకుఁ
బొడుచువేళ నట్ల పొడిచి పెరుఁగుఁ
జిత్ర మిద్ది రాజశేఖర! సృష్టిలో
నలువనేర్పు చెప్ప నలవి యగునె. 127

క. ఎన్నఁడు నిట్టి విచిత్రము
కన్నది విన్నదియు లేదు కడపట గుణసం
పన్నుని సజ్జనమిత్రు జ
గన్నుత నినుఁగంటి ననినఁ గడుమోదమునన్. 128

శా. తత్కాలోచితగోష్ఠి దీర్చి యతనిం దాంబూలపూర్వంబులౌ
సత్కారంబుల నాదరించి కొలువుం జాలించి యారాత్రి యు
ద్యత్కౌతూహలుఁ డౌచు ఖడ్గసహితుం డై యొక్కఁడు న్నృపవరుం
డుత్కోచంబుననేగె నాదెసకు నాయుగ్రాటవు ల్దూఱుచున్. 129

మ. ఘనుఁ డట్లేగుచుఁ గాంచెఁ గాంచనమయాగారప్రకీర్ణాఘనా
శనతీర్థాంత సమున్నమన్నిజవపుస్సంభూతి హేతుప్రచా

లనలీలాకృతడంబరాంబరతలాలంబోష్ణరుగ్బింబ చుం
బన విస్రంభ విజృంభితాద్భుతరస ప్రారంభముఁ స్తంభముఁ. 130

సీ. కని విస్మితుం డౌచుఁ జని హేమగృహముల
రత్నగోపురముల రమ్యమైన
పురము దగ్గఱి దాని పొంత సూర్యప్రభ
నానొప్పు నేఁటిలో స్నానమాడి
గుడిలోని యాదిత్యుఁ గడుభక్తిఁ బూజించి
యిష్టదైవముఁ బరమేశుఁ గొల్చి
యుపవాస ముండి సముత్సుకుఁ డై దేవ
తాయనమున నారేయి గడిపి

ఆ.వె. రేపకడన లేచి పాపవినాశన
తీర్థమునకు నేగి పార్థివుండు
జలకమాడి యచట సంధ్యనారాధించి
జలజమిత్రు నాత్మఁదలఁచునపుడు. 131

ఆ వె. తెలివిపడఁగ మొదలి దిక్పతికెత్తిన
గొడుగుమీఁది పసిఁడిగుబ్బ యనఁగఁ
దూర్పుకొండమీఁదఁ దోఁచె మార్తాండుని
మండలంబు భువనమండనంబు. 132

ఆ.వె. తీర్థమధ్యమమున దివ్యపీఠాంకమై
జిగి దొలంక బుగ్గ లెగయుచుండ
నవ్యమైన కనకనాళంబు గల మహా
కమల మనఁగఁ బుట్టెఁ గంబ మపుడు. 133

క. కడుచోద్యమంది యీఁదినఁ
దద వగు నని యాతఁ డద్భుత స్తంభముపైఁ

పదనుటికి పీఁటమీఁదను
జడియక కూర్చుండి యోగిచందము దోఁపన్. 134

క. ధరణీశుండెక్కిన మొగ[1]
తిరుగక కంబంబు తొంటితెఱఁగున నాభా
స్కరుగతికొలంది జంకక
పెరిఁగెఁ గపటవామనుండు పెరిఁగినకరణిన్. 135

శా. కంభం బీక్రియ నిక్కుచున్ బిఱుసుగల్గం బెద్దయు న్నిక్కఁగా
గంభీరుం డగురాజు కైకొనఁడ యాకాశంబు ముట్టంగన
య్యంభోజాప్తుఁడు చేరనిచ్చు టది హైన్యంబంచు మధ్యాహ్నసం
రంభంబేర్పడ నెండ చిచ్చు గొని పర్వంజేసె గర్వంబునన్. 136

ఉ. చేసిన నెండపెల్లునకుఁ జిక్కక స్రుక్కక నిక్కిమిక్కిలిన్
డాసినఁ గ్రమ్మఱ న్రవి దృఢంబుగ రశ్మిసహస్రమెల్లఁ బై
నీసునఁ గప్పినంతఁ జలియింపక నిల్చినవానిఁ జూచి యు
ల్లాసముతోడ నిట్లనియె లావును దాల్మియుఁ జెంపు మెచ్చుచున్ 137

ఆ.వె. లక్షయోజనంబులను నిల్చి యైన నా
యెండ మానవులు సహింపలేరు
నన్నుఁ జేరనోపునా యున్యుఁ డట్లేని
గాలి నేలపాలు గాకయున్నె. 138

క. నరనాయక నీ పీయెడఁ
బరమేశ్వరు కరుణఁజేసి బ్రతికితి నిజసు
స్థిరభావము సాహసమును
బరికించి మనంబు హర్షభరితం బయ్యెన్. 134

---

1. ధరణిపుఁ డెక్కినమొగ్గక, తిరమై-పా.

క. నీవును నేనును నొక్కటి
గావున నాకుండలములు గైకొను మివి సం
భావనతో నిత్యమును మ
హీవర సౌవర్ణభార మిచ్చుచునుండుఁ. 140

ఆ.వె. ఎన్న నాల్గుమాడ లెత్తొకకర్షంబు
నాల్గుకర్ష లైన నగుఁ బలంబు
పలము లొక్కనూఱు తుల యగుఁ దుల లొక్క
యిరువది మితి భార మిది మతంబు. 141

క. అని యిచ్చినఁ గైకొని యా
తనిపదముల కెఱఁగి మగుడుతఱిఁ గంబంబో
య్యనఁ గ్రుంకఁగఁ దీర్థమునకు
మనుజేంద్రుఁడు చేరవచ్చె మాపటివేళన్. 142

ఆ.వె. కంబ మచట మునుఁగఁగా గంతుగొని తీర
భూమి నిలిచి తగిన నేమమెల్లఁ
దీర్చి భక్తితోడ దేవతాలయములో
నుండి రేయి గడపి యొక్కరుండు. 143

శా. ప్రాతఃకాలమునందు లేచి ధరణీపాలుండు తీర్థంబులో
స్నాతుండై నియమంబుతోడ శివపూజాకృత్యముం దీర్చి సం
ప్రీతింగ్రమ్మఱి వచ్చుచోఁ దెరువునం బృథ్వీసురుం డొక్కరుం
డేతెంచెం గడుదీనుఁ డై యతని నింపేపార దీవించుచున్. 144

క. చేరఁ జనుదెంచి యతఁడో
వీరోత్తమ పేదవాఁడ విప్రుఁడ నేనా
హారంబు వేఁడి వచ్చితిఁ
గారుణ్యము మెఱసి యిచటఁ గావుము నన్నున్. 145

మ. అనినం జూచి కృపారసం బెనయ నాహారార్థి యావిప్రుఁ డీ
తని కిచ్చో నశనంబు లే దితని చేతఃప్రీతి గావింప వే
ధనము న్లేదు ప్రదాతకుం దగిన పాత్రం బబ్బినం బ్రాణమై
నను వంచింపక యిచ్చు టొప్పు నని పుణ్యశ్లోకుఁ డుద్యుక్తుఁ డై. 146

క. మితి లేని మహిమ నీకది
ప్రతిదివసము నొకసువర్ణభార మొసంగున్
మతిఁ జింతింపక పొమ్మని
యతిముదమునఁ గుండలమ్ము లాతని కిచ్చెన్. 147

శా. దానం బీక్రియఁజేసి యెక్కడ యెడఁ దీర్థస్వార్థము ల్సేకుతె
న్నానాచోద్యములెల్లఁ జూచితి జగన్నాథు న్నవిం గంటి స
న్మానం బచ్చట నొందితిన్ ద్విజుని దైన్యం బంతయుం బాపితిన్
దీనం బుణ్యుఁడ నైతి నంచుఁ బురికేతెంచెం బ్రమోదంబునన్. 148

ఆ.వె. నీకు నీగుణములు లేక యీగద్దియ
యెక్కఁదగదు మగుడనేగు మనిన
మనములోన నతనిఁ గొనియాడుచును భోజ
మనుజవిభుఁడు భవనమునకు నరిగె. 149

శా. సంసారాంబుధిపూర్ణమగ్నజననిస్తారాంఘ్రి పంకేరుహున్
హింసావర్జితభావభవ్యమతి యోగీంద్రాత్మపద్మావళీ
హంసాకారు వికారదూరుని విమోహధ్వంస నోత్తంసునిం
గంసారాతిఁ బురారిమిత్రుఁ ద్రిజగత్కల్యాణసంధాయకున్. 150

ఉ. కంజభవార్చనీయపదకంజు నిరంజనునిం బురత్రయీ
భంజను నంజనాచలనిభద్విపదైత్యఘనప్రభంజనున్
సంజనితప్రమోదగిరిజాతనుమంజుల వామభాగు మృ
త్యుంజయు నాంజనేయవిహితోన్నతగీతకృ తాత్మరంజనున్. 151

మాలిని. గిరివిరచితచాపా కృష్ణమేఘాభిరూపా
సురసరిదవతంసా క్షుణ్ణదైతేయహింసా
గరళగిళనదక్షా కంజపత్త్రాయతాక్షా
పురహరహరిరూపా పుణ్యగణ్యస్వరూపా.

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలీకభేకఫణీంద్ర వీరఘోట్టవిశాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిలాంధ్రమహారాష్ట్రభూపాలరూప నూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాఁటిపృథివీశ్వరరాజ్యసముద్ధరణశ్రీకొఱవి వెన్నయామాత్యపౌత్త్ర హరితసగోత్త్రపవిత్త్ర సకలసుకవిమిత్త్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్త్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కునిదానమహోపకారసాహసౌదార్యప్రశంసనం బన్నది సప్తమాశ్వాసము.

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## అష్టమాశ్వాసము.

క. శ్రీలలనాతనురుచిశం
పాలతికాచిరవిలాసపరికీర్ణవపు
ర్లీలాతిశయవిడంబిత
నీలాంబుదవర్ణుఁ ద్రిభువనీపరిపూర్ణున్. 1

—పందొమ్మిదవ బొమ్మకథ—

మ. మతిలో నిల్పి యతండు సజ్జనుల సంభావించి దైవజ్ఞస
మ్మతమౌ వేళఁ గడంగి యెక్కు జనుచో మాన్పించి యేకోనవిం
శతిమద్వారముపొంతబొమ్మ వలికెన్ క్ష్మాపాలకా మూర్ఖ భా
రతపర్వంబు పఠింపఁ బూనుట చుమీ రాగిల్లు నీయత్నముల్. 2

క. ధారానాయక ధారుణి,
నారూఢుం డైన విక్రమార్కునికరణిన్
శూరుండును ధీరుండు ను
దారుండును గాక యెక్కుఁదగ దెవ్వరికిన్. 3

మ. అది యెట్లన్న నెఱుంగఁజెప్పెదఁ దదీయం బైనచారిత్ర ము
న్మదవైరిద్విపసింహ మర్థిజనతామందార మాభూవరుం
డుదయాస్తాచలమధ్యభూమి దనకై నొప్పారు నుజ్జైని సం
పదలం బొంపిరివోవ రాజ్యము నయప్రాజ్యంబుగా నేలఁగన్. 4

ఉ. ఆజననాథుఁ గొల్చి కనకాభరణంబులఁ దేజరిల్లు కాం
తాజనుల న్విచిత్రవసనంబుల బంటుల నందలంబులం

దేఱులఁ జామరంబులను[1] దెల్లని యెల్లుల నేపు సూపుచున్
రాజును మంత్రులు న్సుకవిరాజులు నుండుదు రొక్కచైవడిన్. 5

ఆ.వె. అట్టిదివసముల సమ స్తభూపాలురు
భటులుఁ గవులు హితులు బలసి కొలువ
సురగణంబులోని సురరాజుభంగిన
య్యవనిపాలుఁ డున్నయవసరమున. 6

క. ముకుళితకరుఁడై దౌ వా
రికుఁ డెదుర న్నిలువఁబడి ధరిత్రీశ్వరుఁ కా
నికగా సాళువముం గొని
యొక నల్లనిచెంచు వచ్చియున్నాఁ డనుడున్. 7

క. తత్కారణంబు దెలియ స
ముత్కంఠుండై[2] నిజాభిముఖమానవసం
పత్కరదర్శనుఁ డగు భూ
భృత్కులతిలకుండు వానిఁ బిలువం బంచెన్. 8

మత్తకోకిల. నెమ్మిఁ బచ్చని కుప్పసంబును నీలిచీరయుఁ జీలియుం
దమ్మిపూసలపేరు నెట్టనిధాతుబొట్టును జూరనం
గమ్ముపైఁ దగు సొమ్ముగాఁ బిడికత్తి కాసె నమర్చి పా
బమ్ముల న్వ్రేలుఁ గేలఁ బూనొక్కని యంతఁ జెంచు దెంచుచున్.

క. దూరంబున నుడుగణపరి
వారుండై వెలుఁగు రజనివల్లభుక్రియ ను
ర్వీరమణులలో నొప్పెడు
నారాజుం జూచి మ్రొక్కి యతివినయమునన్. 10

1. దేటయి నీటయి నేటు జూపుచున్ 2. ముత్క లికుండై.

ఆ.వె. నీవు దాడివెట్టి నెగడిన నఱుమక
యీఁకవిరిగి గొందు లీఁగునృపుల
పగిదిఁ బులుఁగులెల్లఁ బఱవ వేఁటాడు నీ
సాహసంబు గొనుము మానవేంద్ర. 11

క. అని చూపి కొలువులోపలఁ
దనచేతి విహంగమమును ధరణీశుని కొ
ప్పన చేసి తాను వచ్చిన
పనిఁ జెప్పఁ గడంగి యతఁడు పతి కిట్లనియెన్.  12

ఆ.వె. నృపులు గానలేని నీమహావసరంబు
నేఁడు గంటి దొడ్డవాఁడ వైతి
మానవేంద్ర యేను మందరగిరినుండి
యరుగుదెంచినాఁడ నవధరింపు. 13

శా. ఓ రాజన్యకులావతంసక! తదీ యోపాంతభాగమ్మునన్
భేరుండాదిమహామృగేంద్రనివహాభివ్యాప్తమై యున్నత
స్ఫారానేకమహీరుహప్రకరవిస్తారావరుద్ధార్కసం
చారం బైనయరణ్య మున్నది తమస్సందోహసందష్టమై. 14

సీ. ఆదివరాహ మాయడవి యేకలములు
మన్నించి విడిచిన గున్నయొక్క
దిక్కరు లక్కడ నక్క నేనుఁగుల చేఁ
దోలుడువడి చన్న దున్నలొక్క
చండికసింహ మచటఁ బేర్చుసింగంపుఁ
గదుపులోఁ దప్పిన కొదమయొక్క
కాలునిపోతం దుఁ గల కారుపోతులఁ
గూడిరాలేకున్న దూడయొక్క

ఆ.వె. మారకమ్మపులి యచట మలయుచున్న
పెద్దమెకములు పెంచిన పిల్లయొక్కొ-
యనఁగ వాలుమృగంబుల కదియ యెపుడు
నాటపట్టగుజాడలు తేటపడఁగ. 15

సీ. అందులపందుల దందంబు క్రందువ
లీలావరాహంబు నేలఁగలసె
నచ్ఛోటిమదలులాయములతో బెసగి యా
యెనుపోతు యమలోకమునకుఁజనియె
నక్కడి కృష్ణమృగౌఘంబుచేఁ జాలఁ
దూలి సారంగంబు గాలిఁబోయె
నట కొండగొఱియల యదుటుననొచ్చి
మహామేష మగ్ని పాలయ్యెఁ ననఁగ

ఆ వె. నొప్పు నితరజంతువులను జెప్పనేల
[1]దుప్పులెలుఁగులుఁదోడేళ్ళు దుప్పు లిర్లు
[2]కొరనువులు మెడినాగులు గుజ్జుఁబిళ్లుఁ
గణఁజు లేదులుఁ గుందేళ్ళుఁ గలవు పెక్కు. 16

ఉ. అయ్యెడ నొక్కయేకల మహంకృతితో గుహనుండి నిచ్చలుఁ
దయ్యము కైవడి న్వెడలి దౌడలు గొట్టుచు బెట్టు రొప్పుచుం
జయ్యనఁ జొచ్చి యేర్చిన గజంబులు మున్నుగ నమ్మృగంబులన్
బ్రయ్యలుగాఁ బడం బొడిచి వారకచంపుచు నుండు గండునన్. 17

గీ. ఎదిరిపందులు దానిపైఁ గదిసిపొలియుఁ
బందెగాఁ డొక్కఁ డ్రేటుగఁబంతమాడి

---

1. దుప్పులెలుఁగులు వ్యాఘ్రంబు లుప్పతిల్ల- 2. వరలు దురువాతులు స్సరపతులు గల్గి-కొఱనువులు మరినాగులు గుజ్జుశిండ్లు.

యోలి నిలిపి యడిదమునఁ ద్రోలిత్రేయ
ఖండితములగు గుమ్మడికాయలట్లు. 18

క. ఆకొమ్ముకాఁడు తొల్లిటి
యేకలమో కాక యముఁడొ యిట్టివిచిత్రం
బేకడఁ గానము విను మది
నీకెఱిఁగింపంగఁ బూని నేఁ బనివింటిన్. 19

మ. వసుధానాయక వేఁటకుం గదలు సత్త్వం బెక్కు మేనంతకున్
సుసరం బౌ లఘు వౌ జయం బగు రిపుక్షోభం బగు న్సద్గుణ
ప్రసరం బేర్పడుఁ జేతి సూటి మెఱయింపం జో టగు న్వేఁట దు
ర్వ్యసనం బంద్రు ధరిత్రినిట్టిగతి సౌఖ్యం బొందుచోఁ గల్గునే. 20

క. అంచుంజెప్పినఁ బ్రియపడి
చెంచుం గనకాంబరములఁ జెలువారఁగ మ
న్నించి వరాహముఁ ద్రుంపఁద
లంచి మృగవ్య ప్రయాణలాలసమతి యై. 21

సీ. దీపంపువేఁటలు దామెనవేఁటలు
తెర వేఁటలును నేర్పు తెరలికలును
బందెమాడినభంగిఁ బందులనొప్పింపఁ
బూ టకాం డ్రనఁదగు వేఁటకాండ్రు
సారమేయంబు లొ సారమేయంబుల
పట్టెడగొలుసులు పట్టినడువ
భేరుండగండగంభీరత్వ ముడిగించు
భేరీరవంబులు బోరుకొనఁగ

ఆ వె. వారువమునెక్కి మితపరివారుఁడగుచుఁ
బోటుకాండ్రును వడిగలయేటుకాండ్రు

వాటపడ వెన్కనరుదేర వేఁట గదలె
మందరంబున కవనిపురందరుండు. 22

వ. అట్లు గదలి కతిపయదినంబులకు దుశ్చరంబగు నగ్గిరిపశ్చిమతటంబున గండ భేరుండాదిప్రచండమృగాండజప్రకాండపరిగణ్యం బగునరణ్యంబుదరి యంజొచ్చి యచ్చటి శిలోచ్చయంబులం బ్రతిధ్వనులను సముదంచితంబు గంబెంచు చెంచులయార్పులును శునకకోలాహలంబులుఁ గాహళాదివాద్యరవంబులు దిక్కులు చెవుడుపడ సమీపించి. 23

క. మెలఁకువ లగుచోటుల మను
ఘలకందువులను జలంబు గొనునెడలను మేఁ
తలపట్లను మృగములకును
వల లొడ్డుచు వేఁట కాండ్రు వలఁకులఁ జనఁగన్. 24

క. పులియొదిఁగి యెగసి యశ్వము
తలదొడుకఁగ నృపుఁడుసురియఁదలద్రెంచిన మే
నిలఁబడఁగఁ బడక యాతల
లలితాశ్వంబునకుఁ బులితలాటము చేసెన్. 25

చ. అటఁ జనునంతలోపల నవాంబుధరౌఘము భంగి ముందటం
గిటకిటఁ గోఱలన్ ధరణి గీఱుచు రొప్పుచుఁ గొప్పరించుచుం
గిటిగణ మేగుదేరఁ గని క్రేవలఁబట్టిన వేఁటకుక్క లొ
క్కట గొలుసు ల్వడి న్విడువఁగాఁ బఱచెం బవమానవేగులై. 26

చ. పఱచుచుఁ గొంకులుం దొడలుఁ బట్టి విదుర్చుచు మాలెగట్టిన
న్మొఱఁగుచుఁ గ్రమ్మఱం దొడికి మోఱలఁ ద్రిప్పినఁ జోటు దప్పఁ గ్రే
ళ్ళుఱుకుచు సింగము ల్గరుల నొక్కటఁ బట్టెడు భంగి దాఁటుచుం
గఱచుచుఁ జాగనీక యరికట్టుచు బెట్టుగ నేచెఁ బందులన్. 27

క. కినిసి వరాహము వాడిచిన
శునకముతల ద్రెళ్లి యెగసి చొప్పేర్పడ నొం
డునేలవునఁ బడియెఁ గవ్వడి
తునుమాడిన యా జయద్రథునితలవోలెన్. 28

వ. అంతట వేఁటకాండ్రును నొండొరువులఁ గడవం బాఱి గంటిలేని కుఱుగంట్లం గలిగి మెఱుఁగారెడి సూటిగల పందిపోట్ల దృఢంబుగా నత్తుకొని యొత్తిలి పోయి మొగము దప్పమాటున బలుమాటునం గదిసి పెద్దగున్నలను, జిఱుగున్నలను, బిడిపందులను, నెదమల్లరంబులను, గొమ్ముకాండ్రను నొక్కుమ్మడిం గ్రుమ్మునప్పుడు. 29

క. గంధగజలీలఁ బంది మ
దాంధంబై యొకని జీరినట్లుగఁ బొదువ
న్సంధింపం బడిన జరా
సంధుని క్రియ వ్రయ్య లొక్కసరసం బడియెన్. 30

ఆ.వె. అట్టివేళ నృపుఁడు కట్టెదురను
[1]నారి బెట్టుపొదమ, నమ్ము వెట్టి తిగిచి
బొట్టు వెట్టినగతిఁ బట్టెలసం దేసెఁ
దిట్టినట్లు పంది మిట్టి పడఁగ. 31

వ. ఆసమయంబున బెబ్బులిం గని పఱచుపశువులపగిది నవ్వనమదగజంబులు మొదలుగాఁగల మృగంబులును వేఁటకాండ్రును నొక్కదిక్కునకుం బఱతెంచిన నంతం దత్పశ్చిమభాగంబున. 32

సీ. పాతాళ మీఁగినపందిఁ జోరికిఁ బిల్చు
కైవడి నందంద కాలు ద్రవ్వఁ

1. నారి, జిట్టబొదమికమ్ము వెట్టినగతి పందివాట్లగ్రుచ్చి పట్టెత్తిదద్దెనం-

గనుసన్నఁ బ్రాణులఁగాల్పఁబూనినమాడ్కిఁ
గన్నుల మిఱుఁగుఱుల్గ్రమ్మఁజూచు
దిగ్గజంబులు మది బెగ్గిలి గ్రుగ్గఁగా
జంకించుగతి వెక్కసముగ రొప్పు
నరుకనిహయముల నరికట్టఁ జనురీతిఁ
గొనవెండ్రుకలు నిక్క గొప్పరించుఁ

ఆ.వె. దిరుగుచోనడ్డమగు కులగిరులఁ దునుమ
వాఁడియిడుభంగిఁ గోఱలుతీఁడికొంచుఁ
గాలమృత్యువు రేఁగిన కరణి లోక
మాకులంబుగఁ గవిసె నయ్యేకలంబు. 33

వ. అట్లు దవ్వుల మలయుచున్నం జూచి యచ్చెరువంది యిచ్చ మెచ్చుచుఁ జిత్తంబున నుత్తలపడక యత్తలం బందుఁకొని. 34

ఉ. వాహముఁ దోలి రాజకులవర్యుఁడు చేరెఁ గృతోల్లసన్మృగ
ద్రోహము నిత్యవీరరసదోహము సంజనితాంజనాద్రిసం
దేహము నత్యుదగ్రఘనదేహము నుద్ధతకాననాంబుధి
గ్రాహము సర్వభీతికరగర్వనిరాహము నవ్వరాహమున్. 35

క. చేరిన నది మది బెదరక
యూరసమునఁ గడచి యతని నెదిరించె సుభ
ద్రారమణుని జెనయఁగ భూ
దారాకృతివచ్చు మూకదానవుమాడ్కిన్. 36

క. అత్తఱిఁ దనచిత్తంబునఁ
దత్తఱపాటొండు లేక ధరణీరమణుం
డత్తలము వైవ నది గని
తుత్తుమురుగఁ బొడిచె రేఁతతుందిలముక్కియన్. 37

క. పొడిచినఁ దడయక పిడికిట
నడిదము బెడిదముగ నెగడ నతఁ డశ్వము న
య్యెడ కదరించినఁ గ్రోధము
వడి మగుడఁగ మగిడెఁబుడమివడవడ వడఁకన్. ౩౮

ఆ.వె. అట్లుదిరిగి చనిన నయ్యేకలము వెంట
హయముఁదోలుకొనుచు నరిగెనృపుఁడు
పందిరూప మైన పాతాళకేతువు
నంటనెయిదు కువలయాశ్వు పగిది. ౩౯

ఆ.వె. తిన్న క్రొవ్వులోన నున్నది నీరుగాఁ
గన్ను లగ్గిమెఱపుగములు గాఁగ
రొప్పటుఱుముగాఁగఁ గప్పుచొప్పడఁబంది
గాలిఁబఱచు మొగులుకరణిఁబాఱె . 40

వ. ఇట్లు పాఱిన ఘోరం బగు కాఱడవిలో దూరంబగు నీరంబులందూఱి. 41

క. పందివెనువెంటఁ నరుగుచు
ముందట నరలోకపాలముఖ్యుఁడు గనియెన్
మందరముఁ బురందరరిపు
మందిరకందరము నిందుమణిసుందరమున్. 42

క. కని డగ్గఱునెడ సూకర
మనువుగ గుహ సొచ్చె నంత నచటితిమిర మా
తని దృష్టిఁ గప్పె భయపడి
తనుఁజొచ్చిన వానిఁ గావఁ దగు ననుకరణిన్. 43

ఆ.వె. ధరణిపాలుఁ డంతఁ దురగంబు నచ్చోటఁ
గట్టి వాలుఁ గేలఁ బట్టికొనుచు

లొంక సొచ్చె నాత్మఁ గొంకక కాలుండు
కదిసి దివియ పట్టి వెదకుపగిది. 44

ఉ. చొచ్చి మహామృగం బరుగుచొ ప్పటఁ గానక కందరాంతని
ర్యచ్చటులాంశుకూట మగు రత్నకవాటము గాంచి యిచ్చలో
నచ్చెరువంది యందుఁ జని యావల నిండిన చిమ్మచీఁకటిం
గ్రొచ్చుచు నేగె వాలు కడఁ గ్రొమ్మెఱుఁగు ల్నిగుడంగఁ గ్రిందికిన్. 45

ఉ. ఆదెసఁ గొంతదవ్వుల మహారజతాంచితసాలమండల
శ్రీదనరార రత్నకలశీపరిచిహ్నితతుంగశృంగసౌ
ధాదిని కేతనప్రసర మైన మహానగరంబు దోఁచెఁ జం
ద్రోదయలీలఁ గన్నులకు నుత్సవమై దిమిరం బడంచుచున్. 46

ఉ. అందులపణ్యవీథుల నహర్నిశముం దిమిరంబు లీను సం
క్రందనరత్న గేహముల కాంతుల నేగఁగరా దటంచు న
మ్మందరసీమలందు గరిమంబున దాఁచిన పద్మరాగముల్
క్రందుకొనుం బ్రదీపములకై వడి దివ్వెలపండుగో యనన్. 47

క. అందు బలిచక్రవర్తి ము
కుందుఁడు దన ద్వారపాలకుఁడుగా రక్షో
బృందములు గొలువఁగా నా
నందంబున నుండు నురగనాథులతోడన్. 48

క. అందులఫణికుల ముపవన
చందన సంవేష్టనిజభుజంగీవదనా
నందనసుందరతరమగు
మందానిల మానుచుండు మ్రాన్గన్నిడుచున్. 49

క. చెలువారెడు నాపురిలో
పలి రక్కసు లెందుగడలభయ మెఱుఁగక తీ

పులవింటికి జడియుచు మరు
నిలువేలుపుగా భజింతు రింతులుఁ దారున్. 50

ఉ. ఆపురిఁ గాంచి సమ్మదము నచ్చెరువు న్మదిఁ బిచ్చలింపఁగా
భూపవరుండు పంది యెటుపోయె బలంబెటు వోయె దివ్యమౌ
నీపుర మెట్లు తోఁచె నది యెవ్వని రాజ్యము చూత మంచు ని
చ్ఛాపర తంత్రుఁడై గవనిచక్కటి దగ్గఱ వచ్చె నయ్యెడన్. 51

ఉ. చేతఁ బసిండిబద్ద విలసిల్లఁగ నొక్కఁడు వచ్చి మ్రొక్కి పృ
థ్వీతలనాథ నాథుఁ డగు విష్ణునిచే సెలవంది దానవ
త్రాత బలీంద్రుఁ డిప్పు డనురాగమున న్నినుఁ బిల్వఁ బంచెర
మ్మా తడయంగ నేల యనుమానము సేయక నీవు నావుడున్. 52

సీ. ఘనుని సందర్శింపఁ గలిగె నిక్కడ నని
యానంద మందుచు వానిఁ జూచి
పురిచొచ్చి రత్న మందిరములసొం పెల్లఁ
గోరి చూచుచు బైఁడికోట దాఁటి
చని యవ్వటారు మోసలఁదూఱిమణిమండ
పంబులోదైత్యులుబలసికొలువఁ
గంకణంబులమ్రోఁత గ ల్లనఁగాఁ బాఁప
జోటులు పసిఁడి పీచోపు లిడఁగ

ఆ.వె. మెఱుఁగుముత్తియముల పేరులఱుతమెఱయ
వలరుచుక్కలలోని రేవెలుఁగువోలె
మానికంబులగద్దియపైనిదీర్చి
యున్నబలిఁజూచి మ్రొక్కె నమ్మన్నెఱేఁడు. 53

క. అతనిఁ గనుంగొని దానవ
పతి ప్రియమునఁ గౌఁగిలించి భద్రాసనను

స్థితుఁ జేసి మిత్రకృత్యో
చిత సత్కారము లొనర్చి సేమం బడిగెన్. 54

శా. ధర్మం బెల్లెడఁ జెల్లునా ద్విజులవిద్యాగోష్ఠి రాజిల్లునా
దుర్మార్గంబు లడంగునా ప్రజలు సంతోషింతురా సత్క్రియా
మర్మం బేర్పడ జన్నముల్ జరుగునా మర్యాద వర్తిల్లునా
నిర్మూలంబుగ శత్రులం గెడపుదా నీలక్ష్మి సొంపెక్కఁగాన్. 55

శా. హర్షంబొంది పురందరుండు ధరపై నందందుఁ గాలంబుల
న్వర్షంబు ల్గురియించునా తగిలి విద్వాంసుల్ ప్రశంసింతురా
ఘర్షింపంగల రీతి నీతి దెలియంగా విందురా కీర్తియు
త్కర్షం బందునె దీనులంగడపుదే దానం బనూనంబుగన్. 56

వ. అనినం గృతాంజలి యై మానవేంద్రుండు దానవేంద్ర నేనెంతవాఁడ నన్నిం
తకుశలం బడిగితివి నీవు మహానుభావుండవు. 57

సీ. కశ్యపసుతుఁడు రక్కసులమేటి హి
రణ్యకశిపుండు నీవంశకర్త యనఁగఁ
బరమవైష్ణవుఁడైన ప్రహ్లాదుఁ డద్భుత
ఖ్యాతచరిత్రుండు తాత యనఁగ
వీరమాహేశ్వరుం డై రూఢి కెక్కిన
బాణాసురుఁడు కూర్మి పట్టి యనఁగ
దానవరక్షణజ్ఞానవిజ్ఞానాది
గురుఁ డైనశుక్రుండు గురు వనంగ

ఆ.వె. నమరలోక మేలుట పరాక్రమ మనంగ
భువనమంతయువితరణాభోగ మనఁగ
దేవదేవుండు హరి యిష్టదైవ మనఁగ
నీమహత్త్వంబు నాకు వర్ణింపఁదరమె. 58

మ. ఘనుఁడౌ విష్ణుఁడు జన్నిదంబు శిఖయుఁ గాయత్రిపల్కుల్ మృగా
జినము న్గోఁచియు దర్భలు న్గొడుగు మౌంజీబంధము న్గోపిచం
దనము న్వ్రేలిమిటొట్టుఁ గుండలములుఁ దండంబు నందంబుగా
నిను వంచింపఁ గడంగి తాఁ గుఱుచయై నీచేత వర్ధిల్లఁడే. 59

క. వెడమాయలవడు గడిగినఁ
దడయక మూఁడడుగు లిచ్చి ధర్మం బిలనా
ల్గడుగులుగా నిల్పిన నీ
కడిమి వొగడ నలవి యౌనె కమలజు కైనన్. 60

క. అలాగు కపటియైనను
వేలుపె యని యొసఁగు నీదు వితరణగుణముం
దాలిమియు మెచ్చి త్రిభువన
పాలకుఁ డచ్యుతుఁడు ద్వారపాలకుఁ డయ్యెన్. 61

క. పాత్రత్యాగి యనంగ జ
గత్రయమునఁ బరఁగునట్టి ఘనుఁడవు నను నీ
మిత్రునిక్రియఁ గనుగొంటి ప
విత్ర చరిత్రుండ నైతి విశ్వములోనన్. 62

సీ. అనవుడు దనుజేంద్రుఁ డతి నమ్మదంబున
నుర్వీశ యీ కలియుగమునందు
వీరుండు శూరుం డుదారుఁడు మఱి లేఁడు
నీవె కా కని యని నిన్నుఁ జూడ
వేడుకపడి యేను విష్ణుని యాజ్ఞచే
వెడలి రాలేక యీవెరవు పూని
నిన్నిటు రప్పించి కన్నులారఁగఁ గంటి
నధికలాభం బయ్యె నంచుఁ బలికి

ఆ.వె. యిదిసువర్ణదాయి యిదిజరామృత్యుని
ర్హారణ మనుచు రసరసాయనములు
పేర్మి నిచ్చి యనిపె బిలమార్గ మెఱిఁగింప
నవ్వరాహమైనయసురఁబనిచె. 63

ఉ. పంచిన, వాఁడు చేరి జనపాలక! యామొగసాలఁ గాచి న
క్తంచరవైరి యన్యులకుఁ గానఁగరాక వసించు, నట్టిరా
త్రించరనాయకుండు నినుఁ దెమ్మని పుచ్చిన నేకలంబనై
వంచనఁ దెచ్చి యిన్ని దురవస్థలఁ బెట్టితిఁ దప్పసైఁపుమీ. 64

ఉ. దానవనాథుఁ జూచితి సనాతనమౌ రససిద్ధిఁ గంటి వో
మానవనాథ నాపని క్రమంబున నీహిత మయ్యె నంచు స
న్మానముతోడఁ గొల్చి బిలమార్గము సూపఁగ వచ్చి వెల్వడ
న్వాని నతండు వీడ్కొలిపి వార్యము నెక్కె నుదాత్తచిత్తుఁడై. 65

చ. మగిడి మహామృగౌఘము నమానుషభూములు నిర్ఝరంబులు
న్నగములుఁ గంటకద్రుమవనంబులు దాఁటుచు వచ్చి యాత్మభృ
త్యగణము రోయుచుఀ జనపదంబును గానక కానలోన నా
మృగయునిఁ గాంచి యొయ్యన సమీపముఁ జేరఁగ వాఁడు మెచ్చుచుఀ. 66

క. మనుజేంద్ర నీవు క్రోడము
వెనువెంటం జనిన నిన్ను వెదక బలంబుల్
గనుకని చనియె న్నేనొక
యనువునఁ దురగంబు జాడయరసెద నిచటఀ. 67

క. కంటిఁ బని చెల్లెననుచుం
గంటకములఁ గండ్లు దప్పఁగాఁ దోడ్కొని రా
జొంటిపడకుండమృగయుఁడు
బంటుతనము మెఱసియొక్క బయలికిఁదెచ్చెఀ. 68

ఆ.వె. అచటనృపుఁడునిల్చియసహాయశూరుండఁ
దోడువలదుహయముఁదోలువాఁ
డ ! నీవు గూడ లేవు నిలువు నీవని చెల్లె
ననుచు వేఁటకాని నాదరించి. 69

క. రసఘుటికలుగట్టిన మృదు
వసనంబులు వారువంబు వాలుం దక్కం
బసదనము రత్నపథకా
దిసమస్తవిభూషణములు దిగ్గన నిచ్చెన్. 70

వ ఇట్లిచ్చి యనిపి తదనంతరంబున జోదనడయు, జంగనడకయుఁ, దురికి
నడయు రవగాలునడయుం గల వారువము నదలించి వాగె వదలి రాగసం
జ్ఞం గదలించి త్రోలిన. 71

క. వలకుం జల్లెడె లాదిం
గలతెక్కలంకరణి నెగయఁగా నశ్వము ని
శ్చలగతి నాదిత్యునిహయ
ములనుం దనకాలిధూళి బోవంబాతెన్. 72

వ. తదనంతరంబ ఫేనిలరక్తరక్తాననం బై ఖలీనచర్వణంబగు గంధర్వంబు
నాఁగి నాగంబుల నమలునాగాంతకుపై నున్న ముకుందునిచందంబునఁ
గంద మప్పళించుచుఁ గలంకదీర్చునప్పుడు. 73

మ. ధరణీనిర్జరుఁ డొక్కఁ డాత్మసుతుఁడుం దానుం బుభుక్షాజరా
పరితాపంబున మేను దూలి పడఁగాఁ బ్రాణంబు లుద్వేగముం
బొరయంగాఁ జనుదెంచి మూఁడుదినము ల్పోయె న్నిరాహారతా
పరిఖిన్నాత్ముల మేము నేఁడు దయతోఁ బాలింపవే నావుడున్. 74

ఆ.వె. అన్న మిచటఁ బట్టెఁడైనను దొరకదు
తనియనిత్తు నన్న ధనములేదు

మేనితొడవులెల్ల మృగయుని కిచ్చితి
నిప్పు డిద్దఱికిని నేమి యిత్తు. 75

క. ఆతురుఁడు దానపాత్రము
చేతం గలయదియె దానసిద్ధి యగుట ధా
త్రీతలపతి దలఁచి కృపా
న్వీతుండై యొక్క ఘుటిక నిచ్చెద ననుచున్. 76

వ. రెండు ఘుటికలు రెండుచేతుల నిడ కొని రసమిది సర్వలోహకాంచనీకర
ణంబు రసాయనం బిది జరామృత్యుహరణంబు వీనిలో నొకటి మీ రిద్ద
ఱం బుచ్చుకొనుం డనినం దండ్రి జరాజీర్ణుం డగుటం జేసి రసాయనం బి
మ్మనిన. 77

ఆ.వె. ఇతనిమాట పొనఁగ దెల్లలోహంబుల
నూనినంతఁ బసిఁడిగా నొనర్చు
రసమె యిమ్ము నాకు రాజనయ్యెదనన్నఁ
దండ్రి వచ్చి కొడుకుఁదలఁగఁద్రోచె. 78

వ. ఇట్లు పరస్పరభిన్నమనోరథం బగు దుర్వాదంబున శిఖ లూడ దోవతులు
వదలఁ దమఛాందసోక్తుల నేన మున్నాశ్రయించినవాఁడ నింక నీ వడుగకు
మనుచుం ద్రోపుత్రోపులాడంగ నెదసొచ్చి. 79

క. ఇటు మీలోపల నూరక
చిటిపొటి వల దైన మీకుఁ జిత్తప్రియసం
ఘటనము సేసెద నని రస
ఘుటికలు నృపుఁ డిద్దఱకును గొంకక యిచ్చెన్. 80

శా. ఇష్టార్థప్రతిపాదనన్ ద్విజులఁ దా నీరీతి నత్యంతసం
తుష్టస్వాంతులఁ జేసి వీడుకొని ప్రత్యుద్యోతమౌ సేన సం

దష్టంబై నలుదిక్కులం గొలువఁగాఁ దానేకసిద్ధక్రియా
హృష్టాత్ముం డగుచు న్మహీవరపరుం డేతెంచె నుజ్జేనికిన్. 81

ఉ. వింటివె భోజరాజ పలువెంటలఁ బూనియు వానిఁ బోలలే
వంటిఁ బ్రయత్నము ల్వలవదంటి విచారము లుజ్జగించి నీ
కింటికిఁ బోవు టొప్పు నన నిట్టి గుణశ్రవణోత్సవంబునం
గంటకితాంగుఁడై యతఁడు క్రమ్మఱ నేగె గృహాంతసీమకున్. 82

వ. తదనంతరంబ కొన్ని దివసంబులరిగిన నిరువదియగువాకిట నెక్కం
బూనుకొని. 83

— ఇరువదియవబొమ్మకథ —

క. నాగారిగమనమిత్రుని
నాగాననజనకు ననఘు నాగాభరణున్
నాగాసురహరుని సువ
ర్ణాగధనుర్ధరుని నందనాగవిహారిన్. 84

ఉ. నిష్ఠఁ దలంచి సర్వధరణీసురసమ్మత మైన వేళ భూ
యిష్ఠము లైన వాద్యము లనేకవిధంబుల మ్రోయ నాసన
శ్రేష్ఠము పొంతఁ జేరఁగఁ బసిండి నొనర్చిన బొమ్మ న్యాయవా
జిష్ఠురవృత్తి దోఁపఁ బలికెం బృథివీపతి నడ్డపెట్టుచున్. 85

ఉ. పొందొకయిం తెఱుంగక ప్రభుత్వము నూపెద నష్టభోగసం
క్రందనుఁ డౌ నవంతిపతికైవడి నీగియుఁ దెంపు లేక యె
క్కందర మౌనె నీవు నినుఁ గానవు గాక తలంచి చూడఁగా
నందని మ్రానిపండులకు నఱ్ఱులు సాఁచుట గాదె భూవరా. 86

ఉ. ఆతనివర్తనంబు దెలియన్వినుకోరికి వచ్చినాఁడ వౌ
నీతలఁ పిప్డుగంటి ధరణీశ్వర ! చెప్పెద నాఁటదాన నా

చాతురి లెక్క కెక్కఁడు ప్రసాదము పెంపున నాదరింపు సం
ప్రీతి యొనర్చుదాన నిఁక మిన్నక మాటలు వేయునేటికిన్. 87

ఆ.వె. అయ్యవంతినాథుఁ డష్టదిక్కులఁ గీర్తి
నిక్క నచటనచట నేర్పుమెఱసి
యాఱునెలలు రాజ్యమర్ధవర్షము ప్రవా
సంబు నియతిగాఁగ జరపుచుండు. 88

మ. దినరాథప్రతిమానరూపుఁ డెలమిన్ దేశాంతరాసక్తిమైఁ
జని యాశ్చర్యకరంబుగాఁ బురములున్ శైలంబులు న్వాఁగులు
న్వనమధ్యంబులుఁ జూచుచుం దిరిగి దివ్యస్ఫూర్తిఁ బద్మాలయం
బన సార్థం బగుపట్టణంబు గనియెన్ హర్షంబు రెట్టింపఁగన్. 89

చ. అట చని పణ్యవీథిఁ గలయం బరికించుచు నొక్కచోట ను
త్కటశశిదీధితిప్రకరధౌతములైన గతి న్విశంకట
స్ఫటికమయంబులై నగృహపంక్తులలోపల హేమరత్నసం
ఘటనమునం దనర్చు గుడిఁ గన్గొని దగ్గఱ నేఁగునయ్యెడన్. 90

ఉ. అరుణుఁడు గ్రుంకెఁ జీఁకటి దిగంతముల న్నిగిడెం బ్రియాంగసం
పర్కము లేని మానినులమానముదూల మరుండు మిక్కిలిం
గర్కశుఁడై చెలంగె నిలఁ గల్వలచెల్వము చూచి వానితోఁ
దర్కము పెట్టఁబూనినవిధంబున నెక్కువ నిక్కెఁ జుక్కలున్. 91

క. ఆసమయంబునఁబతి సం
ధ్యాసముచితవిధులు దీర్చి యాగుడిలోఁ గై
లాసనివాసునిఁ గోరి సు
ఖాసీనుండైన నలువు రటఁ దమలోనన్. 92

సీ. మనము నేర్పున నిన్నిదినములు భూలోక
మంతయుఁ దిరుగుట వ్యర్థమయ్యె

సిద్ధయోగీంద్ర ప్రసిద్ధ చారిత్రుని౯
గాలవంచకుని౯ త్రికాలనాథు౯
జూడలేమైతిమి చూడంగ౯ గన్నులు
గలిగియు నిచట నిష్ఫలములయ్యె౯
బ్రాలేయగిరిపొంత౯ బన్న గాటవి నాత౯
డున్నతతపమున నున్నవా౯డు

ఆ.వె. తెరువులహికులాధీనదు స్తరములనుచు౯
బోవలేమైతిమని తలపోసికొనఁగ
విని మనంబున నతనిదర్శనముగోరి
రాజశేఖరు౯ డచట నారాత్రి గడపి 92

క. అరుణుం డుదయింపఁగ స
త్వరగతి నుత్తరము గదలి తఱచైనమహా
తరులును గిరులును దాఁటుచు౯
దెరు వెఱలకనడిచికొన్ని దివసంబులకు౯. 93

క. దుర్వారశరభగండక
దర్వీకరసింహదంతిదంష్ట్రిలనెల వై
శర్వాణిజనకు౯ డగు నా
పర్వతపతి పొంత౯ జేరె భయరహితుం డై. 95

మ. హిమవత్ప్రాంతము చేరి శీతలము లౌనీరంబులు న్సిద్ధసం
యమిసద్మంబులు దేవదారుమయ దివ్యశ్రీకుటీరంబులు౯
భ్రమరానందమరందబిందువిలసత్పద్మాకరశ్రేణులుం
గుముదప్రోజ్జ్వలకుంజకుంజరమహాకుంజంబులం జూచుచు౯. 96

క. చల్లనికొండ నయంబున
నల్లున కింపయినయట్టి యాభరణగణం

బెల్ల సమకూర్చి దాఁచిన
యిల్లనఁ దగు సర్పవనము నెదురం గనియెన్. 97

సీ. కన్నులమిణుఁగుఱుల్ గ్రమ్మంగ గ్రుమ్మగుచు
బుస్సనుచో వేఁడిపొగలునిగుడఁ
బ్రల్లఁదంబున మఱ్ఱు నల్లనాగులు నాగ
పెంజెరలును బెంటిపెంజెరలును
శంఖపాలకులును జాతినాగులు మర్లఁ
బెంజెరలును నెట్టిఁబెంజెరలును
గూఁకవేటులుఁ జిల్కుగులియలుఁ ద్రాఁచులుఁ
బెరజులుగుట్టపుఁబెరజులచటఁ

ఆ.వె. గలవు తక్కినజెట్టిపోతులునుదుంప
నాగులునుగొంటిగాఁడులునరియకొక్కు
లేనవాలముల్జెడుగులు? నిరుమొగముల
పాములునుబెక్కుతద్వనభూమినుండు. 98

క. ఇవ్విధమున ఘోరంబగు
నవ్విపినాంతంబు సొచ్చి యరుగఁగఁ బాముల్
గ్రొవ్వున గ్రమ్మగుచు నాతని
నెవ్వెంటలఁ దామెయగుచు [1]నెగురుచుఁబట్టెన్. 99

గీ. పట్టి వరుణనాగపాశంబులట్లు మైఁ
జుట్టుకొనిన నతఁడు పట్టువడక
యట్టివేళ జలగ లంటినకరి వోలె
దిట్టతనము మెఱసి తిరుగఁ దయ్యె. 100

---

1. నెగడుచు.

వ. అట్లు దిరుగక యురగభూషణుండునుంబోలె మృత్యువుకడ నిశ్శంకుం డై ముందఱ జని 101

సీ. పులితోలు కచ్చడంబుగ మొలఁ గాసించి
సర్వాంగములను భస్మంబుపూసి
శిరమునఁగెంజెడ వెరవార బిగియించి
విమలాక్షమాల హస్తమునఁ దాల్చి
యాసనశక్తికి నాధార మగుయోగ
దండంబుపైఁ బాణితలముసేర్చి
పట్టు గల్గిన యోగపట్టె పూనిన మేను
స్వస్తికాసనమునఁ జక్కనిలిపి

ఆ.వె. కంధరము వంచి నాసికాగ్రమునదృష్టి
గదియఁ గదలకముక్కన్నుగానరాని
శూలిపోలిక నున్న త్రికాలనాథుఁ
జూచిసాష్టాంగమెరఁగెనాక్షోణివరుఁడు 102

వ. ఇట్లు సాష్టాంగదండంబు గావించిన. 103

క. అప్పరమయోగి యోగం
బప్పుడు వారించి లేచి యాతనిఁ గరుణం
దప్పక చూచిన మేనం
గప్పినసర్పములు విడిచి కనుకనిఁబఱచెన్. 104

శా. దృష్టిం బాములఁ ద్రోలి యాతఁడు ధరిత్రీనాథు మన్నించి సం
తుష్టుండై పలికెన్ జనోత్తమ జగద్దుర్వారదర్వీకరా
శ్లిష్టప్రాంతరమౌ మహాటవి మది న్లెక్కింప కీమంచులో
నిష్టోద్యోగముపూని వచ్చితివి నీయా దెవ్వరిం జెప్పుదున్. 105

ఆ.వె. ధరణిలోనఁ బాముతలగాము లుండునం
ద్రిట్టిపాములు మెయిఁజుట్టుకొనఁగ
నీవు శంక లేక నేనున్న చోటికి
వచ్చినాఁడ వెద్దివాంఛితంబు. 106

క. వినిపింపుము సురలకునై
నను బడయఁగరాని ప్రార్థనలు నీకిత్తుఁ
ఘనుఁ డని చేరినచోఁ గై
కొని యతనికి నొక్కమేలు గూర్పం దగదే. 107

మ. అనిన న్నంతసమంది సాంజలిపుటుం డై విక్రమాదిత్యుఁ డి
ట్లనియె న్సిద్ధయతీంద్ర విష్ణుక్రియ నిత్యానందవారాశిఁ జొ
క్కినచిత్తంబున నాత్మయోగవశముక్తి శ్రీసమేతుండ వై
యనువేలంబుగఁ దేలియాడు నిను డాయంగంటి నేఁ జాలదే. 108

క. నినుఁ జూచినయవి కన్నులు
నినుఁ బొగడినయదియ జిహ్వ నీగుణగణము
ల్వినినయవి చెవులు నీకుం
బనిచేసినయవియ పాణిపద్మము లనఘా. 109

శా. నిత్యానందపదప్రతీతచరితా! నీదర్శనం బైనచోఁ
బ్రత్యక్షంబుగ మేననున్న ఫణభృద్బృందంబులి ట్లూడె న
ప్రత్యక్షంబుగ గర్మబంధములు నీభంగి న్వేసం బాసె నా
దిత్యోగ్రద్యుతి పర్వినం దిమిరముల్ దిగ్భాగముల న్నిల్చునే. 110

చ. కమలవనైకమిత్రుని ప్రకాశ మొకించుక పర్వి సూర్యకాం
తమునకు దీప్తు లిచ్చినవిధంబున నీకరుణార్ద్రదృష్టి సం
యమివర నాపయిం బొలసినంతనె పాపమువాసి యెల్ల పు
ణ్యములును గల్గె వేఱ నినుఁ బ్రార్థన చేయఁగ నేల నాకిఁకన్. 111

క. అనినఁ దనయిచ్చ నిష్టం
బొనరింపఁ గడంగి యోగి యొక నిడుబలపం
బును లాతము బొంతయు గ్ర
క్కున నాతనికిచ్చి వాని గుణములు చెప్పెన్. 112

వ. ఈబలపపుఁగొడుపున వలసినయన్ని లెక్కలొడ్డి వ్రాసి యీలాతపుఁగోల సవ్య హస్తంబునఁబట్టిముట్టించిన నన్నియు నీవుదలంచిన ప్రాణులై నిల్చి నీవుసెప్పిన పని సేయు; నవి యుడుపవలసిన నెడమచేత నావ్రాఁతలు క్రమంబునం దుడిచిన నడంగు; నెచట నైన నీబొంత దులిపినఁ గోరిన యంతధనంబు నీకిచ్చు నరుగు మని వీడుకొల్పిన. 113

ఉ. మ్రొక్కి వినీతుఁడై మగిడి ముందట ఘోరము లైన పాములం
ద్రొక్కుచుఁ గంప లీరములుఁ దూఱుచుఁ గాఱడవి న్మనంబులో
స్రుక్కక మార్గము ల్గడచుచుం గడు దూరము వచ్చి భూవరుం
డొక్కెడఁ గాష్ఠము ల్వ్రేఁచుచున్న మనుష్యుని గాంచె ఖిన్నునిన్. 114

ఆ.వె. వానిఁ జూచి యేల వగచెదు కట్టెల
కింతదవ్వురాఁగ నేమికతము
నావుఁ డేను హూణనరపతిబంటఁ ద
త్పుత్రుతోడఁ జావఁ బూనినాఁడ. 115

ఆ.వె. ఆకుమారుఁ డగ్ని నదె పడుచున్నాఁడు
చూడు మనినఁ గెలన సౌదయొనర్చి
చిచ్చు వెట్టి కూల నిచ్చగించెడువానిఁ
జేర నేగి రాజశేఖరుండు. 116

క. నరవరసుత! నీ కీదు
ర్మరణమునకుఁ బూననేల మదిలోపల నే

పరిఖేదము గల దది యె
వ్వరిమూలము చెప్పు మనిన వాఁడనుమతుఁడై. 117

సీ. ఏ మని చెప్పుదు నిటక్రింద హూణదే
శాధీశుఁడైన మాయయ్య తీఱ
నాయెడరున వచ్చి దాయాదు లందఱు
రాజ్యంబు చేకొని ప్రాభవమున
వెడలఁ ద్రోపించినఁ గడు దుఃఖితుండనై
యొకహితుం డైన సేవకుని గూడి
యేతెంచి యిచట నాజ్ఞాతులచేనైన
యభిషంగ మోర్వంగ నలవి గాక

ఆ.వె. యొంటి నడవి నిట్టిమంటఁ జాఁ గడఁగితిఁ
బరిభవంబునొంది బ్రదుకుకంటె
నిదియ మేలుగాఁగ మది నిశ్చయించితి
ననిన నాతఁ డతిదయాళుఁడగుచు. 118

క. పగవా రౌ త్రినయప్పుడు
జగ మెఱుఁగం దెగుట యొండె సైరణయొండెం
దగుఁ గాక మిగుల నొఁగులుచు
మగవాఁడై మగువపగిది మడియుట తగునే. 119

చ. ఇటు విను చేటులేని బ్రతు కేనొనరించెద నీకు వైరిసం
కట మడఁగుం బదాతి తురగద్విరదంబులు గల్గు నర్థము
క్కుటమగు వీని గొమ్మని విధానము లేర్పడఁ జెప్పి చేతియా
ఖటికయు యోగదండమును గంథయు వానికి నిచ్చెఁ జెచ్చెరన్. 120

శా. తత్సామర్థ్యమునం బదాతితురగ స్తంబేరమౌఘంబు న
త్యుత్సేధంబగు సర్వముం గలిగినన్ హూణక్షితీశాత్మజుం

డు త్సేకంబు మనంబునం బొదలఁగా నుత్సాహసంపన్నుఁ డై
మాత్సర్యంబున భూమిఁ గొన్నరిపుల న్మర్దింప నేగె న్వేసన్. 121

వ. అట్లుకుమారుం డరిగిన యనంతరంబున నిజాయుధధైర్యసహాయుండును
నసహాయశూరుండును నగు విక్రమార్కుండు. 112

ఉ. సజ్జన దర్శనంబును బ్రసాదముఁ గల్గెఁ బరాభవవ్యథా
లజ్జల నగ్నిలోఁ బడఁ దలంచిన చక్కని రాజపుత్రునిన్
బుజ్జవ మేర్పడం గరుణఁ బ్రోవఁగఁ జేకుఱె నంచుఁ బ్రీతుఁడై
యుజ్జయినీజనాధిపతి యొయ్యన వచ్చె నవంతిభూమికిన్. 123

వ ఇట్టి గుణాఢ్యుండు గావున. 123

క. అవ్విక్రమార్కుసరిగా
కెవ్విధముల నింటికేగు డిది తగ వనిన
న్నవ్వుచు నందుల కోర్కులు
దవ్వులుగా మగిడె భోజధరణీపతియున్. 125

వ. మఱియుఁ గతిపయదినంబు లరిగిన. 126

—: ఇరువదియొకటవ బొమ్మకథ :—

క సింధుపతి వైరిహితు సుర
సింధుప్రభవాదిచరణు సింధువిహారిన్
సింధురరూపాసురహరు
సింధుతనూజాత్మబంధు సింధురవరదున్. 127

మ. హృదయాంభోజములోపలం దలఁచి భోజేంద్రుండు ధర్మార్థకో
విదులున్ జ్యోతిషు లాగమజ్ఞులును సేవింపంగ సొంపారు సం
పద పెంపొంద శుభగ్రహోద్ధరణలబ్ధం బైన లగ్నంబునం
త్రిదివేంద్రాసన మెక్కవచ్చినఁ బ్రియోక్తిన్ బొమ్మ వల్కెం దగన్. 128

చ. విను మిటు భోజరాజ యొకవిన్నప మే నొనరింతు విక్రమా
ర్కునిక్రియఁ బెంపు నీగియును రూఢికి నెక్కక యెక్కఁ జెల్ల దే
మనఁ దగు నిన్ను నిచ్చలుఁ బ్రియంబున వచ్చెదు వచ్చి క్రమ్మఱం
జనియెద వాశ మానవు యశంబును నేర్పును దీనఁ గల్గునే. 129

క. అతని చరిత్రము వినఁగో
రితివేని నృపాల యవధరింపుము నాకే
చతురతయు లేదు తెంపున
నతివకు నృపుసభల మాటలాడం దరమే. 130

శా. నామాట ల్వినవ నిచ్చగింపు మతఁడా నాకేశుఁ డిష్టుండుగా
సామంతార్చితపాదపీఠుఁ డగుచున్ సామ్రాజ్యలక్ష్మీకళా
సీమం బౌ భుజసార మొప్పఁగ నయశ్రీమంతుఁ డాభట్టిమ
ఖ్యామాత్యుండుగ నేలె నుజ్జయిని నిత్యం బైనసత్కీర్తితోన్. 131

ఉ. ఆదివసంబులందుఁ బ్రజలందఱు సంతతుల న్సమృద్ధుల
న్మోదము నంది సత్రములు మున్నుగ ధర్మము లాచరించుచు
న్వేదన లేవియుం గనక వేడ్క మనంబుల నిండి యుండఁగాఁ
బేదలు మూర్ఖు లల్పులను పేరును లేదు పురంబులోపలన్. 132

క. నిలుపు గలనీతి భట్టికిఁ
జెలికాఁ డనఁ బొలిచి బుద్ధిసింధు వనంగా
వెలసినయమాత్యుఁడొక్కఁడు
గలఁడతనికిసుతుఁడొకండుగ్రహిలుఁడనంగన్. 133

ఉ. ఆగ్రహిలుండు బుద్ధియు నయంబును శీలముఁ దప్పఁగాఁ బిశా
చగ్రహదష్టుఁ డైన క్రియ సభ్యవిచారము పొందు మాని మి
థ్యాగ్రహవృత్తిఁ ద్రిమ్మరుచు నాడఁగఁ జూడఁగ లేక యాత్మలో
నిగ్రహ మంది తండ్రి సుతునిం దెగి తిట్టుచుఁ జాల దూఱుచున్. 134

ఆ.వె. ఓరిపాపకర్మ యున్న[1] మంత్రికుమారు
లవనిపాలుఁ గొలిచి యచట నచటఁ
బనులు సేయఁగఁ జడుఁ దనుచు నాకును దల
వంపు సేసితి సరివారిలోన. 135

క. అను వగుతనయుఁడు పుట్టిన
జనకుని కిహపరసుఖములు సమకూరు నన
న్మను వింటి నేను నిన్నుఁగని
[2]మని మని నేఁడిట్లు నరకమగ్నుఁడ నైతిన్. 136

క. ఒడ్డును బొడవును రూపును
దొడ్డతనము గలిగి ప్రజ్ఞతోఁ బొదలనియా
బిడ్డని గనుకంటెను సతి
గొడ్డయినను మే లనంగఁ గుందుటగలిగెన్. 137

ఆ.వె. ఎట్టకేనియుఁ దగు పుట్టువు గల్గియు
గట్టియైన యెఱుకపట్టు లేక
యిట్టిభంగి వ్యథలఁ బెట్టుటకంటెను
బుట్టినపుడె యేల గిట్ట వైతి. 138

చ. గృహమున నుండి నన్నుఁ గలఁగింపక యొండెడ కేగు మన్న నా
గ్రహిలుఁడు సిగ్గుదాల్చి యధికం బగు మానము పూని లేచి యా
గ్రహమున శాస్త్రము ల్చదివికా నిఁక నింటికి రానటంచు నా
త్మహితము గోరుచు న్వెడలి దక్షిణభూమికి నేగెనొక్కఁడున్. 139

---

1. మంత్రికుమార వసులకాలిగోరు సరియుగావు-చెడుగుఁ బనులు సేయఁ గడఁగి నాకిట దల- 2. మనుకడలేనట్టినరక.

వ. ఆష్ట్లేగుచు నొక్కనాఁడు[1] భువనగిరియొద్ద నొక్కయగ్రహారంబు దగ్గఱి యందుఁ గొందఱు సభ్యులు పురాణశ్రవణంబు సేయుచున్న నట తానును జేరి వినునెడ నప్పౌరాణికుండు తీర్థఫలంబు లెఱింగించుచు 140

ఆ.వె. ఏకభుక్తములు ననేకదానములు న
యాచితములు జపము లనశనములు
జరపి[2] వెచ్చుకంటె సరగునఁ గాశిలోఁ
బొంది విడిచి ముక్తిఁ బొందవచ్చు. 141

క. మెట్టక పెట్టక పట్టక
గిట్టక తీర్థముల ముక్తికిం జనరా దే
తొట్టును బొరయక మెయిమెయి
కట్టెదురన్ శ్రీనగంబు గనినంజాలుఁ. 142

క. తనువు దొఱంగక యిది యె
క్కనలవి గాదంచు శివుఁడు గైలాసము గ్ర
క్కనవిడిచి బొంది తోఁజనఁ
దనభక్తులకొఱకు నందుఁ దరలక యుండుఁ. 143

క. శిలలెల్లను లింగంబులు
సలిలంబులు దివ్యసింధుసారంబులు తీఁ
గలు సంజీవను లౌ ద్రుమ
ములు మందారములు చఱులు ముక్తిపదంబుల్. 144

మ. అని చెప్ప న్విని చిత్తకల్మషము వాయంజేయ శ్రీపర్వతం
బునకే పోవుట మే లటంచు నతఁడా పుణ్యాత్ములం బాసి చ

1. శ్రీమహాజననంబున నొక్కయగ్రహారంబు - మహాఘనగిరియొద్దఁ గొందఱుసభ్యులు. 2. జరపి చచ్చు కంటె.

య్యున నాదిక్కు న కేగుచుఁ హృదయభృంగాఖ్యనగత్సూతమై[1]
న నగం బల్లన దాఁటి తీర్థసలిలస్నానార్థి యై ముందటన్. 145

మహాస్రగ్ధర. కనియెం గ్రీడద్విహంగన్ ఘనజలరవజాగ్రద్భుజంగ న్మహాపూ
రసిరూఢవ్యూఢదుర్వారభృతరుచితటీరంగభంగ త్తరంగన్[2]
జనితశ్రేయానుషంగన్ జలధిహితపరిష్వంగ నార్ద్రాంతరంగన్
జననిర్ధూతాభిషంగన్ క్షతగిరికటకోత్సంగఁ బాతాళగంగన్. 146

వ. కని యందుఁ గల దక్షిణావర్తంబునఁ గృతస్నానుం డై మల్లికాకుండంబు
ను, ఘటికేశ్వరంబును, భ్రమరికాశ్రయంబును, గాలహ్రదంబును, దేవ
హ్రదంబును, సంధ్యామౌనంబును, జారుకేశ్వరంబును, నందిమండలంబు
ను మున్నుగాఁ ద్రింశద్యోజనాయతంబును ద్రింశద్యోజనవిస్తీర్ణంబును నగు
టంజేసి బహుకోటితీర్థమయంబు నగు నారమాక్షమాధరంబుమీఁదికిం జని
కనకమయప్రాసాదంబు సొత్తెంచి. 147

క. అర్జవమున నచ్చటఁ బూ
ర్వార్జిత మగు పుణ్యసముదయమునం గనియె
న్నిర్జరగణసంసేవితు
నర్జునకిరణాంకు మల్లికార్జునదేవున్. 148

వ. కని సాష్టాంగం బెరంగి. 149

క. గోపతివాహనునకు నల
కాపతిమిత్రునకుఁ ద్రిపురఖండనసమయా
రోపితగిరిచాపునకును
శ్రీపర్వతవిభున కార్తచింతామణికిన్. 150

---

1. హృదయభంగాఖ్యన్ జగత్ఖ్యాతమై- 2. రంగమత్యుత్కలరంగన్- రంగనృత్యత్కురంగన్.

వ. అర్చన లిచ్చి తనఫాలంబునఁ గేలుదోయి గీలించి. 151

సీ. పెద్దమెకముతోలు నిద్దంబుగాఁ గట్టి
గాలిగ్రోలెడుసొమ్ము లీలఁ దాల్చి
చలికొండకూఁతుకై సామేన నిమ్మిడి
చదలేఱు నెలయును జడలఁజెరివి
యేనికమోముతో నెలుకనెక్కిన చిన్ని
బొజ్జపాపఁడు నీదుపజ్జ నడువ
ముజ్జోడు మొగముల ముద్దులకొమరుండు
పురిగలపులుఁగుపై నరుగుదేర

ఆ.వె. వెన్నుఁడును నలువయును బల్వేలుపులును
గొలువ[1] గుబ్బలికొమ్ములగుజ్జునెక్కి
కలిమికొండకునేతెంచినిలిచితనుచు
వింటి ముక్కంటి నినుఁగనుఁగొంటిమంటి. 152

క. అనుచు ననేకవిధంబులఁ
దననేర్చినకొలఁది నతఁడు తప్పనిభక్తిన్
వినుతించి పాపముల వీ
డ్కొని మగిడెం జిత్తశుద్ధి కొనసాఁగంగన్. 153

ఉ. ఆదెసనుండి సర్వజగదాశ్రయు వేదపురాణవేద్యుఁ బ్ర
హ్లాదమనోవిధేయు నసురాంతకు శ్రీ నరసింహమూర్తిఁగా
కోదరరాజతల్పుని నహోబలనాథునిఁ జూడనేగి త
త్పాదసరోరుహంబులకు భక్తిఁ దగం బ్రణమిల్లి ధన్యుఁడై. 154

చ. హరిహరసేవనాసుమతులైన జనుల్విలసింప సంపదా
కరమగుసొంపుపెంపు గల కన్నడభూమికి నేగి యొక్కభూ

1. గద్దరికొమ్ముల.

సురవరునాశ్రయించి తగు సుస్థితి నక్కడనుండి యాస్థతో
సురగురునీతిశాస్త్రమును శుక్రు నయక్రమమ్ముం బఠించుచున్. 155

ఉ. ఆకడ నీతిశాస్త్రవిదుఁడై గురు వీడ్కొని యేగె వేడ్కతోఁ
గాకితమూలశక్తి గనిగా నొనరెంచిన పైఁటిచట్టునా[1]
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁ బోనియట్టి సిరిపుట్టినయింటికి నోరుగంటికిన్. 156

క. పసిఁడియు రత్నము మున్నగ
నిసుముక్రియం బెక్కుధనము లీనఁగ నిలకు
న్వసుమతియు రత్నగర్భయు
వసుధయు నను పేళ్ళు నిక్కవము లౌనచటన్. 157

ఉ. చందనగంధులు న్విటులు జాణలు దానవినోదులుం బ్రజా
సుందరమూర్తులుం గవులు శూరులుఁ బెద్దలు నుల్లసిల్ల సం
క్రందనవైభవాఢ్యుఁ డగు కాకతిభూపతి రాజ్యలక్ష్మిఁ బెం
పొందెడు నప్పురంబున మహోత్సవ లీలల నుండె నేర్పునన్. 158

వ. అట్లు కొన్ని దినంబు లుండి తత్పురజనపరిచయంబున సకలకళాప్రవీ
ణుండై మగుడం గదంగి మహాతీర్థవిలోకనార్థియై యట చని దూరలబున.

క. ఆతఁడు త్ర్యంబకశిఖరో
ద్భూతను విఖ్యాతఁ బరమపూతఁ ద్రిలోకీ
మాత మహాపాతక సం
ఘాతవిఘాతానుయాతఁ గనియెన్ గంగన్ 160

క. ఆనదికి మ్రొక్కి ముఖ్య
స్నానం బొనరింప డిగ్గి చని యుదకం బా

---

1. పైఁడిపట్టునన్.

లోనం దెకతెక నుడుకం
గా నద్భుతమైన మడుఁగుఁ గని వెరఁగందెన్. 161

క పిట్టలు దివిఁ బాఱఁగ నా
కట్టావుల నెఱక నెల్లఁ గమరిన నచటన్
మట్టుపడి కూలుఁ దొడిమల
ప ట్టూడినచుట్టి మేడిపంచులభంగిన్. 162

ఆ వె. అట్లు ఘోరమైన యయ్యుష్ణతీర్థంబు
చేర వెఱచి శిశిరవారిలోనఁ
గెలన జలక మాడి వెలి కేగి యట గుడి
లోన నున్నశివునిఁ గానఁబోయి. 163

వ. అద్దేవు నుచితోపచారంబుల నారాధించి యచట నొక రాత్రి గడపం గ
డంగి యుండె 164

క. ఆయెడ నాకాశంబున
నాయుష్ణాంబువుల యావు లందినఁ దప్తం
బై యపరాంబుధి మునుఁగం
బోయెనొకో యాతఁ డన నభోమణి గ్రుంకెన్. 165

మ. చదలం జుక్కలు పిక్కటిల్లగఁ దమస్సందోహము ల్భూమికా
గదిగంతంబుల నిండ రేయి నిగుడంగా నుష్ణతీర్థంబులో
నుదకం బుబ్బఁగ గొబ్బున న్వెడలి సాంగోపాంగసంగీతులం[1]
జదుగాం డ్రౌ నెనమండ్రు వచ్చి రట కాసర్వేశ్వరుం గొల్వఁగన్. 166

ఉ. మోహనదివ్యమూర్తు లగుముద్దియ లాశశిమౌళికి న్మహో
త్సాహముతోడ హేమజలజంబులఁ బూజ లొనర్చి నాట్యస

1 సంగీతలై.

న్నాహము సేయుచో నొకతె నాదవిశోధన[1] చేయుచుండె నాఁ
గాహళ వట్టె గానగమకశ్రుతితానవిధాన మానఁగన్. 167

ఆ.వె. గానభిక్ష వేఁడ హీనస్వరంబున
వదరుకాయ లంది వచ్చినట్టి
వీణియలకు లయలు విప్పిచెప్పెడు భంగి
నందు ముగురుపాడి రందముగను. 168

క. [2]సూళాదిగీతములును సు
తాళము ధ్రువ గురువు లఘుయుతంబులఁ దమలో
మేళనమునఁ జెడకుండఁగఁ
దాళము వాయించె నొకతె తద్గతికొలఁదిన్. 169

ఆ.వె. గళరవంబు లమర గమకంబుతోఁబేర్చు
రాగమున మనంబు రంజిలంగఁ
బ్రియుఁడు వోలె నధరబింబంబు చుంబించు
వాసెగ్రోలువట్టె వనితయోర్తు. 170

ఆ.వె. మూఢునైన బట్టి ముఖరునిఁ జేయుదు
ననినభంగి సతి మృదంగ మంది
కంకణములుతాళగతిమ్రోయవాయించెఁ
[3]దొయ్యలులకునెద్దిదుష్కరంబు. 171

చ. తతఘనమర్దళాదినినదంబులు నర్వదినాల్గు హస్తని
ర్గతులును దృగ్విలాసములుఁ గన్నులపండుగ గాఁగఁ దాళసం

---

1. నాదవినోదము. 2. సాళాదిగీత. 3. దొయ్యలులకు వేడ్కఁ తోంగ లింప.

గతులు చెలంగఁ బాదకటకంబులు మ్రోయఁగ నాట్యమాడె నొ
క్కతె తొలుకారుక్రొమ్మెఱుఁగు కైవడిఁ దద్రసభావపుష్టిగన్.[1] 172

క. ఎలనాఁగలు మఱి తమలో
పల నృత్తాంగములు వీడుపడ నాడుచుఁ గ్రొ
న్నెలతాల్పువేల్పు నీక్రియఁ
గొలిచి మగిడి యేగునపుడు గుడిలోమూలన్. 173

మ. విస్మేరాకృతినున్న మంత్రితనయు న్వీక్షించి ప్రోయాంగ్రదః మం
దస్మేరానన లౌచు నీకు సుఖమందం గోఁకు లల్లెనే
నస్మద్భూమికి రమ్మటంచుఁ జనఁగా నయ్యుష్ణతీర్థోష్మల
న్విస్మం బయ్యెద నంచు భీతి నతఁ డాప్రాంతంబున న్నిల్చినన్. 174

క. పాతాళంబున కేగిన
యాతరుణులదీప్తి భూతలాంతంబున ను
ద్యోతించునాయనఁ దూర్పున
నాతతమగు కెంపుదోఁపనరుణుఁడు వొడచెన్. 175

మ. దిననాథుం డుదయింపఁగా వెడలి భక్తిన్ గౌతమీతీరకా
ననము ల్దాఁటుచు నొక్కనాఁడు కడుఁ బుణ్యంబైనకాళేశ్వరం
బున కేతెంచి మహోపచారపరుఁడై ముక్తీశ్వరుం గొల్చి నె
మ్మన ముప్పొంగఁగ ధన్యుఁడై మగుడఁ దన్మార్గంబున న్వచ్చుచున్.

క. హరిహరు లేకం బనియెడు
పురాణవచనంబు దృష్టముగ నొకచోటన్
నరసింహుండును రామే
శ్వరుఁడును గలధర్మపురికి వచ్చెఁగడంకన్. 177

[1] ఈ చంపకమాలకు ప్రత్యంతరములో-గీ. కంకణములు తాళగతి చెలంగఁగఁబాద, కటకములును మ్రోయ నటనచూపెఁ, దరుణి యొకతె క్రొత్తమెఱుపుకైవడి నిండి, రసము భావపుష్టిఁబొసఁగుచుండ.

చ అట చని గంగలో జలకమాడుచుఁ గొందఱచే నెఱింగి మి
క్కుటముగ నింపుతో యముని కుండము దూఱి కడంక బ్రహ్మకూఁ[1]
కటియును ముట్టి వెల్వడి జగత్పతి యౌ నరసింహమూర్తి ముం
దట కరుదెంచి మ్రొక్కి యుచితంబుగఁ బూజ యొనర్చి భక్తితోన్. 178

ఉ. నర్మద తుంగభద్ర యమునానది జాహ్నవి కృష్ణ గౌతమిం
గర్మము వాయ నెన్ని జలకంబులు దీర్చితినో దయామతీ
ధర్మము లెన్ని చేసితినొ దానము లెన్ని యొనర్చినాఁడనో
ధర్మపురీనృసింహ నిజదైవమవౌ విభు నిన్నుఁ జూచితిన్. 179

వ. అనుచుఁ బునఃపునఃప్రణతుండై వెడలి తదాసన్నం బగు దేవాలయంబున కుం జనుచు నద్దేవు నుద్దేశించి. 180

ఉ. శాశ్వత మోక్షపారసముచాడ్పున ముందఱ గంగ వాఱఁగా
విశ్వజనీనవృత్తిఁ బృథివిం దగురూపున నిల్చి సంతతా
నశ్వరభుక్తిముక్తిసదనం బగు ధర్మపురీశుఁ డైన రా
మేశ్వరుఁ డెల్లకాలమును నీవుత మాకు నభీష్టసంపదల్. 181

చ. అని గుడి సొచ్చి యీశ్వరున కర్చన లెల్ల నొనర్చి మ్రొక్కి యిం
పున మగుడం గడంగి భువిఁ బుణ్యపదంబులు చూచుచుం గ్రమం
బున నొకయేఁడు వుచ్చి తలఁపు ల్సమకూడిన నిర్వికారుఁడై
జనకుని: జూడవచ్చె నయశాస్త్రవిశారదుఁ డయ్యవంతికిన్. 182

సీ. వచ్చి తండ్రికి గౌరవముదోఁప మ్రొక్కుచుఁ
ప్రియవాక్యములఁ గడునయముసూప
బుద్ధిసింధువుఁ దనపుత్రుఁ గౌఁగిటఁ జేర్చి
న న్నుద్ధరించితే యన్నయనుచు

---

1. కూఁకటియను వేల్పుగొల్చుచు.

సంతసం బందుచు జననాథు దర్శింపఁ
జని వాఁడు పోయి వచ్చిన తెఱంగు
చెప్పిమ్రొక్కించిన క్షితిపాలకుండును
మోదంబుతో వాని నాదరించి

ఆ.వె. రాజనీతులు మంత్రి కార్యక్రమంబు
లడుగుచును గొంతతడవున కట విదేశ
మేగిచోద్యంబులచ్చటనేమిగంటి
చెప్పుమనవుడు గ్రహిలుండుచెప్పెనదియు. 183

ఆ.వె. కడిమి నంధ్రభూమి గౌతమిలో జల
ముడుకుచుండ నుండు నొక్కమడువు
లోననుండి రాత్రి లోలాక్షు[1] లెనమండ్రు
వెడలివత్తురచటి మృడునిగొలువ. 184

క. వచ్చి తమయాటపాటల
నచ్చంద్రాభరణుఁ గొలిచి యరుగుచు నను వా
రచ్చటికిఁ బిలువ నుదకపుఁ
జిచ్చు సొర న్వెఱచి పోక చిక్కితి గుడిలోన్. 185

చ. అనవుడు వేడ్క వానిఁ గనకాభరణాదుల నాదరించి పీ
డ్కొని నృపుఁ డొక్కఁడు న్వెడలి కొన్నిదినంబుల కంధ్రభూమి కా
ననములు దాఁటి పాపహిమనాశనసార్థము నష్టతీర్థముం
గని వెఱ గంది పొంత నుదకంబులఁ గ్రుంకి శివార్చనామతిన్. 186

క. ఆగుడికిం జని హరు నను
రాగంబునఁ గొలుచు నంత రవిగ్రుంకె నను

1. మీనాక్షు.

ద్వేగంబునఁ జీఁకటి ది
గ్భాగంబుల నిండె మేఘపటలము భంగిన్. 187

క. గుడగుడ నుడికెడి యుదకము
ముడివడ గర్జితములట్లు మ్రోయఁగ దెసల
న్వెడఁ గదర మెఱపుఁదీవల
వడుపున నమ్మడువు వెడలి వచ్చిరి పడఁతుల్. 188

ఆ.వె. అట్లు వచ్చి పంచమాదిస్వరంబుల
శ్రుతుల లయలఁ దాళగతుల యతుల
గానగేయగీతగాంధర్వభేదంబు
లలవరించి పాడి యాడునపుడు. 189

క. నరలోకము నహిలోకము
సురలోకముఁ జూచినాఁడఁ జూచినసతు లె
వ్వరుఁ గారు వీర లని భూ
వరుఁ డచ్చెరువంది యుత్సవముతో నుండెన్. 190

క ఆలోన నాటపాటలు
సాలించి యొకింత మగిడి జనపతిఁ గని నీ
వాలోకమునకు రమ్మని
లోలాక్షులు పిలిచి మడుఁగులోనికిఁ జనినన్. 191

క. కడుఁదెంపరియై భూవరుఁ
డుడికెడు వెడమడుఁగునడుమను జొకెను మును గ్రాఁ
గెడునూనియకొప్పెరలోఁ
బడి వెడలినవాఁడు సిళ్ళఁ[1] బడు టచ్చెరువే. 192

---

1. దీనఁబడు టచ్చెరువే-

క. ఉఱికి తదభ్యంతరమున
నెఱమంటలు దాఁటి వెనుక నేతేరఁగ న
త్తెఱఁగెఱిఁగి సిలిచి ప్రియమునఁ
దెఱవలు చెయివట్టి భూపతిం దోకొనుచున్. 193

ఆ.వె రజతసౌధములును రత్న గేహంబులుఁ
గనకమండపములుఁ గలుగుపురము
సొచ్చి వైభవములు సూపుచు మౌక్తికా
సనముమీఁద నతని నునిచి రంత. 194

క. కనకకలశోదకంబుల
జనపతిచరణములు తొడసి సత్కారము లిం
పునఁ జేసి సఖులు లోచన
వనజంబుల దీపముల నివాళింపంగన్. 195

వ. అందు నొక సఖీశిరోమణి నృపశిఖామణికి నయ్యేనమంద్రను జూపుచు. 196

సీ. అవనీంద్ర యష్టమహాసిద్ధు లీరామ
లాఖ్యానగుణము లిం దమరి యుండు
నతిసూక్ష్మరూపమీయణిమచేఁజేకుఱు
మహిఁబెద్దగాత్రమీమహిమనొదవు
[1]జలమున మింటను జులక నయ్యెడునట్టి
లాఘవం బొనరు నీలఘిమచేత
బరువైనభావ మీగరిమచే నగపడు
నీప్రాప్తిచే నగు నిష్టగతులు

ఆ.వె. నెనయుదలఁపులీప్రాకామ్యమునఫలించు
మనుపఁజెఱుపనీయీశత్వముననకల్గు

1. జలముల మునుఁగఁగఁ జులక గానయ్యెడు.

[1]నమరవరులైన నీవశిత్వమునఁజిక్కి
మాఱువల్కరుకై కొమ్ము మమ్ముఁగూడ. 197

వ. ఈయష్టసిద్ధులకు మేము పరకాయప్రవేశాద్యుపసిద్ధులము. తత్పరిచారికా సహస్రసహితంబుగా నీరాజ్యంబు గైకొని యందఱ నేలుకొమ్మనిన నతి విస్మితుం డై యతండు నయవినయంబుల నిట్లనియె. 198

క. మీరలు దేవత లన్యులఁ
గోరం దగ దేను దీర్ఘగుణమెఱుఁగఁగ నా
నీరంబుల మునిఁగితి మీ
కారుణ్యవిలోకనంబు గలిగినఁ[2]జాలున్. 199

క. అని మ్రొక్కి లేచి చనఁజూ
చిన నాతలఁ పెఱిఁగి యష్టసిద్ధులు నగుఁ గై
కొను మని యెనిమిదిరత్నము
లనిమిషసతు లిచ్చివెడల ననిపిరి నృపతిన్. 200

మ. అకలంకుం డగు నమ్మహీవరవరుం డానందసంస్ఫూర్తిచే
వికసన్మానసుఁ డై ప్రసిద్ధవనము ల్వీక్షించుచు న్వింధ్యభూ
మికి గోదావరి దాఁటి కాఱడవిఁ బేర్మిం బోవుచో నొక్కవి
ప్రకుమారుం గనియె న్నిరంతరగళద్బాష్పాకులప్రేక్షణున్. 201

చ. కని యిది యేల యేడ్చెదవు కానలఁ గ్రుమ్మర నేటికన్న నో
మనుజవరేణ్య నాజనని మజ్జనకుం గడు దూఱె దూఱిన
న్మనమునఁ గంది యాతఁ డభిమానముతో వనభూమికేగె నా
తని నరయంగఁ ద్రిమ్మరుచు దవ్వగ వచ్చితిఁ గాన నావుడున్. 202

---

1. అమరవరు లౌదురీవశిత్వమునఁగాన, మాఱువల్కక కై కొమ్ము మమ్ముఁ గూడ. 2. గలిగెం జాలున్.

క. మాతకడనుండు పొమ్మిదె
నీతండ్రిం బంపునాఁడ నిజమని యతిదుః[1]
ఖాతురుని మగుడననిపి మ
హీతలపతి రత్నగుణము లెఱుఁగం దలఁచెన్. 203

ఆ వె. ఇతనితండ్రి యున్నయెడకు నిప్పుడయేగ
వలయు నతనిఁ బ్రోవవలయు ననుచు
రత్నసిద్ధి నంబరంబునఁ జుల్కనై
యర్కుమాడ్కి విక్రమార్కుఁ డేగె. 204

క. అవ్విప్రుజేరి తెలియఁగ
నెవ్వఁడ వీవనుఁడు నాతఁ డిట్లనియె ధనం
బెవ్వేంట లేక బ్రతుకుట
నెవ్వ యనుచు నింటితఁగులు నీఁగినవాఁడన్. 205

ఉ. కాశ్యపిలోఁ బ్రసిద్ధమగు కంచిని నుండుదు విష్ణుశర్ముఁడం
గశ్యపగోత్రజాతుఁడ వికారవిదూరమనస్కుఁడఁ జగ
ద్వశ్యకళావిశారదుఁడ దైవము చెద్దయి దరిద్రభావనా
కార్యము నొంది భార్య గడుఁ గష్టపుఁబల్కులు వల్క నోర్చితిఁ. 206

క. పడఁ గుక్కి లేదు నేలం
బడి పొరలఁగ[2] రొండలూఁడఁ బడితిని దల దా
జడగట్టెఁ గట్టఁ గోకయుఁ
గుడువం గూడును నెఱుంగఁ గుందుట దక్కన్. 207

సీ. కుండలముందఱఁ[3] గూర్చుండి పడుచులు
గంజికి నేడ్చుచుఁ[4] గదల లేరు

1. యాయ్యఁ ద్యోతతకునిమగుడననిపి. 2. లొండులూడ,—కన్నులూడఁ బడవెండ్రుకలు—3. గుంటలముందఱ- 4. గంజికేడ్చుచునదిగానలేరు.

మో కాళ్ళఁ దల లిడి ముడిఁగి నిద్రింతు రే
కాలంబునను మేనఁ గప్పు లేక
యతిదరిద్రునకు నిల్లాలౌటకంటెను
జచ్చుట గడుమేలు సతుల కెల్లఁ
బాపకర్మునిఁ జెట్టవట్టుట మొదలుగా
నిడుమలేకాని యొం డెఱుఁగిననుచు

ఆ.వె. మగువ తెగిపల్క నవ్వగ మాన్ప లేక
జీర్ణదేహుండ ధనము లార్జింప లేక
యూఁతకోలయుఁ దోడుగా నొయ్య వెడలి
దూర మరుదెంచి [1]యడవిలోఁ జేరినాఁడ. 208

చ. అనవుడుఁ జింత నొంద కది యట్టిద యెమ్ములు బూదిపూఁత దు
న్నని పసరంబుఁ దోలు మసనంబుల యునికియుఁ జూచి నిర్ధనుం
డని శివుఁ బాసి రత్ననిధి యైన సముద్రునిఁ గూడె గంగ భా
మినులు ధనంబు లేనిపతి మెచ్చరు లేమియె కీడు గావునన్. 209

క. ధన మొకటి యేల తలఁచిన
పను లన్నియు వీనిచేత ఫలియించుం గ్రై
కొను మని మహిమలు చెప్పుచు
నెనిమిదిరత్నములు నతని కిచ్చెం గరుణన్. 210

శా. ఆవిప్రుండు మణిప్రభావమున దివ్యంబైనదేహంబు స
ద్భావంబున్ ధనలబ్ధియుం బడసి యుత్సాహంబుతోఁ గంచికిం
బోవం గోరి నభోగతిం జనియె, నాభూపాలుఁడున్ దానవి
ద్యావైచిత్రి ఘటించి వచ్చె నతిమోదం బైన యుజ్జైనికిన్. 211

---

1. చావంగఁ గోరినాఁడ.

శా. తత్సామాన్యగుణంబు లిట్లొదవినన్ ధారాపురాధీశ నీ
యుత్సాహంబు ఫలించు నిట్టిగతి నీ వూహింపుమా నావుడు
న్మాత్సర్యంబున నెక్కఁజెల్ల దని యాత్మం జూచి భోజుండు వి
ద్వత్సంఘంబులు గొల్వఁగా మగిడె నాధాత్రీశు నగ్గించుచున్. 212

శా. దుగ్ధాంభోనిధికన్యకారమణు నస్తోకప్రభామండల
స్నిగ్ధశ్యామలదివ్యదేహు నుచితశ్రీగోపవేషక్రియా
ముగ్ధస్త్రీహృదయాపహారిఁ గరుణాంభోరాశిఁ దేజఃకళా
దగ్ధానేక మహాసురున్ సురహితుం ద్రైలోక్యరక్షామణిన్. 213

శా. గీర్వాణాచలరూపచాపశిఖరాంగీకారదీర్ఘోరుస
న్మౌర్వీభూతఫణీంద్రసంయుతమహానారాయణాస్త్రున్ జగ
ద్దుర్వారాకృతికాలకూటగిళనాస్తోకాసితగ్రీవు గం
ధర్వేంద్రార్చితపాదపీఠు నిజభక్తవ్రాతచింతామణిన్. 214

మాలిని. దివిజసరిదుపేతా దేవ దేవానుజాతా
ప్రవిమలనిజగోత్రా పాండుపుత్రైకమిత్రా
వివిధకుధరచారీ విశ్వరక్షావిహారీ
శివమధురిపురూపా సిద్ధబుద్ధస్వరూపా.

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలీక భేకఫణీంద్ర వీర ఘోట్టవి భాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాలరూప నూపురసుందరచరణారవిందసనదప్రోలి పురవరాధీశ్వర వెలనాఁటి పృథివీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీ కొఱవి వెన్న యామాత్యపౌత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్రకసువరాజ తనూజగోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు సాహసాంకువీరసాహసమహోదారత్వ ప్రశంసనం బన్నది యష్టమాశ్వాసము.

—▭—

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## నవమాశ్వాసము

### —: ఇరువది రెండవ బొమ్మకథ :—

క. శ్రీరామావిహరణగృహ
నారాయణ నలినవికసన గ్రహరాజా
కారాయమానదివ్యశ
రీరార్ధ్యున్నతిసనాథు[1] ద్రిజగన్నాథున్. 1

శా. భక్తిం గోరి తలంచి భోజనృపుఁ డాభద్రాసనం బెక్క ను
ద్యుక్తుండై యిరుదిక్కుల న్మెఱపుల ట్లొప్పారుపుణ్యాంగనల్
ముక్తాశేషలు మోళిపై నిడఁగ సమ్మోదంబుతోఁ జేరఁగా
వ్యక్తాలాపము బొమ్మ పేర్చి[2] పలికె న్వారించుచుం బెంపునన్. 2

క. ఓరాజ యాస విడువఁగ
నేరవు మావిక్రమార్కనృపుమాడ్కి మహో
దారత్వముఁ దెగువయు నుప
కారంబును లేక యెక్కఁగాఁ దర మౌనే[3]. 3

వ. అది యెట్లన్నఁ దద్గుణంబు లాకర్ణింపుము. 4

---

1. దివ్యశరీరార్ధసతీసనాథు - శరీరార్ధసనాథుశర్వు. 2. లిచ్చి-గాఁగ.
3. యెక్కదరమేనీకున్.

సీ. అష్టభోగంబుల నైశ్వర్యమునఁ గళ
బలవైరిఁ బురవైరిఁ బద్మవైరి
నతిశక్తి నిలుకడ వితరణగుణమున
నహిరాజు నగరాజు[1] నంగరాజు
నాహవోత్సవమున నభిమానమునఁ గీర్తిఁ
గపికేతు ఫణికేతు గరుడకేతు
దృఢముష్టిఁ జేసూటి దివ్యాస్త్రసామగ్రి
బలరాము రఘురాముఁ బరశురాముఁ

ఆ.వె. [2]పావనత్వమున ఘనసంపత్తి దీప్తి
ననిలమిత్రుని హరమిత్రు నబ్జమిత్రుఁ
బోలు నితఁడని జనులెల్లఁ బొగడుచుండ
నవనితలమేలె నావిక్రమార్కవిభుఁడు. 5

ఉ. వాసవుమీఱి నిత్యవిభవంబునఁ బేదలఁ బ్రోచి వైరిసం
త్రాసవిహీనుఁ డౌ నతఁడు రాజ్యము మంత్రుల కప్పగించి ష
ణ్మాసముల న్విదేశగమనంబు చరించుచు నుండ నొక్కెడన్
వేసవి వచ్చెఁ బాంథులకు వేసట పుట్టఁగ వెట్ట గొట్టఁగన్.[3] 6

ఉ. ఎండకు లావు గల్గఁగ మహీరుహశాఖల నాకు లెల్లఁ బె
ల్లెండల వేఁగ నెండు జల మింకఁగ స్రుక్కఁగఁ బద్మషండ ము
ద్దండముగాఁగ లోకులు యథావిధి నీడలు గోరుచుండఁగా
రెండవసూర్యునట్లు ప్రసరించె నిదాఘము తద్గుణంబులన్. 7

క. విరహులమనముల దినమును
బరితాపం బినుమడింపఁ బరిమళములచే

1. గిరిరాజు. 2. చాపనైపుణీ సంపద సారశక్తి నచ్యుతునిమిత్రు.
3. వెట్టలంటగన్.

దిరిసెంబులఁ గలిగొట్టం
బరువం బేర్పడఁగ నుష్ణపవనము వీచెన్. 8

క. మండెడుమార్తాండద్యుతి
నెండను నొండొండ నెఱియలేర్పడఁగా భూ
మండలము పూర్వమున నవ
ఖండము లయ్యును ననేకఖండము లయ్యెన్. 9

క. ఉదకముఁ గసవును నీడలు
మొదలాఱఁగఁదలకుమృగసమూహంబులయా
పద లెఱిఁగి యిట్టి యమృతా
స్పదమై కడుఁ జల్లనైన చంద్రునిఁ జేరెన్. 10

ఆ.వె. కార్య మయ్యెడు నెడ గర్వంబు పూనక
కాలమహిమఁ దన్నుఁగాచికొనుట
యుచిత మనుచు వెట్ట కోర్వక చలువకై
యత్త్రివారిఁ జేరె నచ్యుతుండు. 11

క. తొడిగినపాముల విసమును
మెడవిసమును నొసలిచిచ్చు మెట్టులవడయున్
ముడివడఁగా వడకాలము
గడపుట కడుఁ గడిఁది యయ్యె గరకంఠునకున్. 12

క. చల్లనిగంగాజలమును
జల్లనిచందురుని గూడ జడలం దిడి తాఁ
జల్లనికొండకు నాశివుఁ
డల్లుండై కొంత బ్రదికె నావేసవిలోన్. 13

ఆ.వె అమృతశీతలాంశు వగు వార్ధిలోనున్న
పద్మనాభునాభిపద్మగృహము

లోనఁ బుప్పొడియును దేనెయుఁ జల్లఁగా
నెండకన్నెఱుం గకుండె నజుఁడు. 14

సీ. విసనకఱ్ఱలు వట్టివేళ్ల చప్పరములుఁ
జందనంబులు ఘనసారములును
జల్లనినీళ్ళు నిచ్ఛాభోజనంబులు
గలవారి కిష్టసౌఖ్యంబు జరుగఁ
బనిచేసి గంజి యైనను నంబలైనను
నెద చల్లఁగాఁ ద్రాగి యెచట నైనఁ
బడియుండి వెన్నెలగుడిపాట[1]
వాడఁగా బేదల కాత్మసంప్రీతి గలుగు

ఆ.వె మంచురొంపిముసురు లేకమార్గికులకుఁ
జల్లపాటునఁ[2] బయనంబుసాగుచుండు
నచ్చ వెన్నెల సుఖనిద్ర యంబుకేలి
యమరు వేసవి కితరకాలములుసరియె. 15

క. అమృతము రసమ్ము క్రియ వేఁ
డిమి నెగసి జలంబు కడకు డిగజాఱిన చం
దముగా నవ్వేసవి జల
మమృతంబై జీవములకు నది చవి కెక్కెన్. 16

వ. అట్టి దివసంబుల. 17

శా. గూఢంబౌ నిజవర్తనం బమర నాక్షోణీవరుం డంత నా
రూఢుం డై పరభూములందుఁ గడపెం గ్రూరప్రవృద్ధాతపో
ద్గాఢాంభోరుహమిత్రదీప్తివిదళత్సర్వాంసహామండల
వ్యూఢారణ్యవిదాహదావసముదగ్రోష్మంబునన్ గ్రీష్మమున్. 18

1. గడుబొట్టవాడగా. 2. చల్లబూటల.

ఉ. అంత విదర్భభూమిఁ బ్రియమంది చరించి యవంతిరాజు వి
శ్రాంతి యొనర్పఁ గుండినపురంబున కేగి యనంతరంబ య
త్యంత మనోహరం బగు నుపాంతవనాంతము సొచ్చి రుక్మిణీ
కాంతకుఁ దొల్లి తాపి యనఁగాఁ దగు దుర్గగృహంబుఁ జూచుచున్. 19

క. రుక్మి యనుమతము లేకయు
రుక్మాంగదవరదుఁ[1] డగు వరుం డాగుడిలో
రుక్మాభరణాంచిత యగు
రుక్మిణిఁ గొని చనియెఁ దొల్లి రూఢికి నెక్కన్. 20

ఆ.వె. అట్టిదేవతాలయము పొంతఁ గొలనిలో
జలకమాడి వెడలి జలజములను
భూవరుండు దుర్గఁ బూజించి ముందట
విశ్రమించియున్న వేళ నొకఁడు. 21

శా. మార్గశ్రాంతి నొకింత డస్సి విలసన్మాకందసౌరభ్య మౌ
దుర్గారామము చొచ్చి వచ్చి నరనాథుం జేరి విప్రుండు నా
స్వర్గాచార్యుఁడు వోలె నాపభునిభావం బెల్ల నీక్షించి సం
[2]సర్గప్రస్తుతి వాక్యవృత్తి నెఱపన్ సంప్రీతితో నిట్లనున్. 22

క. ఆజానుబాహుఁడవు రవి
తేజుఁడ వజ్రాదిచిహ్నధృతచరణుఁడ వం
భోజేక్షణుఁడవు భిక్షు
వ్యాజంబున నున్న చక్రవర్తివి చుమ్మీ. 23

చ. కరులుఁ దురంగమంబులును గాలుబలంబులు నెవ్వి ఛత్రచా
మరములవారు లెంకలును మంత్రులు నయ్యెడపంబువాండ్రు నెం

---

1. రుక్మాంబరధారి. 2. సద్భర్గం బ్రస్తుతవాక్యవృత్తి విలసింపన్ నేర్పుతో నిట్లనున్, సర్గప్రస్తుత......విలసించన్.

దరిగిరి రాజ్య మొల్లక మృషాకృతిఁ ద్రిమ్మరుటేమి నామతి
స్ఫురణము దప్పకుండ నిఁక బొంకక చెప్పుము నీవు నావుడున్. 24

ఉ. సత్యము నీమతిస్ఫురణ క్షత్రియవంశకరుండ విక్రమా
దిత్యుఁడ నే నవంతినృపతిం బరదేశ విశేషదర్శనం
బత్యనురక్తిఁ జేయఁగ నయంబునఁ ద్రిమ్మరుచుండుదు న్సఖా
చిత్యగుణంబు నా కిదియ చెప్పెడి దే మిఁక భూసురోత్తమా. 25

సీ. అనవుడు నాశ్చర్యహర్షంబు లొందుచు
భూసురోత్తముఁ డాత్మబుద్ధి మెఱసి
మృదులాంబరంబులు మేనఁ బూనక జోగి
కై వడి నీకంథ [1]గప్ప నేల
హంసతూలికశయ్యయందు నిద్రింపక
బూడిదలోఁ బడి పొరలనేల
ఘనమైనరాజ్య మేకచ్ఛత్రముగఁ గల్గఁ
దిరిపెమై యూరూరుఁ దిరుగనేల

ఆ.వె. అష్టభోగములకు నాలయం బయ్యు నీ
వష్టకష్టములను నలయనేల
కుడువఁ గల్గి నీకుఁ గుడువ లేకుండుట
యల్పతరముగాదె యవనినాథ. 26

క. [2]ననుఁబోటి పేదయైనను
దనమించుక కలిగె నేనిఁ దనమది ద్రక్కం
దనవనితాదిసుఖంబుల
మనఁ గోరుం బసర మైన మరగదె సుఖముల్. 27

---

1. నీగంత-నీబొంత. 2. ననుబోటియంతయైనను.

క. వికటం బగుదారిద్ర్యము
నకుఁ గడపల లేక జీవనము బహుళకుటుం
బకుఁడం గావున జరగక
యొకచో రససిద్ధి వడయ నూహించి మదిన్. 28

మ. అలసత్వంబునఁ బ్రొద్దుపుచ్చక నిరాహారుండనై కంచిలోఁ
పలఁ గామాక్షి గుఱించి యుగ్రతప మేఁ బండ్రెండుసంవత్సరం
బులు సేయంగఁ బ్రసన్న గామి పిదపన్ భూపాల నాయాత్మలోఁ
గలఁగంబాఱుచు దేవి దూఱుచును భిక్షావృత్తిమై[1] వచ్చితిన్. 29

ఉ. నాకు మహాదరిద్రుడన కనాథునకు న్భువిఁ ద్రిమ్మరం దగుం
గాక ధనంబు రాజ్యమును గల్గఁగ జోగిక్రియం జరింపఁగా
లోకులు నవ్వరే నృపులలో నినుఁ బోలెడు నట్టివాని నే
నేకడఁ గానఁ జాలు నిఁక నేగుము నీపురికి న్సుఖింపఁగన్. 30

ఉ. నాపుడు లేచి యొండువచనమ్ములు [2]వోవఁగనిమ్ము కంచిలో
దేవత నీతపంబునకుఁ దేరకొనం గరుణింప దంటి భూ
దేవకులాగ్రగణ్య యరుదెంచి భవత్ప్రియ మాచరింపఁ ద
త్సేవ యొనర్చి యేను రససిద్ధి ప్రసిద్ధికి నెక్కఁ గాంచెదన్. 31

మ. పొద మాదేవత యున్నభూమి కని యాభూదేవునిం గూడి స
మ్మదలీలం జని రత్నహర్మ్యముల రమ్యంబౌచు సొంపారు సం
పదలం బొంపిరివోవుకంచి నయమొప్పం జూచి యచ్చోటఁ జ
క్కదమౌ భావనఁ జేరనేగె నృపుఁ డాకామాక్షి నీక్షింప గన్. 32

మ. అచటం దీర్థములాడి శంభునకు దైత్యారాతికిన్ మ్రొక్కి పు
ణ్యచరిత్రుం డొకరేయిఁ బుచ్చి మఱునాఁ డారాధనారక్తి మై

---

1. భిక్షావృత్తినై. 2. లటుండఁగనిమ్ము కంచిలో.

నచలంబౌ మతి మూఁడురాత్రులు నిరాహార వ్రతుం డైనచో
నుచితస్వప్నమునందు దేవి వలికెన్ యోగప్రసన్నాత్మ యై. 33

చ. కల యిది నిక్కవం బనుచుఁ గైకొని ముప్పది రెండులక్షణం
బులఁ జెలువారునట్టి నరపుంగవుకుత్తుక నెత్తు రిచ్చి ది
గ్బలి యొనరించినన్ ద్రవిణకారణమౌ రససిద్ధి చేకుఱు
న్వలవదు నీకు నీయనశనవ్రతభేదము మేదినీశ్వరా. 34

చ. అనవుడు మేలుకాంచి కడు నద్భుత మందుచు విక్రమార్కుఁ డా
గొనములవాని నింక సమకూర్పఁగ నొండెడ కేగనేల నా
కని మతిఁ దానె సర్వసుగుణాఢ్యుఁడు గావునఁ దెంపుతోడఁ గ
క్కున నడిదంబు దుస్సి తనకుత్తుక నొత్తె[1] నుదాత్తచిత్తుఁడై, 35

క. ఒత్తఁగఁ బ్రసన్నమతి యై
యత్తఱి నడిదంబు వట్టి యాదేవత లో
కోత్తమ నీతెంపున నా
చిత్తం బిగురొత్తె నిష్టసిద్ధి యొనర్తున్. 36

క. అడుగుమ యనవుడు మది నా
యెడఁ గడుఁ గరుణించితేని నీవిప్రుఁడు దా
నిడుమలఁ బడి పొరలెడిఁ గృప
యెడపక రససిద్ధి యితని కిమ్మని మ్రొక్కెన్. 37

ఉ. మ్రొక్కిన నద్భుతంబును బ్రమోదము నొందుచు యోగమాత దా
నక్కఱ దీర్చునట్టి రస మాతని కిచ్చి యవంతినాయకున్
మిక్కిలి యింపునం బరిణమించి యదృశ్యత నొందె విప్రుఁ డిం
పెక్క తదీయవర్తన మనేకవిధంబులఁ బ్రస్తుతింపఁగన్. 38

---

1. నొత్తెడు నంతలోపలన్.

ఉ. ఆనరనాథుఁ డంత వసుధామరు పీడ్కొని వేడ్కతోడ ను
జ్జేనికి వచ్చెఁ గావునఁ బ్రసిద్ధగుణాఢ్యుని వానిఁ బోలఁగే
వీనగుఁబాటుచేఁత లిఁక నేటికిఁ గ్రమ్మఱు మన్న నాత్మ[1] ధా
రానరనాయకుం డతనిఁ బ్రస్తుతిసేయుచు నేఁగె నింటికిన్. 39

—* ఇరువదిమూఁడవ బొమ్మకథ *—

వ. మఱియుం ద్రయోవింశద్వారప్రవేశోన్ముఖుండై. 40

క. ఏవేళనైనఁ బొక్కటి
[2]యా వెల్లని తమ్మిమొగ్గ యరవిరి గాఁగన్
రేవెలుఁగుఁ బ్రొద్దుఁ గన్నులు
గా వెలిఁగెడివేల్పుకరుణఁ గావుత మమ్మున్. 41

మ. అనుచు న్భోజవసుంధరాధిపుఁడు పుణ్యాహంబునం జందనా
ద్యనులేపాంబరమాలికాకనకభూషాలంకృతుం డై మహా
సన మెక్కం జనుచోట బొమ్మ వలికెన్ క్ష్మానాథ యావిక్రమా
ర్కునిచందంబున దానవైభవము నీకుం జాలదట్లుండుమా. 42

ఉ. అతనిదానవైభవమహత్త్వముఁ జెప్పెద భాస్కరాంశ సం
[3]జాతుఁడువాఁడు విక్రమవిశాలభుజాయుగదుర్మదాహిత
వ్రాతవిఘాతదక్షిణుఁ డవంతిమహీశుఁడు తొల్లి చన్న యా
వ్రాతలలోనఁ గర్ణునికిఁ దంద్రిసుమీ తలపోసి చూచినన్. 43

శా. ఆరాజన్యునిపట్టణంబు విబుధేంద్రాకల్పితం బై సుధ
ర్మారూఢంబును భాస్వదీశ్వరవసువ్యాప్తంబునై పుణ్యవి
స్తారంబై యమరావతీపురవిలాసం బంది నిత్యోత్సవా
ధారంబై పరఁగున్ దురంతదురితోదారవ్యథాగూర మై. 44

---

1. నాత్మలో, నానరనాయకుండతని నర్థినుతింపుచు. 2. యావెలినెత్తమ్మి మొగ్గ. 3 జాతుఁడువిక్రమార్కుఁడు విశాల.

సీ. అట్టిపట్టణ మేలు నమ్మహీకాంతుఁడు
    దేశాంతరాసక్తిఁ దిరుగుచుండు
నెలమితో షణ్మాసములు పుచ్చి మగిడిన
    నప్పుడు మంత్రులు నా ప్రజనులుఁ
బౌరు లుదారులుం బరివారమును గూడి
    పీలికూటంబులు మేలికట్లు
తలిరుఁదోరణములు నలరుపందిరులును
    మొకరతోరణములుమున్నుగాఁగఁ

ఆ వె. బురి యలంకరించి కరిరాజు మున్నిడి
కదలి పంచవాద్యఘనరవముల
నెసఁగు దర్శనంబు లిచ్చి యెదుర్కొని
తెచ్చి రుత్సవంబు పిచ్చలింప. 45

ఉ. ఆజననాయకుండు జవనాశ్వము లెక్కి చెలంగి ముందటన్
రాజులు భృత్యులై కొలువ రత్నవిభూషితమూర్తులైన యం
భోజదళాక్షు లారతులు మున్నుగఁ దన్నుఁ బురస్కరింపఁగా
రాజగృహంబు సొచ్చెఁ గవిరాజనవామరరాజభూజ మై. 46

ఉ. ఈపగిదిన్ గృహంబునకు నేఁగిన యాతఁడు తొల్లి యోగని
ద్రాపరిశీలియయ్యు నుచితంబుగ రాజ్యము చేసె నేర్పునం
దాపసవేషియై జవపదంబులు గ్రుమ్మరి క్రమ్మఱన్ ధరి
త్రీపరిపాలనాభిరతి దేఁకువ కెక్కిన రాముకైవడిన్. 47

ఉ. పెక్కుదినంబు లక్కడ నభీష్టవధూజనమందిరంబులం
దొక్కొకనాఁడు రేయి మదనోత్సవలీలలఁ దేలుచు న్విభుం
డక్కట దీఱఁ దొంటి విరహవ్యథ నెక్కుడు గ్రుక్కి మిక్కిలి
న్మక్కువ కెక్కువైన [1]మగనాలి గృహంబున రాత్రిపుచ్చుచున్. 48

1. మృగనాభిగృహంబున–అని యన్నిప్రతులలోను.

శా. అంతర్గేహములందుఁ గ్రొవ్విరులపర్యంకంబుపై వేడ్కతో
కాంతారత్నముతోడఁ గూడి పిదపం గందర్పకేలీపరి
శ్రాంతుడై శయనంబు రెండుదెసలన్ రత్నంపుదీపంబు ల
త్యంతంబు న్వెలుఁగొందఁ గామసుఖనిద్రాసక్తుఁడై యుండుచున్. 40

చ బలబలఁ దెల్లవాఱునెడఁ బార్థివశేఖరు దత్యరిష్టమౌ
కలఁగని మేలుకాంచి యధికం బగువిస్మయ మంది లేచి తా
జలకము దీర్చి సంధ్యపరిచర్య యొనర్చి యనేక భూషణో
జ్జ్వలనిజమూర్తి యై కొలువుసాలకు వచ్చి కవు ల్నుతింపఁగన్. 50

ఆ,వె. వచ్చి దొరలు గొలువ వజ్రసింహాసనా
రూఢుఁడై ముఖాబ్జరుచి యెలర్పఁ
దన్నుఁ గొలుచువారిఁ దగురీతి మన్నించి
తేరకొనఁగ హితులదిక్కుఁ జూచి. 51

క. వినుఁ డేను రక్తచందన
మున నంగము దోఁగ మేఘమున కెనయగు కా
రెనుబోతు నెక్కి యామ్యము
[1]వనుచుంటినొకండ నంచు స్వప్నముగంటిన్. 52

క. ఈకల శుభమో యశుభమొ
నా కనవుడు నందఱు న్మనంబుల భీతి
వ్యాకులులై వదనము లా
లోకింపఁగ దృష్ట కౌశలుం డొకఁ డనియెన్. 53

క. ధాతుగుణంబులఁ గల లుప
జాతము లౌ [2]వినికి జూడ్కి సంస్మరణమునన్

---

1. చనియెద నేనొకఁడ. 2. జాతంబులు.

రీతి యెఱిఁగి కల విఱుచుట
నీతి చుమీ విఱుపుకొలఁది నిజమౌనదియున్. 54

ఆ.వె. వినుము ధరణినాథ విన్నప మియ్యెడఁ
దొల్లి యొక్క మనుజవల్లభుండు
దేవుఁ డుదయమైన యావేళఁ గలగని
లేచి యొద్ది వనితఁ జూచిపలికె. 55

క. సన్నపుగట్టుననుండి స
మున్నత మగుకొండమీఁది కుఱికితి నని నేఁ
జిన్నకలఁగంటి నీఫల
మెన్నఁగ నీమదికిఁ జూడ నెట్లగుఁ జెపుమా. 56

వ. [1]నావుడు నది ప్రేమపాత్రం బగుభోగస్త్రీ గావునఁ బరిహాసరూపంబుగా నగుచు దిబ్బనుండి కొండ కుఱుకబోయిన నడుముం గాలు విఱుగంబడి యెద వనిన. 57

క. నగుచుం గేహము వెలువడి
జగతీపతి జలకమాడి సంధ్యార్చన యొ
ప్పగఁ దీర్చి యేగి కొలువునఁ
దగువారలవంకఁ జూచి తనకలఁ జెప్పెన్. 58

క. చెప్పిన [2]నతనికిఁ గలలో
నప్పర్వత మెక్కుడిది మహాశుభ మగు నే
చొప్పున ఫల మొనగూడునొ
తప్పక వినిపింతుమనుచుఁదలపోసి యటన్. 59

---

1. క. నావుడునది భోగస్త్రీ, గావునఁబరియాచకంబుగా గుబ్బలినుం, డావలికొండకు నుఱుకం, బోవుటఁ యటఁ గాలు విఱుఁగబొరిబడె దనినన్. (ఒక్క ప్రతి) 2. నందఱు.

క. నీరాజ్య మల్ప మిది యిఁక
నే రీతులఁ జూడ నీకు నింకన్నధిక
శ్రీరమ్య మైన రాజ్యము
చేరం గల దనుచు వారు చెప్పిరి పతికిన్. 60

ఉ. అత్తఱి వచ్చి యొక్కఁడు రయంబున మ్రొక్కి నృపాలశేఖరా
యుత్తరదేశ మేలెడు నృపోత్తముఁ డీల్గిన మంత్రు లన్యులం
జిత్తములందు మెచ్చక విశిష్టగుణాఢ్యుఁడ వంచు రాజ్యము
న్విత్తముఁ గూడ నీ కొసఁగు వేడుకఁ [1]బుచ్చినఁ గానవచ్చితిన్. 61

చ. అనవుడుఁ జోద్యమంది యతఁ డాప్తులమాటలు నిక్కమైన నె
మ్మనమునఁ బొంగి వారికిఁ గ్రమంబునఁ గోరిన వాని నెల్ల మె
చ్చున కొనఁగూడ నిచ్చి తగుశూరులు వీరులుఁ గొల్వ నుత్తరం
బున కధికప్రతాపమునఁ బోయె నరాతికులంబు బెగ్గిలన్. 62

వ. అంత నద్దేశంబుఁ బ్రవేశించుచు మనోల్లాసంబున. 63

క. తఱచైన మంది ముందఱఁ
[2]బరువడిఁ జని తలఁగ ధరణిపతి తురగంబుం
బఱపుచు[3] ముందలఁదనకల
విఱిచినక్రియ గ్రుంతఁ గాలు విఱుగంబడియెన్. 64

వ. అప్పు డందఱును హాహాకారంబుల గుంపులు గూడుకొని పలువరింపంగవా
రిలో [4]సద్యస్సంధాననిపుణుం డగుజెట్టి ఘట్టి దట్టి గట్టిగాఁ గట్టి మంత్రించి
[5]సుఖితుం జేసిన సుఖాసనంబుపై నాసీనుండై చనంగ. 65

---

1. బంచిరి. 2. బరిపిరి. 3. మోదల 4. శల్యసంధాననిపుణు. 5. నుచి
త్తుంజేసి.

శా. ఆదేశంబున మూలదుర్గమగు ప్రోలావాసమై యున్న ధా
త్రీదేవప్రకరంబుఁ దత్ప్రభుజులు మంత్రిస్తోమముం బూజితం
బౌ దంతావళముం బురస్సరముగా నంకించి యేతెంచి యా
హ్లాదం బొప్పఁగ రాజుఁ గూడుకొని వాద్యంబు ల్వడిన్ మ్రోయఁగన్.

ఉ. వచ్చినవారికెల్లఁ బతి వైభవ మేర్పడ నల్లపట్టులుం
బచ్చనిపట్టు కెంపు గల పట్టులు సొమ్ములు నాదరంబుతో
నిచ్చి గజంబునెక్కి తర శేక్షణ లాడుచుఁ బాద వీటిలోఁ
జొచ్చి యమాత్యు లౌనవఁగ సుస్థిరుఁడై ధరయేలెఁ గావునన్. 67

క. తెలియక పలుకుట యుచితమె
జలజభవుం బోలునట్టి సచివుని భట్టిం
బిలిపింపు మాతఁ డెఱుఁగని
కల లెవ్వియు లేవు పొందుగా నది చెప్పన్. 68

చ. అనునెడ భట్టి వచ్చినఁ గృతాదరుఁడై తన పొంత నాసనం
బునఁ దగ నుంచి విక్రమవిభూషణుఁ డా కలఁ జెప్పి యే విధం
బున నిది యున్న దీవు తలపోసి నిజంబుగ నాకుఁ జెప్పుమా
యనవుడు నయ్యమాత్యవరుఁ డాత్మఁ గలంగి కలంగ కిట్లనున్. 69

మ. ధరణీనాయక నీ వెఱుంగదె నిషేధం బంచుఁ జెప్ప న్భయా
తురచిత్తంబుల నున్నవార లిచటన్ దోషంబు నిర్దోషము
న్వెరవారం దలపోసి చెప్పఁదగు నుర్వీభర్తకు న్మేలుగాఁ
బరిశీలించు నిజా ప్తవర్గమున కిభంగి న్భయం బేటికిన్. 70

ఆ.వె. కలకు మొదలిజాము ఫల మొక యేఁటిలో
నందుకొను ద్వితీయయామఫలము
అష్టమాసములకు నబ్బు మూఁడవజాము
ఫలముచూడమూఁడు నెలలఁగలుగు. 71

క. తొలివేకువగాఁ దూర్పునఁ
దెలు పెక్కఁగఁ గన్నకలలు దినదశకమునన్
ఫలియించుఁ [1]బసులవిడువం
దలఁకొనుకల సిద్ధిఁ బొందుఁదద్దివసమునన్. 72

క. ఏనుఁగు గుఱ్ఱముఁ బచ్చని
మ్రానును మేడయును మెట్టు మగపసరంబుం
బూని కలలోననెక్కిన
మానవునకు సుఖము రాజ్యమహిమయుఁగలుగున్. 73

క. కలలోఁ బాములుఁ దేళ్ళను
జెలగలు గఱచుటయుఁ [2]జావుఁజెప్పెడుఁబొరిమై
మఱమంటుట పొందందగు
లలనలఁ బొందుట సుతార్థలాభము చుమ్మీ.

క. [3]తలఁ బేను దినుటయును బ్రే
వులఁ జుట్టఁగఁబడుట మానవుల నెత్తురుఁ గం
డలుఁ బెరుఁగుఁ బాలు మద్యం
బులు [4]నెయ్మని ద్రావుటయును ముదమగుఁ గలలన్. 75

ఆ.వె. నీరు నెత్తురుఁ గనిన [5]నిడుదగు నాయువు
మంట గంట పసిఁడిపంట గంట
తెలుపు తెల్ల మేలు కలలోన వెలిమిడి
యెముక ప్రత్తి లవణముమొకదక్క. 76

క. వినుమిఁక [6]మొద్దును గాడిద
నెనుపోతును లొట్టిపిట్టనెక్కిన నన్నం

1. బసులఁ బిదుకఁదలకొను. 2. జావుచేటొదవునుమై. 3. తలబేనుతీట.
4. నెరయద్రావుట. 5. నిడివగు, నిగుడనౌ. 6. యెద్దును, మ్రోడును.

బును బిండియు నువ్వులు గలఁ
[1]దినఁగన నగుఁ గీడు వసుమతీవరతిలకా. 77

క. నూనెయుఁ గలియును గ్రొవ్వును
దేనెయుఁ గలఁ ద్రావెనే నతివ్యాధియగుఁ
వానరము బొగయుఁ గాకియుఁ
గానంబడెనేని గీడు గానఁగవచ్చుఁ. 78

క. మదగజము దేవరయు మృగ
మదమును గోపురము నీలమణులు న్నవనీ
రదములు ధరణియు యమునయు
నుదకుంభము దక్క నలుపులొప్పవు గలలఁ. 79

చ. జనవర నల్పులందు మహిషం బతినింద్యము దాని నెక్కినఁ
ఘనమగుకీడు గాన నధికం బగుశాంతి యొనర్చి యాకృతాం
తునకు మహోపచారములఁ దుష్టి జనింపఁగఁ జేయ మేలగు
న్నినుఁ బనివంప నిట్లొరులు నేర్తురె రాజవు నీవు నావుడుఁ. 80

మ. ధరణీశుం డిది యెంతకార్య మని యుత్సాహంబుతో శాంతి చె
చ్చెరఁ గావించి కృతాంతుఁ బూజల నతిక్షేమంకరుం జేసి స
ద్గురులం బేదల విప్రుల న్వరుసతో గోభూతిలార్థంబులం
బరమప్రీతులఁగా నొనర్చి పిదప న్బృందారితో నిట్లనుఁ. 81

క. భాండాగారములందుఁ బ
సిండియు రత్నములుఁ బట్టుఁజీరలు ధనము
న్నిండ నిడి తలుపు లెవ్వియు
నుండఁగనీయకుము నీవు నుండకు మచటఁ. 82

---

1. దినగోరంగాదు.

వ. నీ విప్పుడు పెద్దతలవరికి రాజు బండారంబు చూఁవిడిచె నేఁడు మొదలుగా నేడుదినంబులుదాఁక జను లెల్ల నిచ్ఛకు వచ్చువానిం గొనిపొండని చాటించి దేశంబువారి నెల్లఁ జూఁకు రండని యీప్రొద్దె బంట్లనూరూరికి బంచుమని చెప్ప మనవుడు భాండాగారికుం డతివిస్మితుండయి ధనకనకాదివస్తువులం గోశగృహంబులు నించి ఘటితకవాటంబులుగఁ జేసి తలవరికిం దత్క్రమం బెఱింగించిన. 83

క. జనపతి యేడుదినంబులు
తనబండారంబు వస్తుతతి చూఁలుగా
నొనరించు వలయునది కొని
చనరో యని యతఁడు వీటఁజాటఁగఁబంచెన్. 84

క. ఊరూరికిఁ జెప్పఁగఁ దన
వారిని బనుచుటయు నెల్లవారును గుంత
న్వారింపఁబడక చేరెడు
వారిక్రియ న్వచ్చి రయ్యవంతీపురికిన్. 85

ఆ.వె. వచ్చి వీరువారుఁ జొచ్చి విచ్చలవిడి
బడమతోఁట వీటఁబుచ్చునట్లు
నేడుదినము లం దనేక వస్తువులను
గొనుచు నేగి రింపు గొనలుసాఁగ. 86

క. తనిసి ప్రజ చనిన నష్టమ
దినమున బండారి వసుమతీరమణునకున్
వినిపించెఁ బూని చూచిన
ధనసంఖ్య త్రయోదశార్బుదము లయ్యె జుమీ. 87

ఉ. ఈగతిఁ జన్న యీగి ధరణీశ్వర నీకడలేదు గావునన్
వేగమె క్రమ్మఱం జనుము వీఁడిచేఁతలు మాను మన్న నా

త్యాగనిరూఢికి న్మిగుల నచ్చెరు వందుచు భోజుఁ డాత్మ ని
త్యాగమనంబు రోసి తనయంతిపురంబున కేగె సిగ్గునన్. 88

— ఇరువదినాలుగవ బొమ్మ కథ —

వ. మఱియు నొక్కదినంబునఁ జతుర్వింశ ద్వారంబునం గడంగి. 89

క. శీతగిరిబంధు [1]నూతన
శీతకరాభరణు సింధుశీతలమౌళిం
జేతోజాతవిఘాతి
న్భూతివిభూషణుని సర్వభూతాధ్యక్షున్. 90

చ. తలఁపుచు విక్రమార్కుని కథాశ్రవణంబున కిచ్చగించి యు
జ్జ్వలమణికీలితం బగు దివస్పతియాసన మెక్కవచ్చుచోఁ
బలికెఁ బసిండిబొమ్మ జనపాలక నీదు తలంపెఱింగితి
న్వల దననేల మేలు వినవచ్చినవారల మాన్పవచ్చునే. 91

శా. ఓ భోజక్షితిపాల ! నిల్చి వినుమా యుర్వీశుఁ డీశార్చనా
లాభాసక్తుఁడు శక్తుఁ డింద్ర సమలీలాచారి యాచారి యా
శాభాగప్రవికీర్ణమౌయశమున న్సర్వార్థి దారిద్ర్యము
ద్రాభంగక్షమదృష్టదృష్టి కరుణోదారుండు ధీరుం డిలన్. 92

శా. ఆ రాజన్యుఁడు నేల యేలునెడ నత్యాశ్చర్యమౌ నేఋలై
క్షీరంబు ల్ప్రవహించు ద్రాఁకుల మధుశ్రేణు ల్మహావృష్టి సం
ధారాపాతములై స్రవించు ధరణిన్ ధాన్యంబులుం బర్వతా
కారత్వంబునఁ బండుచుండు నరలోకం బొప్పుఁ దత్సంపదన్. 93

ఆ.వె. అట్టి దివసముల జనాధీశ్వరుండు దే
శాంతరములు చూడ నరుగువేళఁ

---

1. దినమణి, శీతకరాంబకుని గగనసింధుశశిధరున్.

1ప్రబలమైనధన విభాగముల్ దీఱక
వైశ్యసుతులు కోరి వచ్చి రటకు. 94

ఆ.వె. వచ్చి సాగి మ్రొక్కి వసుమతీనాయక
నలువురమును సోదరులము మేము
విన్నవింతు మొకటి వినుము 'పురందర
పుర' మనంగ నొక్కపురము గలదు. 95

క. సుందరులు మేనకాదులఁ
గ్రిందుపఱుపఁ బురుషు లమరకిన్నరులను లీ
లం దెగడఁగ నాపురికిఁ బు
రందరపుర మనఁగఁ బేరు రమణీయ మగున్. 96

ఉ. ఆ పుర మధ్యమంబున మహారజతాంచితకుంభదీప్తి సం
దీపిత మైన మేడ హిమదీధితి బింబము మీఱు నందు సు2
స్థాపితవైభవుండు ధనదత్తుఁడు మజ్జనకుండు వైశ్యము
ద్రాపరిపాలకుండు ధనదప్రతిరూపకుఁ డుండుఁ బెంపునన్. 97

చ. సదమలచిత్తుఁ డౌనతని సద్మమునన్ ఘటసన్నిభంబు లౌ
పొదుగులపాలు క్రిక్కిఱిసి భూమి తదీయ యశస్స్వరూపమై
చెదరఁగ మందయానములఁ జెన్ను వహించుచు వేల సంఖ్యల
న్మొదవులు కామధేనునిజమూర్తు లన న్విలసిల్లె నయ్యెడన్. 98

క. కలలోనైనను గఱవును
దలయెత్తఁగనీక బహువిధంబులధాన్యం
బులరాసులు తద్గృహములఁ
గొలఁది యెఱుఁగరాక యుండుఁ గొండలభంగిన్. 99

---

1. ప్రజలవలన దమ విభాగముల్— ప్రజలవలవధర్మ భాగముల్.
2. సంప్రాపితవైభవుండు ధనవంతుఁడు.

క. అనిలునితోడివివాదం
బున డొల్లిన మేరుశిఖరముల కెన యనఁగా
దినకరున కెదురు [1]వెలుఁగుచుఁ
గనకంబుల[?]ప్రోవు లతనిగాదెలనొప్పన్. 100

క. ఓమనుజాధిప యతనికిఁ
దూమెం డల్కానను బుట్లు తొంబది పండం
గామెఱయు పొలముగల స
ద్గ్రామంబులు నూఱుగలవు కంచికి నెనయై. 101

ఉ. ఈగతిఁ బెక్కుసంపదల నెన్నికకెక్కిన మద్గురుండు నీ
రోగశరీరుఁడై బ్రదికి రుద్రసఖుం డనఁ గీర్తి దాల్చుచుం
ద్యాగము భోగమున్ జరపి దైవగతిం గడకాల మైన ఖ
ట్వాగతుఁడై తనూభవుల వద్దికి నల్వురఁ బిల్చి యిట్లనెన్. 102

సీ. ధరణిపై నిడుఁడు ముందటిక్రియ సాగించు
    దర్థంబునకుఁగాటులాడవలదు
క్రమమున నాల్గుమంచముకోళ్ళ క్రిందనేఁ
    బాతినయవిమీకుఁ బాళ్ళుగాఁగఁ
గైకొనుం డాప్తవర్గంబును బెద్దల
    వైశ్యధర్మంబుల వదలవలదు
సంతసంబును బుద్ధిమంతులై [2]పెద్దలఁ
    బోలి బ్రతుకుఁ డంచు బుద్ధిసెప్పి

ఆ.వె. మిగుల నడలి నేము దిగువకు డించిన
యంత గురుఁడుశివునియందుఁగలిసె

---

1. మెలఁగుచు. 2. పెద్దల బ్రోచి.

నాత్మజాతికుచితమైన సంస్కారంబు
నడపి తద్దినములు గడపి పిదప. 103

క. సుముహూర్తంబున నామం
చముకోడులక్రిందఁ ద్రవ్వి చరువులలోఁ జి
ట్టుముకయు మన్నును బొగ్గులు
నెముకలు వేర్వేఱఁజూచి హృదయములలికెన్. 104

మ. భువిలో డాగఁగఁ జేసి రాగిచరువు ల్పూరించి యీతుచ్ఛవ
స్తువు లేలా మనయయ్య డాఁచె ధన మిచ్చోఁ బెట్టఁడో కాక బు
ద్ధివినాశం బతఁ డొందె నొక్కొ మనలో దృష్టించి యెవ్వాఁడొ దొం
గవిధం బచ్చుగఁ ద్రవ్వి చేకొనియెనో కా కంచుఁ దర్కించుచున్. 105

* * * *

క. అయ్యపనిగాదు దాసుల
నియ్యెడ దృష్టింపనేర రెవరుం జౌరలే
దయ్యముగా నా కెంపులు
దయ్యము గొఱయించెననుచుఁ దలపోఁతలతోన్. 106

క. మాలోనమ్మకయును నొక
పాలుం దేలకయు బహుసభాస్థలముల నీ
మూలములు చెప్పి విసిగితి
మేలాగున నైన నిర్ణయించు నృపాలా. 107

వ. అని విన్నవించిన సుముహూర్తమాత్ర ప్రయాణోన్ముఖుండు గావున ధర్మా
ధికారులను మంత్రులను బిలిపించి దీని నిర్ణయింపుఁ డని యప్పగించి విక్ర
మార్కుండు కొన్నిపయనంబులు భట్టిసహాయుండుగాఁ జనిన. 108

---

**** ఇచ్చోట రెండు పద్యములర్థముకాకున్నవి.

శా. ధర్మాధ్యక్షులు మంత్రులుం బిదపఁ దద్వాదంబు దీర్ప న్వణి
జ్మర్మం బేమియుఁ గాన లేక నగుచు న్మాకేల కల్లాద నం
తర్మాయాపరుఁ డైన మీజనకుఁ దర్థం బుండఁగాఁ బాళ్ళుగా
నిర్మించె న్మను బొగ్గు లాది యగువానిం బంచికొం డిమ్ములన్. 109

మ. అని హాస్యంబుగఁ జేసి పుచ్చినను నర్థాసక్తులై [1]వైశ్యనం
దను లూరూరికి నేగి చెప్పికొనుచున్ ధాత్రిం బ్రతిష్ఠాననా
మనిరూఢం బగు వీడు చొచ్చి చని తన్మధ్యంబునన్ శాలివా
హనునిం గాంచిరి దివ్య తేజుఁ డయి బాల్య క్రీడఁ గ్రీడింపఁగన్. 110

చ. కనుఁగొని దివ్యమూర్తి యని గౌరవ మెంతయుఁ దోఁప మ్రొక్కి యో
దినకరతేజ మాతగవు దీర్పుము ధారుణి నెల్లచోటులం
గనికని చెప్పి నిర్ణయము గానక వచ్చితి మంచుఁ దండ్రి చే
సిన నియమంబు మున్నుగ నశేషముఁ జెప్పిన నక్కుమారుఁడున్. 111

క. మీతండ్రియ పాళ్ళులు ని
ర్ణీతములుగఁ జేసి చనియె నేరక మీరీ
భూతలమునఁ దిరుగఁగ నొక
చాతుర్యము గలుగునట్టి జనుఁడును లేఁడే.[2] 112

వ. అయిన నేమి యయ్యెఁ దెలియ విండు. 113

ఆ.వె. ఉముకధాన్యరాసు లెముకలుపశువులు
మన్నుపొలముగలిగియున్నయూళ్ళు
బొగ్గులును బసిండి ప్రోవులు పాళ్ళుగా
నిచ్చినాఁడు వానిఁ బుచ్చికొనుఁడు. 114

1. ననర్థాయాసులై. 2. వినఁడే.

ఆ.వె. పాదధనము పసులు పసిఁడి యర్థధనంబు
పాపుగొఱత ధనము పండుభూమి
ధరణి నధికధనము ధాన్యంబుగావున
వానిఁగొనుఁడు పెద్దవానివరుస.[1] 115

చ. అనవుడుఁ జోద్యమంది కొనియాడుచుఁ గ్రమ్మఱ మ్రొక్కి వైశ్యనం
దనులు కృతార్థులై మగిడి తండ్రి గృహంబున నున్నసొమ్ము లా
తనివచనస్థితిం గొని ముదంబున నుండఁగ విక్రమార్కుఁ డా
య్యనఁ బర దేశముల్దిరిగి యాత్మపురంబున కేగి యిమ్ములన్. 116

చ. వలనుగ నొక్క బాలకుఁడు వైశ్యులపాళులఁ దీర్చెనంచు మం
త్రులు వినిపించిన న్విని విరుద్ధము బాలున కివ్విశేషకౌ
శల మని చోద్యమంది నిజశత్రునిగా మది నిశ్చయించి భృ
త్యులదెసఁ జూచి వాని నిట దోడ్కొనిరం డని పంచెఁ బంచినన్. 117

ఉ. ఆనరనాథభృత్యులు మహాబలులేగి రయంబునం బ్రతి
ష్ఠానపురంబు సొచ్చి శిశుసంగతి నాడెడు శాలివాహు ను
జ్జైనికి విక్రమార్కుని భజింపఁగ రమ్మని పల్కునంత వై
శ్వానరుమీఁద నెయ్యొలుకుచందము గానఁగనయ్యె నయ్యెడన్. 118

ఆ.వె. వెట్టిజోగిఁ జూపి విక్రమార్కుం డని
వెఱపువెట్టి విఱ్ఱవీఁగవలదు
మీన్నృపాలకుండు తానె రాజౌనేని
నిటకువచ్చి బ్రతికి యేగు మనుఁడు. 119

---

1. గీ. పాదధనము పసులు పసిఁడిపాదధనంబు, పాదధనము పొలము పంటయూళ్ళు, ధరణిపాదధనము ధాన్యంబుగావున, వాని గొనుడు పెద్దవాని వరుస.

క. మీరుం బొలియక పొందని
పీరుండై పలికె నంత వీరుం దమయు
ర్వీరమణునకుం జెప్పఁగ
వైరం బీకఁ బుట్టు ననుచు వచ్చిరి మగుడన్. 120

వ. అంతకుము న్నొకదినాధికవర్ష యగు కన్యకకుం బుట్టినవాని నరయం బోయిన బేతాళుండు నతనియునికి వినిపింపంగ నతని భృత్యులుం జని యో మహారాజ నీయాజ్ఞతోడంగూడ మమ్ముఁ బాఱఁ ద్రోపించె నబ్బాలుండు బాలార్కలీలం గ్రాలుచుండు నని చెప్పి [1]తద్ధీరోత్తు లెఱింగించిన. 121

క. కలఁగియుఁ గలఁగక యాతఁడు
బలములు గొలుపంగనేగి పై ఠాణము ద
ప్పులవిడిసినఁ గొందఱు భృ
త్యులు ముందఱఁబాఱి గవనిదూఱిరి పెలుచన్. 122

సీ. తూఱి తోరణములు ద్రుంపఁగాఁ బ్రజ లెల్ల
నదలిన వారిభయంబు లుడిపి
తంఁడ్రియౌనాగేంద్రుఁదలఁచి తచ్ఛక్తిఁగృ
త్రిమరూపములకుఁబ్రాణములువడసి
కదలుచో నిండ్లు వృక్షంబులు గోటలు
జంగమత్వము నొంది సరస నడచె
నొక శాల నెక్కి బాలకుఁ డది యాదిగా
శాలివాహనుఁ డను సంజ్ఞఁ దాల్చె

ఆ.వె. సేన లట్లు వెడలి భూనాథుభృత్యులఁ
బఱపి మొదలిదండుపైఁ గడంగి

1. తద్విరోధోక్తులు.

పోరునప్పు డురగములు శేషపంపున
వచ్చి విక్రమార్కువారి నడఁచె. 123

మ. తనసైన్యంబులు ఘోరసర్పవిషనిర్దగ్ధంబు లైన న్మనం
బునఁ జింతించి యతండు వాసుకి మహాభోగేంద్రు సేవించి యా
తనిచేత న్సుధఁ దెచ్చి సేనలకుఁ జైతన్యంబు రప్పింతు నే
నని యేగెన్నిజభృత్యరక్షణగుణాయత్తుండు మంథాద్రికిన్. 124

క. ఆ మందరగిరితటమున
భూమీశుఁడు భక్తినిష్ఠ భుజగేంద్రకుల
స్వామికిఁ దపమొనరింపఁగ
నామహనీయుఁడు ప్రసన్నుఁడై వేఁడు మనన్. 125

క. నీరూపం బమృతోద్భవ
కారణ మటు గాన నీవె కర్తవు నాసే
నారక్షణమునకు సుధా
పూరిత మగుకలశ మిచ్చి పుచ్చు మహీంద్రా. 126

చ. అని ప్రణమిల్లిన ఫణికులాధిపుఁ డయ్యమృతంబు కుండలో
నినిచి ప్రియంబుతో నొసఁగి నీవిఁక నేగుము నావుడు న్వయం
బునఁ దమతల్లి దాస్యము విముక్తము సేయ సుధారసంబు నే
ర్పునఁ గొని వచ్చు పక్షిపతిపోలికతో నృపుఁ డేగుదేరఁగాన్. 127

ఉ. దీప్రముఖప్రసన్నతు లతిప్రమద ప్రకృతి ప్రశస్తులో
క ప్రియవాదు లప్రకటకార్యులు సుప్రభలందు సూర్యచం
ద్రప్రతిమాను లప్రతిహతప్రతిభాగతి నప్రమేయులౌ
విప్రకుమారు లంతఁ బృథివీపతిఁ జేరి నుతిప్రవీణులై. 128

సీ. శివుఁ డిచ్చ మెచ్చి యిచ్చిన దివ్యఫలముఁ గా
రుణ్యంబుతోఁ గుష్ఠరోగి కిచ్చి

యవధూతు( డిచ్చిన యాసిద్ధలింగంబు
నాహార మడిగిన యతని కిచ్చి
కంబ మెక్కిననా(డు కమలాప్తు( డిచ్చిన
కుండలంబులు యాచకునకు నిచ్చి
యసురేంద్రు( డిచ్చిన రసరసాయనములు
కలహించు నిద్ద ఱర్థులకు నిచ్చి

ఆ.వె. నయముతోఁ ద్రిగాలనాథు( డిచ్చినబొంత
యాదిగా(గ రాచపేద కిచ్చి
వీరవిక్రమార్క ధారుణిఁ జరియించు
పారిజాత మన(గ( బర(గి తీవు. 129

క. ఖేచరపతిశిబికర్ణద
ధీచుల నిను( బోల్పరాదు దీనుల కర్థం
బేచోటనిచ్చి రుర్విని
నీచాగము సర్వవస్తునివహము గాదే. 130

క. అర్థం బన్యుల నడిగిన
యర్థులు వ్యర్థులును గదు నిరర్థులు నట యో
పార్థివ నిను( బ్రార్థించిన
యర్థులు సార్థులు( గృతార్థు లధికసమర్థుల్. 131

మ. అనుచుం బెక్కువిధంబులం బొగడ(గా నాబాలవిప్రద్వయం
బును వారించుచు నింత యేల హృదయాంభోజంబులో నున్న ప్రా
ర్థన మీకే మది వే(డు( డిత్తు నననిన్ ధాత్రీశ్వరా నీవు ద
ప్పనిరాజేంద్రు(డ వేని యాయమృతకుంభంబిమ్ము మాకింపగున్. 132

క. అనుచు న్వాలాయంబుగఁ
దను వేఁడిన మనములోనఁ [1]దత్తఱపడ కే
మనవచ్చు మీరు నావ
ర్ణనమెఱుఁగుదు రెవ్వరొక్కొ దైవతమూర్తుల్. 133

క. తెలిసెద నని నృపుఁడావి
ప్రుల సంబోధించి యిచటఁబొంకకుఁ డధికో
జ్జ్వలము లగునర్థిరూపం
బులమీ రెవ్వరు సమస్తముం జెప్పుఁ డనన్. 134

ఆ.వె. [2]శాలివాహు నట్లు చంపఁ గడంగు నీ
బలము ఫణులచేతఁ బొలిసినంత
వాసుకికిఁ దపంబు సేసి నీ వమృతము
వడయు టెఱిఁగి మమ్ముఁబనిచె నతఁడు. 135

క. వడుగు లయి విక్రమార్కుని
కడకుం జని వేఁడి యమృతకలశము మీచే
పడఁ జేసికొనుఁడు యాచకు
లడిగిన వంచింప కిచ్చు నతఁ డని చెప్పెన్, 136

క. తప్పక చెప్పితి మేమును
దప్పక నీవును యథోచితము సేయుము నీ
చొప్పు వొగడ వేజిహ్వాల
యప్పన్నగవిభున కైన నలవియె భూపా. 137

వ. అని నిజరూపంబులు చూపినం గొంత చింతించి విక్రమార్కుం డర్థు లడిగి
నం దనకు మోచినపని గాన నీక తలంగెనను నపకీర్తి వచ్చు దీని మీఁద

1. దక్కులవడి-దక్కులవిడియే. 2. శాలివాహుమీరునాలంబు సేయునీ-
బలము

నఖిలజగదాధార స్తంభం బగుకుంభినసేంద్రుండును దన్నింతవానిఁగా దలం
చి వీరలం బంచినచోట వృథపుచ్చుట నాదౌద్ధతనంబునకు మిగులం గొఱం
త గావున వైరిమనోరథంబులతోడం గూడ నాయశంబు వర్ధిల్లుంగాక యను
చు నిశ్చయించి. ౧౩౮

క. కుండలిబాలకులకు నధి
కుండగు భుజగేంద్రనాయకుం డటు మెచ్చం
గుండ యమృతంబు నేఁ డీ
కుండఁగఁ దగ దనుచుఁ దప్పకుండఁగ నిచ్చెన్. ౧౩౯

ఉ. ఈ వెరవొప్ప నర్థులకు నిచ్చి యతం డరుదెంచెఁ గ్రమ్మఱం
గావున నీకు నీగుణము గల్గిన గ్రక్కున దీని నెక్కుమా
నావుడుఁ దద్గుణశ్రవణ నందితచిత్తసరోజుఁడైన భో
జావనివల్లభుండును గృహంబున కేగి మతి న్నుతింపుచున్. 140

శా. సారాచారవిచారచారుచరితక్ష్మానిర్జరవ్రాతచే
తోరాజీవనిరంతరోల్లసిత విద్యోతప్రభాధామునిం
బారావారపయోవిహారభువనప్రారంభనిద్రాఖ్యమా
యరామాహతకైటభాది ఘనదైత్యస్తోము దామోదరున్. 141

శా. శర్వాణీహృదయాంబుజాహిమరుచి న్సర్వంసహాభృద్ధను
ర్మార్వీభూతమహాభుజంగమపతిన్ మందాకినీజూటునిన్
సర్వజ్ఞు న్సకలేశ్వరు న్భువనరక్షాదక్షిణప్రాభవున్
గీర్వాణవ్రజసంతతాభిలషితక్షేమంకరు న్శంకరున్. 142

మాలిని. విధురజనశరణ్యా వేద శాస్త్రాదిగణ్యా
బుధహిత నరవేషా భూషణీభూతశేషా
మధుకరనిభ తేజా మౌక్తికాళీసమౌజా
మధురిపుహరిరూపా మర్మకర్మస్వరూపా. 143

గద్యము. ఇది రాయగజగంధవారణవైరిమండలిక భేకఫణీంద్రవీర ఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిలాంధ్రమహారాష్ట్ర భూపాలరూప నూపురసుందర చరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాఁటిపృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ కొలని వెన్నయామాత్యపౌత్ర హరితస గోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్క సాహస పరోపకార స్వప్న శాంతివైభవ దానశూరత్వప్రశంసనం బన్నది నవమాశ్వాసము.

...[*]...

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## దశమాశ్వాసము

### —— ఇరువదియైదవ బొమ్మకథ ——

క. శ్రీదయితావదనచ్ఛా
యాదర్శీభూతకౌస్తుభారుణతేజో
మేదురవక్షఃస్థలు దా
మోదరుఁ గాకోదరేంద్రయోజితతల్పున్. 1

క. నెమ్మనమునఁ దలఁపుచు మో
హమ్మున సింహాసనమున కరుదెంచినఁ జో
ద్యమ్ముగ నిరువదియేనవ
బొమ్మ వలికె [1]నడ్డపెట్టి భోజనృపాలున్. 2

క. ఏమని చెప్పుదు నుజ్జయి
నీమనుజాధిపునిభంగి నియతంబుగ నో
భూమీశ్వర దివ్యంబగు
సామర్థ్యము లేక యెక్కఁ జన దెవ్వరికిన్. 3

మ. అది యెట్లన్న నెఱుంగఁ[2] జెప్పెద నరివ్యాపాదనాపాదనో
న్మదబాహాయుగఖండనంతధనదానప్రీణితక్ష్మాతల
త్రిదశస్తోమనిరంతరస్తుతిలసత్కీర్తిప్రియుండంగనా
మదనాకారుఁ డవంతినాయకుఁడు సామ్రాజ్యంబుతో నొప్పుచున్. 4

---

1. నడ్డుపెట్టి— 2. జెప్పెదనుసువ్యాపారశౌర్యోదయోన్మద.

శా. ప్రాతఃకాలమునందుఁ గొల్వున నయప్రఖ్యాతు లౌరాజులు
స్నీతిన్యస్తమనస్కులౌ సచివులు న్విద్వాంసులుం గొల్వఁగా
జ్యోతిర్మధ్యమున న్వెలింగెడు హిమాంశుంబోలి సొంపొందుచో
జ్యోతిశ్శాస్త్రవిదుం డొకండు ధరణీశుం గాంచి దీవించుచున్. 5

క. సర్వశుభంబులు నీకడ
నిర్వాహము గలిగి యుండు నీకేమని యా
శీర్వాదం బొసఁగుదు [1]నా
యుర్వృద్ధి దలంప నవియ యునికికిఁ గోరుణా. 6

ఆ.వె. ధరణిమీఁద నధిక దానధర్మక్రియా
పరున కాయు వది యపార మగుట
తెల్లమనుచుఁ బలికి తిథివారనక్షత్ర
యోగకరణములను నొప్పఁజెప్పె[2]. 7

సీ. ఐదింటఁ దానొప్పఁ దట నెన్మిదింటఁ దొ
మ్మిదియింటఁ బంద్రెంట మేలు శుక్రుఁ
డిందుఁ డాఱింటను నేడింట మూఁటను
బదిటఁ జేకొన్న శుభప్రదుండు
శనిరాహు కేతుభూతనయసూర్యులు మూఁట
నాఱింట మేలర్కుఁ దట్ల పదిట
రెంట నైదింట నేడింటఁ దొమ్మిదిటను గు
రుం డున్న నెల్లకోర్కులు ఫలించు

ఆ.వె. బుధుఁడు బేసిగానిపొందుల నిష్టుఁ డౌ
వీని కెల్ల దుష్ట వేధ లేమి

1. నాయుర్వర్ధన మదియె తనకునునికిం గోరుణా- నాయుర్వృద్ధి దలంప నలవి యున్నది మీకుణా. 2. నయుక్తిఁ జెప్పె.

ఫలము రొప్పు జననభవనంబు మొదలుగాఁ
బదునొకంటనున్న ఁబరమసుఖము. 8

గీ. అందు [1]రవితనుజాది మహాగ్రహంబు
లిప్పు డాఱింటనునికి స్త్రీయిష్ట మొనరు
గురుఁడుబుధుఁడును బైపయికొన్నుట్టమేలు
శుక్రచంద్రులు మూఁటనిల్పుట శుభంబు. 9

వ. అనుచు శుభస్థానంబులు నతని గ్రహంబులునుం జెప్పి. 10

క. "ధర్మే తిష్ఠతు తే బు
ద్ధిర్మనుజాధీశ" యనుచు దీవించినఁ ద
న్మర్మం బెఱింగి నృపుఁడా
ధర్మముచొప్పెట్టి దనివ దైవజ్ఞుండున్. 11

క. నీవది యెఱుఁగవె ధర్మము
త్రోవం జనువాఁడు భక్తితోఁ దనశక్తిన్
దేవబ్రాహ్మణపూజలు
గావింపఁగవలయు విగతకల్మషుఁ డగుచున్. 12

క. గురువును దేవరగా స
త్పురుషుని గురువుగ నిజాశ్రితునిఁ బ్రాణముగాఁ
బరవనితఁ గన్నతల్లి గఁ
బరధనము విషంబుగాఁగ భావింపఁదగున్. 13

గీ. అన్నదానము దుర్భిక్షమైనయప్పు
డంబుదానంబు నిర్జలం బైనచోట
నభయదానంబు శరణార్థియైనవేళఁ
జేయుటుచితంబు మనదయాశీలమలర. 14

---

1. అందురవిదనుజమంత్రిముఖ్యగ్రహమ్ము.

క. కృత్యాకృత్యవిచారము
నిత్యోచితదాన మాత్మనియమము బుధసాం
గత్యము పరోపకారము
సత్యము వినయంబు నయము జరపఁగవలయుఁన్. 15

ఉ. ఈకొలఁదిం దదంగము లనేకవిధంబుల నుండు నన్ని యు
న్నీకడ నొప్పుచున్న వవనీవర నావుడు విద్యలందుఁ బ్ర
త్యేకసమర్థుఁడైన నృపుఁ డిప్పటియేఁటి ఫలంబుఁ జెప్పుమా
నాకని యానతిచ్చిన మనంబున నాద్విజుఁ డుత్సహించుచున్. 16

మ. మహిమాఖండలుఁ డంచు భూజనులు సంభావింప నీ వింపుతో
మహిఁ బాలించుచుఁ బుణ్యకృత్యముల ధర్మద్రవ్య మార్జింపఁగా
గ్రహదోషంబులు పుట్టవట్లయిన నోరాజేంద్ర యీయేఁట దు
స్సహపాపగ్రహసంభవం బగునతిక్షామంబు వర్తిల్లెడిన్. 17

ఉ. అక్రమ మాచరించి విను మర్కతనూజుఁడు తొల్లి యున్న యా
శుక్రుని రాశిఁ[1] దా విడుచుచు న్శకటాకృతి నున్న రోహిణీ
చక్రము దూఱి మంగళుని సద్మము చేరఁ గడంగి యేఁటిలో
వక్రగతిం జరింపఁగ నవర్షణమై చనుఁ గొన్నివర్షముల్. 18

క. పఱిపఱి నిల పఱియలుగా
[2]నెఱిసిన వనపంక్తు లెండ నిరుపమమగునా
వఱపునఁ బంద్రెండేడులు
కఱ వింక నతిదుస్తరంబు గాఁగల దధిపా. 19

చ అనవుడు దీనికడ్డపడునట్టి యుపాయము గల్గెనేని నా
యను వెఱిఁగింపు మన్న వసుధామరతృప్తియె కారణంబుగా

---

1. శుక్రునిడాసి- 2. నిఱిసిన వనపంక్తు లెండనెడ్రతెవ్వని (నెడతప్పని)

నొనరిన దేవతార్చనల హోమములన్ గ్రహపూజ [1]మున్నుగా
జనవర [2]శక్తికిం దగినశాంతియొనర్పుము వర్షణంబగుఁ. 20

క. ఇనుమున నాశనిరూపం
బొనరించి వినీలవస్త్రయుక్తంబుగ న
ర్చనము రచియించి ఖది రేం
ధనమున హోమంబుసేయఁ దత్ప్రీతియగుఁ. 21

చ. అనినఁ ద్రివిక్రముండు మొదలైన పురోహితులఁ గ్రహాదిపూ
జనములు సేయఁ బంచి మృదుశాలిమయాన్నముఁ బాయసంబులుఁ
మునుముగఁ బిండివంటలు సమూహముగా నొనగూర్చి యిష్టభో
జనముల [3]భూసురు ల్దనియ శాంతి దలంబుగఁ జేసి శక్తితోఁ. 22

క. దేశాధీశ్వరుఁ డర్థుల
కాశాపరిపూర్తి సేయ నారాధిత యా
నాశాపూరణి దేవి ని
వేశాంగణసీమ హోమవిధి గావించెఁ. 23

ఉ. ఈగతిఁ బెక్కుహోమములు నీగులుఁ[4] బూజలుఁ జేసిచేసి వ
ర్షాగమ మేమియుం గనక యక్కట యాగము మీఱు నాశుభో
ద్యోగము వ్యర్థమయ్యె శివయోగినియుం గరుణింపఁ దంచుఁ జిం
తాగతుఁ డైనవేళ గగస్థలి నయ్యశరీరి[5] యి ట్లనుఁ. 24

ఉ. భూపకులేంద్ర యింత దలపోయఁగ నేటికి యోగమాత యా
శాపురి సంతసిల్లి యతిసత్త్వము నీకొసఁగెం బ్రభావసం

---

1. మున్నొనర్చను. 2. శక్తికిం దగిన శాంతి యొనర్పను వర్షణంబ గున్. యొనర్పుమతర్షణంబులఁ. 3. భూజనుల్దనియ. 4. నింపుగ బూజలు నీగులుశాంతిఁజేసి. 5. గగనాంతమునందశరీరి. 6 శాపురిశక్తిసంతసిలి సత్వము

దీపితదివ్యశస్త్రనిహతిన్ దిననాథతనూజవక్ర మా
ర్గాపఘనోపరోధ మభయంబునఁ జేయుము వృష్టి గల్గెడున్. 25

ఉ. పంటలు పెక్కుగల్గు నని పల్కిన నానృపుఁ డాత్మలోన ము
క్కంటి రఘూద్వహా న్విజయుఁ గైకొని మ్రొక్కుచు దివ్యబాణము
ల్వింట నమర్చి పంక్తిరథులీలఁ గడంగి ప్రతాపశక్తి మి
న్నంటి గ్రహంబు లెల్ల విరియంగ శనైశ్చరు నడ్డకట్టినన్. 26

ఉ. ఆశని నిల్చి నీబలమహత్త్వము మెచ్చితిఁ దొల్లి నీవు గౌ
రీశునిచేఁ దపంబున నభీష్టము లందితి, నేఁడు శక్తి నా
[1]కాశము గట్టి నాదగుప్రకాశము ద్రుంచితి నేఁటినుండి నీ
దేశములోపలం గఱవు దీఱఁ బ్రజ ల్సుఖియింపఁ జేసెదన్. 27

శా. హర్షం బయ్యె భవత్కృతంబున నృపాలాగ్రేసరా కోరిన
న్వర్షంబు ల్గురియింతు నెప్పుడయిన న్వర్ధిల్లు పొమ్మన్న ను
త్కర్షంబందిన శౌర్యమొప్పఁగ సుభిక్షం బుర్విఁ దోఁపంగ దు
ర్ధర్షుండై చను [2]దెంచి భక్తిఁ గొలిచెన్ ధాత్రీశుఁ డాశాపురిన్. 28

వ. అది గావున 29

క. ఈసామర్థ్యము [3]నీకడ
వీసంబునులేదు మగిడి వెసఁ జను మనినన్
వేసరినభంగి భోజుం
డాసింహాసనము డిగి గృహంబున కరిగెన్. 30

వ. తదనంతరంబ కతిపయదినంబు లరిగిన షడ్వింశతితమద్వారంబునఁబోవుచు

—* ఇరువదియాఱవ బొమ్మ కథ *—

క. తెల్లనికొండయు గుజ్జును
దెల్లనిపూఁతయును మేను దెల్లని షాముం

1. కాశముమ్ముట్టి నాకడఁ బ్రకాశభజించితి. 2. చనుదెంచె వేగ నెలమిన్ ధాత్రీశుఁ డుజ్జేనికిన్. 3 నీకరవీసంబును లేదు.

దెల్లని చుక్కలఱేఁడును
దెల్లనిచదలేఱు గలుగు తెల్లనివేల్పున్. 32

శా. చేతఃపద్మమునం దలంచి [1]విహితాశీర్వాదభూమీసుర
వ్రాతంబున్ హితవర్గముం[2]గొలువ సౌవర్ణోజ్జ్వలద్భూషణా
న్వీతుండై సుదినంబునం గడఁగి దేవేంద్రాసనాసక్తితో
నేతేరం గని బొమ్మ వల్కె వసుధాధీశు న్నివారించుచున్. 33

క. కార్యంబుగానిచేఁతలు
మర్యాదలుగా వవంతిమనుజేంద్రుక్రియన్,
ధైర్యమును సత్యమును నౌ
దార్యంబును లేక యెక్కఁదగదన్యులకున్. 34

ఉ. ఆతనిధర్మవర్తనకథామృతపానముఁ గోరుదేని పృ
థ్వీతలనాథ నిల్చి విను ధీరుఁ డుదారుఁడు శూరుఁ డాతఁ డ
త్యాతతకీర్తికాముఁడు [3]సదామితదానవినోది సాహస
ఖ్యాతచరిత్రుఁ డార్తహితకారణశీలుఁడు నేల యేలఁగన్. 35

మ. గజవాజిప్రముఖంబులౌ బలములన్ గర్వంబు రెట్టింప న
క్కజమౌ రాజ్యము సేయురాజులు మదిం గంపించి సేవింపఁగాఁ
బ్రజలెల్లన్ ధన్యధాన్యపుత్రవనితాభాగ్యంబులం బొందియు
న్నిజధర్మంబులు దప్పకుండిరి [4]మహానిర్వాహులై యందఱున్. 36

శా. ఆకాలంబున విక్రమార్కుఁడు విధేయంబైన దేశాంతరా
లోకాసక్తి మహిం జరింపఁ జని వాలుం జోగివేషంబు ని
త్యాకల్పంబుగ నంతటం దిరిగి ప్రత్యావృత్తుఁడై వచ్చుచో
నాకర్ణించె నతండు కాఱడవిలో [5]హంభాయనున్ ధేనువున్. 37

---

1. విహితాశీర్వాదమౌ భూసుర. 2. గొలువ నాస్వర్ణోజ్జ్వలద్భూషణా
3. సుధాకరదానవినోది; నుదారసదానవినోది; 4. మహానిర్వాణులై యుర్వరన్
5. నంభారవంబారగన్.

చ. అట విని యిట్టి కాఱడవి నద్భుతమైనది ధేనుఘోష మ్మ
త్కటమదపుండరీకహరి గండకసంకుల మైనచోటి క
క్కట పసు లెట్లు వచ్చె విధికల్పన చూచెద నంచు నేగి ముం
దట గిరిపొంతఁ గొంతయెడ దవ్వుల రేగడ వెంచలోపలన్. 38

ఆ.వె. నాల్గుకాళ్ళు రొంపి నాటిన నుంకించి
వెడలి రాఁగడంగి వెడల లేక
దీనవదన మైన ధేనువుఁ బొడఁగని
యతిదయాళుఁ డయ్యె నవనివిభుఁడు. 39

చ. అనువగువేళ దగ్గఱిన యాయతిథిం, జెఱనున్న భూమిదే
వునిఁ, గడురొంపిఁ బడ్డ పశువున్, వ్యసనాతురుఁ డైన యేలికం,
దన పగవారు గొన్న బిరుదంబున దుఃఖితుఁడైన మిత్రునిన్,
ఘనబలుఁ డయ్యుఁ గైకొన నికష్టునిఁ జూడఁగనోడుఁ గాలుఁడున్. 40

ఆ.వె. అనుచు వెంచ సొచ్చి తనకాళ్ళు గట్టిగాఁ
బెట్టి తోఁకమట్ట పట్టి యెత్తఁ
జట్టుభంగి రొంపి పట్టును వీడక
మొదవు కొంతయైనఁ గదలకుండె. 41

క. [1]ఆయవసరమున ఘన మగు
నాయావు నచెత్తలేక యలసగతుండౌ
నాయకుని జగము గని నగు
నోయని వెలుఁగుడిగెనన నినుండటఁగ్రుంకెన్. 42

గీ. మెట్టు గట్టుఁ జెట్టు మిట్టను బల్లము
బయలు ననుచు నేరుపఱుపరాక

---

1. ఆయవసరమున నాఘనుఁ, డాయావును—ఘనుఁడై యాయావును

మిన్ను వచ్చి నేలమీఁద వ్రాలిన యట్లు
దెసలఁ జీకువాలు దీటుకొనియె. 43

క. పగలు బయలనుండక కొం
డగుహలలోఁ జొచ్చుకొని యడంగి దినాంతం
బగుదడవె వెడలె గూబలు
నిగుడం [1]జీఁకట్లు పోలె నీలాకృతులై. 44

సీ. అప్పుడు చీఁకట్ల కుప్పలచొప్పున
ఘుమఘుమధ్వనుల మేఘములు వొడమె
నందుల మెఱపు లయ్యంజనాచలభూమి
దావాగ్నిశిఖల చందమున మెఱసెఁ
జెల్లుగాఁ బెటులు పెఠిల్లున మ్రోయుచుఁ
బిడుగులు తొడితొడిఁ బడియెఁగడల
రువ్వున వడినెడ త్రెవ్వనిగాలితో
గవుకులంతలు చినుకు లవనిఁ దొరఁగెఁ

గీ. బిదప నెత్తుగ బోరునఁ బెద్దవాన
కడవలను గ్రుమ్మరించిన వడుపు దోఁపఁ
గురియుచుండంగ వఱదలు గ్రుంత మిట్ట
లొక్కకొలఁదిగఁ బాఱె నీళ్ళొక్కజముగ. 45

శా. ధారాపాతజలాతిశీతఘనవాతక్లిష్టమా వృష్టిలో
నారాజన్యుఁడు [2]గోవుడించి చన నన్యాయం బటంచు న్మహా
ధీరుండై తనబొంత గప్పె నిజశక్తిన్ద త్తసాహాయ్యుఁడై
యారే యెల్లను దానె మాటగుచు ధర్మాసక్తితో నిల్పఁగన్. 46

---

1. జీఁకట్లయట్లు. 2. కుట్టిడించి, ధేనుడించి.

ఆ.వె. మిత్రుఁ డరిగిన యెడ శత్రువునై యిట్లు
గాసి వెట్టిన మదిఁ గలఁగఁ డితఁడు
ధర్మశీలునెదురఁ దామసగుణములు
నిలువ వనుచు రజని తలఁగిపోయె. 47

శా. ప్రత్యూషం బగునంత వాన వెలిసెం బ్రవ్యక్తమై దిక్కులం
దత్యాభాసము గల్గె జక్కవకవల్ హర్షించెఁ జీఁకట్లు దే
శత్యాగంబుగఁ బాసెఁ దమ్ములు వికాసం బొందఁ బూర్వాద్రి నా
దిత్యుం డుద్గతుఁ డయ్యెఁ గుంకుమగతిం దేజంబు రాజిల్లఁగన్. 48

క. పక్షులు వలుకుచుఁ దమతమ
పక్షము లగువానిఁ గూడి బాలార్కరుచిం
బక్షంబులు కెంపదరఁగఁ
బక్షీంద్రుని పిల్ల లనఁగఁ బాఱం దొడఁగెన్. 49

ఉ. అప్పుడు విక్రమార్కుఁడు ప్రయాసము వుట్టఁగఁ దోఁకవట్టి తా
నెప్పటి యట్ల పూనికొని యెత్తఁగ ధేనువు లేవకున్న నే
చొప్పు నెఱుంగ లేక యిది చూడఁగ సన్నము చాల వ్రేఁగు నా
కప్పరమేశుఁ డిచ్చిన మహాబల [1]మెక్కడ స్రుక్కె నక్కటా. 50

ఉ. కొమ్ములు పట్టి యెత్తఁ బథికుం డొకఁ డైనను గల్గఁ డిట్టి ఘో
రమ్మగుకానలోపల నరప్రసరం బది యెట్లు గల్గు నా
యిమ్ముల యత్న మేల ఫలియించుఁ బురాకృతవృత్తినైన భా
గ్యమ్మునఁ గాక యంచు మదిఁ గందుచు ముందఱఁ బాఱఁ జూచినన్. 51

సీ. [2]గజములం తేసి మృగంబులఁ
జెండాడుగోరు లంకుశముల కొలఁదిమీఱఁ
జాఱలు తనచేతఁ జచ్చినజీవుల
లెక్కబొట్టులక్రియ నక్కజముగఁ

1. మిక్కడ. 2. గజములయంతమృగ.

నొక్కపెట్టునఁ బ్రజ నుర్విఁ గూలఁగఁజేయు
　　కాలదండాకృతి వాల మెసఁగ
మదిఁ గ్రోధవహ్నికి మొదలైన
　　నిప్పులపెంపునఁ గన్నుల [1]కెంపు గదుర

ఆ.వె. బ్రణుతవీరరసము పట్టినకడవనా
దనరు రౌద్రరసము దాన యగుచు
నవని [2]మ్రింగుమాడ్కి నావులించెడు మహా
వ్యాఘ్రమొకటి కానవచ్చెనెదుట. 52

క. కని దీని నెత్తఁ దోడ్పడు
మనుజుని దలఁపంగఁ బసులమారియె వచ్చె
న్మను గండమాలమీఁదను
మొనకురుపుం బుట్టె నన్నమోసంబాయెన్. 53

చ. ఇది కడు దుస్తరం బనుచు నెంతయు నాతురుఁడైన నంతలోఁ
జెదరక బంటుమీఁదఁ బరికించుచు దగ్గఱుశూరుకైవడిం
బదములచప్పు డేర్పడనిబాగునఁ బొంచి చలించి వాలమున్
వదనము చేయి నెత్తుకొని వ్యాఘ్రము పైఁబడియెం గడిందిగన్. 54

క. పదునెడ నడ్డమునొచ్చిన
పుదమివిభుం గదిమి యెడమభుజ మడిచెఁ ననుం
బొడగనియుఁబొడుచు బెట్టిఁగియు
బడియఁడనుచుఁబొగడి చేతఁజఱచినమాడ్కిన్. 55

ఆ.వె. పెడమరించి యతనిఁ దొడరక యాపులి
మిత్తిభంగిఁ గుట్టిమీఁది కుటికి

---

1. కెంపు దేర　2. నవని బీటవెట్టి యావులించెడు.

మును దిలీపుఁ డిష్టముగఁ గాచునందిని
నెగసిపట్టు నామృగేంద్రుకరణి. 56

క. ఉఱికిన నాపులితల దెగ
నఱికినఁ బులి మాయ మైన నభమున సుర ల
త్తరి మెచ్చి పుష్పవర్షము
తఱచుగఁ[1]గురియించి రభయదాయకుమీఁదన్. 57

చ. అవనివరుండు నెమ్మనమునం దతివిస్మయ మంద నొక్క లా
ఘవమున లేచి పల్వలము గ్రక్కున వెల్వడి కుత్తి లోచనో
త్సవమగు దివ్యభావమున సన్నిధి గై కొని యేను గామధే
నువ నిను మెచ్చితి న్మదికి నూల్కొనునిష్టము వేఁడు నావుడున్. 58

క. తద్భాషణమున మదిఁ గడు
నద్భుతముఁ బ్రియంబునిగుడ నాతఁడు సురసం
పద్భోగభాగ్యనిధి యని
సద్భావముతోడ మిగుల సన్నుతుఁ డగుచున్. 59

క. అమృతాహారులు నసురులు
నమృతంబునకై మహాప్రయాసముతో న
య్యమృతాంభోనిధి దరువఁగ
నమృతము నీయంద కలుగ నటఁ బుట్టితివే. 60

క. పుట్టినయి ల్లంబుధి తోఁ
బుట్టువు లమృతేందు[2]కల్పభూజము లవియ
ప్పట్టున నూరక మనఁగా
నిట్టి విరోధంబు నీకు నేలా కలిగెన్. 61

---

1. గురియంజేసి రభయ దాయకునిపై వేడ్కన్. 2. కల్పభూజాదులచే, పట్టుసురలోకమనఁగా.

ఆ వె. తల్లి యింతకును గతం బేమి తెలియఁగా
నానతీయవలయు ననుచు మ్రొక్కి
నిలిచి యున్న సురభి నృపవర్యుఁ దనపుత్రు
రీతి మిగుల నాదరించి పలికె. 62

సీ. పురుహూతుఁడొకనాఁడు గురువాదిగాఁగల
విబుధసంఘంబు సేవింపుచుండ
నూర్వశియును రంభయును మంజుఘోషయు
నా తిలోత్తమయును నాఘృతాచి
ప్రియదర్శనయు సుకేశియును మేనకయునా
నెనమండ్రు దివ్యనాయికలు గొలువ
గరుడగంధర్వకిన్నరపన్నగేంద్రులు
తమనియమంబులు తగభజింప

ఆ.వె. వసువులును రుద్రు లుభయపార్శ్వముల నుండ
సిద్ధు లెనిమిది తనపొంతఁ జేరి నిలువఁ
దుంబురుఁడు నారదుఁడును బ్రస్తుతులుసేయ
నధికసంపదఁ గొలువున్నయవసరమున. 63

శా. పర్యాయప్రకృతప్రసంగముల సంభాషించుచో దేవతా
చార్యుం డోసకలజ్ఞ నారదమునీశా నేఁటికాలంబునం
గార్యాకార్యవిచారముం గృపణరక్షాదక్షకత్వంబు నౌ
దార్యంబుఙ ఘనధైర్యముం గలిగి యేధాత్రీశుఁడొప్పుఙ భువిఙ. 64

మ. అనిన న్నారదుఁ డోసుపర్వకులవంద్యా యిప్పు డుర్వీస్థలి
న్మనుజాధీశులు లెక్కమీఱఁ గల రేష్మాపాలురుఙ దీనపా
లనధైర్యంబున లావున న్వితరణోత్సాహంబున న్విక్రమా
ర్కునిసాదృశ్యము నొందలే రతనిఁ బేర్కొన్న న్శుభోదర్కముల్. 65

చ. అని పలుకంగఁ దావిని మహాసనసంస్థితుఁ డైన పాకశా
సనుఁ డతివిస్మయంబుఁ గడుసంతసముం బొదమంగ సమ్ముఖం
బున నిలుచున్న నన్నుఁ గని పూని ధరిత్రికిఁ బొమ్ము విక్రమా
ర్కునిసుగుణమ్ము లేర్పఱుచురూపము గైకొనుమంచుఁ బంచినన్. 66

ఉ. నే నిట వచ్చి యిచ్చటికి నీవును రాఁగల వంచు దుర్బలం
బైన గవాకృతిన్నిలుచునంతట వచ్చితి వింద్రుమాయ న
వ్వానయు గాలియుం గలిగె వ్యాఘ్రము పైఁబడుటయ్యె నన్నియు
[1]న్మానవనాథ యిన్నిటికి మానుగ నోర్చితి గాన మెచ్చితిన్. 67

ఉ. నావుడు సమ్మదం బతిఘనంబుగఁ బొంగి యవంతినాథుఁ డో
దేవి భవద్విలోకనము దివ్యపదస్థితికారణంబు నా
దైవము గల్గెఁ జాలు వివిధంబగుసంపద నీశుభానుకం
పావిభవంబునం గలదు భవ్యుఁడ నైతి నటంచు మ్రొక్కినన్. 68

శా. క్షోణీనాయక నేఁటి మెచ్చునకు నీ సౌమ్మైత్రిఁ గైకొమ్ము గీ
ర్వాణాధీశుఁడుఁ బొందలేని శుభము ల్ప్రాపించు నీకంచు న
క్షీణోల్లాసముతోడ వచ్చు సురభిం జేపట్టి దీనాతుర
త్రాణాసక్తుఁ డతండు క్రమ్మఱి మహోత్సాహంబుతో వచ్చుచున్. 69

ఉ. అంపెలు గట్టి చేత నొకయష్టి ధరించుచు నెత్తివెంట్రుక
ల్పెంపల ప్రేలఁగా ముదిమి జీపనరంబులు తక్కిస్రుక్కి యా
కంపిత మైనవక్ష మనుకంపకు హేతువుగాఁగఁ బ్రార్థనా
లంపటుఁ డయ్యు మేనికి బలం బొదఁగూడమిఁ గుందువిప్రునిన్. 70

చ. కనుఁగొని యేల కుందెదవు కారణ మే మిది చెప్పు మన్న నో
యనఘ మహాదరిద్రుఁడ ననల్పకుటుంబికుఁడ న్వినష్టజీ

---

1. న్మానవనాథసైచియభిమానము దాల్చితిగాన.

నను(దను జావ(గోరి యిట వచ్చి తి దేమని చెప్ప నావు(డు
న్మనమున నిట్టితెం పుడుగుమా యని రాజు కృపార్ద్రచిత్తు(డై. 71

క. నే వే(డినకోరుకు లివి
గా వన(గారాదు గాన( గారుణ్యముతో
నీవిప్రుని రక్షింపను
దేవీ పొమ్మనుచు( గామధేనువు నిచ్చెన్. 72

ఉ. ఇచ్చి నభఃస్థలంబున సురేశ్వరు( డాదిగ దేవసంఘము
ల్మెచ్చ(గ( దొంటిమార్గమున మిక్కిలి వేడుకతో నవంతికి
న్వచ్చె నృపాలు( డిట్టి గుణవైభవ మింకిట( గల్గెనేని నీ
విచ్చట వచ్చు టొప్పు మనుజేశ్వర యుక్తము నీ వెఱుంగవే.

క. నావుడు విని యుజ్జయినీ
భూవల్లభుసద్గుణములు పొగడుచు హితులన్
సేవకుల వీడుకొని భో
జావనివల్లభు(డు నిజగృహంబున కరిగెన్. 74

వ. మఱియును గతిపయదినంబులు జరిగిన. 75

—* ఇరువది యేడవ బొమ్మకథ *—

క. అక్రూరవరదు రణరం
గక్రీడాశమితవిమతు( గమలారమణుం
జక్రీశ్వరపర్యంకుని
జక్రాయుధభరణు దుగ్ధసాగరశాయిన్. 76

మ. అతితాత్పర్యమునం దలంచుచు నిలింపాధీశభద్రాసన
స్థితికై సంపద పెంపుమీఱ(గ( గృతాశీర్వాదభూనిర్జరా
న్వితు(డై భోజవిభుండు దగ్గఱునెడ న్వీక్షించుచు న్సప్తవిం
శతమద్వారము నొద్ద బొమ్మ సుజనాశ్చర్యంబుగా నిట్లనున్. 77

ఉ. పూతచరిత్రు సాహసవిభూషణుఁ బోలఁ జరించుచోట దుః
ఖాతురుఁ డైనవాఁడు తనకబ్బినయోగికిఁ బాత్రుఁ డంచు నే
జాతివిభేదము న్గుణవిచారము సేయక యిచ్చునట్టి యా
దాతృగుణంబు లేక వసుధావర నీ కిది యెక్కుశక్యమే. 78

శా. పాత్రాపాత్రవివేక మంచు ధనలోభం బెక్కుడంజేయు నీ
ధాత్రి న్నీతులు గల్గుఁగాగ ఘన చింతాఖిన్నుఁ డౌవాఁడె స
త్పాత్రుం డంచు నెఱుంగు టొప్పు ననుచుం దత్కాలదానంబుల
న్మిత్రత్వంబు వహించు సర్వజనులు న్మెచ్చంగ వాఁ డెల్లెడన్. 79

మ. వివరింతు న్వీను తద్గుణంబు లఖిలోర్వీనాథసంసేవ్యుఁ డ
య్యవనీపాలకుఁ డొక్కరుండ పరదేశాలోకనాసక్తి యు
త్సవమై సొంపు నటింపఁ గ్రుమ్మరుచుఁ బ్రాసాదోజ్జ్వలం బైన చం
ద్రవతీదుర్గము గాంచెఁ [1]గాంచికి సమానంబై వెలుంగొందగన్. 80

ఉ. ఆపుర మద్రిమీఁద వివిధావరణంబు ననేకలోకసం
దీపితమధ్యమం బనుగతిప్రకటీకృతసోమసూర్యవీ
థీపరిణాహరమ్యము నతిస్థిరభూభృదుపాశ్రయంబునై
శ్రీపతియాజ్ఞనుండు నది రెండవయబ్జభవాండమోయనన్. 81

ఉ. ఆనగరంబు సొచ్చి నవహర్మ్యనిరంతరరమ్యవాటికం
బైనవణిక్పథంబున ననంతసువస్తుసమూహదర్శనే
చ్ఛానిరతిం జరించి మణిసంఘటితంబగు నొక్కదేవతా
స్థానముఁ జేరి భిక్షుకువిధంబున నచ్చట విశ్రమింపఁగన్. 82

సీ. చెంగావి వలిపెంబుఁ జెలువారధరియించి
దలముగామేన గంధంబుఁ బూసి

---

1. గాంచికెనయైరాజిల్లుచున్నుండగన్.

తిలకంబు కస్తూరిఁ దీర్చి జాదులఁ గలి
గొట్టులఁ బొదవుగాఁ గొప్పవెట్టి
కందుదుప్పటిగప్పి యందియ డాకాలఁ
గీలించి పువ్వుఁగోల వట్టి
నిద్దమౌ కుచ్చుల [1]యుద్దాలు కిఱ్ఱని
మ్రోయఁగా నుల్లాసమునఁ జెలంగి

ఆ.వె. నలువు రేవురుఁసంగడీ లెలమితోడఁ
బోఁకలాకులు [2]నోటిలోఁబోసికొనుచు
జాణతనమున నట్టహాసములునొలయఁ
బెచ్చు రేగుచుఁగొలువఁగావచ్చెనొకఁడు. 83

క. వచ్చి గుడిసొచ్చి యందఱు
దిచ్చులు తనతిండికొఱకు [3]దీపులువెట్టఁ
మెచ్చుచు వేడుకయాటల
నచ్చోటం బ్రొద్దువుచ్చి యల్లన మగిడెన్. 84

క. మఱునాఁడు పెదవు లెండఁగ
నెఱిచెడి వదనంబు వాడ [4]నిస్సత్వముతో
ఱుగోఁచి గట్టుకొని క్ర
మ్మఱ వచ్చెన్వాఁడు దుఃఖమలినాకృతియై. 85

ఆ.వె. వచ్చి వెచ్చనూర్చి యచ్చోటఁ గూర్చున్న
వానిఁ జూచి మనుజవల్లభుండు
నీవు నిన్న రమ్య మౌవేషమున వచ్చి
నేఁడి టేల వచ్చినాఁడ వనిన. 86

---

1. ఉద్దాలు=చెప్పులు. ఉద్దాలుమ్రోయఁగా నుల్లాసమున జొక్కి యొయ్య జేరి 2. నోడిలోనఁ బోసికొనుచు. 3. దీపులువుట్టన్. 4. నీచత్వముతో.

సీ. చెప్పిన దీన నే సిద్ధియౌ నట్లయ్యు
నడిగిన నాకిది యడఁపనేల
మేటి జూదరి యన వాటమౌ తివుటమై
నాడుచుండుదు నే నహర్నిశంబు
దృష్టియేమఱక [1]నందియు జాగరంబును
దిగయును గాళనాఁ దేటపడిన
యచ్చులలోన నే యచ్చైనఁ గైకొని
మాటలాడిన యట్ల వేటుగలుగఁ
ఆ.వె. దలఁపుగతి వచ్చుఁగోరినదాయమనఁగ[2]
శకునిజూదము పీనియచ్చొకటియనఁగ
గెలుపునాదిగ నొడ్డుచు గెలుబనేర్చి
యెల్లపిడికిళ్ళు విడిపించియేనకొందు. 87

ఆ.వె. ధనము గలుగఁ జూచి తమకంబు పుట్టించి
మొదల గెల్వనిచ్చి పిదపగెలిచి
నలువు రౌననంగ బలవంతు నైనను
నిలువనాఁగికొందు[3] నిమిషమునను. 88

క. చతురంగంబున నే నతి
చతురుఁడఁ గరితురగమంత్రిశకటభటప్ర
[4]స్థితి పరహస్తము సేయుదు
క్షితి మెచ్చఁగ రాజు బంటుచేఁ గట్టింతుౝ. 89

---

1. సందియు జాగరంబును దిగయునుగరయునా-నంటయు జాగరంబును దీగయుగరము నైదింటబడిన. 2. దాయమేసి. 3. నాచికొందు. 4. స్థితవర హస్తము.

క. ఎక్కడఁ గోరిన దాయము
లెక్కువతక్కువలు గాక యే తేరంగా
నెక్కటి నెత్తమ్మున గొ
మ్మెక్కటియును నాడ నేన యెక్కటిఁ జుమ్మా. 90

క. తగులు విరియైనఁ గడు మె
చ్చుగ నాడుదుఁ బులుల మూఁటజూదంబులలో
మిగులఁగ నేర్పరిబాగిడి
తిగుటన్ సొగటాల నే నతిప్రౌఢుండన్. 91

ఉ. మేదిని నిట్లు జాణలకు మెచ్చగు నాటలు నేర్చువారికే
నాది యనంగ నొప్పుచు నహంకృతి నిప్పుడు దప్పనాడి యా
జూదమునందుఁ జిక్కి విరసుల్నను నవ్వఁగ మేనివజ్రభూ
షాదిసువస్తువు ల్గెలిచినాతని కిచ్చి వివర్ణ మొందితిన్. 92

ఉ. దైవబలంబు లేమి గతి దప్పిన నర్థము గోలుపోయితి
న్నావుడు బుద్ధిగా దని మనంబున కింపు జనింపఁ జేయ ను
ర్వీవరుఁ డిట్లను న్వినుము వీటఁడిచేఁతలు మాను మేదినిన్
దేవతల న్భజింపు సుగతిస్థితులొక్కట నీకుఁ జేకురున్. 93

క. [1]ధనమును సత్యము శౌచం
బును నాదిగఁ గోలుపోవు భువిదుర్వ్యసనం
బని యెన్నఁబడ్డ జూద
మ్మున బ్రుంగుడు వంగుడౌటఁ బొందిది యగునే. 94

క. జూదమున నలుఁడు చెడియెను
జూదంబున నట్టిధర్మజుండును జెడియెన్

1. ధనము యశమును సత్యంబును ...బ్రుంగుడుబ్రుంగుడౌట-బ్రుంగుడు మగ్గుడౌట.

[1]జూదమున ధాతువాదము
వాదంబునఁ దొరరఁ జేటవశ్యము గలుగుఁ. 95

ఉ. హితుని తెఱంగునన్ హితము నిష్టముఁ జేకుఱ బుద్ధి చెప్పితి
న్మతిఁ బరికించి మద్వ్యసనమగ్నుఁడవై చెడకుంటి వేని సు
స్థితి యొనగూడు లోకమునఁ దేఁకువయుం జెడకుండు నన్న నా
[2]కితవవరుండు నవ్వి యదిగేలిగఁ జేయుచు బల్కెఁ బ్రౌఢుఁడై. 96

ఆ.వె. ద్యూత కేళిరసము త్రోవ యెఱుంగక
పలికె దీవు వెడఁగుభావమునను
[3]వలనుగల్గి వాడఁ జెలమనీరము మాడ్కి
దీన నర్థ మొదవు తెరువు పుట్టు. 97

క. ధనలాభంబు బురాణము
వినికియు వాద్యంబు యోగవిద్యయు శాస్త్రం
బును సంగీతముఁ గావ్యం
బును నాటకములును జూదమున కెనయగునే. 98

క. గెలుపుతమకమునఁ జిత్తం
బలరంగాఁ గపటజూద మాడక యెవ్వం
డలసుఁ డయి చనియె భువి ని
ష్ఫలజన్ముఁడు వాఁడెకాఁడె పసరముభంగిన్. 99

క. [4]ఒకరూక వట్టి పది వే
లకు నొడ్డుచు నాడిపట్టిలాభము గరద

---

1. జూదమునం జాంబూనదవాదంబున. 2. కితవరుఁడల్లనవ్వి. 3. వలను గల్గియాడ 4. ఒకమాడపట్టి...నెరదప్పక-గొంద్రందఱు, గాంద్రనుడుకు.

ప్పకయిత్తురుఁ గొంద్రనువరు
లకటా జూదంబులోన నన్యతము గలదే. 100

ఉ. ఆట జయంబుఁజేకొనిన నర్థము చేకుఱు దాన మేటిగా[1]
నోటమిఁజిక్కి ద్రవ్య మిడనోపని పేదల కడ్డమౌచు మా
ఱాట భజింప ధర్మ మగు నంతన మోక్షము గల్గుఁ గావునం
దోటికిఁ జూచువార లిది దుర్వ్యసనం బన నమ్మవచ్చునే. 101

ఉ. హితభావంబున బుద్ధి-చెప్పితివి నాకిష్టంబుగా దాట సం
తతము న్సంతసమందఁ జేయు నొకచో దైవంబు దప్పించినన్
మతి వేఱొండుల కెక్కునే ధనము సంపాదించెఁ బూర్వంబున
న్మతిమంతుం డసురాజు బుద్ధిఁ జని సన్మానంబుతో నుండెనే. 102

—: మతిమంతుని కథ :—

ఉ. నావుడుఁ దత్కథావివరణంబునకుం జెవి యొని భూవరుం
డావిధ మేర్పడం దెలుపు మన్న దురోదరశీలుఁ డిట్లనున్
దేవసమానుఁడైన జయదేవుఁడు నా ధరయేలుచుండె ర
త్నావళిసంజ్ఞ నొప్పిన మహానగరంబున ధర్మశాలి యై. 103

చ. అతనికిఁ గాంతిరేఖ యనునంగనకుం బ్రథమాంశగణ్యుఁ డౌ
సుతుఁ డుదయించి బాలుఁ డగుచు న్నయశాస్త్రము లాగమంబులుం
గృతులుఁ బఠించి యోగములకీ లొకయింత యెఱింగి సర్వస
మ్మతమగు నేర్పుకల్మి మతిమంతుఁడునాఁ బరఁగెం బురంబునన్. 104

మ. అతికాలంబునఁ బెద్దయై నృపుఁడు పుణ్యారణ్యవాసంబు ప్ర
స్తుతమైన న్నయభూషణుం డను నమాత్యుం బిల్చి తత్సమ్మతి
న్సుతునిం బట్టము గట్టియేగె నట నస్తోకప్రభావాఢ్యుఁ డౌ
మతిమంతుం డిల యేలుచుండెఁ దనసామ్రాజ్యంబు పూజ్యంబుగన్. 105

1. దానగామమా- దానదానగాదు పేరోటమి.

క. రత్నాకరమేఖలఁ దన
పత్నిగఁ జేపట్టి సుగుణబంధురుఁ డనఁగా
రత్నావళిలో నాయక
రత్నంబై తేజరిల్లెఁ బ్రజ రంజిల్లన్. 106

క. రేలు నిగూఢాకృతితో
వాలు సహాయముగ లోకవార్తలుఁ గిడు
న్మేలును నరయుచుఁ దిరుగఁగ
బాలుని నొకనాఁడు మంత్రి ప్రార్థనచేసెన్. 107

క. మేదినిలో నీనడవడి
యాదిన్నృపాలకులచరిత మైనది నాకుం
గాదనరా దొకగతి నిది
గాదనియెద నాత్మ నొండుగాఁ దలఁపకుమీ. 108

ఆ.వె. నేఁడు చెప్పవలసె నృపుడు నీజాతక
మడుగునాఁడు బుధుల కడను వింటి
వినుము మొదలియంశమునఁ బుట్టినాఁడవు
చోరశిక్ష నిన్ను సోఁకుననిరి. 109

క. రజనిసమయములఁదిరుగకు
సుజనులతోఁ బొత్తుసేయు సోమకళాంకు
న్భజియింపుము హితులను మముఁ
బ్రజలను జేపట్టుమిదియ ప్రార్థనమాకున్. 110

ఆ.వె. అనుడుబాలనృపతి యౌఁగాకయనియొండు
బుద్ధిఁజూచిబ్రదుకుపొందుగాదు

గామకోపలోభగర్వమత్సరమోహా
ములనెకాని [1]రాజ్యబలముగొనదు. 111

క. కామక్రోధాదులు ని
స్సీమముగా విడువకున్నఁ జేటగు నొకచో
నే మునినై యుండఁగ మఱి
నామీఁదను ఘోరదండనం బేల యగుఁ. 112

మ. ఇది తప్పంజను టొప్పనంచు నడురే యేకాకియై యేగి భూ
తదయాళుం డనుమౌనిచేత శుభతత్త్వజ్ఞానుఁడై యంబికా
స్పదమధ్యంబునఁ బెక్కునాళ్ళు పవనాభ్యాసంబుతో నుండె ను
న్మదసారంగకురంగసంఘపరిగణ్యంబౌ నరణ్యంబులోఁ. 113

క. పోఁడిమి చెడియును దనమది
వాఁడిమి చెడనీక లబ్ధవైరాగ్యుండై
వాఁడతినియమంబునఁబదు
[2]మూఁడేఁడులదాఁకధ్యానముననుండంగఁ. 114

మ. ఒకనాఁ డేగురుదొంగ లంతికమునం దొప్పారు మందారనా
మకమౌ దుర్గము లీల నేలుచు మహాక్ష్మాపాలుఁడౌ జీవర
క్షకుకన్యాసదనంబు కన్న మిడువాంఛఁ వచ్చి యద్దేవి క
త్యకలంకం బగుభక్తిభావమున సాష్టాంగంబుగా మ్రొక్కుచుఁ. 115

క. లోకేశ్వరి నీకృప నీ
క్ష్మాకాంతుని కూఁతురగు ప్రకాశినిసొమ్ము
ల్మాకబ్బిన నందలరెడు
నాకల్పమునీకు నిచ్చి యరిగెదము సుమీ. 116

1. ములనెకాదు రాజుబలముచనదు. 2. మూఁడేఁడులదనుక. మూఁడేండ్లందాఁక.

క. అని కానికె మైకొని చన
దిననాథుఁడు గ్రుంకెఁ దమము దిక్కుల నిండెన్
జనులు పనులుడిగి రారెకు
రనువరులై తిరుగఁ జొచ్చి రానగరములోన్. 117

మత్తకోకిల. గాలిచీరయు నొల్కి-బూడిద గ్రద్దగోరును గొంకియుం
గోలయు న్వెలుగార్చుపుర్వులక్రోవి ముండుల బంతియున్
మైలమందుల కొయ్య కత్తెర మాఱుగన్నపుఁగ త్రియు
న్నీలిదిండులు నల్లపూఁతయు నేర్పుతోడుగ ముచ్చులున్. 118

క. చప్పళ్లాలించుచుఁ దమ
చప్పుళ్ళడఁచుచును జొచ్చి సందులలోనం
జొప్పెఱుఁగకుండ [1]నేగుచు
జెప్పులుమాటైనడాఁగురింపుచుఁబురిలోన్. 119

ఆ.వె. ఉలుకు మ్రగ్గునంత నొకచోటమ్రొద్దుల
యట్లమెదలకుండి [2]యన్నకరువు
కొదవియంతనంత గొదుగుచు లోపలి
మెలఁకు వరసి [3]కోటమలుకదాఁటి. 120

ఆ.వె. పాలె మున్న వారిపై నొల్కి-బూడిద
మందు చల్లి పెద్ద మగులు కొంత
కూలఁ ద్రవ్వి రాచకూఁతు రుండెడిమేడ
కత్తిరించినట్లు గంటువెట్టి. 121

క. తొడిదొడిఁ గ్రోవులపుర్వుల
విడిచి దివియ లార్చి గంటి వెలుఁ గాలోనం

1. నీగుచు 2. యన్నకదవుకొదివి-యంతలేచి. 3. కోటచలుకదాటి.

బదికుండఁ [1]జెలులుమాటఁగ
నౌదయనిక్రియనులుకులేక యొకరుఁడుసొచ్చెన్. 122

ఆ.వె. అపట నూర్పులరసి యాబాల నిద్రించు
దెఱఁగియొయ్య డాయనేగి వాఁగు
మీలఁ బుడికిపట్టు జాలరికై వడిఁ
బుడికి పుచ్చుకొనియెఁ దొడవులెల్ల. 123

సీ. అన్నియు నౌలకు నందిచ్చునప్పుడు
మును స్వయంవరమున కనుచు డాఁచి
దండియపై నిడ్డ తపనీయమాలిక
భుజము సోఁకిన దానిఁ బుచ్చుకొనుచుఁ
గన్నంబు వెడలి సంగడికాండ్రఁ గూడిన
నందఱు నుల్లాస మతిశయిల్ల
దుర్గంబు వెలువడి దూరస్థలంబున
సొమ్ముల తరబడి చూచునపుడు

ఆ.వె. వెనుకఁబురములోనఘనముగాఱంతయ్యె
నారెకుబునుదివియలందికొనుచుఁ
గల్లపుట్టె ననుచు నెల్లదిక్కుల జార
లరయఁ జొచ్చి [2]రప్రమత్తులగుచు. 124

క. ఆకలకలమున నిలువక
యాకులులై పసిఁడిపేరె యధికం బనుచున్
లోకేశ్వరికై గుడియా
వాకిటఁ బాఱుచును లోనవైచిరి ప్రముచ్చుల్. 125

---

1. శాంలమాటుగ-చెయ్యిమాటిడి 2. రతిభయార్తులగుచు-రతి విహస్తు లగుచు.

కం. తపసిఁడిపేరు గుడిలోఁ
దాపసుఁడై నిష్ఠ నున్న ధరణీపతికం
ఠోపాంతంబునఁ దగిలెం
బాపంగారానికర్మబంధముభంగిన్. 126

చ. తలవరు లంతలోఁ బ్రతిపదంబును జాడలు వట్టి వచ్చుచున్
బలబలఁ దెల్లవాఱ గుడిప్రాంతము దగ్గఱి యంతలోన ని
[1]శ్చలనిజగాత్రుఁడై నియమసంస్థితుఁ డౌ మతిమంతుఁ జేరి త
ద్గళమున వ్రేలుచున్న నవకాంచనమాలికఁ గాంచి యుగ్రులై. 127

ఉ. ముచ్చిలి రాచసొమ్ములివి మున్నుగ నన్నియుఁ దెచ్చి మౌనివై
యిచ్చట నున్నఁ బోవిడుతుమే వెసఁ జెప్పుము తోడిదొంగ లిం
కెచ్చట నున్నవార లని యీడిచి చేతులు గట్టి మోఁదుచుం
దెచ్చి కదంకతో వసుమతీపతిముందఱఁ బెట్టి రాతనిన్. 128

సీ. జీవరక్షకుఁ డను నీవు జీవంబు వో
నాడక చెప్పరా తోడివారి
నెక్కడనుంచితి తక్కినసొమ్ములు
తెమ్మని కొట్టించి ధృతి యడంచి
యొకయుత్తరంబు నీయక యున్నఁజంపింపఁ
గడఁగియుఁ దనపేరికడిమిదలఁచి
[2]కోపించి కాల్సేయిగోయించి వెడలించె
నాలోననొకవైశ్యుఁ డతని బ్రోవఁ

ఆ.వె. గరుణ నుడుకునూనె గాపించి వగయార్చి
కూడునీళ్ళు నొసఁగి వాడుఁదేర్చి

---

1. శ్చలమునివేషయోగమున సంస్థితు 2. గొంచుచు నతనికాలుంజేయు గోయించ—రోజుచునతనికాలుంజేయి.

పాటిగుడి సెయొక్కచోటఁ గట్టించి యం
దునిచి దినమునరయుచున్ననతఁడు. 129

క. [1]తనజన్మఫలము దప్పనె
తను వెడలినమీఁదనైనఁ దప్పదు నేఁ డీ
యనుభవమునఁ దీర్చెదనని
మనమునఁ దలపోసి యాత్మమరణంబుడిగెన్. 130

శా. ఆవైశ్యోత్తము ప్రోపునన్ బ్రదికి పుష్టాకారుఁడై రాత్రి నా
నావైచిత్రి ననేకరాగముల గానం బింపుగాఁ జేయఁగా
దేవస్త్రీక్రియ మేడనున్న నృపపుత్రీరత్న మాలించి కా
మావేశంబు భజించి దాది నటకుం [2]బ్రార్థింపఁ బుత్తెంచినన్. 131

సీ. అది వచ్చి యాతని యాకార మీక్షించి
మది రోసి క్రమ్మఱ సుదతిఁ జేరి
యిలఁగల రాజపుత్రుల నెల్ల మెచ్చక
యుండి నీ విప్పు డామొండివానిఁ
దెమ్మని పుచ్చితి కొమ్మ నీవెఱుఁగవు
నగుఁబాటు గాకున్నె జగములోన
ననవుడు నమ్మక యాబాల తానఖి
సారికాకృతి గూఢచారి యగుచు

ఆ.వె. వచ్చి చూచి దుఃఖవహ్నిచేఁ గ్రాఁగుచు
దెలివి సెడక దేహదీప్తి మెఱయ
నఱకఁబడిన పసిఁడితెఱఁగున నున్న యా
ధీరచిత్తుని జయదేవసుతుని. 132

---

1. జననఫలముదప్పనె యీ. 2. బ్రార్థించి—న్నర్థించి.

క. చూచి తను మఱచి పైబడఁ
జూచిన నాదాది నిలిపి క్షోణీపతికిన్
నీచందము చెప్పి తదా
జ్ఞోచితగతి నితనిఁ గూడు టొప్పుఁ గృశాంగీ. 183

వ. అదియునుం గాక. 184

క. మును నీవు స్వయంవరమున
కని డాఁచిన కనకమాలికాభరణం బీ
తని ముట్టి వచ్చెఁ గావున
నొనరినపతి యితఁడె కాఁగ నొప్పుం బదమా. 185

చ. అని మగిడించినం దిరిగి యంతిపురంబుకేగి పినకే
తనుఁ దభిమానముం దగవుఁ దాల్మియు సిగ్గు నడంపఁ దెంపునన్
జనకుని వేఁడి నీవు ననుఁ జంపినపాపము నొందువాఁడ వీ
పని కెడచేసితే ననుచుఁ [1]ప్రార్థన యేర్పడఁ జేసి మ్రొక్కినన్. 186

మ. అకటా పేరును బెంపు సొంపు నతిరమ్యాకారముం గల్గువా
నికి నే నిచ్చెద నంచు గారవముతో నిన్నుంప నీ విట్లు వం
శకళంకం బొనరించి తీవు మొద లెంచం గోర వీమొండివా
నిక మోహించితి మాకుఁ జిచ్చిడితివో నీవేల మేమేటికిన్. 187

క. అని పదరు టియ్యకోలుగఁ
జని సఖులును దాను వెఱపు సమయించి ప్రకా
శని మతిమంతుని దోడ్కొని
తనమేడకుఁ [2]దెచ్చెఁ బ్రజలు దను నవ్వంగన్. 188

ఆ.వె. తెచ్చి జలకమార్చి దివ్యాంబరంబులు
గట్టనిచ్చి మంచిగంధ మలఁది

---

1. ప్రార్థననేర్పడఁ జెప్పిమ్రొక్కినన్. 2. నేగె.

యిష్టభోజనమునఁ దుష్టి గావించి యా
కొమ్మ తన్ను నతనిసొమ్ముఁ జేసె. 139

వ. అంత. 140

క. వెఱ పుడిగి యతఁడు రతికళ
లెఱుకపడంబొదలుతివుట హృదయముగరఁగ
నరకంబడియును జవిగల
చెఱకుక్రియం దీపులుట్టఁ జెలువం గలసెన్. 141

వ. ఇట్లు కలసి సతిపతు లుండునంత. 142

క. ఒకనాఁటిరాత్రి తేజః
ప్రకటాకృతు లిద్ద అనిలపథమున డిగి మే
డకు వచ్చి నిలిచి రాబా
లిక పతిపానుపుననుండి లేచి తలంగన్. 143

సీ. నిలిచిన వారి యుజ్జ్వల దివ్యతేజంబు
చూచి దిగ్గనఁ దాను లేచి యచట
నిద్దఱఁ గూర్చుండ నిడి యర్చనము లిచ్చి
యేల విచ్చేసితి [1]రెవ్వ రనుడుఁ
గార్యంబు నాచేతఘటియించు విఘటించు
నీ వెంత తా నెంతనిలువుమనుచుఁ
గలహంబు బుద్ధికిఁ గర్మంబునకు నైన
నింద్రుండు మాన్పించి యిటకుఁబుచ్చె

ఆ.వె. నీవు నిర్ణయింపు దేవేంద్రునానతిం
ద్రోవరాదు శిక్షితుండ వీవు

1. రెవ్వరేమి, కార్యంబు నాచేత ఘటియింపఁగా మదిఁదలఁచి వచ్చితిరది తెలుపుమనిన.

బుద్ధిఘనమొ కర్మము ఘనంబొ చెప్పుమా
యేను బుద్ధిఁ గర్మమీతఁ డనిన. 144

వ. అతఁడు విని బుద్ధికర్మంబుల కిట్లనియె. 145

ఉ. ఎంతటివాఁడ నేను దివిజేంద్రునియానతి నన్నుఁగూర్చి మీ
యంతటివారువచ్చినఁ గృతార్థుఁడ నైతి ఫలానువృత్తి మీ
పంతము మీ రెఱుంగరె శుభం బశుభంబును గూడి చేయుచోఁ
గొంతయుఁ గీడు లే దుభయకూటము గాదె ఫలంబు పట్టునన్. 146

ఆ.వె. బుద్ధిదేవి నీవు పొందుగా [1]నిలువక
కర్మఫలము లెట్లు గదియు నైనఁ
దండ్రి కర్మ మీవు తనయవు మీతండ్రి
యెక్కు డైన నీకు నేమికొఱఁత. 147

క. దుర్మార్గునకును బుద్ధి స
ధర్మునకును విధికృతంబు తప్పదు "బుద్ధిః
కర్మానుసారిణీ" యను
మర్మము చెప్పుదురు నీకు మఱియొక తెరువా॥ 148

క. మును బుద్ధి ద్రోవఁజాలని
నను దృష్టాంతముగ నమరనాయకుఁ డిటకుం
బనిచె ననుఁ జూడ జగడము
పనిలే దని యొడఁబడంగఁ బలికి వినతుఁడై. 149

ఉ. చే టటుదప్పి లక్ష్మి నిరసించి వనంబున మౌనినైనచోఁ
నాటునఁ గాలుఁ జేయిఁ జనునాపదఁ బ్రాణము తీపినుంట నీ
జోటియు వెంట వచ్చుటయుఁ జూడ నయుక్తము లైన వింక నే
పాటులఁ బెట్టఁ జూచెదవొ బాపు, విధీ! నిను మీఱ వచ్చునే. 150

---

1. విద్వడ, విద్వక.

చ. అని వినయోక్తిగాఁ బలికినంతనె కర్ణము బుద్ధియుం గడం
కను దెరు వేది మాకనుచుఁ గైకొని యొక్కటి యౌచు నిర్ణయం
బునకుఁ బణంబుగాఁ గడుఁ బ్రమోదముతో నమృతంబు దెచ్చి పో
సిన నతికాంతిగా నతని చేయును గాలును వచ్చెఁ జెచ్చెరన్.　　151

ఉ. ఈగతి బ్రోచి వారు సన సీవల బాలిక యేగి హస్తపా
దాగమన ప్రకారము ప్రియంబుగఁ దండ్రికిఁ జెప్పె నాతఁడు
న్వేగమ వచ్చి యల్లుని నవీనరతిప్రియుఁ జూచి యాత్మపు
త్రీగుణభాగ్యసంపద నుతించుచుఁ గౌఁగిటఁ [1]జేర్చె నాతనిన్.　　152

చ. అతనిచరిత్రముం దెలిసి యత్యనురాగముతో నతండు దా
సుతరహితుండు గానఁ దనక్షోణికి నాతని రాజుఁ జేసిన
న్మతి నతిహృష్టుఁ డౌచు మతిమంతుఁడు తత్పురి యేలుచు న్నిజ
క్షితి కరుదెంచి మంత్రికుల సేవితుఁడై సిరు లొందెఁ గావునన్.　　153

క. నీవెరవును నావెరవును
దైవగతిం గాని కొనదు దయ గలిగిన నా
త్రోవల నాడుచు నుండఁగ
నీ వర్థముప్రాపు గమ్ము హితభావమునన్.　　154

సీ. నావుడు నట్లకాఁ గావింతు నూఱడు
మని వాని ననిపిన యవసరమునఁ
బరదేశు లిద్దఱు భాషించుచో నొకఁ
డిల యెల్లఁ గ్రుమ్మరి యింద్రకీల
నగముపై నున్న మనస్సిద్ధి యనుదేనిఁ
జూడ మైతిమి విశస్తులము మనము
అష్టదిక్కుల నున్న యష్టభైరవులకు
నష్టాంగరుధిరంబు లర్చనముగఁ

---

1. జేర్చెఁ జెచ్చెరన్.

ఆ.వె. జేసి కంఠరక్తసిక్తంబు బలియిచ్చు
జనులకోర్కు లెల్ల శక్తి యిచ్చు
నమ్మఁడనుచు శాసనము వ్రాసియున్నది
[1]యచటియాత్ర సేయ నరుగమకట. 155

క. అని పలుకఁగ వృత్తాంతము
విని విక్రమభూషణుండు విస్మితుఁడై వా
లును మగతనముం దోడుగఁ
జనియె న్మనుచనిన సవ్యసాచికి నెనయై. 156

చ. అట చని కాంచె భూమివరుఁ డర్జునసిద్ధితపోనుకూలముం
గుటిలకిటిద్విపారిమదకుంజరసేవిత సానుమూలముం
జటులగుణచ్చటారటితసంయమిరక్షణపుణ్యశీలముం
గటకమణిద్యుతిప్రకటకందరకూలము నింద్రకీలముజా. 157

చ. కని గిరిమీఁద నున్న గుడికందువకుం జని యందుఁ దీర్థమ
జ్జన మొనరించి వచ్చి కొనసాగఁగ దేవికి భైరవాదికం
బునకుఁ బ్రియంబు సేయఁ దనమూర్తి వధింపను వేడ్క ఖడ్గమె
త్తినఁ గరుణాప్రసన్నయయి దేవత యాతని నడ్డపెట్టుచుజా. 158

ఉ. ఇచ్చకువచ్చినట్టివర మేమట వేఁడుము కా దనాక నీ
కిచ్చెద నన్న [2]భూమివరుఁ డీవు ననుం గరుణించితేని యే
యెచ్చెముఁ జూడ కాడుచును నోడుచు నిర్ధనుఁ డౌచునున్న యా
దిచ్చున కెల్లకాలము నతిద్రవిణం బొసఁగం దలంపుమా. 159

క. అని వేఁడి యతని కర్థము
తనియఁగ నిప్పించి సమ్మదంబునఁ బురికిం

---

1. యచటఁజూడఁబోదమనుచునిట్లు 2. నాకువలయేశ్వరుఁడుం గరుణించి తేని.

జనుదెంచె విక్రమార్కుఁడు
తనతిరుగుడు సర్వజనహితంబై నెగడన్. 160

ఉ. వెంచలఁ జెర్వులన్ బయల వెన్నెల రేగటఁజౌట నైన వం
చించక యొక్క చందమునఁ జిన్కులు మున్నిడఁ బంచినట్లు వ
ర్షించు నవాంబుదంబుక్రియ జీవన కారణ మౌచు లక్ష్మి ప్రా
పించిన నెల్లవారలకుఁ బెట్టినయాతఁడె దాత గావునన్. 161

క. నీ కింత దానచతురత
లేకునికిని దీని నెక్కలే వనవుడు న
ట్లాకర్ణించి యతఁడు హిత
లోకము గొల్వంగ మగిడి లోనికిఁ జనియెన్. 162

శా. దుర్గానాయక మానసాంబురుహసంతోషక్రియాహంసు నం
తర్గూఢస్థితవైరిదానవవిభేదక్రీడనాప్రౌఢు స
న్మార్గారూఢమునీంద్రచింత్యనిజనామస్తోముని రక్షిత
స్వర్గౌకఃపతి నిందిరారమణుఁ గంసధ్వంసిఁ దార్క్ష్యధ్వజున్. 163

శా. హస్తన్యస్తసువర్ణభూధరధనుర్జ్యాపన్నగాకర్షణో
దస్తాంభోనిధికన్యకారమణబాణాగ్రానలాప్లుష్టదై
త్యసోమాశ్రయదుర్గనిర్గతకురంగాక్షీగణాగణ్యచ
క్షుస్తీర్ణోదకశాంతకోపదహనున్ సోమార్క వహ్నీక్షణున్ 164

మాలిని. దురితహరచరిత్రా తోషితాత్మీయమిత్రా
పరుషజనవిదూరా భక్తరక్షావిహారా
స్థిరతరనిజకీర్తీ దేవతాచక్రవర్తీ
పురహరహరిరూపా బుద్ధసిద్ధస్వరూపా.

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలిక ఖేకవణీంద్ర వీరఘోట్టవి
భాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్ర మహా

రాష్ట్రిభూపాల రూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాఁటి పృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ కౌఅవి వెన్నయామాత్య పౌత్ర హరితసగోత్ర పవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతం బైన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు విక్రమార్కునిదివ్యసామర్థ్యంబును సర్వదాతృత్వంబును మతిమంతోపాఖ్యానంబును సాహసాంకు సర్వోపకారత్వంబు నన్నది దశమాశ్వాసము.

•••❀•••

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## ఏకాదశాశ్వాసము

క. శ్రీసహితకంఠభూషణ
వాసుకిఫణరత్నరుచిరవపురర్ధకృతా
[1]వాసనిజతోషమయ గౌ
రీసఖ్యవిహారి నిందురేఖాధారిన్. 1

### — ఇరువదియెనిమిదవ బొమ్మకథ —

మ. కడుభక్తి న్మదిలోన నిల్పుకొని లగ్నం బొప్పఁగాఁ గూర్చి పెం
పడర న్విప్రులు తన్నుఁ జేరి కొలువన్ హర్షానుకర్షంబు దే
ర్పడ నాభోజమహీవరుండు మఱియు న్భద్రాసనం బెక్కఁన
య్యెడఁ బాంచాలిక యడ్డపెట్టి మఱి సభ్యేష్టంబుగా నిట్లనున్. 2

చ. ప్రియమున నిల్వరింపక గభీరగుణం బిటు లుజ్జగించి సం
శయ మగునుద్యమంబునకుఁ జాగిన నేల ఫలించు నీకు ను
జ్జయినినృపాలుభంగి నతిసాహసము న్సకలోపకారమున్
దయయును లేక యిచ్చటఁ బదం బిడవచ్చునె భోజభూవరా. 3

చ. అతనిగుణంబు లెట్టివని యానతి యిచ్చెదవేని నిల్చి నీ
మతి నిఁక నాదరించి వినుమా వినిపించెదఁ గొంతకొంత యు
ద్ధతపరిపంథికుంజరవిదారణసింహపరాక్రము న్మత
[2]క్రతుసఖు నార్తలోకహితకారణు నెట్లు నుతింప నేరుతున్. 4

---

1. వాసమయతోషనిజగౌ. 2. క్రతుసుఖసఖ్యునార్తహిత—నార్తమర్త్యహిత

ఉ. యాచకపారిజాత మని యర్థులు దన్ను నుతింపఁ ద్యాగభో
గాచరణంబునం బరఁగి యబ్ధులు మేరగ నుర్వియెల్ల సం
కోచము లేక యేలుచు నకుంఠితవిక్రముఁ డై విదేశముల్
చూచుమనంబుతో నతఁడు జోగివిధంబున నేగి యొక్కఁడున్

ఆ.వె. గురిజపేరు లఱుతఁ గొమరారధరియించి
యడవిమొల్లలఁ గురులందుఁ జెరివి
పాలుటాకులు మొలబాగుగాఁగట్టి యే
తెంచుచెంచుసతులఁగాంచికాంచి. 6

క. మాకందములును రక్తా
శోకములును జంపకములు సురపొన్నలు నా
లోకించుచుఁ బ్రియపడి నరఁ
లోకేశుం డొక్కవనములోఁ దిరుగంగన్. 7

సీ. అతని ప్రతాపాగ్ని నవమానితం బైన
  పగిది బింబమునఁ దాపంబు వొదల
నంభోజహితుఁడు మధ్యాహ్నకాలంబున
  నిప్పులు వర్షించుచొప్పు దోఁప
సర్వజంతువుల కసహ్యంబుగా మహా
  నగము లెండఁగ నెండ నిగుడఁజేయఁ
బలుచనయ్యెను జొటిపట్టులు వేఁడిమిఁ
  గసవులు మొదలారఁగమరఁ జొచ్చె

ఆ.వె. విహగకులము తాము విహరించుతరువుల
కేగ కీరములను నీఁగఁదొడఁగె
వడ ఘనంబు గాఁగ వాయువు వీతేర
జగము శూన్యమైన చంద మొందె. 8

క. ఆవేళఁ బేదచెంచుల
కావాసం బైన పల్లెప్రాంతంబున ధా
యావితతము లగు సురిగల
క్రేవఁ బరిశ్రమము దీర్ప క్షితిపతి నిలిచెన్. 9

చ. అట పరదేశికు ల్వలువు రధ్వపరిశ్రమఖేదఖిన్నులై
నిటలములందుఁ జెంజెమట [1]నిల్వక చెక్కులు జాఱ నెండచేఁ
గటముల రక్తకాంతి నధికంబుగ జొత్తిల దప్పి నోష్ఠ సం
పుటములు వాడఁగా వగరుపుట్టఁగ వచ్చిరి వెచ్చనూర్చుచున్. 10

క. వారిం గైకొని శీతల
వారిం దృష దీర్చి గారవముతోడ ఫలా
హారంబులొసఁగి క్షుత్పరి
హారం బొనరించి యలఁత యంతయుఁ దీర్చెన్. 11

క. సమనంతరంబ మీ కీ
క్రమమున బెట్టలయనేల ఘర్మాంతపరి
భ్రమణమున నింత పుట్టునొ
విమతులు వధియింపఁగడఁగి వెనుదగిలిరొకో. 12

క. నావుడు నొక్కరుఁ డాతని
భావజ్ఞుం డనుచు మిగులఁ బ్రణుతించి నిజం
బీవ యెఱింగితి వట్లొ
నావిధ మేర్పడఁగ విను భయంకర మరయన్. 13

క. ఈతల మూఁడామడలం
దాతతముగ మాల్యవంత మనుగిరి మెఱయున్
వేతాళనగర మనఁగఁ గి
రాతేశ్వరుఁ డేలునొకపురం బున్న దటన్. 14

---

1 నీళులుమేనులజాఱ.

చ. దయ యొకయింత లే దచట ధర్మము పేర్కొనరాదు ప్రాణసం
శయము విదేశి కయ్యెడ రసాలవనాంతమునందు శోణిత
ప్రియ యను నొక్కదేవత యభీష్టవిధాయిని భీషణోన్న తా
లయమున నుండుఁ గొందరికులంబున కెప్పుడు నింటివేలు పై. 15

ఉ. ఏము విదూరయానమున నెంతయుఁ జిక్కి యనంతరంబ వి
శ్రామపదంబు గోరుచు రసాలసుశీతలమైన దేవతా
ధామము చొచ్చి చండికకు దండనమస్కృతు లాచరించి యా
సీమనె యుంటి మొక్కవలచేరినపక్షులభంగి నజ్ఞతన్. 16

క. ఆయెడ నగరము దెస న
న్యాయతఁ బోనీక పట్టుఁ దరికట్టుఁడు వే
డాయుచు మెడగట్టుం డని
కూయిడఁ బెను అంతు పుట్టె గుండియలదరన్.

చ. చందనకుంకుమార్ద్రఘనసారన వాక్షతపాత్రహస్తయై
సుందరి యోర్తు భూషణరుచుల్మెఱయ న్వనలక్ష్మి పోలిక
న్మందఱ నేగుదెంచి గుడిమోసలఁదూఱుచు మమ్ముఁ గాంచి చూ
డ్కిందయ దొంగలింపఁ బలికెం బలుకు ల్మది కింపుపుట్టఁగన్. 18

చ. వెఱవక యున్న వార లిట వెట్టితనం బిది గాదె కొందరుల్
చుఱు కొకయింత లేక [1]మనుజుం దమదేవత కిందు నిత్యముం
జెఱు పొనరింతు రిప్పు డది [2]సేగి విదేశులఁ బట్టుచున్నవా
రెఱుఁగఁగ జెప్పితి న్వెడలి యేగుఁడు ప్రాణము సద్ద గల్గినన్. 19

చ. అనవుడు నేము నాత్మహృదయంబులు మిక్కిలి తల్లడింపఁ జ
య్యన వెలి కేగి వాకిట భయంకర మైనఁ దదీయపశ్చిమం
బునఁ గలుకోట యెక్కి సురపొన్నలు నేపెలు నున్నతోఁటలోఁ
గనుకనిఁ బాఱి వచ్చితిమి క్రమ్మఱి చూచుచు బమ్మరించుచున్. 20

---

1. మనుచుం. 2. జోగివిదేశులఁ.

మ. నడుమ న్నిల్వఁగనోడి యీరములలోన న్ముండ్ల గండ్లం దడం
బడుచు న్లేచుచు రెండుయోజనములుం బ్రాణాపదందాఁటి కా
అడవి న్నీరముపట్టు గానక నిరాహారవ్యథం జిక్కి యి
క్కడఁ బుణ్యాత్ముని నిన్నుఁ గాంచితిమి సౌఖ్యం బయ్యె భాగ్యంబునన్.

క. పోయెద మిఁక నీవా
కోయల నగరంబు పొంతకుం జనవల ద
న్యాయులు వాండ్రని చెప్పుచుఁ
బోయిరి కుతుకమున జనవిభుం డిటకదలెన్. 22

ఉ. అంతటఁ గాంచె నాతఁడు నిరంతరపర్ణఫలప్రసూనని
శ్చింతము రామపాదసరసీరుహచిహ్ననితాంతరమ్యప
ర్యంతము భూర్జపత్ర లిఖితోపగతోత్సుక కిన్నరీప్రియో
దంతము పుండరీకహరిదంతదురంతము మాల్యవంతమున్. 23

క. ఆపర్వతంబు చేరువఁ
బాపాత్ములకెల్ల నునికిప ట్టగుపుర మా
భూపాలుఁడు గాంచి తదీ
యోపాంతవనంబులోని కొయ్యననేగెన్. 24

సీ. అచ్చట నొకసరోజాకరంబునఁ గృత
　　స్నానుఁడై దేవతార్చనకు నేగి
నిచ్చలుఁ గ్రొత్తయౌ నెత్తుట జొత్తిల్లు
　　రంగంబు గల గుడి రాజుచొచ్చి
ఖడ్గంబు మాతులుంగ ఫలంబు నభయంబుఁ
　　బునుకయు నంకుశమును వరంబు
సురియయు సూత్రంబుఁ గరములధరియించి
　　శోణితప్రియ యున్న సొంపుచూచి

ఆ.వె. యుగ్రదేవత యని యూహించి తలఁకక
రక్తపుష్పము లనురక్తితోడ
నానరఁ బూజచేసి వినుతించిప్రణమిల్లి
యచటఁగొలిచియున్న యవసరమున. 25

వ. అనగరంబుదెసనుండి దిమ్ము రేఁగినయట్లు [1]తూఁగొమ్ములుఁ బువ్వనంగ్రోవులునుం దప్పెటలును ఢక్కలును బెక్కువిధంబుల దిక్కులు చెవుడుపఱుపుచు మ్రోయు సవ్యాద్యరవంబునకు బాసటయై తమ యార్పులుం బెడబొబ్బలును గిరిగహ్వరంబుల నుపబృంహితంబులుగా గంధపుష్పార్చితుం డగు నొక్కదీనుని నడుమ నిడుకొని కుఱుచ [2]కాసకోఱలు మెఱయించుచు బరికెతలల కఱకుఁగొండరులు సనుదెంచిన నప్పరమకారుణికుండు. 26

ఉ. దీనుని నేఁడి కిచ్చటికిఁ దెచ్చితి రింతట దేవి మెచ్చునే
హీనుఁడు దుర్బలుండు జడుఁ డేడ్చెడి వీఁ డవలక్షణుండు మీ
రీనరుఁ దెచ్చి చూపి జగదీశ్వరి నిట్లడికింపఁ జూతు రే
యేనుఁగు చిక్కనేని మఱి [3]యెంపలిబెట్టునఁ గట్టవచ్చునే. 27

క వీనిం బోవఁగనిం డిదె
నే నుత్తమకులుఁడ మాంసనిబిడుఁడఁ బ్రియప
న్మానసుఁడ నన్ను నరబలి
గానిచ్చిన దేవి మెచ్చుఁ గరుణం బ్రోచుఁ. 28

వ. అని యద్దేవికి నుద్రేకంబు పుట్టి వాని నిరసింప తాను మెయికొనిన నాబోయలు నీకొండినినే చంపించుట మే లని వానిని విడిచిపుచ్చి యతనికి నట్ల

1. తూఁగొమ్మలునుం బువ్వనగ్రోవులునుం దప్పెట్లుం దింట్లును ఢక్కలును (దింట్లను అనుటకు, నుంట్లును అనియు) 2 కాసలతోఁగొఱకలు మెఱయిం. 3. వెంపలిబెట్టు అని వాడుక, యెంపలి యనియుందు ప్రయోగము.

గంధపుష్పాక్షతాదు లిచ్చి దేవిచేరువ గమ్మని యతని ముందట నిడి
తలంగిన. 29

ఆ.వె. మెచ్చుగాఁగ నిట్టి మెకము [1]సాళించెద
ననుచుఁ జండిమంత్రమొనరఁ జెప్పి
పూజకుం డొకండు భూమీశుతల ద్రుంప
బెడిదమైన వాఁడియడిద మెత్తె. 30

క. ఆతని ప్రభావమునఁ బరా
హతయై తద్గుణము మెచ్చి యయ్యెడ నాదే
వత యడిదము గొని మతినా
తతమగు రోషమున వానితల దెగ నడిచెన్. 31

శా. ఆపాపాత్ముని నట్లు ద్రుంచి నవరక్తాస్వాదన ప్రీతయై
భూపాలోత్తముధర్మముం దయయుఁ దెంపు న్మెచ్చుచుం బ్రేతభూ
తోపేతంబుగ డాకినీసముదయం బుప్పొంగుచు న్నర్తన
వ్యాపారంబులఁ దోడుసూపఁ జెలఁగెన్ వ్యక్తస్వరూపంబునన్. 32

ఉ. అంతఁ బ్రసన్నయై నిలిచి యార్తశరణ్యుని నిన్ను మెచ్చితిం
జింతితమైన కార్య [2]మిదె చేకుఱ నిచ్చెద వేఁడు మన్న భూ
కాంతుఁడు మ్రొక్కి నీదుకృప గల్గిన నేమి కొఱంత నేఁడు నా
కింతియ చాలు మర్త్యబలి యెన్నఁడుఁ గోరక పూజ నొందుమా. 33

మ. అని ప్రార్థింపఁగఁ బూజకుండు నట దివ్యాకారుఁడై యంబరం
బున భాసిల్లుచు నిల్చి ఖేచరుఁడఁ [3]గర్పూరాంగుఁడ న్నేఁ గుబే
రుని శాపంబున సుక్కి యీగతి నతిక్రూరుండనై యిప్పుడో
జననాథా భవదాగమంబు కలిమి న్పాపావధిం బొందితిన్. 34

---

1. సాధించెద. 2. మిటు. 3. గర్పూరాఖ్యుఁడన్.

క. నావుడు వెఱఁ గందుచు నీ
కేవిధపు న శాప[1] మొదవె నీకథ తెలియం
గా వినిపింపుము మాకని
భూవల్లభుఁ డడుగ దివ్యపురుషుఁడువల్కెన్. 85

ఆ.వె. ధనదు దేవపూజ కనువగు క్రొవ్విరు
లెచట నైనఁ గోసి యేన తెత్తుఁ
[2]దెల్లవాఱ విరులు దేనొకనాఁ డేగి
మధువనమున నొక్కమగువఁ గంటి. 86

క. అన్నెలఁతుక యెదురను సుర
పొన్నలు గోయంగవచ్చి పుష్పాయుధుచే
నున్న నెఱవాదియమ్ములఁ
గన్నుల నగుచున్న చెలియకడకుం జనియెన్. 87

క. ఆట చని మదిసమ్మద ము
త్కటముగ సఖిఁ గౌఁగిలించి కానఁగరా వో
విటవంచని [3]యిన్నిదినము
లెట పోయితివనిన నదియు నిట్లని పలికెన్. 88

క. రతిలంపటుఁడును శృంగా
రతిలకుఁడు ననఁగ విటులు రసికత్వమునన్.
క్షితిఁ దిరుగుచు [4]నావెర వ
ద్భుతముగ వినినన్నుఁ గెలువఁబూనికడంకన్. 89

క. నాయింటికి నరుదెంచిన
నాయిద్దఱ కేను జందనాగురుకస్తూ

1. శాపమబ్బె శాపమయ్యె. 2. కానకరిగి విరులు దేనొకనాఁడిచ్చె.
. యిన్నాళ్ళే. 4. నా పేరద్భుత.

రీయుతముగ నుపచారము
సేయించితిఁ [1]దెక్కరముగఁ జిత్తము లలరన్. 40

వ. తదనంతరంబ వారలు కుసుమంబులుం దాంబూలంబులుఁ బుచ్చుకొని యో విటవంచనీ నీ పేరు నిజంబుగ నెటువంటి విటుల నైన మోసపుత్తు వఁట నిక్కువంబె యని యడిగిన. 41

క. కల్లలునిజములు ధర్మము
మొల్లంబును బ్రియము మోహమును నలుకయు న
య్యుల్లసము నయముసరిగాఁ
జెల్లునువెలయాంద్రయందుక్షితిపతులందున్. 42

* * * *

సీ. మఱియు నొక్కండు బ్రాహ్మణవిటుం డనువరి
నను(గోరి చనుదెంచినాకునైన
తగులెల్ల విని నన్ను దర్శింప మఱి యుపా
యము లేక సురపొన్న లమరఁగట్టి
మూఁ డెత్తులుగఁ జేసి మును మాలకరి వోలె
నేతెంచి నాచేతి కిచ్చినంత
నిరుదెసలం దున్న యిద్దఱ కొసఁగి యం
దొక్కటి నేఁ గొన నుత్సహించి

ఆ.వె. యందుఁ దేనె గ్రోలు నళిఁ జూచి యిదియును
క్షణము సౌఖ్యమొందుఁగాక యంచు
ముడిచికొనక దండఁ దొడమీఁద నిడుకొంటిఁ
గ్రొత్తవాని కియ్యకోలు గాఁగ. 47

1. తేకరముగ.

వ. తరువాత వానికిఁ బసిండిటంకం బిప్పించి సంచిలోఁ బడినయప్పుడు గాని యిది దక్కదని పలికి యీతుమ్మెద ప్రియము చెడకుండు మాగవని యొద్ది సురపొన్నమీఁద విడిచిపొమ్మని పీడుకొలిపిన వాఁడును నట్లు చేయుచుం జని మత్స్యమాగమంబునకుఁ బెక్కువిచారంబులు సేయుచు నెఱ జాణయగుటంజేసి. 48

ఉ. నిష్కము సంచిలోఁ బడుట నీరజమిత్రుఁడు గ్రుంకు వేళఁగాఁ
బుష్కరనేత్ర చెప్పె నళి పొన్నపయి న్విడుమంట లోనికిన్
దుష్కరవృత్తిగా దదియు త్రోవ చుమీ యని చూపు టయ్యె నే
శుష్కవిచారము ల్వలదు సూర్యుఁడు గ్రుంకిన నంద యేగదన్. 49

క. అని నిశ్చయించుకొనునెడ
వనజాప్తుఁడు నిప్పుమాడ్కి వారిధిలోన
న్మునుఁగఁగ నెగసిన పొగ క్రియ
ఘనముగఁ దిమిరంబు దిశలఁగనుకనిపర్వెన్. 50

ఆ.వె. అంతఁ బ్రొద్దు వుచ్చి యంధకారంబులోఁ
బొన్న యెక్కివచ్చి పొంచిపొంచి
జగతిమీఁద నొక్కశయ్యపైఁ బురుషుల
నడుమ నిద్రవోవు నన్ను లేపె. 51

* * * *

వ. పిదపనయ్యుద్దఱం గదలించి యిప్పుడు నాతోడఁ గ్రీడసల్పినవాఁ డెవ్వండు చెప్పుఁడా యనిన వాండ్రు నొండొరులఁ జెప్పుకొని తారు గాకుండుట దెలిసికొని [1]కళవళపడి యిది యేమి చోద్య మని విచారించుచు నుండంగ, నేను, బగలు వచ్చిన మాలకరి యప్పుడు దెచ్చిన మూఁడెత్తులలో నిరు

---

1. తక్కలపడి.

దేసననున్న మీకు రెంటి నిచ్చి కడమ నాకొసంగిన దండయందుఁ దుమ్మెద
సుఖియింపని మ్మని తొడమీఁద నిడుకొనినభావంబు మీ రెఱుంగరైతిరి.

క. ఆరసికుఁ డెఱిఁగి వచ్చిన
సీరీతుల నడుమఁ గలిసి యెఱుకపడఁగ మా
[1]చీరలువీడ్వఁటిచితిమి వి
చారింపఁగ నేల నాధు జయ మౌఁ గాదే. 56

క. నావుడు వనితలనెవ్వఁడు
గావంగా నోపు మాప్రకార మొరులకు
న్నివెఱిఁగింపకు మని ల
జ్జావనతముఖాబ్జులగుచు నరిగిరి చెలియా. 57

ఉ. నిన్నటిరాత్రి యీతగులు నీగతి నిచ్చట విశ్రమించుచుం
బొన్నలు గోయవచ్చితి నపూర్వపుఁబంతము వింటివే యనం
బ్రన్నన నవ్వి యీకొలఁది పంతము లెవ్వరుఁ జేయ రుర్విలో
నిన్నిఁకఁ గాముకు ల్గెలువనేర్తురె యంచు నుతించె బోటియున్. 58

ఆ.వె. ఇట్టిగోష్ఠివినుచు నేను గూఢంబుగాఁ
దరువుమీఁదఁ బెద్దతడవు నిలిచి
విరులుగోసికొంచునరిగెడునంతలో
విభునిదేవపూజ వేళ దప్పె. 59

చ. అలుకుచు నేగ నాతఁడు శివార్చనవంచక మాల్యవత్తటి
న్నిలిచి దినంబు మానవులనెత్తురుద్రావెడి శోణితప్రియం
గొలిచి మనుష్యహంత వయి కోవెలలోపల నుండుమంచు న
న్నలిగి శపించె నీశ్వరనిరాకరణం బిది రిత్తవోవునే. 60

1. చీరలు వీడ్వడఁగట్టిన, సారస్యం బిదియ నాదుజయ-

వ. అపుడు వడవడ వడంకుచు నేనపరాధి నైతిని బుణ్యకార్యంబు వదలి దుర్గోష్ఠివిన్నదానికి ఫలం బిపు డిట్లయ్యె దేవరయానతి తప్పునా నాకెన్నండు శాపావధి యాన తిమ్మని మ్రొక్కిన భవసఖుండు గొంత ప్రసన్నుండై నీ వాదేవతం గొలిచి తత్క్రియ నుండంగ నెప్పుడే నొకవీరుండు నరబలి మానిపింపం దాఁ జేరువయ్యెడి నప్పుడాదేవిచేత శస్త్రహతిని శాపముక్తుం డవు గమ్ము పొమ్మనిన. 61

క. ఖేచరభావం బుడిగి వ
నేచర భావమున నిట్లు నిచ్చలు జనుల
న్నీచుఁడ నై వధియించుచు
నీ చేతం బూర్వపదము నేఁడిదె కంటిన్. 62

మ అనుచుం జెప్పి కుబేరకింకరుఁడు దా నాకాశమార్గంబునం
జనియెం గ్రమ్మఱ శోణితప్రియయు నాజ్ఞాపాలు నగ్గించి నీ
మనమార న్మను గోరినట్టికొలఁది న్మర్త్యోపహారంబు గై
కొను టే మానితి నూరి కేగు మని పీఠ్యాకల్పం బ్రసన్నాత్మయై. 63

వ తదనంతరంబు- 64

ఉ. దేవతఁ జూచితిన్ జనులఁ దింటయు మాన్పితి యక్షభృత్యు స
ద్భావము నొందఁ జేసితి ముదం బిట చేకుఱె నంచు వీటి కు
ర్వీవరుఁ డేగుదెంచె నిఁక వింటివె వేగమ నీవు నింటికిం
బోవుట మే లనంగ విని [1]భోజనృపాలుఁడు క్రమ్మఱె న్వెసన్. 65

——*ఇరువదితొమ్మిదవ బొమ్మకథ*——

క. అంభోధిశయను గమలా
సంభోగప్రౌఢు నబ్జసంభవగురునిన్

1. భోజుఁడుక్రమ్మఱనేగె లోనికిన్.

జంభారివినుతగుణసం
రంభాటోపాంధహర కరాళజ్వాలీ. 66

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మఱియుఁ ధాత్రీశుఁ డా పాకశా
సనుసింహాసన మెక్కవచ్చిన సముత్సాహంబు వారించి కాం
చనపాంచాలిక వల్కె దానగుణవిస్తారంబున వ్వాహసాం
కుని సాదృశ్యము నొందలేక యిది నీకుం జెల్లునే పార్థివా. 67

క. అతనిదానము భువన
ఖ్యాతము సకలోపకారకారణము దయా
చాతుర్య [1]తుర్యవిధమ
త్యాతతధనకనకసముదయాకరము భువిఁ. 68

క. త్యాగంబున సత్కీర్తియు
యోగంబున ముక్తిసతియు నుచితం బగు ను
ద్యోగంబున సంపదయును
భోగంబున సుందరియునుఁ బొందినఁగూడుఁ. 69

క. అనుచును ద్యాగము యోగం
బును నుద్యోగంబు నిష్టభోగంబును బెం
పొనగూడఁ దగినకాలం
బున జరపుచు నవ్విభుండు భువి యేలంగఁ. 70

చ. ఉరగము లెల్ల శేషులు పయోనిధు లెల్ల సుధాబ్ధు లేఱు లం
బరనదు లద్రు లారజతపర్వతముల్ గ్రహము ల్సుధాకరు
లరువులు కల్పవృక్షములు దైవతసంఘము లన్నియు న్మహే
శ్వరు లనఁ జెల్లె నెల్లెడల [2]సాహసభూషణుకీర్తివర్తనఁ. 71

---

1 చాతుర్యవిదితమదియ. 2 సాహసభూషణుఁ దుర్వి యేలఁగఁ.

ఉ. అట్టిదినంబుల న్నృపులు నాశ్రితులుం గవితారసజ్ఞులుం
జుట్టలు మంత్రులుం దొరలు శూరులు వీరులుఁ గొల్చియుండఁగా
దిట్టతనంపుఁబ్రోక యనఁ దేఁకువ కెక్కి విదేశవర్తి యా
బట్టొకఁ డేగుదెంచి జనపాలశిఖామణిఁ గాంచి పెల్లుగన్. 72

సీ. బ్రహ్మయు వని రాజుఁ బ్రస్తుతి చేసి త
దాజ్ఞ సుఖాసీనుఁ డై భజించి
కవితయు సర్వలక్షణపరిజ్ఞానంబు
సత్యవాదమును ధీచాతురియును
త్యాగంబు శౌర్యంబు సరసోక్తియును నాఁగ
నియ్యేడుగుణముల నెన్నఁబడ్డ
చండపుత్రుండఁ బ్రచండవాచాలుండఁ
జండపురాణదీక్షాగురుండ

ఆ.వె. నవనిపాలు రెల్ల నరిగాఁపులట్లు నా
కిచ్చుధనము లెల్ల నియ్యకొనుచు
నుత్సవమునఁ దిరుగుచుండి యీజగములో
నిను మహాప్రదాత యనఁగ వింటి. 73

సీ. సత్కీర్తి సతికిని సత్కుక్షిలోపల
భువనత్రయంబును బొదలుచుండు
గావున నింతకు నీవె తండ్రివి నీదు
ధనము యాచకులకుఁ దల్లి సుమ్ము
తమపితృధనము తేతఱి నైనఁగైకొన్న
నిది భాగ మని భువి నెన్నఁబడునె
తనకుటుంబముఁ బ్రోవఁదా నెంతప్రియపడ్డ
నతఁడు మహోదారుఁడనఁగఁదగునె

ఆ.వె. తగదు గానినీయుదారత్వమేమని
పొగడవచ్చుఁ [1]దొంటిరంతు పొంటెఁదలఁప
శమితకుజనతర్క జయరమాసంపర్క
విమతకైరవార్క విక్రమార్క. 74

క. జలములు పైఁబడక మహా
నల మాఱదు శౌర్యభూషణా నీ కోపా
నలము రిపుసతులకన్నుల
జలములు గని యాఱు నెంత సత్త్వం బిచటన్. 75

క. కావున యశముఁ బ్రతాపము
నేవెరవునఁ బొగడఁ జెల్లు నెవ్వరి సరిగాఁ
గావింపవచ్చు దీనులఁ
గావం బ్రోవంగ నీవె కారణ మగుటన్. 76

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశ నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశ యై చలింప దిఁక సద్గుణముందఱ సద్గుణాఢ్యుఁ బ్ర
స్తావన చేయనేరనియతం డతిమూఢుఁడు గానఁ జెప్పెదన్. 77

ఆ.వె. విపులదుర్గ మైన వింధ్యపర్వతసీమఁ
జంద్రకాంతసౌధజాలరుచుల
రాజపురముతోడ రాయుచు మించిన
రత్నపురము నాఁ బురంబు గలదు. 78

క. ఒకటొకటికంటెఁ బొడవనఁ
బ్రకటముగా నచటి హర్మ్యపంక్తులు దివి ము
ట్టి కలశభవుచే వింధ్యా
ద్రికిఁగృతముననైన కొఱఁతఁ దీర్చుచునుండున్. 79

---

1. తొంటిపొందెతలప.

క. అందు జయసేనుఁ డనఁగఁ బు
రందరవైభవుఁడు [1]రాజరాజధనాఢ్యుం
డిందుధరభక్తినిరతుఁడు
వందిజనప్రియుఁడు మనుజవల్లభుఁ డుండున్. 80

క. ఆనరనాయకు వేఁడిన
దీనులు ధనవంతు లగుచు దేశములోన
న్మానవనాథులక్రియ నతి
దానంబులఁ బరగుదురు ప్రదాత లనంగన్. 81

సీ. అట్టివిజయసేనుఁ డధిక సంపత్తితో
నొకనాఁడు నవవసంతోత్సవంబు
సేయ నుద్యోగించె నాయవసరమునఁ
గవులును బట్లును గాయకులును
నర్తకులును నిజకీర్తి నుతించుచు
సరసభావంబున సరస నడువఁ
జెలువార వారకాంతలు సుగంధద్రవ్య
హస్తలై కెలఁకుల నరుగుదేర

ఆ.వె. దొరలులెంకలుహితులుమంత్రులునుగొలువ
నశ్వరత్నము నెక్కియుద్యానభూమి
కేగి యచ్చటనొకపొదరింటిక్రేవ
సురుచిరంబుగ మాకందతరువుక్రింద. 82

శా. అర్పింపందగు పూజలెల్లఁ దగుమర్యాద న్సమర్పించి కం
దర్పుం దత్ప్రియమిత్రుని న్సముచితోత్సాహంబునం గొల్చి యే
కార్పణ్యంబును లేక యింపెనయఁగాఁ గాశ్మీరకస్తూరికా
కర్పూరాదివసంతఖేలనములుం గావించె నుల్లాసి యై. 83

1. రాజరాజౌదార్యం.

క. జనవరుఁ డయ్యుత్సవమున
మనమలరఁగ యాచకులకు మాడలు పదివే
లును దొమ్మిదిలక్షలు గ్ర
క్కునననిచ్చెం గీర్తి దిశలఁ గొనసాఁగంగన్. 84

వ. ఆసమయంబున- 85

ఉ. యాచకకల్పభూజ మగు నానరనాథు మహావదాన్యునిం
జూచితి వాని చేత నిలు చూఱలు గొన్నగతి న్నువస్తువు
ల్వాచతురత్వచిహ్నములునాఁ గయికొంటి నతండు ధాత్రిలో
రాచగొనంబులం బరఁగువా జవుఁ గావున నెన్న నొప్పగున్. 86

ఉ. అంచు నతండు రత్నపురియందలి మండలనాథచంద్రు వ
ర్ణించిన నయ్యవంతిధరణీధరుఁ డాతని చాగ మాత్మలోఁ
గొంచెమకాఁ దలంచి [1]నిజకోశగృహాధిపుఁ డైన లెంక నీ
క్షించి యనంత దానగుణశీలసమగ్రత [2]సత్యుదారుఁడై. 87

చ. ఇతని కనర్ఘ రత్నములయిండులుఁ గాంచనమందిరంబులుం
జతురతురంగసద్మములు సామజశాలలు నూపురాద్యలం
కృతిసదనంబులు న్వసనగేహములుం బరిపాటిఁజూపు న
మ్మత మగువస్తుజాతము సమస్తమునుం గొనిపోవని మ్మటన్. 88

క. అనవుఁడు భాండాగారికుఁ
డును విస్మయమందుచుం గడుంబ్రియ మదరం
దనలోన వెలుఁగుపడ నా
తనిఁదోడ్కొని యరిగి వరుసఁ దద్గృహములలోన్. 89

వ. మదశుకానుకృతంబు లగు మరకతంబులును, బరిపుష్పరాగంబు లగు పుష్పరాగంబులును, ధామాధికంబు లగు గోమేధికంబులును, ప్రభాస ఫ

1. నిజకోశగృహస్థితుఁడైన. 2 నత్యుదగ్రుఁడై.

లంబు లగు ముక్తాఫలంబులును, విడంబితబాలప్రవాళంబు లగు ప్రవాళం బులును, నదృష్టవైదూర్యంబు లగు వైదూర్యంబులును, యమునానీరనీలం బు లగు నీలంబులును, రుచివిజితవజ్రంబు లగు వజ్రంబులును, గర్విత పద్మరాగంబులగు పద్మరాగంబులును, నవధీరిత మేరుశిఖరంబు లగు కనకశిఖరంబులును, నధరీకృతార్ణవాజు లగు తేజులు ను, నుపమితదిగ్గ జంబు లగు మత్తగజంబులును, గర్భికారసువర్ణాకారంబు లగు సువర్ణాలంకా రంబులును, నానాంశుకంబు లగు చీనాంశుకంబులును, గనుపట్టం జూపిన నవ్వందివరుండు నివ్వెఱఁగంది తత్త్యాగసంపదలకుం గంపితశిర స్కుండై యందుందన కావటం బగువానిం గొనిపోవం దలంచి. 90

క. అనుచరులచేత మణులును
గనకము మూటలుగఁ దృష్ణఁ గట్టించి నృపా
లుని గర్ణుని మీఱితి వని
కొనియాడుచు నర్థ మట్లు గొనుచుం జనియెన్. 91

ఉ. ఆతఁడు చన్నపిమ్మటఁ దదర్థగృహస్థితుఁ డైన లెంక సం
ప్రీతమనస్కుఁ డై నృపుని పెంపు మనంబున సన్నుతించుచు
న్నీతియు భీతియుం గలుగ నేరుపు చొప్పడ విన్నవించె న
త్యాతత మైన యాజ్ఞ వినయంబునఁ జేతులు మోడ్చి నమ్రుఁడై. 92

క. తనియఁగఁ బట్టుకొనిపో
యినయర్థము కొలఁది మీకు నెఱుఁగఁగవలయు
న్వినిపించెద ననవుడు న
మ్మనుజేంద్రుఁడు చులుకఁ జూచి మందస్మితుఁడై. 93

క. చనువాఁ డని నే నిచ్చిన
చనవునఁ గొనిచన్నధనము సంఖ్య యెఱుంగం
బనిలే దిఁక నాయర్థము
కొనియేగినవాఁడె యెఱిఁగికొన్నం జాలుఁ. 94

సీ. అనుడు నాలెంకయు నాశ్చర్యమందుచు
ధరణీశ నీకు నుదారమతికి
నిప్పటియానతి యొప్పు నట్లయ్యును
బలికెద నావిన్నపంబు వినుము
పయిలెక్కకాండ్రను గయికొల్పి వెఱపించి
లెంక విశ్వాసంబు బొంకు చేసి
ధన మెంత గల్గినఁ దాఁ జుల్కఁజూడక
యాయవ్యయంబుల నడుగవలయు

ఆ.వె. వాని వివరమెల్ల వర్గువుగాఁ గూర్చి
నెఱయఁదెలుపులెక్క నెఱుఁగుకొనుచు
వ్యయముపుచ్చి నిలువ వ్రాయించికైకొంట
ప్రభుల కిదియ నీతివిభవమంద్రు. 95

ఆ.వె. వ్రాఁతకాని నమ్మరా దర్థగృహముల
నుంచకున్న నేమి యొక్కనాఁడె
వెరసు గూడుమనినఁగరణము పండిత
న్యాయమనఁగనర్థమచటఁ దెచ్చు. 96

క. ఒకదెసఁ దెచ్చిన యాయం
బొకదిక్కునఁ జెల్లువ్రాసి యొకదెసవ్యయ మ
ట్లొకదిక్కునఁ జనవ్రాసినఁ
బ్రకటంబుగ వాఁడు మిగులఁ బాపాత్ముఁడగుఁజా. 97

క. వహి వారణాసి యనఁగా
మహిఁబరఁగివ దిందుఁ గపటమార్గంబుగ నా
గ్రహమున వ్రాసినవానికి
నిహపరములు లేవు నరక మెదురై యుండుఁజా. 98

గీ. రాని పైఁడి చెల్లువ్రాయుట యాయంబు
తక్కువై వ్యయం బదెక్కుడౌట
లెక్క తుడుపువడుట లిపి సందియం బౌట
చెల్లు మఱచుటయును గల్లపనులు. 98

క. కరణము తనయేలిక కుప
కరణము నిర్దయగుణాధికరణము ప్రజకు
న్స్మరణము పగ వారలకును
మరణము నాఁ జెల్లు నీతిమంతుం డైనన్. 99

ఉ. వ్రాలకు సందియంబువడ వ్రాయక మోసము పుట్టనీక గ
ర్వాలసుఁ డై సుడిం బడక యప్పటికప్పటి కిష్టబుద్ధితో
నేలిక చిత్తవృత్తిఁ జరియించుచు నుండియు నెద్దియైనఁ ద
త్కాల మెఱింగి చేయునది కార్యము రాజహితాధికారికిన్. 100

క. అధికారము గైకొని బహు
విధముల నాయమును వ్యయము వినిపింపక యే
యధికారి యడఁచె మఱివాఁ
డధికారియకాక పతికి నాప్తుం డగునా. 101

క. కావున నియ్యెడ నను హిత
సేవకునింగాఁ దలంచి చిత్తములోనన్
భావించిన యట్లైనను
నావిన్నప మవధరింపు నరలోకేంద్రా. 102

వ. అట్లు కా దేని యెత్తువెరసైన నవధరింపు మని మ్రొక్కి యోవదాన్యశిరో
మణీ బట్టుపట్టుకొని చన్న రత్నధనస్వర్ణసంఖ్య చూచిన నేఁబదికోట్లు నఱు
వదిలక్షలయ్యె నవిన నుల్లంబున సంతసిల్లి. 103

క. తెలియఁగల దొకటి విను నా
సెలవున నతఁ డర్థ మట్లు చేకొని చనియె
న్వల దనుచు నడ్డపెట్టక
నిలుపక పంపినదిచాలు నీపని యొప్పన్. 104

మ. అనినం గ్రమ్మఱ మ్రొక్కి వాఁడు నరలోకాధీశ నీయాజ్ఞఁ గాం
చనరత్నాంచిత శేఖరంబు కరణి న్సర్వక్షమాధీశులు
న్వినయానమ్రశిరస్కులై శిరముల న్విఖ్యాతిగాఁ దాల్చి నీ
పనివారై నెగడంగ నీ సెలవుఁ దప్పంజేయ నే నెవ్వఁడన్. 105

క. ఎత్తఱినైనను బతి దన
చిత్తగతిం దగవు మీఱి చెప్పిన పని మా
ఱుత్తర మీయక చేసిన
నుత్తమసేవకుఁడు వాఁడె యుర్వీరమణా. 106

చ. పనిచినఁ [1]బోనివాఁ డొకఁడు పంచినఁ దా నొరుఁ బంచు నొక్కరుం
[2]దను విది గా దటంచు నెదురాడు నొకం డొకఁ డొంటిఁ బోవరా
దను నొకఁ డప్డు రోగినను నాపని గాదను నొక్కరుండు పొ
మ్మనఁగఁ జలించు నొక్కఁడు జనాధిప [3]యేడ్వురుఁ గష్టసేవకుల్. 107

ఆ.వె. ఆజ్ఞదప్పుట పతి యాయువు దరపుట
కాన నర్థమెంత యైన నేఁడు
వోవుఁగాక యేను దేవరయానతి
దప్పఁజేయుదునె హితత్వ మేది. 108

వ. దేవ నీయానతి కనుగుణంబుగ నమూల్యరత్నాది సువస్తువు లెల్లను దాఁ
పురంబు చేయక చూపిన నతండు తన యిచ్చకొలందినె యవారితంబుగా

---

1. బోయిరాఁడొకఁడు. 2. దనునిదిగాదటంచు. 3. యార్వురు అని మూ.

నింతధనంబు గొని చనియె ననిన మిక్కిలి సంతసిల్లి నవ్వుచు నాతెంకకు లక్షధనంబు పసదనం బొసంగెఁ గావున. 109

క. నీకంత యీవి గలుగక
యీకడ నడు గిడఁ దరంబె యేగు మనిన నా
భూకాంతునిగుణము లుప
శ్లోకించుచు నృపుఁడు మగిడి లోనికిఁ జనియెన్. 110

—* ముప్పదియవ బొమ్మకథ *—

వ. మఱియు నొక్కశుభావసరంబున. 111

క. నెఱయ మగతనము గలిగియు
నొఱపుగ జగములకు దల్లియుం దండ్రియునా
నెఱుకపడ నొప్పు మేనను
దెఱవయు మగవాఁడునైన దేవరఁ దలఁతున్. 112

మ. అనుచు న్భోజనరేశ్వరుండు మఱియు న్యత్నంబున న్రత్నకీ
లనరమ్యం బగు నమ్మహాసనముపై లక్ష్మీకళాసుందరా
ననుఁడై పాదసరోరుహం బిడునెడ న్వారించి యాపొంతకాం
చనపాంచాలిక యిట్లను న్సరసవాచాలత్వ మేపారఁగన్. 113

ఉ. భోజనరేశ్వరా మగిడి పోయెద వెప్పటి యట్ల క్రమ్మఱన్
రాజసవృత్తి నెక్క ననురాగము గైకొని వచ్చె దింతటం
దేజముగల్గు నే వసుమతిం బ్రతిలేని వదాన్యవృత్తి మా
రా జగు విక్రమార్కు సరిగాక పదం బిడఁ జెల్ల దేరికిన్. 114

క. అతని వదాన్యత్వము విన
మతిఁ బ్రియ మగునేని వినుము [1]మందారము సం

1. మందారము సం, తతమును సంతానముఁ దా, నతనికి,

తతదానశాలియనఁ దగు
నతనికి సరిరాక వెలుకనై తలవాంచెన్. 115

ఉ. దండితశత్రుమండలుఁడు దానగుణార్కసుతుండు వైభవా
ఖండలుఁ డార్తరక్షణనికామసముద్యతమానసుండు మా
ర్తాండసమాన తేజుఁడు ప్రతాపసమగ్రభుజుండు మేదినీ
మండల మెల్ల నేలె గరిమంబున నబ్ధులు నాల్గు మేరగన్. 116

క. సాహసభూషణుఁ డొకనాఁ
డీహితమునఁ దలఁచి నిశ్చయించి కలిమిచే
నైహికసుఖమగు ధర్మో
త్సాహమునఁ బరోక్షసుఖము సమకూరఁదగున్. 117

క. ఈరాజ్యంబున కిటుసం
సారసుఖం బొదవె జన్మసాఫల్యముగా
నేరీతినైన ధర్మా
చారంబున నొందవలయు స్వర్గసుఖంబున్. 118

మ. అనుచుం గల్పిత నిశ్చయుం డగు నరేంద్రాధీశుచిత్తంబు వ
ర్తన మూహించి తదీయసమ్మతికి నుత్సాహంబు రెట్టింప నా
య్యనఁ దన్మంత్రివరుండు వల్కె నిరపాయస్వర్గసౌఖ్యంబు నీ
కనుమానం బగునే యనంతసుకృతవ్యాపారసంచారికిన్. 119

సీ. అతిథిసత్కారంబు నార్తరక్షణమును
దానంబు దయయు సత్యవ్రతంబు
తఱచుగాఁ జేసినధర్మంబు తనతోడి
నీడయై చనుదెంచుఁ దోడుగాఁగఁ
జిత్తంబు నానాఁటి చింతగూరకమున్న
యాత్మసంపదలు పెంపఱకమున్న

ముదిమిచే సంధులు వదలకమున్న రో
గంబున నొకకీడుఁ గాకమున్న

ఆ.వె. పుణ్యమార్జింపు డవసరంబునకు మొదల
గట్టియౌధనములు గూడఁబెట్టు టండ్రు
జీవ మెడలంగ సుకృత మార్జింపఁజనుట
నిల్లు గాలంగ నుయి ద్రవ్వనేగు టండ్రు. 120

క. ఈవచనం బితరులకొఱ
కై వినిపింపంగవలయు నది నీకడ స్వా
భావిక మైనది గావున
నీ వెఱుఁగనియట్టి ధర్మనిరతులు గలవే. 121

క. నావుడుఁ గడు మదినుత్సుకుఁ
డై విప్రులయిండ్లు గ్రుతులు నర్థము వనముల్
బావులు నూతులుఁ జెఱువులు
దేవస్థానములు నిలిపెఁ దేఁకువకెక్కన్. 122

ఉ. ఎక్కడ జూచినన్ సుకృత మెన్నిక కెక్కఁగఁ గీర్తిసంపద
ల్పెక్కువిధంబులన్ ధరణిఁ బెంపు వహింపఁగ నానరేశ్వరుం
డొక్కఁడె తీర్థసేవనసముత్సుకుఁడై పరివార మెల్ల న
ల్దిక్కులయందుఁ గొల్చి చనుదేరఁగ నర్మద కేగె సొంపుగన్. 123

చ. కరితురగాదిసైన్యపరికల్పితమార్గ నివేశుఁ డౌచు ద
వ్వరిగి యవంతినాథుఁడు నిరంతరవారివిహారశీలసుం
దరతరరాజహంససముదాయసమాహితశర్మద న్నిజ
స్మరణనివారితోన్మదభుజంగమదుర్మదఁ గాంచె నర్మదన్. 124

క. కనుఁగొనికడుఁ బ్రియమున నె
మ్మనమునఁ బ్రణమిల్లియచటిమాంధాతృపురం

ఋనవిడిసియనుచరులుఁదా
నునునదికింజనియెనిజమనోరథమలరన్. 125

మ. చనియాతీర్థములో సచేలముగ సుస్నానంబు గావించి నూ
తనవస్త్రాభరణానులేపముల గాత్రం బుజ్జ్వలస్ఫూర్తి గై
కొని రాజిల్లఁగ నిల్చి విప్రవరులన్ గోభూతిలార్థాది దా
ననిరూఢిం దనిపె న్నవిగ్రహణపుణ్యంబైన కాలంబునన్. 126

క. కొంకక యిచ్చుచు వెలువడి
శంకరుఁ గింకరమనోవశంకరు నురగా
లంకారు నచట నిలిచిన
యోంకారేశ్వరునిఁగొలిచె నుచితార్చనలన్. 127

మ. భువనాధీశ్వరు నిట్లు తత్పరమతిం బూజించి సేవించి త
ద్భువనప్రాంగణరత్నమండపములోఁ బర్యంతభూమీశులుం
గవులు న్భటులు గానవేత్తలు నలంకారజ్ఞులు న్మంత్రులు
న్యువతీస్తోమము లెంకలుం గొలువఁగా నుల్లాసియై యుండఁగన్. 128

మ. ఒకవైతాళికుఁ డేగుదెంచి సభలో నుత్క్షిప్తహస్తాగ్రుఁ డై
ప్రకటాశీర్వచనక్రమంబున నిజప్రౌఢత్వ మేపార గా
నకళాభిజ్ఞత చూపఁ బూని పలికెన్ క్ష్మాకాంత నీకీర్తికాం
తకు నీరేడుజగంబు లొక్కమణిసౌధం బై వెలుంగుంగదా. 129

ఉ. ఓనరనాథచంద్ర సుగుణోత్తమ యిచ్చట నాప్తవర్గమున్
దీనుల బట్లను న్ధరణిదేవతలం గవులం బ్రియోక్తి స
న్మానము లేర్పడంగ ననుమానము సేయక యాదరించు నీ
దానమహోత్సవంబు విని దవ్వులనుం డిదె చూడవచ్చితిన్. 130

ఆ.వె. అర్థినన్ను మెత్తు వటుగాక నేర్పరి
నన్ను మెచ్చువడయు టదియ కడిఁది

నేఁటి కొక్క విద్య నేమెఱయించెద
నవసరంబు నాకు నానతిమ్ము. 131

క. అనుడుఁ దదీయకళాద
ర్శనలాలసుఁ డగుచు నవసరం బిచ్చినఁ గై
కొని నామేళము గూడ్కొని
పనివినియెద నంచువెడలిపాఠకుఁడేగెన్. 132

సీ. అయ్యెడ నొకక్రొత్తయైనమహావీరుఁ
డందియ డాకాల నమరఁ బూని
బాగుగాఁ బులిగోరు పట్టు దిండుగఁగట్టి
నునుపార మేనఁ జందన మలంది
తిలకంబు కస్తూరిఁ దిలకించి చొళ్లెంబు
చెంగులపాగతోఁ జెన్నుమీఱ
హనుమంతువ్రాసిన యరిగెబిళ్ళయు వాలుఁ
గరములజయలక్ష్మి గదలుకొనఁగ

ఆ.వె. నొకఁడువచ్చె వెనుక నొక్కబింబాధరి
యంచుదుప్పటిమునుఁ గమరఁబెట్టి
మేనికాంతి కప్పులోనఁ గ్రిక్కిఱియంగ
హంసయానయగుచు నరుగుదేర. 133

క. [1]వచ్చి నృపుంగని మ్రొక్కిన
నచ్చో నొకమంత్రి యోమహావీరుఁడ నీ
వెచ్చోటనుండి సతితో
నిచ్చటి కరుదెంచినాఁడ వెవ్వఁడ వన్నన్. 134

---

1. వచ్చి ప్రణమిల్లినిల్చిన.

శా. [1]ఆపీరుఁడు వినీతుఁడై మనుజలోకాధీశుతో నిట్లనుఙ
దేవాధీశునిబంట నొక్కెడ బలోదీర్ణుండ నై తప్పొగిం
గావింపం గని నన్ను హీనపదునిం గాఁజేసిన న్వచ్చినా
[2]నీ వామేక్షణ నాదుభార్య యిట నా కిష్టంబుగా వచ్చితిఙ. 135

క. క్రమ్మఱ నింద్రుఁడు రిపు సై
న్యమ్ములు పోరాడ వచ్చునవసర మని యు
ద్ధమ్మునకుఁ దోడుపడ నను
రమ్మని పుత్తెంచె నిపుడు రాజవరేణ్యా. 136

క. నే నరుగఁగ నక్కడ నా
దానవయుద్ధమున సుదతి దలఁకెడు నిట నే
మానవుఁడు హితుఁడు లేఁ డటు
గాన సతికి నీవె ప్రాపుగాఁ దగుదధిపా. 137

ఆ.వె. [3]పాలనంబు సేయుప్రభుఁడవు నీకంటె
నొండుచోట నుంచు టురవుగాదు
దిక్కులేనిప్రజకు దిక్కునీ వటుగానఁ
దరుణి నరసికొమ్ము తంద్రికరణి. 138

క. అని యప్పగించి సభలో
వినువారలుఁ జూచువారు విస్మయమందఙ
హనుమంతునొద్దనముతో
హనుమంతుని పగిది నెగసె నాకసమునకుఙ. 139

---

1. ఆపీరుఁడు వినతుండై, భూవరుతో నిట్లు పలికెఁ బొలుపలరంగా-దేవతలు దానవాదుల, తోవైరముపూని నన్నుఁ దోడ్పడఁదలఁచిరే. 2. ఈవామేక్షణ భార్యగా క్షితితలం బిష్టంబుగా వచ్చితిఙ. 3. భారమెల్లమాన్పుప్రభుఁడవు-నొండుచోటఁగార్య మొందుపుట్టు-పాపమెల్లమాన్పు-

క. మిన్నంటి నెగసి నరులకుఁ
గన్నంటిన యంతదవ్వుఁ గానంబడి య
త్యున్నతగతిఁ గనుపట్టక
చన్నం గని చోద్య మందె జనపాలుండున్. 140

సీ. అమీఁద దేవాసురాహవం బైనట్లు
పంచమహావాద్యఫణితు లెసఁగెఁ
బొడువుఁడు తలఁద్రెంచుఁడదువుఁడునానిట్లు
పెదబొబ్బలార్పులుమదులువదియె
నంతలోపల హనుమంతునొద్దనముతోఁ
గూడ నాతని చేయిగూలె ధరణిఁ
దరువాత వాలుతో దక్షిణహస్తంబు
నందియతోఁ గాలునట్లు వదియెఁ

ఆ.వె. దొడికాలును దెగితొలఁగెఁజెంగులపాగ
చొల్లియంబుతోనఁ ద్రెళ్ళెఁదలయుఁ
ద్రిండుతోడఁగూడ [1]మొండెముదిగదొల్లెఁ
గొలువులోనఁజూడ ఘోరమయ్యె. 141

ఉ. ఎక్కడినుండివచ్చె నితఁ డెవ్వఁడొ యింద్రునిబంటు నంచుఁ దా
నిక్కమలాక్షి నుంచి దివికేగి సురాసుర సంగరంబునం
గ్రక్కున నొక్కఁ డిట్లు కడికండలునయ్యె నటంచుఁ గొల్వులోఁ
బెక్కువిధంబుల నృపునిఁ బేర్కొని విస్మయమంది రందఱున్. 142

ఆ.వె. పిఁది మునుఁగువచ్చి మెలఁతుక యలకలు
చక్కదువ్వియవ్వ దక్కజముగ

---

1. గుండములు ద్రెళ్ళె- నెదమకాలునుదెగి పుడమిబడియె. గుండలములు ద్రెళ్ళె.

నధిపునవయవంబు లాయొడ్డనంబుతోఁ
గూడఁ దిగిచి బెగడుగొనకపలికె.　　143

క. ఓ నరనాయక యింకిట
నేనుండుట తగదు సమరనిహతుని వీరు
న్నానాథుఁగూడ నేగెద
నానతి యీవలయు నాకు నగ్నిసొరంగన్.　　144

క. [1]నావిని మొదలనె యాతని
చావున కతిఖిన్నుఁడైన జనపతి కృపతో
నో వీరపత్ని జనకుని
కైవడి నినుఁ బ్రోతు నిట్లు గదఁగకు మనియెన్.　　145

క. ఇది చాగెడుకొఱకై నీ
పదములకడ నుంచె నిట్లు పతిపోయిన స
త్పదమున కేగెద ననువుట
మదిఁ జూడఁగ నిదియె తండ్రిమన్నన గాదే.　　146

ఉ. ఆకులపాటుతోడ నశుభాకృతియై యొక వేళనైనఁ బోఁ
కాకును లేక సొమ్ములకు నట్టులు సాఁపక పేరఁటంబులం
బోక తొఱంగి పూఁతలును బువ్వులు దూరముగాఁగ మండయై
యేకడఁ జేరిన న్విధవ కెగ్గులె కాక [2]భరింపవచ్చునే.　　147

క. చచ్చియుఁ జావక తనలో
వెచ్చుచు నియమముల నింక విధవాత్వమున
న్నిచ్చలు మాఁడుటకంటెను
జిచ్చుఱుకుట మేలు సతికి క్షితి మెచ్చంగన్.　　148

1. ఆవీరభటుని చావునకై　2. చరింపవచ్చునే, తరింపవచ్చునే, ధరింప వచ్చునే.

క. పతి దుఃఖితుఁ డైనను దా
నతిదుఃఖిత యగుచు నూరి కతఁ డరిగినఁ బీ
డిత యగుచు నతఁడు సచ్చిన
ధృతితోడన సచ్చునది పతివ్రత చుమ్మీ. 149

ఆ.వె. పుట్టలోనిపాముఁ బట్టు గారడికుండు
బలిమి వెడలఁ దిగియు పగిది నింతి
తోడఁ జచ్చి పతి యధోగతుఁ డైనఁ దా
నుద్ధరించి సౌఖ్య మొందుచుండు. 150

ఆ.వె. ఆతని కేమికొఱఁత పతి హితంబునఁ బ్రాణ
మిచ్చినాఁడు దివికినేగినాఁడు
రమణుఁడగుచునచట [1]రంభాదిసతులఁగూ
డ్కొనకమున్ననన్నుఁ గూడ ననుపు. 151

ఆ.వె. ఉరక మాన్పితేని నురి వెట్టుకొనియుండె
నుండు గట్టి సీళ్కఁ గూలి యుండె
విషముద్రావి యుండె విడుతుఁ బ్రాణంబు లా
తగనిచావు కీడుదగులు నిన్ను. 152

సీ. [2]అటుగాక పుణ్యమౌ నగ్నిప్రవేశంబు
చెయుంపు మాకీడుచెంద దిందు
నెన్న ముక్కోటియు నేఁబదిలక్షలు
మానవు మేన రోమంబు లుండు
నన్ని యేఁడులు స్వర్గ మాత్మనాయకుతోడ
ననుగతయౌ సతి యనుభవించు

1. రంభాదిసతులను గూడకుండ-రంభాదులను గూడుకొనక మున్న-
2. అటుగాన యుక్తమౌ

వీరు నియాల నై విధవ నై యుండుట
సముచితం బదిగాదు చాగనిమ్మ

ఆ.వె. తడయనేల యనుచుఁ దరుణి ప్రార్థించిన
మాఱు వలుక లేఁ మనుజవిభుఁడు
కొంత యనుమతింప నంతలోఁ దజ్జను
లాయితంబు చేసి రార్తు లగుచు. 153

చ. ధృతి మతిఁ బొంగి రాజునకు దీవన లిచ్చి నిజాధినాథు మే
నితునుకలుం దదస్త్రములు నించి ఘృతప్లుతచందనేంధనా
న్వీత మగు నగ్నికుండమున నింతి వెస న్నవనీతపుత్రికా
కృతిఁ బడి యంతలోనఁ గరఁగెఁ జనులందఱుఁ బ్రస్తుతింపఁగాఁ. 154

వ. తదనంతరంబు. 155

క. వసుధేశుఁడు వెఱఁగందఁగ
వెస నరిగయు వాలు ద్రిండు విలసిల్లఁగ నా
కసమున డిగి యవ్వీరుఁడు
కనుగందకవచ్చి తొంటికై వడి నిలిచెఁ. 156

ఉ. ఒక్కఁడు నిట్లు వచ్చి వినయోక్తులు మున్నుగ మన్ను ఱేనికిఁ
మ్రొక్కి సురప్రసూనముల మోహనమౌ నొకదండ యిచ్చి నే
నక్కడ కేగి దానవుల నందఱఁ ద్రోలినఁ జూచి మెచ్చుగా
నిక్కుసుమస్రజంబు దివిజేంద్రుఁడు నా కొసఁగెం బ్రియంబునఁ. 157

క. క్రమమున నయ్యింద్రుఁడు నా
కమరపదం బొసఁగి నిజసభాంతరమున ని
త్యము నుండఁగవలయుఁగుటుం
బముఁదోడ్కొనిరమ్మటంచుఁ బనిచె న్నగుడఁ. 158

క. ఆకారణమునఁ గ్రమ్మఱ
నీకడ కరుదెంచినాఁడ నిఁక నేగెద నే
నీకప్పగించి పోయిన
నాకోమలి నిచ్చి మగుడ నన్నుపు నృపా. 159

చ. అనవుడుఁ గొల్వులోనిజను లందఱు మిక్కిలి చోద్యమందఁ గా
మనుజవరుండు వాని కొకమాటయు నాడఁగ లావు లేక వి
న్నన యగుచున్న మంత్రులు మనంబున విస్మితులయ్యు వీరుఁడా
యనిమొన నీవు దీఱిన మృగాక్షియుఁ జచ్చుటెఱిఁగెం బ్రియంబునన్. 160

మ. అనిన న్వారలఁ జూచి వాఁడు దివి నే నాదేవసంఘమ్ములు
న్ననుఁ జూడ రిపుసేనలం బఱపి మందారస్రజం బింద్రు మ
న్ననగాఁ గైకొని వచ్చినాఁడ నిట నున్నాఁడ న్ననుం దీఱినాఁ
డనిన న్మెత్తురె రాచవారలకుఁ గల్లాడ న్మనం బొందునే. 161

క. ప్రత్యక్షముగా నెదురను
సత్యము వలుకుదురు గాక చనువారు హితా
మాత్యులునై మీరీతని
కృత్యము నడుపుదురు మిమ్ము గెలువం దరమే. 162

చ. అనుడు నిరుత్తరుం డగుచు నవ్వసుధేశుఁడు వానికంత నా
యనిమిషనాథునొండె మఱి యంతకునైనఁ గలంచి తెత్తు నేఁ
డని మది నిశ్చయించుకొని యాత్మహితుం డగు బెంకచేత కాం
చనమయముష్టిరమ్య మగు శస్త్రిక యల్లన యందె నందినన్. 163

క. ఆవీరుం డప్పుడె నిజ
భావము ప్రకటముగ నాత్మభామినితోడం
దావై తాళికుఁ డగుచుం
గైవారము సేసె జనులు గడు వెఱఁగందన్. 16

క. సరనాథ నిన్ను నపు డవ
సర మడిగినవాఁడ నైంద్రజాలికురీతి
న్నరుల నణకించి నీచే
సిరి వొందం జోద్యమిట్లు చేసితి ననియెన్. 185

ఆ.వె. అనుడు వెఱఁగు వడుచు నవనీశుఁ డంతయు
నింద్రజాలమగుటయెఱిఁగియతని
గారవించి యెన్నికళ లభ్యసించితి
వన్నినాకుఁ జెప్పు మనుడు నతఁడు.

ఆ.వె. పెక్కువిద్యలెఱుఁగఁ బృథ్వీశ నినుఁ గొల్చి
నేర్తుఁ గొన్నికళలు నేర్తుఁ దొల్లి
వానిపేళ్ళు వినఁగ వలయును జెప్పెద
దానసైన నన్నుఁ దద్జ్ఞుఁడనరె. 187

వ. కావున నవధరింపుము నాలుగు వేదంబులును శిక్షాదిషడంగంబులును స్మృతులును బురాణంబులును బూర్వోత్తరమీమాంసలును న్యాయవిస్తారంబులును నితిహాసంబులును వాస్తుశాస్త్రంబును శ్రౌతతంత్రంబును నాయుర్వేదంబును ధనుర్వేదంబును విషప్రతీకారంబును మంత్రప్రతీకారంబును గణితంబును మాంత్రికత్వంబును జలసూత్రంబును సంగీతంబును సాహిత్యంబును నుచితకృత్యంబును నాటకంబులుఁ గావ్యంబులు నలంకారంబులు నానాదేశభాషలును సకల లిపిపరిచయంబును దూరగమనంబును దూరశ్రవణంబును ధురంధరత్వంబును వశ్యాకర్షణాది షట్కర్మంబులును వాహనారోణ చాతురియు జలస్తంభన, శిలా స్తంభన, స్థల స్తంభన, అగ్ని స్తంభన, ఖడ్గ స్తంభన, వాయు స్తంభన, రస స్తంభన, శుక్ల స్తంభన, రక్త స్తంభనాదులును మహేంద్రజాలంబును నష్టవస్తుసముద్ధరణంబును జింతితార్థ దానముష్టీకరణంబును బ్రియభాషణంబును నదృశ్యకరణంబును నదృశ్యాకర్షణంబును గృషివాణిజ్యాదులును శక్తిత్రయం

బును రత్నగర్భాది పరీక్షణంబును మనుష్యాది జీవపరిరక్షణంబును ద్యూతాదిఖేలనంబును యమనియమాద్యష్టాంగయోగంబును అష్టావధానంబును వైదికంబును లోకాచారంబును రతిరహస్యంబును వాద్యకౌశలంబును నాట్యంబును బరకాయ ప్రవేశంబును బరవంచనంబును ఉపాయాపాయవివేకంబును వీరత్వంబును వాచకంబును గందుక కుక్కుటాండ జలపూర్ణభాండ చక్రభ్రమణంబును బహురూపనటనత్వంబును వేణుదండ భ్రమణంబును రాజముఖ మృగముఖ స్త్రీముఖ చోరముఖ దిఙ్ముఖబంధనంబును హాలికప్రయోగంబు నాకారగుప్తియు భావజ్ఞానంబును గ్రామణికత్వంబును లేఖకత్వంబును బరిహాసంబును వాచాలకత్వంబును నిష్క్రంపవృత్తియు సర్వజాతి శిల్పపరిశీలనంబును నానీ చతుష్షష్టి కళలయందును దేవరసాన్నిధ్యంబునం గొంత పరిచితుండ ననిన[1]. 168

క. భూవల్లభు డాతని వి
ద్యావిజ్ఞానంబు మెచ్చి తనలోపల సం
భావింపఁ దలంచునెడఁ
దౌవారికుఁ డేఁగుదెంచి తగ నిట్లనియెన్. 164

క. ఓనరనాయక తమకుం
బూనిక ఫలియింపఁ బాండ్యభూపతిమంత్రుల్
కానుకలు గొంచు దేవరఁ
గానం జనుదెంచినారు కడు వినయమునన్. 170

ఆ.వె. అనిన వారిఁ దోడికొనిరమ్ము నావుడు
మగిడి యేగి యచటిమంత్రివరుల
వాఁడు దోడుకొనుచువచ్చి దర్శింపించెఁ
గనకరత్నచయము మునుముగాఁగ. 171

---

1. ఈవచనంబులోని చతుష్షష్టికళలును- ప్రతికొక విధముగా మార్పఁబడినవి, సంఖ్య హెచ్చినది.

సీ. ఆమంత్రివరులు సాష్టాంగంబుగా మ్రొక్కి
    నిలిచి ముందరఁ గరంబులు మొగిడ్చి
జనలోకనాయక యెనిమిదికోట్లు దీ
    నారముల్ [1]నూర్వుర వారసతులు
తొంబదిమూఁడు ముత్యంబుల [2]కావళ్ళు
    నేఁబదిమత్తకరీంద్రములును
మున్నూఱు జవనాశ్వములును గప్పంబుగాఁ
    బాండ్యభూపాలుండు పంపె నీకు
ఆ.వె. నవధరించి దండయాత్ర యక్కడమాని
యతని గావవలయు ననుచు మ్రొక్కి
[3]యున్నఁ గరుణఁజూచి యుర్వీశ్వరుండును
మోద మడర వారి నాదరించి. 172

ఉ. అర్థులు గోష్ఠి [4]చేయు సమయంబున వచ్చిన దర్సనంబు న
య్యర్థుల కిచ్చెనేని ప్రభు వాతఁడె కావున విద్యవాని కా
య్యర్థము ముత్తియంబులు నవాంగనలుం గరులున్ హయంబులుం
బార్థివుఁ డిచ్చి పుచ్చెఁ దను బాండ్యునిమంత్రులు ప్రస్తుతింపఁగన్. 173

క. అట్టి మహోదారుఁడు తన
పట్టణమున కేగి రాయబారులఁ గృపఁ జే
పట్టి సిరి నెగడెఁ గావున
నిట్టిగుణము లేక యెక్క నితరులతరమే. 174

క. అనవుడు భోజుండును నె
మ్మనమున నవ్విక్రమార్కు మహనీయము లౌ

---

1. యువతులు నూఱువురును. 2. క్రోవలు. 3. విన్నవించుటయును విని యవనీపతి. 4. చేయునెడలందున- చేయునెడ నప్పని.

గొనములు గొనియాడుచు సి
గ్గనయఁగ నాసొంపుదక్కి యింటికిఁబోయెన్. 175

శా. శృంగారాధిపతిత్వసంజనితలక్ష్మీ సంగతాంగు న్వియ
ద్గంగాకారణపాదపద్ముని ద్రిలోకవ్యాపకుం గోపరూ
పాంగీకారకృతార్థితవ్రజకురంగాక్షీమనోరంగునిన్
సంగీతప్రియు సామవేదమయుఁ గంసధ్వంసి విశ్వంభరున్. 176

శా. గంగాతుంగతరంగసంగతజటాకల్పాయమానాకృతిం
ద్వంగదోగ్రభుజంగరాజఫణరత్నజ్యోతిరుద్దీప్త సా
రంగాంకద్యుతిధౌతరాజతగిరీంద్రస్థానరంగస్థలీ
రంగద్భృంగిరిటిప్రసంగసుఖపారంపర్యధుర్యున్ శివున్. 177

మాలిని. శశధరశకలాంకా సన్మనోనిష్కళంకా
విశదగిరినివాసీ [1]విశ్వబాధానిరాసీ
దశముఖవరదాతా దైత్యహింసావిధాతా
పశుపతిహరిరూపా ప్రాజ్యపూజ్యస్వరూపా !

గద్యము. ఇదిరాయగజగంధవారణవైరిమండలిక భేకఫణీంద్ర వీరఘోట్టపి
భాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్ర
భూపాలరూప నూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర
వెలనాఁటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్య పౌత్ర
హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజ
ప్రణీతంబైన సింహాసనద్వాత్రింశికయను కావ్యంబునందు సాహసాంకుని
సాహసోపకారంబులును విటవంచని వంచకత్వంబును గర్వారాంగుని
శాపమోక్షణంబును విక్రమార్కునౌదార్యంబు నన్నది యేకాదశాశ్వాసము.

---

1. విశ్వబోధానురాశీ.

—□—

శ్రీరస్తు

# సింహాసన ద్వాత్రింశిక

## ద్వాదశాశ్వాసము

క. శ్రీపరిరంభణసమయ
ప్రాపితనవకుంకుమాంక భాసురనిజదే
హోపమితసాంద్రనీరద
రూపు న్స్మరవిమతనిహితరోషాటోపుఁ. 1

చ. హృదయమునం దలంచి ధరణీశుఁడు క్రమ్మఱ నొక్క వేళ నా
త్రిదశవరాసనంబున కతి ప్రమదాస్పద మైనరాజ్యసం
పద నరుదేరఁగా నతని భావము గన్గొని యల్ల నవ్వచం
దదనుమతంబు మాన్పి విదితంబుగ నచ్చటిబొమ్మ యి ట్లనుఁ. 2

### —* ముప్పదియొకటవ బొమ్మకథ *—

క. ముప్పదిమాఱులు క్రమ్మఱి
యప్పుడు చనుదెంచినాఁడ వాతనికథ లి
ట్లొప్పఁగదా యిఁకనొకకథ
చెప్పెద నీచేఁత నీకుఁ జెల్లదు చుమ్మీ. 3

ఉ. సజ్జనరక్షణోన్నతవిశాలభుజాయుగళుండు సర్వసం
పజ్జితకిన్నరేశ్వరుఁ డపారభటోద్భటవైరిమేదినీ
భృజ్జలజక్షపాకరుఁడు భీమబలాఢ్యుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున గుణోర్జితుఁడై ధరయేలుచుండఁగఁ. 4

క. జననుతుఁడు శాంతిశీలుం
డనఁగా నొకభిక్షుకుండు హరిమూర్తికిఁ దా
నెనయగు భూవల్లభునిం
గనుఁగొనఁ జనుదెంచి ఫలము కానుకయిచ్చెన్. 5

క. ఇచ్చినఁ గైకొని నృపుఁ డిటు
విచ్చేయుం డనుచు గారవించుచు నతనిన్
సచ్చరితుఁ డనుచు నాసన
మిచ్చి యుచితగోష్ఠి జరపి యెలమిని ననిపెన్. 6

వ ఇట్లనిపిన తదనంతరంబున- 7

ఆ వె. ఆఫలంబు తనగృహాధ్యక్షు చేతికి
నిచ్చిలేచి లోనికేగె విభుఁడు
మఱియునాతపస్విమఱునాఁడుగ్రొత్తగా
నొక్కపండుదెచ్చియొసఁగెఁ బతికి. 8

శా. ఆపండు న్నృపుఁ డట్లు పుచ్చుకొని భాండాగారిచే నిచ్చె ని
ట్లేపార నృపహస్తుఁడై యవసరం బీక్షించుచు న్భిక్షుకుం
[1]డేప్రౌఢుం గవితావిలాసమున నర్కేందు ప్రతీకాశుఁ డా
క్ష్మాపాలుం గొలువంగ నయ్యె దశవర్షంబు ల్వినోదంబుగన్. 9

చ. అటు లొకనాఁడు క్రొత్తఫల మాతఁడు దెచ్చినఁ బెంచినట్టి మ
ర్కటమున కిచ్చె నాకపియుఁ గైకొని మూర్కొని చూచి మెచ్చుచుం
గటుకనఁ బండులం గొఱుకఁగా నొకరత్నము గింజమాడ్కి ముం
దటఁ బడియె న్నిజప్రభలఁ దద్గృహమండప మర్కువన్నెగాన్. 10

సీ. ఆరత్న మీక్షించి యాశ్చర్యమున విభుఁ
డట గృహాధ్యక్షుఁడైనట్టి లెంకఁ

1. శేపారం గనరానివేషమున లంకేశప్రతీకాశుఁడై.

బిలిపించి యిన్నాళ్ళఫలములు దెమ్మన్న
నరిగి మాణిక్యంబు లైనవాని
నన్నిటిఁదెచ్చిన [1]నాదాఁపుటకు మెచ్చి
వానికి నవి యిచ్చి వడుసఁ బిదప
క్షాంతిశీలుం డటు చనుదెంచుటయుఁ జూచి
యనఘ నీవిట్టి యనర్ఘ మణులు

ఆ.వె. నాకు నిచ్చి యేమి నాయెడఁ గైకొనఁ
దలఁచినాఁడ విపుడు విలువఁ జూడ
నొక్కరత్నమునకు నుర్వియంతయుఁ జాల
దిన్నిరత్నములకు నెద్దియిత్తు. 11

క. అనవుఁడు నాభిక్షుకుఁ డో
జననాయక దీనికంటె సమధికగుణమౌ
పనిగలదు గాన వచ్చితి
ననఘుఁడ వభయుఁడవు సాహసాంకుఁడవగుటన్. 1[illegible]

చ. క్షితివర నాప్రియంబు విను కృష్ణచతుర్దశినాఁటిరాత్రి యు
న్నత మగు మఱ్ఱిక్రింద మసనంబున నున్న పిశాచపంక్తి స
న్నుతు లొనరించి హోమము మనోరథ సిద్ధికిఁ జేయువాఁడ నే
కతమున నీవు నచ్చటికిఁ గ్రక్కున రమ్మటు నాకుఁ దోడ్పడన్. 13

చ. అనవుడు నింతకాలము ప్రయాస మిదేటికి నాఁడె చెప్పినం
బనివిననే యడంచి యొక బ్రహ్మముఁ జేసితి నేఁడు నీవు చె
ప్పిన సమయంబు దప్పక యభీష్టము నీకొనగూర్ప వచ్చెదం
జనుమని వీడుకొల్పి నృపచంద్రుఁడు మానస ముత్సహింపఁగన్. 14

వ. అంతఁ గృష్ణచతుర్దశి వచ్చినం దద్రాత్రి సమయంబున. 15

---

1. నాడాఁపురమునకు మెచ్చినదానికి నవియిచ్చి పిదప.

క. నీలాంకితభూషణములు
నీలాగురు లేపనములు నీలాంబరముల్
నీలోత్పలములు నిజదే
హాలంకారములు గాఁగ నతఁ డొక్కండున్. 16

సీ. కరవాలహస్తుఁ డై పురము వెల్వడి వీర
భావంబుతోఁ బూర్వభాగమునను
డాకినీచండ తాండవసముద్దండంబు
ఘూకఘూత్కారాది ఘోరపదము
సంప్లుతశవదాహసమయ సముజ్జ్వల
చ్చట చటధ్వనివహ్నిసంకులంబు
సకుటుంబవృద్ధజంబుకభీషణాక్రోశ
సంతతబధిరితాశాంతరంబు

ఆ.వె. కర్పరాస్థిశూలకంకాళనృకపాల
దారుణంబు భూతకారణంబు
నాగభయరసంబునకు నాస్పదంబైన
యాశ్మశానభూమి కరిగి యచట. 17

క. వటతరువుక్రింద నచలో
త్కట మగు గుండంబుఁ బొంతఁ దపసిం గని యే
మట పనివంపుము నావుడు
భటభావముఁ బొగడి కార్యపరుఁడై యతఁడున్. 18

వ. ఇచటికిఁ గ్రోశమాత్రమున నొక్క-శింశుపావృక్షం బున్నది యందు విల
గ్నుండగు బేతాళుండున్నవాఁ డతనిం గొంచు రమ్మతండు మౌనంబునం
గానిరాఁ డని పంచిన నట చని యనేకవిహంగభుజంగ పిశాచ బ్రహ్మ
రాక్షస సతతనివాసం బగు నమ్మహామహీరుహంబు డగ్గఱి తదీయ శాఖావ

నేక్తావనతచరణుండు నవలంబమానహస్తుండును నధోముఖుండును నగు
నా భూతప్రముఖుం జూచి. 19

సీ. తరువెక్కి కాళులతగు లూడ్చునంతలోఁ
 జేతులుపట్టినం జేతు లూడ్చి
మఱియుఁ గాళ్ళం బట్టి మొఱవెట్టునాతని
 మెడమీఁద నిడుకొనిపుడమి కుఱికి
బంటున కుచిత మౌ పనికిఁ బంపక భిక్షు
 కుండు పీనుఁగుమోవఁగోరిపనిచె
ననిదూఱఁగా బిశాచాగ్రేసరుఁడు మీఁది
 కెగసి యెప్పటియట్లతగిలియుండె
ఆ.వె. భూవరుండు మోసపోయితి నని తాను
 మీఁది కేగి పీఁపుమీఁదఁ బెట్టి
 కొనుచు డిగ్గి యేమియును బల్క నోడుచుఁ
 గదలివచ్చెఁగార్యగౌరవమున. 20

క. ఆయెడ బేతాళుఁడు జన
 నాయకుఁ బరికించి వేఁడి నరవర భార
 వ్యాయామము మఱచి సుఖో
 పాయంబునఁ దెరువు జరుగునని కథఁజెప్పెఁ. 21

—: వజ్రముకుటుని కథ :—

వ. అది యెట్లనిన. 22

ఆ.వె. అఖిలలోకవిదిత మైన కాశీపురం
 బునఁ బ్రతాపముకుటుఁ డనఁగ రాజు
 కలఁడు వాని కిష్టకాంత సోమప్రభ
 యనఁగఁ గలదు పేరు సార్థముగను. 23

క. ఆదంపతులకు సుతుఁడు ప్ర
మోదాకృతిఁ బుట్టి వజ్రముకుటుఁ డనంగా
మేదినిఁ బరఁగుచునెన్నఁగ
శ్రీదనరారంగ మరునిచెలువు వహించెన్. 24

క. ఆరాజసుతుఁడు బుద్ధిశ
రీరుండనుమంత్రిసుతుఁడుప్రియసఖుఁడుగ నా
నారూపవినోదముల వి
హారంబులు సలుపుచు న్మహావ్యసనుం డై. 25

ఉ. ఇష్టసఖుండుఁ దా నడవికేగి మృగంబుల వేఁటలాడుచుం
గ్లిష్టశరీరుఁడై కొలని క్రేవ జలార్థము చేరి కన్యకా
సృష్టికి నాద్యలో యనెడు చెల్వాలు [1]గొల్వఁగఁ దారకాంతర
స్పష్టహిమాంశురేఖ కిది సాటియనం బొడఁగాంచె నొక్కతెన్ 26

చ. అనువుగ బాహులోచనకుచాస్యకళ ల్గొనివచ్చినారు తెం
డని బిసమీనచక్రనలినౌఘము నీళ్లను ముంచి వచ్చి శో
ధన మొనరించి చేకొను విధంబున నంబురుహాకరంబు పొం
[2]తను విహరించు బాలికయు ధారుణీనాథతనూజుఁ జూచినన్. 27

క. ఇరువురచూపుల మదనుఁడు
శరములుగాఁజేసి పులక సముదయ మొదవన్
సరి నయ్యిరువురమనములఁ
గరఁగించెం బ్రేమరసము గడలుకొనంగన్. 28

ఉ. అంబురుహాక్షి యప్పుడు ప్రియంబున నొఁదలగల్వపూవుఁగ
ర్ణంబునఁ జేర్చి, దంతశిఖరంబుల ఘట్టనచేసి, పాదప

---

1. గొల్వగ నొప్పుచుం గళా, స్పష్టహిమాంశురేఖకిది సాటియనందగు కొమ్మఁ గన్గొనెన్. 2. తనిలిచియున్నబాలకియు.

ద్మంబునఁ బెట్టి, వక్షమున దాపి, మనోగతి లక్షణంబు వ
క్త్రంబునఁ దోఁపకుండఁ, జెలికత్తెలు గొల్వఁగ నేగె నూరికిన్. 29

క. ఇటనాతురుఁడై వజ్రము
కుటుంబప్రియసఖుఁడు దన్నుఁ గొల్వఁగఁ బురి కా
దట నరుదెంచియు నొకచెం
గట నుండెం దెలియరాని [1]కనుబేటమునన్. 30

వ. ఇట్లాకన్నియ నామగ్రామ జన్మప్రేమాతిశయంబు లెఱుంగమి మిగులఁ
బొగులుచు దాని తగులు వగల నొగులు చున్న రాజకుమారుం దెలుపకుం
డుట బుద్ధిగా దని బుద్ధిశరీరుండు డగ్గఱి నీ కింతచింతయేల విను మాకో
మలి తలమీఁది యుత్పలంబు కర్ణంబునుం జేర్చుకొనుట కర్ణోత్పలుం డను
రాజుగలఁ, డది దంతఘట్టితంబు సేయుట దంతఘట్టకుం డనం దన్మంత్రి
గల, డది పదపద్మంబున మోపుటం బేరు పద్మావతి యగు, నది హృద
యంబున నత్తుట నీవ హృదయేశ్వరుండ, వని సూచించె నప్పుడే నిశ్చ
యించితి నాకర్ణోత్పలుండు [2]కుంతలదేశం బేలుచుండు నని విందుము.

ఉ. ఆతనిమంత్రికూఁతు రవదంగనగా నొనరించువాఁడ ర
మ్మా తలపోఁత లేల యని మానవనాథతనూజుఁ గొంచు న
వ్వీతనిగూఢ వేషముల నేగుచుఁ [3]గొంతలకంబు చేరి మా
[4]ర్గాతిథివృత్తి నొక్కతె గృహంబున నిల్చి యనుక్రమంబునన్. 32

సీ ఈపురం బేలురా జెవ్వఁ డాతని మంత్రి
యెవ్వఁ డాతనికూఁతు రెవ్వరొక్కొ
యింతయు నెఱుఁగుదువే యని
యడిగిన నుర్వీశ్వరుండు కర్ణోత్పలుండు

1. కనుజతనమునన్. 2. కళింగదేశం. 3. నేగికళింగపురంబుసొచ్చి
4. ర్గాతురవృత్తి.

తన్మంత్రివర్యుండు దంతఘట్టకుఁడు త
త్తనయ పద్మావతి యనఁగఁ గలదు
దానికి నే నిష్టదాసినై వర్తింతు
నని యది చెప్పిన నాత్మఁ బొంగి

ఆ.వె. మంత్రిపుత్రుఁడు తనమాట నిక్కవమైన
నతని నూఱడించి యదియ యటకు
దూతిగాఁగ మొదలుదొరకొని తమరాక
చెప్పిపుచ్చి రపుడు చెలియకడకు. 33

క. అది చని యొక రాకొమరుఁడు
సుదతీ నీతలఁ పెఱింగి [1]సుగుణత యొందం
గదియఁ జనుదెంచి సమ్మద
మొదవఁగ నాయింట విడిసి యున్నాఁ డనినన్.  34

వ. అది విని గూఢభావం బేర్పడకుండ దానిని భర్జించి రోషమిషంబునం గర్పూర మలయజ సాంద్రంబు లగు రెండు చేతుల దాని రెండు చెక్కులం దన పదిత్రేళ్ళు నంటవ్రేసిన నది ఖిన్నవదనయై తిరిగి చనుదెంచి తత్కృతావమానంబు సూపిన నారాకొమరుం డింక నాశ లే దని యుస్సురనినం దత్సహచరుం డగు బుద్ధిశరీరుం డట్లనియె 35

సీ. చింతింప కిఁక దీని చెక్కిళ్ళఁ దెల్లని
పదిరేఖలుగ వ్రేసి పంపు టరయ
నిదిశుక్లపక్ష మీపదిదినంబులుఁ బుచ్చి
రమ్మని చెప్పుట నమ్ము మనుచుఁ
దెలిపి యాపదిదినంబులుఁ బుచ్చి యాదాసిఁ
బ్రార్థించి యెప్పటియట్లపనుప

1. సుందర మొదవన్ - సుగుణతనమునన్.

నది తొంటిక్రియ మాటలాడఁగాఁ గుంకుమ
నూఱెడి సఖిఁ బిల్చినోరిమీఁద

ఆ.వె. దీని నడుపు మనుచుఁదెగి మూఁడుప్రేళ్ళప్రే
యించి వెడలనడిచెవంచనమున
మగిడివచ్చి కుంకుమద్రవాంకితము లౌ
పెట్లు సూపె నది యభీష్టమమర. 36

గీ. చూచి యాస లేమిఁ [1]జూకురుఁబొందుచు
చచ్చుటొప్పు ననుచు వెచ్చనూర్చు
వ్రజముకుటుఁ బొగల వల దసితత్సఖుఁ
డాస గలుగఁ దెలిపి దానిఁ బిలిచి. 37

వ. ఆకన్నియ రజస్వల యై యుండంబోలుఁ గావున నెఱ్ఱగా నీమూఁడు ప్రేట్లు ప్రేయించి త్రోలించె నీమూఁడు దినంబులుం గడపి యింక నొక్కతో యంబె యరుగవలయు నని వేఁడుకొనిన నదియుం గ్రమంబున నాలుగ వనాఁడు కన్యకాసౌధంబునకుం జని మగిడి వచ్చి. 38

మ. నగుమో మొప్పఁగ నేఁటిమాట వినుచు న్నాదరింపంగ నే
నుఁగు తద్వేళ మదించి కంబము వెస న్నుగ్గాడి యేతెంచిన
న్మాగసాల న్వెడలంగరా దనుచు నంభోజాక్షి పీఠంబుపై
డిగజాఱ న్ననుఁ ద్రాటఁ గట్టి విడిచెన్ డెందంబు బిట్టులుకఁగాన్. 39

క. అనవుడు తన్మార్గంబునఁ
జనుదెమ్మను టయ్యె ననుచుజనపతిసుతునిం
గొనిచని యాపీఠము పై
ననిపె నతని మీఁదివార లటు చేఁదుకొనన్. 40

1 సుర్రుక్కుచుఁబొక్కుచు.

శా. ఆసౌధాంతరసీమ రత్నమయ పర్యంకంబుపై నుండి త
ద్దాసీలోకకృతోపచారుఁ డగుచుం దాంబూల పుష్పాదు లు
ల్లాసం బంది చెలంగి కైకొనుచు బాల న్స్రగ్గుదేఱం బరీ
హాసోక్తిం బరికించి రాకొమరుఁ డేకాంతబునం బ్రోడయై. 41

క. తలఁపునకం దెం గడు న
గ్గల మగుతమకమున బాలఁ గౌఁగిట నిడి మైఁ
బులకలు మొలవగఁ దలకొని
చెలుకగరతిసుఖముచవులుచూపుచుఁ గవసెఁ. 42

ఉ. ఈగతిఁ బెక్కునాళ్ళు సుఖియించుచు నుండి విదేశభూమిలో
నేగతి నున్నవాఁడొ తన యిష్టసఖుం డని యిచ్చలోనఁ జిం
తాగతుఁ డైన దీనికిఁ గతం బిట నేటిది చెప్పు మన్న నా
త్మాగమనంబుఁ దన్మతియు నాతని యున్కియుఁ జెప్పె నేర్పడఁ. 43

క. అది విని నీకాప్తుఁడు నా
హృదయస్థితి యెఱుఁగు జాణఁ డీక్రియ దాసీ
సదనమున నొగులుచుండఁగ
నది యేలా చెప్ప వాతఁ డాప్తుఁడు గాఁడా. 44

క. అతనికి విం దొనరింపం
జతురుఁడు నను మెచ్చుఁ బాయసముఁ బక్వాన్నా
న్వితముగఘృతముంగొనిచని
యతిముదమునఁబెట్టియింటికరుదెమ్మనుచుఁ. 45

సీ. ఆపదార్థములు రయమ్మున సమకూర్చి
యాత్రాడు వెంటనే యనుప నతఁడు
చనిదాసిగృహమునఁ దనయిష్టసఖుఁగాంచి
బాలిక యిదె విందుపనిచె ననిన

నొకట నాయున్కిఁ జెప్పక యుండవైతివి
తనమీఁది చిత్తంబు దరలఁ గాన
నతు శిష్టచెలికాని నైతురె నాకును
విషమువె ట్టిది దొడ్డ విందువనిచేఁ

ఆ.వె. జూడుమనుచు నతఁడు శునకంబునకుఁబెట్టె
నదియుఁదినుటతడవె యవనిఁగూలె
నెదిరివారిచిత్త మెఱిఁగి వర్తించెడు
వారికేల కీడు వచ్చునురక. 46

వ. ఇట్లు దృష్టాంతంబు చూపి నీవింక గూఢంబున నేగి యతనికి భోజనంబు వెట్టితి నని చెప్పి మధుపానమత్త యగు నమ్మత్తకాశినికి లోఁదొడ గోరు నాట మూఁడు పోటులు వరుసం బొడిచి పాదభూషణమ్ము గొని రమ్మిటఁ గార్యంబు చూచుకొందమని యనిపిన నతండు నని యాక్రమం బొనరించి యందియఁ గొని వచ్చిన. 47

ఉ. అక్కడ మాని తత్పురి యుపాంతమున న్మసనంబులోన గో
రక్కుఁడు మీననాథుఁడు ధరం జరియించుచు విశ్రమార్థమై
యిక్కడ నిల్చినారొ యన నిద్దఱు నుద్ధతి సిద్ధవేషులై
యొక్కమఠంబు గట్టుకొని యుండిరి శూలము కేలఁ గ్రాలఁగన్. 48

క. ఒకనాఁ డటు కర్ణోత్పలు
నికొడుకు మృతుఁడైన నెఱిఁగి నీతివిదుఁడు మం
త్రికుమారుఁడు నృపసుతుచే
తికి నూపుర మిచ్చి సంతఁ ద్రిప్పఁగఁబనిచెన్. 49

క. అమ్మెద నని చూపుము తెగ
నమ్మకు మఱి దీనిజాడ లడిగిన నీచి

త్తమ్మనఁ గలఁగక నాకీ
సొమ్మిచ్చెను గురుఁ డటంచుఁ జూపుము నన్నున్. 50

సీ. అనవుడు నౌఁగాక యని పురంబున కేగి
యంగడి నమ్మఁజూపంగ నొకతె
మనపాప సొమ్మని మంత్రికిఁ జెప్పిన
నాతఁడు సొమ్ముతో నతనిఁ బట్టి
పృథివీశుముందఱఁ బెట్టిన గలుషించి
చెప్పరా యిది యెట్టు చేరెననిన
నే భ్రమచ్చఁగాను మీకీజాడఁ జెప్పెద
బంటుల నావెంటఁ బనుపు మనుచుఁ

ఆ.వె. గొందజారెకులనుదోడుకొనుచువచ్చి
నాకుసొమ్మిచ్చెనీగురునాథుఁడనుచుఁ
జూప వారలుమదిఁ గడుఁజోద్యమంది
యట్టివేషంబునకు సంశయంబునొంది. 51

క. ఓగురునాయక యీ సొ
మ్మేగతి నినుఁ జేరెఁ జెప్పనేతెమ్మనినన్
జోగులము మేము మాకట
రాఁగూడదు గాన రాజు రమ్మనుఁ డిటకున్. 52

క. అతనికిఁ జెప్పెద మనవుడు
నతివేగము యేగి వార లటు వినిపింపన్
క్షితిపతియును మతి నతివి
స్మితుఁడై చనుదెంచి కపటసిద్ధుని మ్రోలన్. 53

క. వినతుఁడై యున్న యాతని
గనుఁగొని నీపీట దంతఘట్టకుసుత డా

కినియై యీమసనములో
నను రాత్రులు దిరుగునది దిగంబర యగుచున్. 54

క. ఈ రాత్రి నీకుమారుని
మాఱిమసఁగినట్లు చంపి మలయఁగ నేనా
ఘోరాతిశూలనిహతిఁ ద
దూరుస్థలి నొంచి చరణ మొడియఁగ నెగసెన్. 55

క. కాలు విదిర్చిన నందియ
కీలెడలినఁ బుచ్చుకొంటి క్షితినాయక యే
స్త్రీలను జంపరు గావున
నాలలనను వెడలననుపు మంతియ చాలున్. 56

క. అనవుడు వెరఁగంది భయం
బున మంత్రితనూజసౌధమున కంగనలం
బనిచి తొడపైఁ ద్రిశూలం
బునఁ బొడిచిన యట్టులున్న [1]పోటులుదెలిసెన్. 57

ఆ.వె. తెలిసి శోకరోషకలుషుఁడై యారాజు
మగిడి పురికి నేగి మంత్రికూఁతు
దయ్యమనుచుఁ బ్రజలుదలఁకఁగా వెడలఁగొ
ట్టించెఁ జూడనిది కడిందియనుచు. 58

శా. ఆకన్యామణి దుఃఖమూలమునఁ బ్రాణాంత్యంబు చింతింపఁగా
నాకాశీపురరాజపుత్రకుఁడు వ్యక్తాకారుఁడై తన్మన
శ్శోకం బార్చుచు [2]వేడ్కజోగిఁ దనయిష్టంగా నెఱింగించి య
స్తోకం బౌ నిజరాజ్యముం దెలుపుచుం దోడ్కొంచు నేగెం బ్రియన్. 59

---

1. భూపతిదెలిసెన్. 2. వెడ్డుజోగి.

క. తదనంతరంబ యొక నా
ల్గుదినములకు దంతఘట్టకుఁడు సతియును దా
మదిఁ [1]గూఁతుశోకదహనము
పొదివినఁ బరలోకమునకుఁబోయెం బెలుచన్. 60

క. ఆపాపము గడపటఁ గా
శీపతిపుత్రుండొ యతనిచెలికాఁడో యీ
భూపాలుఁడో వీరలలో
నేపురుషం బొందుఁ జెప్పు మెఱిఁగినకొలఁదిన్. 61

సీ. ఎఱిఁగి చెప్పకయున్న నిప్పుడే నీతల
పదివ్రక్కలై పడు నిది నిజంబు
కావునఁ జెప్పుమా నావుడు నిఁక నూర
కుంట మోసం బని యుర్వివిభుఁడు
కామాతురుండౌచుఁ బ్రేమరాకొమరుండు
[2]తనదానిఁగాఁజేసికొనుటతగవు
సచివసూనుఁడు నిజస్వామి కార్యమునకు
మర్మంబు సేయుట ధర్మపథము

ఆ.వె. తలవరులచేత వానివర్తనము లెల్ల
మొదలఁదెలియక యదినిజంబుగఁదలంచి
చేసెఁగావున దురితంబుచెందుఁబ్రభుని
రాష్ట్రకృతమైనపాపంబు రాజుఁబొందు. 62

క. అనవుడు బేతాళుఁడు నె
మ్మనమునఁ గొనియాడి యతని మౌనత్యాగం

---

1. గూఁతుశోకదహనంబున. 2. తనపనిఁగా.

బున నిలువక యెగసి రయం
బునఁ జని తరుశాఖఁ దగిలెఁ బూర్వస్థితితోన్. 63

వ. ఇట్లు విడిపించుకొని పోయిన. 64

క. ఆనరపతి క్రమ్మఱఁ జని
పీనుఁగు క్రియ వీఁపుమీఁదఁ బెట్టుకొని చనం
గా నొకకథనెపమున న
మ్మౌనము విడిపించి యతఁడు మగుడం బాఱెన్. 65

వ. ఇట్లు మొదలికథంబోలె సారెసారెకుం గథలు చెప్పి మఱుఁగులైన సదుత్తరంబు లందుచుం బరికించుచు నిరువదియేనుమాఱులుదాఁక రాకపోకలనలయించి యతనివివేకంబునకు స్థిరోద్యోగంబునకుం బరిణమించి బేతాళుండు మే లౌనగూర్పం దలంచి. 66

క. నరనాథ సర్వలక్షణ
పరిపూర్ణుఁడ వంచు నిన్ను బలిసేయ మదిం
బరికించి కపటభిక్షుకుఁ
డరుదుగ ననుఁ దోడితేర ననుపుట గంటే. 67

ఆ.వె. నన్నుఁగొంచు నేగ నిన్నునుసాష్టాంగ
మెఱఁగుమనిన మ్రొక్కనెఱుఁగఁదొల్లి
నేఁడు నిన్నుఁ జూచి నేర్చెద నిప్పుడు
మ్రొక్కిచూపు మనుము మోసపోక. 68

క. ఇటు మ్రొక్కుమనుచుఁ జాఁగినఁ
దటుకున నడిదమున వాని తల ద్రెంచి సము
త్కట మగు ననలములో నొ
క్కట వైము వ్రసిద్ధులెల్ల [1]గతిపడునీకున్. 69

---

1. గనఁబడు.

చ. అనవుడు నట్ల యియ్యకొని యాతని మూఁపునఁ బెట్టుకొంచు దె
చ్చిన మది మెచ్చి వాఁడు మును సెప్పిన రీతిని మ్రొక్కుమన్న నే
రనిక్రియఁబల్కిన న్మఱి ధరం బ్రణమిల్లిన వానిమస్తకం
బనువునఁ ద్రెంచి పావకున కాహుతిగా నొనరించి సిద్ధుఁ డై. 70

ఆ వె. ఆత్మరక్షణాఢ్యుఁ డగువాని నటు వేల్చి
నంత భూతనాథుఁ డతని మెచ్చి
యెప్పుడైనఁ దలఁపు మేవచ్చి నిల్చెద
సిద్ధు లెనిమిదియును జెందుననియె. 71

క. సుర లటు పేర్కొని విద్యా
ధరరాజ్యము గలుగనొసఁగి తద్గుణముల క
చ్చెరు వందుచు నేగిరి భూ
వరుఁడును బేతాళుననిపి వచ్చెం బురికిన్. 72

శా. ఈసామర్థ్యము నేర్పుఁ దెంపు నణిమాధీశత్వము న్లేక నీ
కీసింహాసన మెక్క టౌనె మదిలో నీక్షింపుమా యన్న ను
ల్లాసం బెల్లఁ దొఱంగి తద్గుణగణశ్లాఘాపరుం డౌచు ల
జ్జాసంగవ్యథఁ గ్రమ్మఱం జనియె భోజక్ష్మావిభుం డింటికిన్. 73

— ముప్పది రెండవ బొమ్మకథ. —

క. తదనంతరంబ యాము
ప్పది రెండవబొమ్మయైనఁ బద మిడు తరి స
మ్మదమున నిఁకఁబల్కెడునని
మదిలోపలఁదలఁచియతఁడుమఱినాఁడెలమిన్. 74

---

1. ఈకందమునకు మాఱుగా, వ. అనిన నట్ల విక్రమార్కుండు సంకల్ప సిద్ధుండయ్యెఁగావున- అని యొక ప్రతిలోఁ గలదు.

క. సన్మునిహృదయారాధితుఁ
జిన్మూర్తిఁ గృపావిశేష శేషాభరణు
న్మన్మథమదగజ కేసరి
జన్మజరా మృత్యురహితు సర్వేశ్వరునిన్. 75

క. డెందంబునఁ దలఁపుచు సం
క్రందనమణిపీఠమెక్కఁ గడఁగెడునెడ నా
కందువ నిలిచిన బొమ్మ వె
సం దిన్నని నగవుతోడ జనపతిఁ బలికెన్. 76

చ. వలదన నేల యిట్టి దురవస్థలఁ బొందఁగ నేల నీకు భూ
తలమున విక్రమార్కుగతి ధర్మము సత్యము సాహసంబు ని
శ్చలముగ నిల్పలేని మనుజప్రభుఁ డీదెస మెట్టఁజూచినం
దలఁపులు నిష్ఫలంబు లగుఁ దత్త్వ మెఱుంగని బుద్ధి నిన్నిటన్. 77

చ. అతని గుణక్రమం బెఱుఁగు మయ్య భుజాబలభీమసేనుఁ డా
తతరణకౌశలార్జునుఁడు ధర్మయుధిష్ఠిరుఁ డార్తరక్షణా
చ్యుతుఁడు కృపాదిలీపుఁ డరిసూదన భార్గవుఁ డర్థబోధవా
క్పతి విభవామరేంద్రుఁడనఁగా నత డుజ్జయినీపురంబునన్. 78

చ. క్రతువు లనేకము ల్నడిపి గౌరవ మేర్పడ నుర్వి సప్తసం
తతులును నిల్పి వేదనినదంబులు విప్రగృహంబులందు సం
తతముఁ జెలంగ దీను లతిదానముల న్నెగడంగ ధర్మసం
గతి మెఱయించె రాజసవికారము లెవ్వియుఁ జెందకుండఁగన్. 79

చ. కఱవులపే రడంచి యుదకంబుల నెప్పుడు నర్ణవాకృతిం
జెఱువులు నిండియుండఁ దమసీమలఁ దప్పక నాలుజాతులుం
దఱచుగ ధర్మము ల్నెఱపఁ [1]దస్కరజారుల నప్రమత్తత
న్మెఱయఁగనీక సజ్జనులు మెచ్చఁగ శాశ్వతకీర్తికాముఁ డై. 80

1. దస్కరజాతుల

ఉ. అంబుజమిత్రు నంశ మని యార్యులు సన్నుతి సేయఁగా సము
ద్రంబులు నాల్గుమేర లగు ధారుణి యంతయు నేలుచుం బ్రతా
పంబున రాజు లెల్లఁ దన పంపు చరింపుచుఁ గొల్వఁ గార్యఖ
డ్గంబుల వైరులం దునిమె గట్టిగ సత్యము నిల్పుకోరికిన్. 81

సీ. సత్త్వంబుననె మహైశ్వర్యంబుగా గెల్చి
వసుధేశులను నాత్మవశులఁ జేసి
వరరత్నకనకాది వస్తువు లన్నియుఁ
దనసొమ్ముగాఁ జేసికొని యతండు
హయమేధములు మొదలైన యాగములందు
గూడి దేవతలెల్లఁదోడుపడఁగ
బడుగులు వేఁడినఁ బ్రాణంబు లైనను
వంచింప కొసఁగెడు వ్రతము వట్టి

ఆ.వె. సర్వదిక్కులందుఁ జాటించి యర్థులఁ
గూడఁ దిగిచి వారు గోరినట్ల
యూళ్ళ నర్థమును యథోచితంబుగ నిచ్చి
శాసనంబుగాఁగ శక మొనర్చె. 82

వ. భువిలో నభూతపూర్వంబు నద్భుతంబు నగుకృత్యంబు శకం బనంబడుఁ దొల్లి జరుగు శ్రీరామశకంబు యుధిష్ఠిరశకంబు నణంచి నిజశకంబు నిల్పిన నందానందాది సంవత్సరాద్యమ్మున విక్రమార్కశకంబై చతుర్లక్షజ్యోతి శ్శాస్త్రగతిప్రవర్తకం బయ్యె. 83

ఆ.వె. నడుమ శాలివాహనశకంబు గలిగియుఁ
జెడక యుత్తరమునఁ బుడమిలోన
నెన్నిచూడఁ బదియు నెనిమిది వేలేఁడు
లతనిశకము రూఢినలరఁగలదు. 84

క. ఈపాటి మహిమ గుణములు
నీపాలం గలిగె నేని నేఁ డెక్కుఁ వృథా
టోపంబులు వల దని యో
క్ష్మాపాలక నిన్ను మాన్పఁ జలమో ఫలమో. ౮౫

క. అని చెప్పి మఱియు నాతని
మన మలరఁగఁ బలికె నిన్ని మాటలు మానే
ర్పున నతనిమహిమకొలఁది
[1]న్వినిపించితి వింతెకాక నీవల్పుఁడవా. ౮౬

క. నరనారాయణులనఁగాఁ
బరఁగెడు హరిమూర్తు లుర్వి ఫల్గున దామో
దరులై పుట్టిరి నాఁ డా
నరుఁ డతఁడై పుట్టినాఁడు నరవరతిలకా. ౮౭

క. ఈకలియుగమున విద్యల
కేకడఁ జేపట్టు లేమి యెఱిఁగి పలికి వా
ణీకామిని వినిపించిన
నాకమలభవుండు సెప్పె నచ్యుతుతోడన్. ౮౮

ఆ.వె. [2]అచ్యుతుండు విద్యలైశ్వర్యమునఁగాని
మెఱయవనుచుఁజెప్పి యెఱుకగలుగ
నరునిఁ బుట్టఁ బంచె నరపతిత్వము గోరి
యతఁడు నవని నీవయై జనించె. ౮౯

క. నరునకు నారాయణునకు
నరయఁగ భేదంబు లేదు హరి యొక్కఁడు న

---

1. వినిపించిననింతనేమి. 2. అచ్యుతుండ విద్యలైశ్వర్యమునఁగాని, మెఱయవనుచుఁ జెప్పి యెఱుకగలిగి, యవనిబుట్టఁబంచె నాహరియిపుడు నీవై జనించినాఁ డవవనిపాల.

య్యెరువుర రూపగుఁ గావున
వెరవుగఁ బరికింప నీవ విష్ణుఁడ వనఘా. 90

క. ఈపుణ్యుని నినుఁ జూచిన
శాపావధి గలిగెఁ గల్మషం బడఁగెఁ గులో
ద్దీపక! "నావిష్ణుః పృథి
వీపతి" యనుకీర్తి నీకు విహితం బయ్యెన్. 91

చ. అన విని చోద్యమంది వసుధాధిపుఁ డప్పుడి శాపకారణం
బొనరఁగఁ జెప్పు మెవ్వ రని యుత్సుకుఁడై తను వేఁడినం గ్రమం
బున నది క్రమ్మఱం బలికె భోజనృపాలక! పార్వతీసఖీ
జనులము నేము దేవి కనుసన్నల దగ్గఱి కొల్తు మెప్పుడున్. 92

క. ఒకనాఁ డేమును నయ్యం
బికయును విశ్రాంతి కేగి శుకపికభృంగ
ప్రకరపరితోషకర మగు
నాకవనమున విరులు గోయుచున్నెడ వేడ్కన్. 93

సీ. కన్నుల విని గాఁలి జెన్నొందు నందియ
యడుగుఁదమ్మికి బెడఁగడరఁజేయ
నందిని నులికించు పెందోలు హొంబట్టు
కైవడి నునుపారఁ గాసెవోసి
తలఁచినయంతనె వలపులఁ దలకొల్పు
వెలిపూఁత మేనెల్ల గలయఁబూసి
జక్కవకవ కెదురెక్కుడౌ రేవెలుఁ
గెలమితో జడలపై వెలుఁగుచుండ
ఆ.వె. విసముమెడనుండియును దీపి[1]వెలికిఁదోఁపఁ
గేలశూలంబు ఫణిపతి లీలమెఱయ

1. దీప్తి.

మిండజంగమై యామంచుఁగొండకూఁతు
నెదుటికరుదెంచె ముక్కంటిచదురులాఁడు. ౯౪

క. ఆచందము గనుపట్టం
జూచిన యావేళ మనసిజుఁడు మమ్ముఁ దెగం
జూచి తన కమ్మఁదూపుల
మాచిత్తములెల్లఁ గరఁచె మానము లెడలన్. ౯౫

క. పులకించెఁ జెక్కు లలికం
బుల లేఁజెమ రొత్తె నధరముల నదరొదవెన్
వలువల గనయము లూడెం
[1]బలుకమఱచియుంటిమేము ప్రతిమలమాడ్కిన్. ౯౬

క. ఆతఱి నయ్యంబిక మా
చేతోగతు లెఱిఁగి కనలి చెలిమికి వెలిగా
భూతలమునఁ [2]బుత్తళులై
చైతన్యము లుడుగుఁ డనుచు శాపంబిచ్చెన్. ౯౭

ఉ. ఆక్రియ శాప మిచ్చిన భయంబున నందఱ మాత్మ లజ్జ ర
క్షాక్రియసన్నిపాత ముడుగంబడు కైవడిఁ గామవిక్రియో
పక్రమ మౌనెడం దెలిసి పార్వతికిం బ్రణమిల్లి తల్లి మా
కేక్రియ శాపమోక్ష మగు నింత దలంచుట మాతృకృత్యమేః ౯౮

మ. అనుచుం బ్రార్థన చేసిన న్వాని కృపాయత్తాత్మయై మీరు కాం
చనపాంచాలికలై జనించుఁ డొక ప్రస్తావంబునం బుణ్యవ
ర్తనునిం జెప్పఁగ వాక్యసిద్ధి యగుఁ దత్కాలంబు మీశాపమో
చనమౌఁ బొందని వీడుకొల్పిన మనస్తాపంబునం బిమ్మటన్. ౯౯

వ. ఒక్కమాఱే భూలోకంబునకు రానోడి, మాసంప్రార్థన విశ్వకర్మనిర్మితం
బగు నయ్యింద్రసింహాసనంబున నట్లుండి పదంపడి భూమికి వచ్చి యాయు

త్తమ నాయకు గుణకథనార్థమై నిన్నిన్ని మాటలు వారించితిమి. నాపేరు శృంగారతిలక యనం బరఁగు. వీరలు జయయును, విజయయు, మలయావతియు, ననంగసంజీవనియును, గంధర్వసేనయుఁ, బ్రభావతియు, సుప్రభయు. సంభోగనిధియు, సుభద్రయు, జంద్రికయు, గురంగనయనయు, ననంగధ్వజయు, నిందువదనయు, విలాసరసికయుఁ, గోమలియు, సౌందర్యవతియు, లావణ్యవతియు, లజ్జావతియు, నిందుమతియు, జనమోహినియును, విద్యాధరియు, హరిమధ్యయు, సుఖప్రదాయినియుఁ, బ్రబోధవతియు, మలయవతియు, హంసగమనయు, నంగసుందరియు, సుకేశియుఁ, జతురికయు, వామాంగియుఁ, దలోదరియు, [1]నను పేరులు గలవారని యెఱుంగు మిట్టి మేమును. 100

క. బొమ్మల మై యామణిపీ
ఠమ్మున బహుకాలముండి దస్సితి మని చి
త్తమ్ములఁ బొగులఁగ మాభా
గ్యమ్మున నీతోడ మాట లాడంగలిగెన్. 101

క. కష్టంబు వీడె నీకే
యిష్టం బది వేఁడు మిప్పు డిచ్చెద మనినన్
సాష్టాంగ మెరఁగి భోజుఁడు
హృష్టుండై పలికె వారిహృదయము లలరన్. 102

క. మీకృప సంపద లన్నియు
నా కుండగ నేమి ప్రార్థనము భవదీయా
లోకము గలిగెను బుణ్య
శ్లోకుఁడ నై యుండఁ గంటి లోకులు వొగడన్. 103

1. మనోహరియు, మానవతియు, పద్మపాణియు, నీలవేణియు, శుకవాణియు, పులినశ్రోణియు, నిరుపమయు నను పేరులు ప్రత్యంతరములలో నున్నవి. వీనింజేర్చిన ౩౨ నకు మించినవి.

క. అని వినయోక్తులు వలికినఁ
గొనియాడుచు నిలిచి రాజకుంజర నీచే
సిన యుపకారమునకు నే
మని ప్రత్యుపకృతి యొనర్ప నర్హము మాకుఁ. 104

చ. సకలకళా ప్రవీణుఁడవు సజ్జనరక్షణదక్షిణుండ వం
ధకరిపుభక్తిశీలుఁడవు దానవినోదివి సర్వభావభా
వకుఁడవు విష్ణుమూర్తివి దివానిశముం గవిపాఠకార్థిగా
యకనుతిశాలి వుర్వీపతి వల్పుఁడవా భువి భోజభూవరా! 105

శా. నీ కేవాంఛయు లేకయున్న వినుమా ని న్నెవ్వఁ డీక్షించినఁ
మాకిష్టంబు సరస్వతీవిభవ మామర్త్యుండు వేపొందు, వా
క్ప్రౌఢుండై విలసిల్లఁ జేసెదము భూపాలాగ్రణీ నీయశం
బాకల్పంబుగ నొప్పఁగాత జనలో కానంద మై సాంద్ర మై. 106

సీ. కన్ను లయ్యును బండికన్నులయ్యును జంద్ర
సూర్యులెవ్వనికడ సొంపుగనిరి
సుతుఁడయ్యె రథముపై సూతుఁడయ్యును సుర
జ్యేష్ఠుఁడెవ్వనికడ శ్రేష్ఠుఁడయ్యెఁ
దల్పంబునయ్యె నాకల్పంబు నయ్యె నా
గేంద్రుఁ డెవ్వనికడ నెన్నఁబడియెఁ
బదమయ్యె మస్తకాస్పదమయ్యె నాకాశ
మధ్య మెవ్వనికడ మహిమకెక్కె

ఆ.వె. నట్టి యుభయమూర్తి హరిహరనాథుండు
దేవదేవుఁ డిష్టదైవ మగుచు
నెరయఁబ్రోచుఁగాత నీకొల్వువారల
భూజనేంద్రభూజ భోజరాజ. 107

క. పర్యాప్తంబుగఁ గథ లీ
మర్యాద న్విన్న యట్టి మానవునకు నౌ
దార్యంబును దెగువయు గాం
భీర్యమ్మును బ్రియము నయముఁ బెంపువహించున్. 108

మ. అని దీవించి యుమాసఖీజనులు దివ్యాకారసంపత్తి సొం
పున నాకాశమున న్మెఱుంగులక్రియం బొల్పారుచుల్లాససం
జనితప్రౌఢవచోవిలాసముల నాశ్చర్యంబు రెట్టింప నా
జనులెల్లం దముఁ జూడఁగాఁ జనిరి భోజశ్రేష్ఠు నగ్గించుచున్. 109

శా. భోజేంద్రుండును నెక్కురామి హృదయాంభోజంబులోఁ గాంచి ని
ర్వ్యాజం బై విలసిల్లు యత్నమున విద్వత్సన్నిధిన్ దానిపైఁ
దేజోమూర్తిఁ ద్రిలోకవంద్యుని [1]మహాదేవున్ శివు న్నిల్పి త
త్పూజాలబ్ధ వరప్రసాదమహిమన్ భూమండలం బేలఁగన్. 110

శా. సద్యోనిర్ణయ వాదులు న్సరసులు [2]స్సంగీతకావ్యక్రియా
విద్యావంతు లనంతశిల్పరచనావిజ్ఞానులు న్సర్వసం
పద్యోగప్రథమానకీర్తియుతులు న్వామామనోరంజనా
హృద్యాకారులుఁ బుణ్యవర్తనులు నై యేపారి రుర్వీజనుల్. 111

మ. అనుచుం జెప్పిన నద్రిజాత మిగులన్ హర్షించి యోదేవ యే
నును బూర్వంబునఁ గొంత వింటిఁ బిదప న్నూత్నప్రసంగంబున
న్వినవింపోగతి నేఁడు విస్తరముగా వింటి న్మహావీరుఁ డా
తనిసామర్థ్యము నీప్రసాదమునఁ జిత్రం బయ్యె మృత్యుంజయా. 112

క. [3]నాకోరిన కథలెల్లను
నేకతమునఁ దెలియ నానతిచ్చితి దేవా

---

1. మహాదేవున్ననున్నిల్పి, మహాదేవుం దగన్నిల్పి. 2. సంగీతవాద్యక్రియా. 3. నాకోరినకొలఁదినియా

యీకలియుగపర్యంతం
బీకథలు ప్రసిద్ధి కెక్కు నిట నీకరుణన్. 113

మ. [1]అని యీరీతి నుమామహేశులకు సాంద్రానందసంధానమై
విననింపై కవిసమ్మతప్రకృత మై విద్యున్మనఃసద్మ జీ
వన మై పావన మై మహాసనకథాద్వాత్రింశ కర్ణామృతం
బన నెల్లప్పుడుఁ జెల్లుఁగాత భువిలో నాచంద్రతారార్క మై. 114

శా. అంభోరాశిజలప్రపూర్ణవిహృతివ్యాసక్తచిత్తాంబుజుం
గుంభీసంభవముఖ్యసర్వమునివాగ్గుంభస్తుతారంభునిన్
జంభారాతిసమీహితాయసమహాస్తంభాంతసంభూత సం
రంభాటోపవిదారితారివరుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపరున్. 115

శా. బాణాగారముఖాభిరక్షణగుణప్రారబ్ధ యుద్ధక్రియా
క్షీణోపేంద్రసుహృత్త్వకృత్యుని దృఢాంగీకారసన్మానిగీ
ర్వాణాధీశసమర్చితాంఘ్రియుగళు న్వామాంగవిన్యస్తశ
ర్వాణీమగ్నమనోంబుజుం [2]త్రిభువనావష్టంభునిన్ శంభునిన్. 116

మాలిని. నవహిమకరజూటా నందితామర్త్యకూటా
జవనవృషభవాహా శంఖచక్రాంకదేహా
ధవళనిజశరీరా దానవధ్వంసకారా
శివమురరిపురూపా శిష్టదృష్టస్వరూపా. 117

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్ట
విభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవి శాంధ్ర
మహారాష్ట్ర భూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవ

---

1. అనుచుంబ్రార్థనచేసెఁ గావున నరేంద్రానందసంధానమై. 2. త్రిభువన
వ్యాపారపారీణునిన్.

రాధీశ్వర వెలనాంటిపృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ శ్రీ కొలని వెన్నయా మాత్య పౌత్ర హరితసగోత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోప రాజ విరచితం బయిన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు బేతాళ హరణంబును, బద్మావతి యితిహాసంబును, విక్రమార్కుని యష్టప్రసిద్ధి సంసిద్ధియుఁ దన్మహాసామర్థ్యంబును, బొమ్మల శాపాగమనమోక్షప్రకారం బును దదీయ నిజస్వరూపప్రాప్తియు నన్నది సర్వంబును ద్వాదశా శ్వాసము.



